# విషయ సూచిక

ఓం

# గ్రంథ పరిచయం

ధర్మమనే పదం 'ధృ' అనే సంస్కృత ధాతువునుంచి వచ్చింది. 'ధృ' అంటే ధరించడం, సహించడం, నిలబెట్టడం. ధర్మానికి అనేక అర్థాలు సూచించారు. ప్రకృతి అని, ప్రకృతి నియమాలని, భరించేది గాను, నైతికమైనది గాను, ఉత్తమమైనది గాను, నైతికం, నైతిక శక్తి, సత్కర్మ, నియమం, మతసమ్మతమైనది, నాణ్యమైనది, వైవిధ్యంగలది, సత్యమైనది, పంచభూతాత్మకమైనది. మానవసంబంధమైన సర్వక్రియలలో ఈ ధర్మం ఇమిడి ఉంది. ఈ క్రియలు అనేక విధాలుగా వ్యక్తమవుతున్నాయి. వాటిని నైతికం, ధార్మికం, ఆధ్యాత్మికం అని వర్ణించారు. అన్ని మతాలకు, నమ్మకాలకు ఈ ధర్మమే ప్రధానమైన ఆధారమై ఉంది. ఈ నేపథ్యంలోనే అనాదిగా భారతీయులు ఆచరించిన ధర్మాన్ని సనాతన ధర్మం అంటున్నారు. బౌద్ధమతం, జైనమతం ఈ సనాతన ధర్మానికి వేరు వేరు పాయలు. ఈ సనాతన ధర్మమే భారతీయుల మానసికస్థితిని, అభిలాషను, ఆధ్యాత్మికతను, సంస్కృతి సంప్రదాయాలను, జీవనవిధానాన్ని తేటతెల్లం చేస్తుంది.

ఈ గ్రంథంలో సనాతన ధర్మానికి సంబంధించిన అన్ని సూత్రాలను, నైతిక విలువలను వివరించడమైంది.

# 1. ధర్మ సూత్రాలు

ధర్మం ప్రధానంగా భౌతికంగాను, ఆంతరంగికంగాను వ్యక్తమవుతుంది. ఈ ధర్మం సన్మార్గంతో కూడినది, పవిత్రమైనది. భౌతికంగా సన్మార్గాన్ని అవలంబించాలి. అంతరంగంలో పవిత్రతను చేకూర్చుకోవాలి. ధర్మంలో ఇమిడి ఉన్న ఈ జంట ప్రయోజనాలను అందరూ గుర్తించాలి. ఇహపరాలతో కూడినది మానవ జీవితం. ప్రతి మానవుడూ తన కర్తవ్యాన్ని గుర్తించి మెలగాలి. మానవుడు తన కర్తవ్యాన్ని, తాను ఎలా జీవించాలి, ఎందుకు జీవించాలి అనే విషయాలను గ్రహించి తదనుగుణంగా తన మాటలను, ఆలోచనలను, కర్మలను ఆచరించాలి.

ధర్మమనే పదం 'ధృ' అనే సంస్కృత ధాతువునుంచి వచ్చింది. అంటే ధరించడం, సహించడం, నిలబెట్టడం. ధర్మానికి అనేక అర్థాలు సూచించారు. ప్రకృతి అని, ప్రకృతి నియమాలని, భరించేది గాను, నైతికమైనది గాను, ఉత్తమమైనది గాను, నైతికం, నైతిక శక్తి, సత్కర్మ, నియమం, మతసమ్మతమైనది, నాణ్యమైనది, వైవిధ్యంగలది, సత్యమైనది, పంచభూతాత్మకమైనది. మానవసంబంధమైన సర్వక్రియలలో ఈ ధర్మం ఇమిడి ఉంది. ఈ క్రియలు అనేక విధాలుగా వ్యక్తమవుతున్నాయి. వాటిని నైతికం, ధార్మికం, ఆధ్యాత్మికం అని వర్ణించారు. అన్ని మతాలకు, మత నియమాలకు, నమ్మకాలకు ఈ ధర్మమే ప్రధానమైన ఆధారమై ఉంది. ఈ నేపథ్యంలోనే మనం తెలుసుకోవలసినది ఏమంటే భారతీయులు అనాదిగా ఆచరిస్తున్న ఈ ధర్మాలనే సనాతన ధర్మాలుగా వ్యవహరిస్తున్నారు. బౌద్ధమతం, జైనమతం ఈ సనాతన ధర్మానికి వేరువేరు పాయలు. హిందూ మతం కూడా ఇదే విధంగా సనాతన ధర్మం. ఈ సనాతన ధర్మమే భారతీయుల మానసిక స్థితిని, అభిలాషలను,

ఆధ్యాత్మికతలను, సంస్కృతి సంప్రదాయాలను, జీవన విధానాన్ని తేటతెల్లం చేస్తూంది.

ధర్మానికి మూలం సత్యం. సత్యం దైవస్వరూపం. సత్యాన్ని అనుసరించి ఆచరించినదే ధర్మమని జ్ఞానులు గుర్తించారు. ఆచరించిన ధర్మానికి త్రికరణాల ద్వారా ఫలితాలను మానవుడు గ్రహించలేకపోవచ్చు, కానీ అంతరాత్మ ద్వారా సమాధానాన్ని గ్రహించవచ్చు. కాబట్టి మనం సత్కర్మలకు అలవాటుపడాలి. వేదాలలో ఈ త్రికరణాలతో కూడిన క్రియలకే ప్రాముఖ్యాన్ని ఇస్తూ వివరించారు. ఆంతరంగిక విషయాల గురించి వేదాలు తెలపనప్పటికీ, ప్రతి క్రియకు అంతరాత్మ ప్రబోధం వ్యక్తమవుతుంది.

కాలం గడిచేకొద్దీ అనేక ధర్మశాస్త్రాలు, ధర్మసూత్రములు వెలుగులోకి వచ్చాయి. వీటన్నిటిలో అత్యంత ప్రభావం చూపినది మానవధర్మ శాస్త్రం (మనుధర్మ శాస్త్రం) ప్రజల మన్ననలు పొంది ఆచరణయోగ్యమైనది. ఇందులో అనేకమైన విషయాలను, హక్కులను గురించి, బాధ్యతల గురించి, వర్ణధర్మాలు, ఆశ్రమ ధర్మాలు గురించి వేదప్రమాణంగా వివరించారు. జైమిని మహర్షి ఈ ధర్మసూత్రాలను ఆమోదించి ఆస్తికులందరికీ ఆచరణయోగ్యముగా వీటిని విశదపరచెను.

ధర్మమంటే సత్కర్మల జ్ఞానం. ఈ జ్ఞానం ఇంద్రియాతీతంతో కూడినది. కార్యం రీతిని, ఇంద్రియాతీత స్వభావాన్ని, నైతిక విలువల ఆవశ్యకతను ఎరుకపరుస్తుంది. తాను ఆచరించే కర్మ ఫలితాలను కర్తకు విశదపరుస్తుంది.

ధర్మమంటూ భరించేది. అంటూ విశ్వాన్ని భరించునది. ధర్మం అనేకత్వంతో కూడిన ఒక సంఘటిత శక్తి సంఘటిత శక్తి లేకపోతే ఐక్యత లోపించి దేనికది విడిపోతుంది. ఒక సత్కర్మకు గుర్తింపే ఈ

సంఘటిత శక్తి. మానవుని సత్కర్మ నాచరించి ఉత్తేజపరిచేది ఈ ధర్మమే. ఆచరించి సాధించాలి. సత్కర్మను ఆచరించడం వల్ల సత్ఫలితాలు, దుష్కర్మ లాచరించడంవల్ల దుష్ఫలితాలు కలుగుతాయి. దుష్కర్మల నాచరించడమే అధర్మం అంటారు.

మీమాంసద్వారా ధర్మనిర్ణయం జరుగుతుంది. ఏది నైతికం? ఏది ధార్మికం? ఏది సత్కర్మ? ఈ మీమాంసద్వారానే భారతీయ ఇతిహాసాలన్నీ ఏది మంచి? ఏది చెడు? ఏది ఆచరించదగ్గది? ఏది ఆచరణయోగ్యం కాదో నిర్ణయింపబడినది. ఈ సదాలోచనలకు సత్కర్మలకు ఈ మీమాంసే పునాది.

మీమాంస ద్వారా ధర్మానికి సరియైన అర్థాన్ని ఆంగ్లములో నిర్వచించలేము. ఏది ప్రస్తుతం? ఏది అప్రస్తుతం? తెలియజేసేది ధర్మం. తత్త్వ, జ్ఞాన విచారణల ద్వారా ధర్మాన్ని అనేక రీతులగా వివరించడం జరిగినది. బౌద్ధమతంలో ఈ ధర్మాన్ని కర్త, కర్మ, క్రియలనే ఆధిభౌతిక దృష్టితో వివరించారు. జైనులు ధర్మాన్ని అనుసరించే మొత్తం అంతా పరిభ్రమిస్తూందని భావిస్తారు.

అలాగయితే ధర్మమంటే ఏమిటి? మీమాంస ప్రకారం ధర్మమంటే ఒక అద్భుతశక్తి. ఈ శక్తినే మనం మంచి చెడులుగా విభజించాం. మానవుడు చేసేకర్మలు మంచిచెడులుగా విభజన అయ్యాయి. ఈ మంచి చెడుల నిర్ణయం భగవంతుడి సంఘపు నిర్ణయం ప్రకారం జరిగింది. ఈ మంచిచెడులన్నిటినీ మనం మీమాంస ద్వారా నిర్ణయించలేము. ఈ ధర్మపు శక్తి బుద్ధి, మనస్సు, ఇంద్రియాలకు అతీతమైనది. ఇంద్రియాలకు అగోచరమైన ఎన్నో అంశాలు ఇందులో ఇమిడి ఉంటున్నాయి. ఈ ధర్మపు శక్తి ఆత్మలో చేరి ఉంటున్నది. ఈ ఆత్మశక్తే సర్వజీవుల జననమరణాలను

నిర్ణయిస్తున్నది. మానవుడు ఆచరించే ధర్మాన్ని అనుసరించి అతని పురోగతి, తిరోగతి ఏర్పడుతున్నది.

ఈ అద్భుతమైన ఆత్మశక్తి మనకు అగోచరమైనప్పటికీ, మనం ఒప్పుకొని తీరవలసిందే. ఎందుకంటే ఈనాడు చేసిన కర్మకు ఫలితం మరెప్పుడో అనుభవించడం జరుగుతున్నదికదా! కార్యం పూర్తి అయినప్పటి నుంచి, ఆ కర్మ ఫలితాన్ని పొందే సమయానికి మధ్యలో ఎంతో కాల వ్యవధి ఉంటూంది. కారణం లేకుండా ఏ కార్యం జరగదు. మానవుడు వరసగా కర్మలను చేసుకుంటూ వెళ్ళిపోతున్నాడు. ఆ కర్మలకు ఫలితం ఎప్పుడు, ఏ విధంగా బయటపడుతుందో మానవుడు గ్రహించగలగాలి. ఈనాడు ఒక మామిడి విత్తనం వేశాము. ఆ విత్తనం మొక్కై, పెరిగి, పూత పూసి, కాయగా పండుగా మారడానికి 5 సంవత్సరాలు పట్టవచ్చు. ఆ మామిడిచెట్టు ఆ తదుపరి అనేక ఫలాలను ప్రతి సంవత్సరమూ అందిస్తుంది. అంటే ఒక విత్తనం మామిడి వృక్షంగా మారింది; అంటే ఎంతో శక్తిని చేకూర్చుకున్నది కదా! కాబట్టి మనం ఇక్కడ గ్రహించవలసిన విషయం ఏమంటే విత్తనం నాటగానే ఆ కర్మ పూర్తి అయిందని భావించకూడదు. ఆ కర్మ కొంతకాల గమనం తరవాత ప్రచండ శక్తిగా మారి అనేక రీతులుగా, సమయానుకూలంగా ఫలాలనిస్తుంది. మపం చేసేకర్మల ప్రచండశక్తిని మనం గ్రహించలేకపోతున్నాం. కారణం అవి అగోచరంగా ఉండటం. ఒక అయస్కాంతాన్ని ఇనుపఖనిజం దగ్గర వద్ద పెట్టగా, ఇనుప ఖనిజపు రజనును వెంటనే అయస్కాంతం ఆకర్షిస్తుంది. అంటే ఇక్కడ కర్మకు వెంటనే ఫలితం వ్యక్తమవుతున్నది. అన్ని కర్మలకూ ఈ విధంగా ఫలితాలు ఉ ండవు. ఈ విషయాన్ని మనమందరం గ్రహించాలి. మనం ఆచరించే సత్కర్మలు భవిష్యత్‌లో ఒక ప్రచండశక్తిగా మారి అనేక సత్ఫలితాలను అందిస్తుంది. ఇలా మర్మాలను మానవుడు గ్రహించాలి. మనం భవిష్యత్తులో ఆశించే మంచి ఫలితాలకోసం ఈనాటి నుండే ప్రయత్నం చెయ్యాలి.

జీవుడు ఏకవచనం, ఆత్మ బహువచనం. మానవుడు ఏకవచనం, భగవంతుడు బహువచనం. నేను ఫలానా గ్రామంలో ఉంటాను, కానీ ఆ గ్రామం నేను కాదు. అంటే నేను ఆత్మస్వరూపుణ్ణి, అంటే ఆత్మలో భాగం నేను. కానీ నేను ఆత్మను కాను (బహువచనం). మీమాంస ద్వారా జీవులు చేసే కర్మల ఫలితములను నిర్ణయించేది ఆత్మశక్తి. ఈ అనంతమైన ఆత్మశక్తి యావత్ విశ్వాన్ని నియంత్రించుచున్నది. ఈ ఆత్మశక్తి అనేక కర్మలచేరిక, అనేక ప్రణాళికల చేరిక, అనేక రీతుల చేరికయై ఉన్నది. అన్ని శక్తులతో కూడి ఈ ఆత్మశక్తి అన్ని కార్యాలను ఒక చక్కని ప్రణాళికను అనుసరించి జరిపించుచున్నది. ఉదా: భూమ్యాకర్షణ శక్తి, అయస్కాంత శక్తి మొదలైనవి ఈ ఆత్మశక్తిలో అనేక పదార్థాలు సమ్మిళితమై ఉంటున్నవి. ఈ పదార్థాలకు అనేక ధర్మాలు ఉంటున్నవి. ఈ పదార్థాలు తమతమ ధర్మాలను అనుసరించుచున్నవి. ఈ ఆత్మశక్తి అంతర్వాహినిగా అన్ని పదార్థాలలోను, అన్ని శక్తులలోను, అన్ని ప్రణాళికలలోను, అన్ని కర్మలలోను ప్రవహించు చున్నది. బౌద్ధులు ఈ ఆత్మశక్తినే ధర్మమన్నారు. కాబట్టి ధర్మమనగా అది యొక నియమం. భరించేది, నిలబెట్టేది. కాబట్టి ఈ విశ్వము యొక్క క్రమమే ధర్మమని చెప్పవచ్చును.

మీమాంసకులందరూ వేద ప్రమాణంగా ధర్మమును అంగీకరించి, ఆచరణ యోగ్యంగా శాసించారు. కర్మ, కర్మయొక్క ఫలితాలను దృష్టిలో పెట్టుకుని కర్మనాచరించుటే ధర్మమని కొందరి అభిప్రాయము. ఇక్కడ కర్మను, కర్మయొక్క ఫలితాలను వేరు చేయుట జరిగినది. మంచి కర్మలకు మంచిఫలితాలు అన్నది అందరికీ విదితమే కానీ చేసిన ప్రతికర్మకు ఫలితం అగోచరమై ఉన్నది. కాబట్టి ఫలితాలను ఆశించకుండా సత్కర్మల నాచరించమని వేదాలు మానవుని నియంత్రిస్తున్నవి. కాబట్టి వేదాలలో సూచించిన విధంగా ఆచరించుటే మానవుని కర్తవ్యం. అదే మానవుని ధర్మము. Good = మంచి, Right = ఒప్పు. మనమాచరించె కర్మలు

మంచివిగాను, ఒప్పుగాను ఉండవలెను. అదే విధంగా కర్మయొక్క ఫలితాలు మంచిగానూ ఒప్పుగానూ గ్రహించవలెను. వెంటనే ఫలితం కానరాని మూలాన కొన్ని కర్మలు మంచివిగా కొందరు, ఒప్పుగా కొందరు వర్ణింతురు. అదే విధంగా కర్మయొక్క ఫలితాలను కూడా మంచిగాను, ఒప్పుగాను నిర్ణయించుచున్నారు. ఈ నేపథ్యంలో మనము గ్రహించ వలసినది ఏమనగా, చేసిన కర్మ ఒక అనంతశక్తిగా ఫలమొందును అని.

ఇంతవరకు మీమాంసలో విచారించిన విషయాల నుండి ఈ విషయాలను గ్రహించడమైనది. 1. మానవుని కర్తవ్యకర్మలను వేదాలు శాసించుచున్నవి. 2. వేదాలు సూచించిన విధంగా మానవుడు తన కర్తవ్యకర్మల నాచరించవలెను. 3. మనము కర్మల నాచరించిన పిదప అవి ఒక అనంతమైన శక్తిగా రూపొందును. ఈ అనంతమైన శక్తి మానవులకు అగోచరముగా ఉండును. 4. మన కర్మలయొక్క ఫలితమైన ఈ అనంతశక్తి కారణ, కాలానుకూలములను బట్టి వ్యక్తమగును. 5. ధర్మమనగా ఈ అనంతమైన ఆత్మశక్తియే. అది మంచి కర్మలకు మంచి ఫలితాలను, చెడు కర్మలకు చెడు ఫలితాలను అందించును. కర్మయొక్క మరో రూపమే కర్మ ఫలితము. సాధారణంగా ధర్మమును, అధర్మమును మానవులు ధర్మముగానే వ్యవహరించుట పరిపాటి.

మీమాంసతో మనము కర్మసిద్ధాంతమునే ధర్మ సిద్ధాంత మనవచ్చును. అనగా ఈ ధర్మమే మానవుని కర్తవ్య కర్మలను బోధించుచున్నది. అగోచరంగా ఉన్న అనేకమైన అంశాలను దృష్టిలో పెట్టుకునే వేదాలు ధర్మాచరణను శాసించినవి. మన కర్మలవల్ల ఏర్పడే ఈ అనంతమైన ఆత్మశక్తి యావత్ విశ్వాన్ని నియంత్రించుచున్నది. ఈ అనంతమైన ఆత్మశక్తి యావత్ విశ్వమును నియంత్రించుచున్నప్పటికీ మానవుడు స్వేచ్ఛగానే వ్యవహరిస్తున్నాడు. తన గత కర్మలు తన స్వేచ్ఛకు భంగము కలుగునీయుట

లేదు. కానీ తన కర్మలనే పెట్టుబడిగా మానవుడు తన భవిష్యత్తును ఏర్పాటు చేసుకుంటున్నాడు. గతంలో మంచి పనులు లేదా చెడు పనులు చేసి యుండవచ్చును. వాటి ఫలితాలు అనుభవించవలసిందే. అయినప్పటికీ మానవుడు స్వేచ్ఛను అనుభవిస్తున్నాడు. గతంలో మంచి పనులుచేసి, ప్రస్తుతంలో కూడా మంచి కర్మలే చేయవచ్చును. గతంలో చెడు కర్మలు చేసి ఇప్పుడు మంచి కర్మల నాచరించవచ్చును. ఈ మంచిచెడుల మిశ్రమఫలితాలు మానవుడు అనుభవించును. ఈ మిశ్రమ ఫలితాలు కారణంగా గతంలో జరిగిన అన్ని కర్మలకు ఫలితము ఉండాలన్న శాసనము ఏమీలేదు. అనగా గతంలో జరిగిన దుష్కర్మలను సరిదిద్దుకోవడానికి భగవంతుడు అందరికీ అవకాశమిస్తున్నాడు. కాబట్టి గతంలో జరిగిన చెడుకు వెరువక సత్కర్మలపై అందరూ దృష్టిని పెట్టవలెను. భగవంతుడు ఇచ్చిన అవకాశానికి మానవులంతా భగవంతునికి తమ కృతజ్ఞతలు తెలుపుకోవాలి.

ఈ నేపథ్యంలో భగవద్గీత ద్వారా శ్రీకృష్ణభగవానుడు తెలియ జేసిన ధర్మాలను మానవులు గ్రహించి ఆచరించవలెను. మానవుడు సత్కర్మల నాచరించవలెను. మానవులు భగవంతునికి శరణాగతి కావలెను. మానవులు ఈ శరణాగతితో తమ అహంకార, మమకార, వ్యక్తిత్వాలను భగవంతునికి అర్పించవలెను. ఈ సృష్టి భగవంతునిది. ఈ ప్రకృతి భగవంతుని యొక్క సృష్టి. భగవంతుని యొక్క అనేక శక్తులలో ఈ ప్రకృతి కూడా ఒక శక్తి. మనము ఈ ప్రకృతిలో ఉంటూ, ఈ ప్రకృతినుండి మనము ఏమి పొందుతున్నామో దానిని తిరిగి ప్రకృతికి ఇచ్చివేయవలెను. మానవుడు భగవంతుని యొక్క సమిష్టికృషిలో భాగంగా భావించుకొనవలెను. అంతేకానీ తాను సర్వస్వతుంత్రుడిగా భావించకూడదు. మానవుడు తన సర్వస్వమును భగవంతునికర్పించి ఈ జగన్నాటకంలో తనవంతు పాత్రను చక్కగా నిర్వహించవలెను.

భగవద్గీత మానవుని నుండి ఏమి ఆశించుచున్నది? మానవుడు తన ధర్మమును ఆచరించి ఆధర్శమానవునిగా మారవలెనని భగవద్గీత సూచించుచున్నది. ఆదర్శమైన వ్యక్తిత్వమనగా ఏమిటి? మానవుడు తన కర్తవ్యకర్మలను విధిగా ఆచరించవలెను. ద్వంద్వాలకు అతీతముగా ఎదిగి సమత్వమును పాటించవలెను. తనలోని అహంకార, మమకారాలను నిర్మూలించుకుని, తనకు ఏది జరిగినా అది భగవంతుని నిర్ణయముగా భావించుకొనవలెను. తన సమస్థితిని కోల్పోరాదు. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యముల కతీతముగా తన మనస్సును పవిత్ర పరచుకొనవలెను. ఇంద్రియ నిగ్రహము పాటించవలెను. మానవుడు అన్ని బంధనల నుండి విముక్తి సాధించాలి. ఈ బంధనలే మనలోని అజ్ఞానము నకు కారణము. ఈ అజ్ఞానమే మన కోరికలకు కారణము. కోరికలు తీరనియెడల క్రోధము, క్రోధమువల్ల వివేకము నశించును. వివేకము నశించుట వల్ల విచక్షణ కోల్పోవును, జ్ఞాపకశక్తి నశించును. కాబట్టి ఆదర్శ మానవుడు అన్ని బంధనలకు అతీతముగా, అహంకార మమకారములను త్యజించి, ఈర్ష్యా ద్వేషములు లేకుండా, ద్వంద్వాతీతుడై, సమస్థితిని అనుభవించవలెను. ఫలాపేక్ష రహితుడై సర్వకార్యములు నిర్వహించి, శాంతిని పొందవలెను.

వేదాలలో తెలియజేసిన కర్మాచరణే ధర్మమని మీమాంసకుల అభిప్రాయము. అయితే వైశేశిఖులు ధర్మమును ఇహము, పరములతో కూడినదని వివరించెను. వీరి దృష్టిలో ధర్మమనగా సత్కర్మాచరణ మరియు మోక్షసాధన. ఇహమున మానవ మనుగడకు, సుఖజీవనమునకు అవసరమైన సత్కర్మలు మరియు భౌతిక బంధముల కతీతమైన కర్మలు చేయవలెను అని వీరి బోధ. సత్కర్మాచరణ వల్ల ఇహమున మానవుడు సుఖమును పొందును. మోక్షసాధన ద్వారా అనంతమైన ఆనందప్రాప్తి

లభ్యమగును. వేదాలలో కూడా సత్కర్మాచరణ, మోక్షసాధనల ఆవశ్యకతను తెలిపెను. మోక్షసాధనే మానవునికి అన్నిటికంటె ముఖ్యమైన లక్ష్యము. దీనిని మానవుడు సాధించవలెను.

బౌద్ధమతమున ధర్మమనగా ఈ విశ్వములో జరిగే సర్వ కార్యముల సమగ్ర స్వరూపము. పంచభూతాలు, స్థితులు, లక్షణాలు, పదార్థాలు, న్యాయశాస్త్రము, జీవన విధానము, రూపము మొదలైన అంశాలన్నీ ధర్మములో ఇమిడి యున్నవని తెలిపెను. వీరికి గౌతమబుద్ధుడు బోధించినదే సత్యము. అదే ఆచరణ యోగ్యము. అదే వారి అంతిమ గమ్యము, లక్ష్యము, సత్యము కాబట్టి బౌద్ధులకు ధర్మమే అన్నిటి కంటే ప్రధానమైయున్నది.

ధర్మముననుసరించి బౌద్ధుడు 4 ఉత్తమ సూత్రాలను ప్రతిపాదించెను. 1. జ్ఞానదృష్టితో ధర్మము గురించి సంపూర్ణ అవగాహన కలిగించుకోవలెను. 2. సత్కర్మల ద్వారా తనలోని అజ్ఞానమును నాశనమొనరించుకుని పవిత్రులు కావలెను, ధర్మ దృష్టి కలిగి ఉండవలెను. 3. ధ్యానము ద్వారా ధర్మాత్ముడిగా మారవలెను. 4. ధర్మానికి ప్రతినిధిగా అనగా ధర్మస్వరూపునిగా మారవలెను.

సామాన్య వాడుకభాషలో ధర్మమనగా జీవన విధానము, నైతిక మార్గము, న్యాయబద్ధమైనది మరియు మతము. ధర్మమనగా సత్యముతో కూడినది, జ్ఞానము, నైతికము మరియు కర్తవ్యము. ధర్మము సత్యమైనది. ఈవిశ్వముయొక్క స్థితిగతులను నిర్ణయించునది. ధర్మము ఈ విశ్వములో చెడును నిర్మూలించి, మంచిని పెంచు అనంతశక్తికి ప్రణాళిక. ఎప్పుడైతే ధర్మముగురించి అవగాహన ఏర్పడునో, అప్పుడు మానవుని యొక్క అన్ని బంధనములు ఆ జ్ఞానముతో పటాపంచలయిపోవును. ధర్మ బద్ధమైన జీవితములోని ప్రణాళికను అనుసరించి ఆచరించి, జ్ఞానమును, మోక్షమును సాధించవలెను. ధర్మమును ఆచరించిన తర్వాత ఇతరులకు బోధించవలెను.

మానవ ధర్మశాస్త్రములో నిర్వచించిన సత్కర్మాచరణే మీమాంస ద్వారా నైతిక, సాంఘిక, న్యాయ బద్ధముగా ఆచరణ యోగ్యమైనది. కౌటిల్యుని అర్థశాస్త్రము ద్వారా రాజులకు, ప్రభుత్వములకు అనుసరించవలసిన ధర్మములను మరింత స్పష్టత కలిగించెను. శ్రీసత్యసాయి భగవాన్ గత ఆరు దశాబ్దములుగా మానవ జీవన విధాన మును సనాతన ధర్మముగా ఎఱుకపరచి, అందరిచే ఆచరింపచేసిరి. ఈ గ్రంథములో వివరించే ధర్మ సూత్రములన్నీ సత్యసాయి బోధలే అని గ్రహించవలెను. ఇతర మహానుభావుల ధర్మసూత్రములను ఇందు ప్రస్తావించిన వారి పేర్లను సూచింపబడినది. అనాదిగా ఋషులు, తత్వవేత్తలు బోధించు ధర్మ సూత్రములన్నీ సనాతన ధర్మమునకు సంబంధించినవే. ఈ ధర్మ సూత్రములు సత్యమైనవి, మానవతా విలువలతో కూడినవి. సనాతన ధర్మము ఆధ్యాత్మికమును వివరించును. ఆధ్యాత్మికమనగా మనలోని లోపములను సవరించుకుని పరిష్కరింపబడుట. భగవాన్ సత్యసాయి ప్రబోధలు, అనాది నుండి ఋషులు మహానుభావులు బోధించు బోధనలు మరియు సనాతన ధర్మవిషయములు అన్నీ ఒక్కటేయని, వాటిలో ఏ మార్పులేదని యావత్ విశ్వమానవాళి గ్రహించి, స్ఫూర్తిపొందెను.

# 2. ధర్మం - ఆదర్శాలు

ధర్మసూత్రాల ముఖ్య లక్ష్యము ఏమిటి? ధర్మసూత్రాలు, మరియు ప్రతిమతము కూడా మానవులను ఆదర్శ మానవులుగా తీర్చిదిద్దాలనే ప్రయత్నమే చేస్తాయి. మానవుడు సంఘజీవి. ఆదర్శవంతమైన, క్రమశిక్షణతో కూడిన జీవన విధానము మానవునకు అత్యవసరము. మానవుడు సుఖమైన జీవితమును కోరుకుంటున్నాడు. కానీ, నేటి మానవునకు సుఖము భౌతికముగా గానీ, నైతికముగా గానీ, ఆధ్యాత్మికముగా గానీ లభించుచున్నదా? లభించుట లేదు. ఈ కారణమున మానవుడు సుఖము కోసం ఇంకా పరిశీలిస్తూనే ఉన్నాడు. 'సర్వేజనా స్సుఖినోభవన్తు' 'సమస్త లోకా స్సుఖినోభవన్తు' అంటూ మన ఋషులు తాము ఆచరించి సుఖము, శాంతి, ఆనందములనిచ్చు సన్మార్గమును సూచించారు. మానవులు, ఎవరికివారు, తమతమ మానసిక, ఆధ్యాత్మిక సుఖ సంతోషములు, ఆనందము కొరకు ఎవరికి తోచిన విధముగా వారు ప్రయత్నము చేయుచున్నారు.

మానవజీవితము అనగా ఏమిటి? మానవ జీవితమునకు అర్థము, పరమార్థము ఏమిటి? మానవుడు తన జీవితలక్ష్యము సాధించుటలో ఏ విధమైన ప్రణాళికను ఆచరించవలెను? ఈ ప్రశ్నలకు ప్రతి మానవుడు జవాబులు తెలుసుకోవాలి. ఈ విషయములపై మానవునకు అంతఃశ్శుద్ధి, ఆత్మ పరిశీలన అత్యవసరము. ప్రతివ్యక్తి తీరికగా ఈ విషయములపై దృష్టిపెట్టి ఆలోచించవలెను. కోరికలు ఉన్న మానవుడు పక్షపాతముతో వ్యవహరిస్తాడు. ఈ పై విషయములపై దృష్టిపెట్టలేక ప్రాపంచిక విషయములలో తలమునకలై తన కర్తవ్య, కర్మలను పట్టించుకోవడం లేదు. ఈ కారణము చేత ఆశ్రమధర్మాలు ఏర్పడ్డాయి. ఈ ఆశ్రమ ధర్మాలు వేదములలో అరణ్యపర్వమున వివరింపబడెను.

ఆశ్రమధర్మాలు నాలుగు. మానవుని జీవితములోని మొదటిదశ విద్యార్థిదశ. విద్యార్థిగా ఒక గురుకులానికి వెళ్ళి, అక్కడ గురువు వద్ద సర్వవిద్యలు అభ్యసించెడివాడు. గురువు వద్ద విద్య ముగించి, గురువు అనుమతితో తన రెండవదశను అనగా గృహస్థాశ్రమధర్మాలను మొదలు పెట్టేవాడు. విద్యార్థికి మూడు ఋణములు కలవు. ఆ మూడు ఋణములను ప్రతి మానవుడు తీర్చవలెనని గురువు యొక్క ఆదేశముగా ప్రతి గృహస్థు స్వీకరించవలెను. మొదటిది తల్లిదండ్రుల ఋణము, తల్లిదండ్రుల నుండి తమకు వంశపారంపర్యంగా వస్తున్న సంస్కృతీ సంప్రదాయాలను మరువక, ఆచరిస్తూ తమ తరువాత వంశాభివృద్ధికి సంతానమును బడయుట. మగ సంతానము కొరకై వేచియుండుట జరిగేది. గురువుల ఋణము రెండవది. తాను గురువులవద్ద నేర్చుకున్న విద్యను తాను ఇతర విద్యార్థులకు పంచవలెను. ఈ విధముగా తాను నేర్చుకున్న జ్ఞానమును సంఘము శ్రేయస్సు కొరకు వినియోగించవలెను. మూడవది దైవ ఋణము. యావద్విశ్వమును నియంత్రించుచున్న ఆ భగవంతుని ఋణము ప్రతి మానవుడు త్యాగముతో సాధించవలెను. దైవప్రార్థనతో వంటవండటం, దైవ ప్రార్థనతో భోజనం చేయడం, దేవుని ముద్ద అంటూ నేయి కలిపిన అన్నమును దైవార్పణ చేయడం మనం అనాదిగా ఆచరిస్తూ వస్తున్నాము. ఈ మూడు ఋణములను తీర్చడం వల్ల మానవునకు కలసివచ్చే లాభములు ఏమీ ఉండవు, కానీ వీటిని ఆచరించకపోతే మాత్రం దుఃఖము, శిక్షలకు గురి అగును.

మూడవది వానప్రస్తము. గృహస్తు జీవితము ముగిసిన పిదప భార్యతో అడవులకు వెళ్ళి అక్కడ ప్రశాంతముగా తన గతజీవితమును ఆత్మపరిశీలన చేసుకుని జీవిత సత్యములను తన అనుభవ పూర్వకముగా నెమరు వేసుకోవాలి.

నాల్గవ ఆశ్రమ ధర్మము సన్యాసము. అన్ని బంధనములను వదలి సన్యాసిగా జీవించవలెను. తన కుటుంబంతో ఏవిధమైన సంబంధ బాంధవ్యములు ఉండ కూడదు. పుట్టినప్పటినుండి పిలువబడుతున్న తన నామధేయమును కూడా వదిలి పెట్టి, సన్యాసిగా మరో పేరుతో వ్యవహరించ వలెను. సన్యాసిగా తన జీవితమును భగవంతునికే ఆత్మార్పణ చేయవలెను. సన్యాసిగా ఆస్తిపాస్తులు ఉండవు. తన జీవనము సాగించుటకై భిక్షచేసి బ్రతుకవలెను. తన వద్దకు వచ్చిన వారందరికీ ఆధ్యాత్మిక విషయములను బోధించవలెను.

ఈ నాలుగు ఆశ్రమధర్మాలు ప్రతి మానవుడు ఆచరించవలెనని వేదములు ఆదేశించినవి. ఇందు మూడవ, నాల్గవ ఆశ్రమధర్మాలను పాటించి తీరవలెనని శాసించలేదు. ఈ చివరి రెండు ఆశ్రమధర్మాలు మానవుని ఆధ్యాత్మిక అభివృద్ధికి దోహదపడునని తెలియజేయడమైనది.

కాలగమనముతో కులములు ఏర్పడ్డాయి. ఈ కులములు ఏర్పడట మనేది సంఘ విభజనగా ఎంతమాత్రము భావించరాదు. కులములు ఏర్పడినప్పుడు ఈ విభజన దృష్టి లేనేలేదు. క్రీస్తుకు పూర్వము 2000 (BC)-1500(BC) సమయములో ఆర్యులు మన దేశములోనికి ప్రవేశించారు. ఆర్యులు తెల్లటి వర్ణముకలవారు. వారు భారతదేశములో ప్రవేశించే నాటికి మనదేశములో అందరూ గోధుమరంగు (బ్రౌన్) మరియు నలుపు చాయ కలిగినవారు కనిపించారు. ఆర్యుల సంఖ్య చాలాతక్కువగా ఉండేది. సంస్కృతములో వర్ణమనగా రంగు. సంఖ్యలో తక్కువగా ఉన్న ఆర్యులు తమశాఖ అభివృద్ధికోసం మరియు పెద్దరికం కోసం రాజకీయం గాను, సాంస్కృతిక వైభవము కోసం కొన్ని మతపరమైన శాసనాలు జారీ చేశారు.

ఈ ఆర్యులు మతము పేరుతో కులములను ఏర్పాటుచేశారు. మతపెద్దలు మతమును తమ స్వాధీనంలో ఉంచుకున్నారు. మత సంబంధ మైన కార్యాలను నిర్వహించువారు బ్రాహ్మణులు అనిపించుకున్నారు. క్షత్రియ ధర్మాలను కూడా వీరే తమ స్వాధీనమున ఉంచుకున్నారు. వీరే క్షత్రియులని పిలవబడుతున్నారు. ఈ ఆర్యులు వ్యాపార లావాదేవీలను కొంత తమ స్వాధీనమున ఉంచుకుని మిగతాది అక్కడివారలకు అవకాశమిచ్చారు. వ్యాపార లావాదేవీలను నిర్వర్తించే వ్యాపారులు వైశ్యులుగా పిలువబడు తున్నారు. వ్యవసాయం మరియు ఇతర శారీరక శ్రమతో కూడిన వ్యాపకము లన్నీ ఆయా ప్రాంతవాసులకు అప్పచెప్పడమైనది. వ్యవసాయం మరియు శారీరక శ్రమ చేసేవారిని శూద్రులుగా పిలువబడుచున్నారు. ఈ నాలుగు శాఖల కలయికలతో మరెన్నో ఉపశాఖలు ఏర్పడినవి.

ఆశ్రమ ధర్మాలు ఏర్పడ్డాయి. వర్ణ ధర్మాలు ఏర్పడ్డాయి. ఈ ఆశ్రమ ధర్మాలకు, వర్ణ ధర్మాలకు సన్నిహిత సంబంధము కలదు. ఆశ్రమ ధర్మాలు మానవులందరూ నిర్వహించవలెనని వేదములు ఆదేశించినప్పటికి స్త్రీలను, శూద్రులను వానప్రస్థమునకు, సన్యాసాశ్రమాలకు ప్రోత్సహించక దూరము చేయడమైనది.

స్త్రీలు వానప్రస్థాశ్రమ ధర్మము నిర్వహించు సమయములలో తమ భర్తలతో అడవులలో ఉండవలెను. కానీ అడవుల్లో భర్త ఇంట్లోలేని సమయా లలో ఆ స్త్రీకి రక్షణ ఏది? ఈ కారణము చేత వానప్రస్థాశ్రమము కుంటు పడినది. ఇంక నాల్గవ ఆశ్రమధర్మమైన సన్యాసాశ్రమమునకు కూడా స్త్రీలకు ప్రోత్సాహము లేకపోయెను. కారణము సన్యాసాశ్రమములో ప్రతి ఒక్కరు ఏకాంతజీవితమును, తమ కాళ్ళమీద తాము బ్రతకవలెను. ఇది ఎంతో శ్రమతోకూడినది. స్త్రీలకు ఇది క్షేమంకాదని భావించడమైనది. అయినప్పటికీ మన భారతదేశములో వానప్రస్థ ఆశ్రమం, సన్యాశాశ్రమంలో రాణించిన స్త్రీమూర్తులు మన చరిత్రలో కలరు.

ఇంక శూద్రులను కూడా వానప్రస్థాశ్రమానికి, సన్యాసాశ్రమానికి దూరము చేయడమైనది. కారణము, వారికి ఆధ్యాత్మికములో అన్ని విషయాలలోను వెనుకబడి ఉండటమే. భగవంతుని విషయములు తెలియదు. ఆత్మపరిశీలనా జ్ఞానములేదు. విషయములపై సరి అయిన అవగాహన లేకపోవడము, వారి అజ్ఞానం మరియు వారి తామసిక స్థితి.

విదురుడు, సూతుడు శూద్రులే అయినప్పటికీ వారు మహా జ్ఞానులు. వీరు అందించిన జ్ఞానము నేటికి అన్ని ఆశ్రమాలవారు, అన్ని వర్ణాలవారు ఆమోదించి ఆచరించుచున్నారు.

ఈ ఆశ్రమధర్మాలు, వర్ణ ధర్మాల కలయికతో జీవనము సాగించుటను వర్ణాశ్రమ ధర్మముగా పేర్కొనబడుచున్నది.

ఈ నాలుగు ఆశ్రమధర్మాలకు, వర్ణ ధర్మాలకు సన్నిహిత సంబంధము కలిగి ఉంటున్నది. ఈ నేపథ్యములో ఎవరి ధర్మమును వారు తు చ తప్పక పాటించవలెను. ఎవరయినా తమ ధర్మాలను సరిగా ఆచరించకపోయిన యెడల దాని ప్రభావము సంఘముపై ప్రభావము చూపును. ఎవరు చేయవలసిన కర్తవ్య కర్మలు వారే చేయవలెను. ఈ విధముగా ఈ కర్తవ్య కర్మలు, వారి బాధ్యతలు సంఘంలో పెనవేసుకునిపోయాయి. ఈ కారణము చేత ఒకరు చేయవలసిన కర్తవ్యమును మరియొకరు నిర్వహించడము సాధ్యపడేదికాదు.

భగవద్గీత యందు స్వధర్మమునందరు ఆచరించవలెనని తెలుప బడెను. స్వధర్మమనగా స్త్రీపురుషులన్న బేదభావములు లేకుండా నైతిక జీవనమును, వారి వారి కర్తవ్య కర్మల ననుసరించి జీవనము సాగించుట. స్వధర్మమనగా వర్ణాశ్రమ ధర్మముల మేళవింపుగా భావించవచ్చును.

అయితే ప్రకృతి వైపరీత్యాలు సంభవించినప్పుడు ఈ వర్ణాశ్రమ ధర్మాలను కొంతకాలము ప్రక్కన పెట్టుట జరుగును. ప్రకృతి విపత్తుల సమయంలో బ్రాహ్మణులు క్షత్రియుల ధర్మమును, క్షత్రియులు వైశ్యుల ధర్మాలను ఇలా ఒకరి ధర్మాలను మరియొకరు నిర్వహించుట జరుగును. అట్టి కర్తవ్యకర్మలను "ఆపద్ధర్మము" అని తెలుపబడుచున్నది. అంతేకానీ బ్రాహ్మణులు అన్నివేళలా బ్రాహ్మణ సంప్రదాయములనే ఆచరించి పాటించ వలెను. ఇతర వర్ణములవారు బ్రాహ్మణ వృత్తిద్వారా వేదపఠనము, వైదిక కృతులు నిర్వహించుట నిషిద్ధము.

వర్ణాశ్రమ, స్త్రీ పురుష బేధాలు లేకుండా సర్వమానవులు నిర్వహించ వలసిన ధర్మాలు సూచించబడినవి అందుకొన్ని. ఇతరులకు హాని కలుగజేయకుండుట. సత్యమును వచించుట, సత్కర్మాచరణ, పవిత్రమైన జీవనము, క్షమాగుణము కలిగియుండుట, ఎల్లవేళలా ఓపిక వహించుట మొదలైనవి. ఇట్టి ధర్మాలను సాధారణ ధర్మము లేదా సామాన్య ధర్మమని వ్యవహరింతురు.

కొన్ని సందర్భాలలో సామాన్య ధర్మాలకు, స్వధర్మాలకు అభిప్రాయ బేధములు తలెత్తును. ఉదా: ఇతరులను హింసించరాదని సామాన్య ధర్మము తెలుపుతున్నది. కానీ క్షత్రియుండు రణరంగమందు వైరి ప్రాణములు తీయును కదా! స్వధర్మమున క్షత్రియుడు వైరిని హతమార్చుటకు అనుమతినిచ్చును. కానీ సామాన్య ధర్మములో ఇతరులకు హాని చేయుట ఒప్పుకొనదు. ఇట్టి పరిస్థితులలో మతములు తమకు తోచిన రీతిని అవలంబించెను. సనాతన ధర్మము స్వధర్మాచరణకు మొగ్గుచూపెను; కానీ బౌద్ధమతము, జైనమతము వారు ఇట్టి పరిస్థితులలో సామాన్యధర్మమునే ఆచరించుటకు మొగ్గుచూపెను.

అయితే న్యాయశాస్త్రరీత్యా మానవుల కందరికీ ఒకటేరీతి అన్నట్టుగా సంఘ కట్టుబాట్లను దృష్టిలో ఉంచుకుని ధర్మసూత్రాలు నిర్దేశింపబడెను.

క్రీస్తుపూర్వము 2వ శతాబ్దంలో, మనువు తన మానవధర్మ శాస్త్రము క్రోడీకరించే సమయానికీ వర్ణ వ్యవస్థ చాలా గట్టిగా తయారయ్యేను. మొదట్లో ఈ వర్ణ వర్గీకరణము చాలా నెమ్మదిగా మొదలయ్యేను, కానీ క్రమేపీ బలపడెను.

భగవద్గీత యందు భగవానుడు గుణప్రాతిపదిన అవర్ణములను వర్ణించెను. మానవుని దృష్టి భౌతిక దృష్టి. భగవంతునిది అంతర్దృష్టి. భగవంతుడు గుణప్రాతిపదిన తెలియజెప్పిన విషయములను మానవులు అంతర్దృష్టితోనే గ్రహించవలెను.

ఉదా: జన్మ బ్రాహ్మణుడు, గుణబ్రాహ్మణుడు. భగవంతుడు మానవులందరినీ గుణబ్రాహ్మణులుగా మారవలెనని సూచించెను. అనగా గుణప్రాతి పదికన బ్రాహ్మణుడు ఉత్తమ స్థితియందు ఉన్నాడు. భగవంతుడు అందరినీ ఉన్నత స్థితిలోనే చూడాలని కోరుకుంటాడు. సత్యసాయివాహిని ద్వారా భగవాన్ శ్రీసత్యసాయిబాబా వారు మానవులందరు గుణబ్రాహ్మణులుగా మారవలెనన్నారు. జన్మ బ్రాహ్మణుడి కంటే గుణబ్రాహ్మణుడే ఉత్తముడని సెలవిచ్చెను.

ఈ నేపథ్యములో మనము గ్రహించవలసిన విషయము ఒకటి ఉన్నది. కులమును బట్టి జాతిని నిర్ణయించలేమని, ఉదాహరణకు దక్షిణ భారతదేశములో ఎందరో రాజులు మరియు చక్రవర్తులు శూద్రకులానికి చెందినవారే. సర్వాధికారముతో భారతదేశమునేలిన నందరాజులు, మౌర్యవంశరాజులు శూద్రకులమునకు చెందినవారు; గుప్తరాజులు వైశ్య కులమునకు చెందినవారు; సంగులు, కణ్వులు, శాతవాహన చక్రవర్తులు

బ్రాహ్మణకులమునకు చెందినవారై యున్నారు. ఆశ్చర్యకరముగా క్షత్రియు లలో ఇట్టి రాజులు లేరు.

సర్వాధికారముతో ఒక సంస్థ ఏర్పడినప్పుడు, వారి కులము ఏమై నప్పటికీ, ఆ కులమువారు ఇతర కులముల వారితో వివాహములు జరిపించుట పరిపాటియాయెను. ఈ విషయము ఏమనగా, భారతీయ సంప్రదాయములు, సంస్కృతి అభివృద్ధికి అన్ని కులాలవారు తమ తమ వంతు కృషిచేశారు. అయితే ఈ సంస్కార సంప్రదాయముల అభివృద్ధికి బ్రాహ్మణుల మరియు క్షత్రియుల కృషి ప్రశంసనీయము.

భగవద్గీత యందు పురుషులతో పాటు స్త్రీలకు కూడా మోక్షానికి సమానమైన అర్హత కలదని భగవానుడు తెలిపెను. అయితే ఎవరి ధర్మము వారు ఆచరిస్తూ ఉత్తమ గతులను పొందవచ్చుననెను.

గుణప్రాతిపదిన ప్రతికులములోను ఈ నాలుగు వర్ణములవారు ఉ న్నారని శాస్త్రములు వెల్లడించుచున్నవి. అనగా జన్మతః బ్రాహ్మణుడు అయినప్పటికీ గుణమునకు బ్రాహ్మణుడో లేక క్షత్రియుడో లేక వైశ్యుడో లేక శూద్రునిగానో వ్యవహరించవచ్చును. ఇదే విధముగా అన్ని వర్ణములలో ఈ గుణ ప్రాతిపదిన అన్నివర్ణముల వారు ఉన్నారు.

కులవ్యవస్థను, వాటి పుట్టుపూర్వోత్తరములను మనము పరిశీలించి నట్లయితే మనకు ఎన్నో అవకతవకలు అవగతమగును. మనుష్య పంచకములో కులవ్యవస్థ గురించి ఇట్లు తెలుపబడెను. మనుష్యుల వర్ణము ప్రాతిపదిన నాలుగు వర్ణములు ఏర్పడెనని, తెల్లని వర్ణమువారు బ్రాహ్మణులని, ఎర్రని వర్ణమువారు క్షత్రియులని, పసుపు వర్ణమువారు వైశ్యులని, నలుపు వర్ణమువారు శూద్రులని వర్ణించెను. ఇది బాహ్యదృష్టి. కానీ అంతర్దృష్టితో ఈ విషయమును పరిశీలించవలెను. తెల్లని వర్ణమునకు

సాత్వీకమని, ఎఱ్ఱని వర్ణమునకు రాజసికమని, ఎరుపు, నలుపు మిశ్రమంతో ఏర్పడిన పసుపు వర్ణమువారు వైశ్యులని, నలుపురంగు వారు తామస భావముగల శూద్రులని ఇందు వర్ణించెను. అయితే కాలముతో అంతర్దృష్టిని మరచి బాహ్యదృష్టితో వర్ణ బేధములను గ్రహించుట జరిగెను. బాహ్యదృష్టి తోనే ఈ వర్ణధర్మములు ఏర్పడినవి.

మనిషి యొక్క రంగు (వర్ణము)తో ఏర్పడిన ఈ కుల వ్యవస్థను ఎంతమంది సమర్థిస్తారు. మనిషి యొక్క రంగు తెలుపు, ఎరుపు, పసుపు, నలుపులు ఆయా ప్రాంతముల వాతావారణ పరిస్థితులను బట్టి, ఆహార నియమములను బట్టి, చేసే కర్మలను బట్టి ఏర్పడును.

బ్రాహ్మణ స్త్రీకి జన్మించిన కారణమున అతను బ్రాహ్మణుడనిపించుకోడు. ఉపనయనము, వేద పఠనము కారణమున వాడు బ్రాహ్మణుడనిపించుకోడు, ఎవరయితే ఉత్తమ గుణములు కలవారో వారే నిజమైన బ్రాహ్మణులు. సత్యమును అనుసరించువారు, ధర్మమును ఆచరించువారు, దయ, ఓపిక, కారుణ్యము, ప్రేమ, త్యాగము, క్షమ గుణములు కలవారు, నిశ్శబ్దమును ఆచరిస్తూ ధ్యానము చేసేవారు, వైదిక కర్మలనాచరించువారు, మోక్షము కొరకు సాధన సలుపువారే నిజమైన బ్రాహ్మణులు. అదే విధముగా స్వభావరీత్యా వివిధ వర్ణములుగా వారి కర్మలు ఏర్పడెను.

జన్మించిన వారంతా శూద్రులే అని తైత్తిరీయ శ్రుతి తెలుపుచున్నది. జన్మించినపుడు అందరూ పశుసమానులు. ఉపనయనము ద్వారా మళ్ళీ జన్మఎత్తి వేదపఠనముతో విప్రుడిగా గుర్తింపబడ్డాడు. ఆ పిదప బ్రహ్మ జ్ఞానము సాధించి బ్రాహ్మణుడనిపించుకొనును. శూద్రులుగా పుట్టినప్పటికి భగవంతుడి కోసం తమ జీవితములను అంకితము చేసేవారే బ్రాహ్మణులని తెలిపెను. జన్మ ఎక్కడయినప్పటికీ, భగవంతుని విస్మరించినవారు శూద్రులని ఇక్కడ తెలియపరచెను.

మనువు వ్రాసిన మనుధర్మశాస్త్రములో బ్రహ్మజ్ఞానమును సాధించిన బ్రాహ్మణోత్తముల తల్లిదండ్రుల చరిత్రలను విశదీకరింపబడెను. ఋష్యశృంగుడు ఒక లేడికి పుట్టెనని, విశ్వామిత్రుడు ఒక క్షత్రియుడని, జంబూకుడు ఒక నక్కకు పుట్టెనని, గౌతముడు ఒక కుందేలుకు పుట్టెనని, వాల్మీకిముని ఒక చీమల పుట్టనుండి పుట్టెనని, అగస్త్యుడు ఒక కుండ నుండి పుట్టెనని, వేదవ్యాసుడు ఒక చండాలస్త్రీకి జన్మించెనని, వశిష్ఠుడు ఒక పతితకు పుట్టెనని, నారదుడు ఒక చాకలికి పుట్టెనని, కౌండిన్యుడు ఒక వితంతువుకు జన్మించెనని, మాతంగుడు ఒక మాదిగ స్త్రీకి జన్మించెనని, మాండవ్యుడు ఒక కప్పకు పుట్టెనని, శాంఖ్యుడు ఒక చండాలస్త్రీకి జన్మించెనని, గార్గేయి ఒక గాడిదకు పుట్టెనని, శౌనకుడు ఒక శునకమునకు జన్మించెనని తెలుపబడెను. ఇక్కడ మనము ఒకసారి ఆలోచించాలి. ఈ వివరణలో వివరించిన జంతువులు నిజానికి జంతువులు కాదు. అవి వారి తల్లిదండ్రుల పేర్లుగా మాత్రం మనము భావించాలి. పైన ఉదాహరించిన వారందరూ మన భూమిపైన నడయాడిన మహానుభావులు. ఇట్టి మహానుభావులను జన్మపరంగాను, వర్ణ పరంగానూ చూచుట మనకు సాధ్యమా?

భగవద్గీతలో వర్ణించిన వర్ణక్రమమును ప్లాటో వర్ణించిన వర్ణక్రమముతో పోల్చవచ్చును. విషయమేమిటంటే, అభివృద్ధి చెందిన ఏ ప్రదేశములోనైనా ఈ వర్ణ క్రమాలు ఏర్పడినట్లు మనకు చరిత్ర తెలుపు చున్నది. పూర్వము, భారతదేశమున ఆర్యులు, ఆర్యులుకాని వారిని ఊచ కోత కోయడానికి సిద్ధపడగా, దానిని నిరోధించినది ఈ వర్ణక్రమమే.

భారతదేశమున మతమునకు పెద్ద పీట వేశారు. పుట్టిన ప్రతి ఒక్కరు ఆధ్యాత్మికమును సాధించవలెనని నొక్కి వక్కాణించెను. మానవజన్మకు పరమావధి భగవంతుడే. సత్కర్మల నభివృద్ధి పరచుకుని భగవంతుని భక్తితో

ముక్తులు కావలెనని మతము బోధిస్తున్నది. ఇట్టి బోధలకు ప్రభావితులైన మహానుభావులు భారతదేశమున ఎందరోకలరు. ఈ మహానుభావులు వారిలో జ్ఞానోదయము కాగానే సర్వసంగ పరిత్యాగులై (తమ ఆస్తులను, స్థితిని, అధికారమును తృణప్రాయముగా త్యజించి) మానవాళికి ఆదర్శమైనారు.

ఆల్డస్ హక్స్‌లే ఎంతో స్పష్టతతో ఇలా తెలిపెను. కులవ్యవస్థలో నెలకొని యున్న అస్పష్టతలను ఏ ఒక్కరూ నిర్ణయించలేరు. ఒక వృత్తిలో ఉన్నవారే వేరొక వృత్తిని గురించి చర్చించుట సబబుకాదు. అది ఒక పొరపాటు. సంఘం యొక్క సుస్థిరతకు ముప్పును కలిగిస్తుంది. బ్రాహ్మణులు తమ బ్రాహ్మణ్యముతో మాత్రమే మోక్షసాధనకు అందరికి మార్గదర్శకము వహించాలి. అంతేకానీ, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు, అధికారులు, తయారీదారులు, వినియోగదారులు మొదలైనవారు తమ తమ రంగము లలో నైపుణ్యము సంపాదించి మోక్షము గురించి అనగా బ్రాహ్మణుల కర్తవ్యకర్మలను నిర్వహించ ప్రయత్నించడంవల్ల అస్పష్టత గందరగోళం ఏర్పడుతుంది. అదే విధముగా బ్రాహ్మణులు క్షత్రియ కర్మలు ఆచరించినా, క్షత్రియులు క్షాత్రధర్మం వదలి వైశ్యధర్మం ఆచరించినా అస్పష్టత ఏర్పడును. క్షత్రియులు లేరని యుద్ధభూమికి బ్రాహ్మణులను, వైశ్యులను, శూద్రులను బలవంతంగా యుద్ధభూమికి రప్పించడం ఎంతవరకు సబబు? యుద్ధం కోసం క్షత్రియ దృష్టితో బ్రాహ్మణులను, వైశ్యులను, శూద్రులను సమానం చేయడం తగునా? చరిత్రలో మనకు ఇటువంటి సంఘటనలే జరుగుతున్నవి. రాజకీయ లబ్ధికోసం, డబ్బుకోసం స్వార్థముతో తమతమ కులవృత్తులు వదులుకొని ఇతర ధర్మములకు తరలినవారు ఎందరో కలరు. ఈనాడు అనుసరిస్తున్న ధర్మము మాట ఏమిటి ? రాజకీయ లబ్ధికోసం, వ్యాపార లావాదేవీల కోసం ఎవరికి వారు తమ ధర్మసూత్రాలను తయారు చేసుకుంటున్నారు. అనగా బ్రాహ్మణత్వమును ప్రక్కన పెట్టేస్తున్నారు; అనగా

బ్రాహ్మణులను నిర్లక్ష్యం చేస్తున్నారు. ఈనాడు వినియోగదారులను దృష్టిలో పెట్టుకుని పాలసీలు రూపొందబడుతున్నాయి. ఈనాడు ప్రజలు యుద్ధం – శాంతిల గురించి చర్చలు నిర్వహిస్తున్నారు. బ్రాహ్మణులు ఆదేశించ వలసిన జీవన విధానము ఈనాడు సామాన్యులే జీవనవిధానము గురించి చర్చించి తమతమ విధానాలను రూపొందించుకుంటున్నారు. ఇది ఎంత దురదృష్టకరం? పులితోలు కప్పుకుని గాడిద రాజ్యమేలుతున్నట్లుగాఉన్నది.

# 3. జీవన విధానం

క్రీస్తుపూర్వము 5వ శతాబ్దమునుండి ఈ ధర్మసూత్రాలను ప్రవేశ పెట్టడం మొదలయినది. ఈ నేపథ్యములో చతుర్విదపురుషార్థములను, మరియు మూడు విధాలైన జీవనవిధానాలను భారతీయ తత్వవేత్తలు గుర్తించినారు.

మానవుడు చేసే ప్రతి కర్మయు ధర్మ, అర్థ, కామ, మోక్ష సాధనాలే. సుఖముగా జీవించడానికి మానవునకు ధనము కావాలి. మానవ నైతిక పురోగతికి సత్కర్మాచరణ, త్యాగములతో కూడిన ధర్మ కార్యక్రమాలు సలపాలి. మానవుడు సుఖమును నైతిక మార్గమున సాధించవలెను కానీ అనైతిక మార్గమున కాదు. ధర్మ మార్గమున, సత్కర్మాచరణ ద్వారానే మానవుడు సుఖమును పొందగలదు. మానవుడు ప్రధానముగా తన కర్తవ్య కర్మల ద్వారా ఈ సంతోషమును బడయవలెను. మానవుడు తన కర్తవ్య కర్మల ద్వారా నైపుణ్యము సంపాదించును. ఈ నైపుణ్యముతో అతని సుఖము మరింత హెచ్చగును. నైపుణ్యమునకు సుఖ సంతోషమైన జీవనమునకు అవినాభావ సంబంధము కలదు.

మీమాంస ద్వారా కొందరు ధర్మసూత్రాలకే పరిమితము కాగా మిగిలిన వారు మోక్షసాధనకై సాధన చేసేవారు. సత్కర్మాచరణ వల్ల మానవునకు సుఖ సంతోషములే కాక మోక్ష సాధనకు కూడా ఉపకరించును. సత్కర్మాచరణాలతో ప్రాపంచ బంధనములను తొలగించుకొనవీలగును. మన మనస్సు పవిత్రమగును. మన హృదయము వికసించును. మనలో ఉన్న పరమాత్మకు అవగతమగును. ఆనంద ప్రాప్తి కలుగును.

ఈ నాలుగు పురుషార్థములు మానవునకు అవసరమే. ఒక మెట్టు నుండి మరియొక మెట్టుకు అన్నట్టుగా ఈ చతుర్విద పురుషార్థములు

మానవుని ఉన్నత స్థితికి అనగా మోక్షసాధనకు మార్గము చూపుతూ, కైవల్యమును సాధించిపెట్టును.

బౌద్ధులు మరియు జైనులు ఈ చతుర్విదపురుషార్థములలో మోక్ష సాధనకే పెద్ద పీటవేశారు. వీరు మొదటి మూడు పురుషార్థములకు గుర్తింపు నివ్వలేదు లేదా పట్టించుకోలేదు. కేవలం మోక్షసాధనే మానవ లక్ష్యసాధన అయిన యెడల అది సన్యాస జీవితముతోనే సాధ్యమగును. ఈ కారణముచే గృహస్థుజీవనము కంటె సన్యాస జీవనము ఎంతో ఉత్కృష్టమైనదిగా మనము భావింతుము. వేదములలో సన్యాస జీవనమునకు అంత ప్రాముఖ్యతను ఇవ్వలేదు. ఆర్యుల కాలమునుండే వానప్రస్థాశ్రమ జీవన విధానమును, సన్యాస జీవితమునకు ప్రాముఖ్యత కల్పింపబడెను.

ఈ చతుర్విద పురుషార్థాలలో ధర్మము మూడవ మెట్టు. ఈ నేపథ్యము లోనే భౌతికమైనప్పటికీ క్రింద రెండు మెట్ల ఆవశ్యకతను గుర్తించి, క్రింద మెట్టు సహాయముతో పై మెట్టు ఎక్కే ప్రయత్నము చేయవలెను. అంతిమ లక్ష్యసాధనమైన మోక్ష సాధనకై మన ఇతిహాసములలో ఎంతో జ్ఞానము, తత్త్వము మానవునికి అందుబాటులో ఉంచడమైనది.

మానవుడు తన జీవితమును సార్థకము గావించుకొనుటకు ఒక జీవన విధానమును ఎంచుకొనవలెను. దీనినే యోగము లేదా మార్గము అందురు. యోగమనగా కలయిక, అనగా మానవుని తన లక్ష్యముతో మమేకము చేసేది యోగము. మార్గము అనగా దారి, బాట. భారతీయులు మూడు మార్గములను కనుగొనిరి. అవియే కర్మ, భక్తి మరియు జ్ఞానమార్గాలు.

కర్మమార్గము ధర్మమార్గమును అనుసరించును. సత్కర్మద్వారానే మానవుడు సుఖసంతోషములను బడయును. ఇదే సన్మార్గముతో మోక్ష

సాధన వీలగును. మానవుడు తాను ఆచరించు కర్మకు ఫలితమును ఆశించును. ఆ విధముగా చేసిన కర్మకు మానవుడు బద్ధుడగుచున్నాడు. వైరాగ్యభావముతో, ఫలాపేక్ష రహితముగా కర్మలనాచరించినచో మానవుడు తాను చేసిన కర్మలనుండి బంధ విముక్తుడగును. ఈ నేపథ్యములో మానవుడు ఫలాపేక్ష రహితముగా నిర్వహించవలసిన మూడు ఋణములను గుర్తించుకొనవలెను. వైరాగ్యముతో ఫలాపేక్ష రహితముగా కర్మల నాచరించుట వలన మానవుడు ప్రాపంచిక బంధనల నుండి కూడా బయటపడును. అట్టి మానవుడు మోక్షమును పొందును. ఏ మానవుడు కర్మ  చేయకుండా మనలేడు. వైరాగ్యభావము, ఫలాపేక్ష రహితముగా సాగే జీవన విధానమే మోక్షసాధనకు మార్గము.

భగవద్గీత కర్మల గురించి మరింత విపులముగా వివరించెను. కర్మలు రెండురకములుగా వివరింపబడెను. అవి స్వార్థ కర్మలు మరియు నిస్వార్థ కర్మలు. ఫలితమును ఆశించి స్వార్థ కర్మలు సాగును. ఫలితము నాశించకుండా నిస్వార్థ కర్మలు సాగును.

స్వార్థ కర్మలు వ్యక్తిగతమైనవి. అవి ప్రాముఖ్యము లేని కర్మలు. ఈ వ్యక్తిగతమైన కర్మలు సత్కర్మలు కావచ్చును. ఉదా: మానవుడు తనకు సిరిసంపదలను, సంతానములను ప్రసాదించమని భగవంతుని ప్రార్థించ వచ్చును. ఈ స్వార్థకర్మలు అహంకార పూరితమైనవి.

నిస్వార్థ కర్మలు ఫలాపేక్షరహితమైనవి. ఇట్టి కర్మలు ఎంతో ప్రాముఖ్యమును నోచుకొనును. స్వార్థ, స్వప్రయోజనము నాశించక చేసేకర్మలు సమాజ శ్రేయస్సుకు, లోక కళ్యాణమునకు దోహదపడును.

నిజానికి కోరికలేకుండా మానవుడు ఏ కర్మను ఆచరించడు. ధర్మ బద్ధమైన కార్యమును చేయాలన్న కోరిక కూడా ఒక కోరికే. భగవంతుని

కోరుకోవడం కూడా ఒక కోరికే. అయితే భగవద్గీత ఈ కోరిక విషయములో స్పష్టతను తెలియజేసెను. సృష్టిలో ప్రతిజీవి త్యాగమునకు అలవాటుపడెను. ఆవు, తన పాలను తనకోసం ఉపయోగించుకోదు. వృక్షము తన ఫలములను తాను సేవించదు. ఇదే నేపథ్యములో మానవుడు కూడా వైరాగ్య భావముతో, ఫలాపేక్ష రహితముగా కర్మలను త్యాగ భావముతో ఆచరించి నప్పుడు యోగముగా మారును. అహంకారం నాశనమగును. మానవుడు భగవంతుని ప్రీత్యార్థమై మోక్షసాధనకై చేసే కర్మలద్వారా లోక కల్యాణము జరుగును. మానవుడు కేవలం స్వార్థ స్వప్రయోజనాలకే కర్మలనాచరించిన ప్రపంచమే నాశనమగును. నిస్వార్థ కర్మలవల్ల సంఘమునకు ఎంతో మేలు జరుగును.

ఒక మంచి కార్యమును ఒక రీతిలోనే ఆచరించగలము. గానీ అదే కార్యమును అనేక రీతులలో చేసి చెడు కర్మలుగా ఆచరించవచ్చు. కాబట్టి కర్మను ఆచరించే సమయములో మానవుడు తన వివేక విచక్షణాలను ఉ పయోగించి సత్కర్మగా ముగించవలెను.

త్యాగము వైరాగ్యములతో కూడిన కర్మలు మానవుని బంధ విముక్తుని చేయును. త్యాగమనగా ఒక సామాన్య క్రతువుకాదు. త్యాగము వల్ల వైభవము ఏర్పడును. భగవంతుని సృష్టిలోని సర్వజీవరాసులకు త్యాగము వల్ల యోగము సంక్రమించును.

మానవుడు ఆహారమునుండి పుట్టుచున్నాడు. మనము స్వీకరించే ఆహారము వర్షాధారమైయున్నది. వర్షము యజ్ఞమువల్ల; యజ్ఞం కర్మవల్ల; కర్మ బ్రహ్మవల్ల; బ్రహ్మ పరమాత్మ స్వరూపము వల్ల ఏర్పడుచున్నవి. ఈ విధముగా అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడు అంతటా త్యాగముతో నిండియున్నాడు. పరమాత్మకు ఏ కోరికలు లేకపోయినప్పటికినీ ఈ

జగన్నాటకమనే కర్మను ఆచరించుచునేయున్నాడు. భగవంతునికి అన్నీ ఉన్నాయి. కోరికలు లేవు. అయినా ఆదర్శము కొరకు నిత్యము కర్మాచరణ జరిపిస్తూ ఉంటాడు.

భగవద్గీత మానవుని సామాన్యస్థాయి నుండి ఎంతో ఉన్నత స్థాయికి మార్గము చూపెను. మానవుడు తన స్వార్థ స్వప్రయోజనమును వదల వలెను. అహంకార, మమకారములు వదలవలెను. వైరాగ్యము పెంచు కోవలెను. ఫలాపేక్ష లేక కర్మల నాచరించవలెను. భగవద్గీత అవతారవాణి. అవతారవాణిని అనుసరించిన మనస్సు పవిత్రమగును. హృదయము విశాలమగును. ఈ విధమైన సత్కర్మాచరణ వల్లనే భగవంతుని సన్నిధి లభ్యమగును.

రెండవ మార్గము భక్తిమార్గము. ఫలాపేక్ష రహితముగా కర్మల నాచరించమని చెప్పుట సులభము, కానీ ఆచరించుట చాలా కష్టము. అట్టివారు తరించుటకు మరి మార్గమేది? భక్తిమార్గమే. ఈ భక్తిమార్గమున భగవంతునిపై నిర్మలమైన, నిస్వార్థమైన, నిశ్చలమైన ప్రేమను కలిగి ఉండ వలెను. కర్మమార్గములో ఫలాపేక్ష లేని స్థితికంటే మన మనస్సును భగవంతుని ప్రేమతో నింపుకొనుట సులభము. నిష్కామ కర్మ సహజముగానే భగవంతుని భక్తిని పెంచును. మానవుడు ఎన్నో కోరికలతో, ఎన్నో కార్యములు చేస్తుంటాడు. కానీ వాటి ఫలితములు ఏమైనప్పటికీ భగవంతుని నిర్ణయములుగా స్వీకరించి, భగవంతుని శరణుపొందవలెను. ఈ విధముగా భగవంతుని పై ప్రేమ, భక్తి కలిగిన మానవుడు, భగవంతునికి ఆత్మ నివేదనము గావించుకుని పరమాత్మునిలో లయమగును.

మూడవది జ్ఞానమార్గము. జ్ఞానమార్గమునకు అంతర్ముఖు లవ్వవలెను. తనలో ఉన్న భగవంతునితో నిరంతరము సంబంధము

కొనసాగించవలెను. తనలో ఉన్న చైతన్యమే ఈ విశ్వచైతన్యములోని భాగముగా గుర్తిస్తాడు. ఇట్టి ఆత్మసాక్షాత్కారమునకు పవిత్రత ఎంతో ముఖ్యము. శుద్ధ, బుద్ధ, ముక్తి స్వరూపుడైన పరమాత్మతో నిరంతరము సంబంధము పెట్టుకోవలెనన్న అది తనలోని పవిత్రత వల్లనే సాధ్యమగును. సత్కర్మల వల్లనే మానవుడు పవిత్రుడగును. శరీరము, మనస్సు, ఇంద్రియములు, బుద్ధి తత్త్వములను దాటిన పరతత్వమును అనుభవము లోనికి తెచ్చుకొనును. భక్తి లేని జ్ఞానము నిరర్ధకము. కాబట్టి జ్ఞానమార్గమును అవలంబించే వారు సత్కర్మలతో పాటు, భక్తిని కూడా కలిగి ఉండవలెను.

# 4. పరమాత్మ - పరంధామం

భగవంతుడు అన్ని ప్రదేశములలోను సమానముగా ఉన్నాడని సెయింట్ బెర్నార్డ్ తెలిపెను.

భగవంతునిపైగల నమ్మకము, మరియు ధర్మాచరణను దృష్టిలో పెట్టుకుని సంఘములోని మానవులు నాలుగు విధములుగా గుర్తింప బడినారు. వారు ఆస్తికులు, నాస్తికులు, ఆస్తిక నాస్తికులు, నాస్తిక ఆస్తికులు. ఆస్తికులు భగవంతుడున్నాడని నమ్మడమే గాక భగవంతుని బోధనలను ఆచరిస్తారు. నాస్తికులు భగవంతుని నమ్మక, ధర్మమార్గమును ఆచరించరు. ఆస్తికనాస్తికులు భగవంతుడు ఉన్నాడని నమ్ముతారు కానీ ఆయన తెలిపిన ధర్మసూత్రములు పాటించరు. నాస్తిక ఆస్తికులు భగవంతుని నమ్మక పోయి నప్పటికీ ధర్మమార్గమును ఆచరించెదరు. భగవంతుడు సర్వవ్యాపి. ఆయన లేని ప్రదేశములేదు. అయినప్పటికీ అగోచరమైన భగవంతుని ఉనికిని మానవులు వివిధ స్థాయిలలో గుర్తిస్తున్నారు.

రయెస్‌బ్రూక్ భగవంతునిపై తన అభిప్రాయమును ఇట్లు తెలిపెను. భగవంతుడే సర్వమానవులలో తన ప్రతిరూపముగా వ్యక్తమగుచున్నాడు. మానవులందరిలో తానే ఉంటూ ఏకత్వమునే వ్యక్తము చేయుచున్నాడు.

బాబా చెప్పేది అదే. మానవులందరూ ఒక్కటే. వారంతా ఆత్మ స్వరూపులే. భూమి మీద మానవులందరూ ఆ పరమాత్మ యొక్క ప్రతినిధులే. మనందరి జీవితముల మూలతత్త్వము ఆ దివ్యత్వమే. ఈ సత్యమును తెలుసుకొనుటే మానవ జీవిత పరమార్థము.

భగవంతుడు నిరాకారుడు, రూపరహితుడు, గుణాతీతుడు, నిర్వి కారుడు, బంధనములు లేనివాడు. భగవంతుడు ఒక కార్యముకాదు. భగవంతుని నిర్వచించుటకు పదములు చాలవు. మాటలకు, భావాలకు అందనిది భగవంతుని తత్త్వము.

భగవంతుడు నిరాకారుడే అయినప్పటికీ అన్నీ తానై ఉంటున్నాడు. సముద్రపు నీటిలో ఉప్పు ఉంది, అయినా ఉప్పుకనపడదు. కర్రలో నిప్పుదాగి ఉంది. ఆ నిప్పు కర్రలో కనబడదు. పుష్పులో పరిమళము కనబడుతుందా? కనబడదు. పాలలో వెన్న ఉంది. కనబడుతుందా కనపడదు. అదే విధముగా అన్నిటా భగవంతుడు అగోచరముగా వ్యక్తమై ఉన్నాడు. మానవ ప్రయత్నముతో భగవంతుడు వ్యక్తమగును. కాబట్టి సాధన ఆవశ్యకతను గుర్తించి, సాధనచేసి, అవ్యక్తమైన భగవంతుని అనుభవములోనికి తెచ్చుకొనవలెను.

అన్నిచోట్లా భగవంతుడు ఉన్నాడన్నది సత్యము. కానీ భగవంతుని ఎంతమంది గ్రహిస్తున్నారు. మానవులంతా ఒక రీతిలో వ్యవహరించరు. విభిన్నరీతులలో, అనగా ఎవరిరీతి వారిది అన్నట్లుగా మానవ ప్రయత్నము జరుగుచున్నది. ప్రయత్నించిన వారికి ప్రయత్నించినంత అన్నట్లుగా వారివారి అనుభవమునకు భగవంతుడు లభ్యమవుతున్నాడు.

భగవంతుడు అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుడు. ఆయనే విశ్వ చైతన్యము. సృష్టియొక్క సర్వశక్తుల మూలస్వరూపము ఈ భగవత్ తత్త్వమే.

భగవంతుడు విరాట్ స్వరూపుడు. ఈ సృష్టి యావత్తు ఆయన నుండి ఉద్భవించినదే. భగవంతుని చేరి మాయఉంటుంది. వేదములు ఈ మాయను కూడా జ్ఞానసంపదగానే భావించడమైనది. భగవంతుని సర్వ శక్తిమయతత్త్వము వల్లనే ఈ సృష్టి ఏర్పడినది. భగవంతుడు తన సర్వాంతర్యామి తత్త్వముతో ఈ జగన్నాటకమును ఆడిస్తూ, ఆనందిస్తున్నాడు.

ఈ ప్రపంచము భగవంతుని నియంత్రణలో సాగుచున్న తరంగముల యొక్క సమూహాము. దివ్యచైతన్యముతో కూడిన మనమే ఈ తరంగముల యొక్క మొదలు మరియు చివర. ఈ అనంత విశ్వము పరమాత్మ యొక్క

ఆటస్థలము. తన తృప్తి ఆనందముల కొరకు భగవంతుడు ఈ జగన్నాటకమును జరిపిస్తూ ఉన్నాడు. భగవంతుడే ఈ విశ్వమునకు సర్వాధికారి. అట్టి భగవంతుడు అనేక రూపనామములతో ఈ సృష్టియందు అనేకముగా వ్యక్తమగుచున్నాడు. ఈ విశ్వము భగవంతునికి ఆట, పాట, నృత్యము, సూత్రం మొదలైనవి. ఈ జగన్నాటకములో పాత్రధారులు, రచయిత, డైరెక్టరు అన్నీ భగవంతుడే అయి ఉన్నాడు.

మనము ఎవరము? మనలో ఉన్నది తత్, అనగా ఆ భగవత్ స్వరూపమే. ఈ విషయమును మనము గ్రహించి, ఈ నాటకములో భాగస్థులమవ్వాలి. మనము ఎల్లవేళలా త్రికరణశుద్ధిగా భగవంతుని ప్రజ్ఞతోనే జీవించాలి.

భగవంతుడే సత్యము, భగవంతుడే ఈ విశ్వమునకు సర్వాధికారి. ఈ విశ్వమునకు భగవంతుడే చైతన్యరూపుడు. ఈ సృష్టికి కాల, కారణ, కర్మ, కార్యము అన్నీ తానై ఉన్నాడు. భగవంతుడే ఈ విశ్వములో అనేక జీవరాసులుగా వ్యక్తమగుచున్నాడు.

భగవంతుడు గుణాతీతుడు. పంచభూతముల తత్త్వములైన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలకు అతీతమైన స్థితి భగవంతునిది. అట్టి నిరాకార స్థితిని వేదములే వివరించలేకపోయెను. మాటలలో భగవంతుని ఎవరు వివరింపజాలరు. కానీ ఈ తత్త్వము అనుభవము ద్వారా విదితమే. అదే అంతులేని ఆనందము.

ఇట్టి అనంతమైన ఆనందమును బడయవలెనన్న మానవుడు మొట్టమొదట తన అహంకారమును రూపుమాపవలెను. ఈ ప్రయత్నము అందరు చేయవచ్చును. కానీ కొద్దిమంది మాత్రమే సాధనచేసి తరించుచున్నారు. భగవంతుని యొక్క అనేకత్వములోని ఏకత్వమును, చాలా తక్కువమంది గ్రహిస్తున్నారు.

ఈ సృష్టిలో భగవంతుడు అనేక రూపములతో కాలాను గుణముగా, అనేకచోట్ల అవతరించెను. ఆ అవతారములు భగవంతుని లక్షణములైన ప్రేమ, త్యాగము, దయ, కారుణ్యము, జ్ఞానము మొదలైన వాటినే వ్యక్తము చేసెను.

భగవంతుడు గుణశీలుడు. గుణశీలుడు అనగా భగవంతుని గుణములను వర్ణింప మానవుని తరముకాదు. అయినప్పటికి భగవంతుని 108, 1008 నామాలతో ఆయన గుణగణములను మానవుడు గుర్తు చేసుకుంటూ ఉంటాడు. ఇట్టి గుణ శీలుడైన పరమాత్మను భక్తితో మానవులు అనేక రీతుల అర్చనలు, పూజలు, జపములతో తమ ప్రేమను చాటుకొందురు.

ఈ విశ్వములోని జీవరాసులన్నీ, అణువు నుండి ఘనము వరకు అన్నిటా భగవంతుడే ఉన్నాడని హక్స్లే తెలిపెను.

ఈ సృష్టిలోని జీవరాసులు భగవంతుని ఉనికిని గుర్తించలేక పోతున్నవి. మానవులలో కూడా ఆస్తికులు మాత్రమే భగవంతుని ఉనికిని గుర్తించగలుగుతున్నారు.

దేవాలయములలో అర్చనామూర్తులను ఆరాధిస్తూ ఉంటాము. ఈ ఆరాధనలు పెరిగే కొద్దీ అవి పుణ్యక్షేత్రములుగాను, పవిత్ర స్థలములుగాను ప్రసిద్ధిచెందుతాయి. ఈ పుణ్యక్షేత్రముల యొక్క మహిమలను ఎవరూ కాదనరు. ఈ పుణ్యక్షేత్రములను దర్శించి, అర్చనామూర్తుల దర్శనము చేసుకున్నవారందరికీ అనుభవములు కలగక పోవచ్చును. కానీ ఆ పుణ్యస్థల ప్రదేశముతో మనలో పవిత్ర భావములు పెరిగి మనసున ప్రశాంతత చోటు చేసుకొనును.

భగవంతుని దర్శనము చేసుకొనవలెనన్న అంతర్దృష్టి అవసరము. అంతర్దృష్టి గలవాడికి భగవంతుడు తేలికగా లభ్యమగును. బాహ్యముగా భగవంతుని వెతకుట, గుర్తించుట చాలా కష్టసాధ్యము.

సాధనలో మొట్టమొదట మానవుడు అంతర్దృష్టి అలవరచు కోవలెను. ఆ పిదప మనస్సులోని అరిషడ్వర్గములను త్యజించి పవిత్రులుగా మారవలెను. తన హృదయములోని విషయ వాసనలను, సంకుచిత భావములను తొలగించుకుని హృదయమును విశాల పరచుకొనవలెను. ఈ విధముగా తనలో అంచెలంచెలుగా మార్పులు సాధించవలెను. భగవంతునికి మనకు మధ్యనున్న అడ్డంకులను ఒకటొకటిగా తొలగించు కొనవలెను. భగవంతుని సాధనలో ఎదురయ్యే ఆటంకములు, కష్టములకు వెరువక, వాటిని భగవంతుడు కల్పించిన అవకాశములుగా భావించు కొనవలెను. ఈ సాధనలో మనకు అవమానములు ఎదురవ్వవచ్చు. కానీ భగవంతుని ఎఱుకతో సాధనలో ముందుకు సాగవలెను.

భౌతిక ప్రపంచము ఏపాటిది? సామాన్య ప్రజలతో నిండిన ఈ ప్రపంచము సామాన్యముగానే అనిపించును. తాత్కాలికమైన సుఖ సంతోషములు దొరుకును. కానీ మానవుడు తట్టుకోలేని, ఊహించని ఎన్నో కష్టనష్టములను ఎదుర్కొనవలసి ఉంటుంది. శాశ్వతమైన ఆనందము కొరకు మానవుడు భగవంతుని వైపు దృష్టి మరల్చవలెను. మానవ ప్రయత్నము ఈ నేపథ్యములో చాలా అవసరమైయున్నది. మానవుడు ఒక్క అడుగు భగవంతునివైపు వేస్తే, భగవంతుడు మనవైపు పది అడుగులు వేస్తాడు. ఈ సత్యమును గ్రహించి మానవుడు శ్రద్ధతో సాధన సలుపవలెను. కలల ప్రపంచములో కాక వాస్తవ ప్రపంచములో మానవుడు జీవించి, సాధించవలెను. కష్టేఫలి అన్నారు మన పెద్దలు.

సృష్టిలో అణువణువునా భగవంతుడున్నాడు. సర్వజీవరాసులలో భగవంతుడు ఉన్నాడు అనే సత్యమును గ్రహించాలి. సృష్టిలోని సాధారణ మానవులను మరియు అత్యల్ప జీవరాసులను తన స్వార్థం కోసం పీడించి, నష్టము కలుగజేయరాదు.

భగవంతునికి అనేక రూపములు. ఏ రూపములో అయినా భగవంతుని కొలువవచ్చును. కానీ పరిమితమైన ఆలోచనలతో పరిమితులు లేనటువంటి పరమాత్మని కొలచుట తప్పిదము. భగవంతుని మనము ఈ విశ్వానికి అధికారిగా భావిస్తే, ఆ అధికారి యొక్క మన్ననలకోసం మానవుడు తాపత్రయపడతాడు. ఈ నేపథ్యములో భగవంతునితో సంబంధము కేవలం ఇచ్చుపుచ్చుకునే వ్యవహారములో మిగిలిపోతుంది. ఇది సరికాదు. పూజలు, అర్చనలు, జపములతో భగవంతుని ఆరాధించుట మంచిదే, అయినప్పటికీ సదాచారముతో మనలో మార్పులు సాధించాలి.

భగవంతుడు సర్వవ్యాపి, సర్వశక్తిమంతుడు, సర్వజ్ఞుడు, సర్వాంతర్యామి. ఆయన అఖిలాండ కోటి బ్రహ్మాండనాయకుడు. భగవంతుని తత్త్వము, జ్ఞానములను మన పురాణములు అనాదిగా మానవునకు తెలుపుచున్నవి. అట్టి భగవంతుడిని సాధించడమే మన జీవితలక్ష్యమని తెలుపుచున్నవి. లక్ష్యము దిశగా ప్రయాణము జరుగవలెనన్న మనలో మార్పులు అవసరము. మరి ఈ భగవంతుని సాధన వల్ల మనలో మంచి మార్పులు కలుగుచున్నవా? మానవుడు తనలోని తామసిక లక్షణాలను, రాజసిక లక్షణాలను విడచి సాత్విక లక్షణాలను అభివృద్ధి పరచుకొనవలెను. ఇట్టి మంచి మార్పులను రాబట్టునదే భగవంతుని తత్త్వము, జ్ఞానము.

మనదృష్టి ఎట్టిదో సృష్టి అట్టిది. మనము పుట్టినప్పటినుండి మన తల్లిదండ్రుల సంరక్షణలో పెరుగుతున్నాము. మన జీవన విధానమునకు

మన అలవాట్లే ప్రధాన కారణము. ఈ అలవాట్లు మనము మన పెద్దలనుండి గ్రహిస్తున్నాము. గతజన్మ పాపపుణ్య విషయవాసనలను బట్టి మనకు ఈ జన్మలోని అలవాట్లు ఆధారపడి ఉంటున్నవి. గత జన్మ సంస్కారముల వల్లనే మనకు ప్రస్తుత జన్మలో భగవంతునిపై మక్కువ కలుగును. నేను ఎవరు? నేను ఎక్కడినుండి వచ్చాను? నాది అనునది ఏది? మొదలైన ప్రశ్నలపై శ్రద్ధ పెట్టినవారు తమ సాధనను నిరాటంకముగా, భక్తి శ్రద్ధలతో కొనసాగించి గమ్యము చేరుదురు.

భౌతిక దృష్టిగల మానవుడు ప్రవృత్తిలో జీవిస్తాడు. అంతర్దృష్టిగల మానవుడు నివృత్తిలో జీవిస్తాడు. ప్రవృత్తిలో ఉన్నవాడు ఏకత్వములో అనేకత్వమును గ్రహిస్తాడు. నివృత్తి మార్గములో ఉన్నవాడు అనేకత్వములో ఏకత్వమును గ్రహిస్తాడు. అంతర్దృష్టి అభివృద్ధికి నేను, నాది అనే అహంకారము వదలవలెను. అందుకనే మన పెద్దలు మనోనాశమును సూచించారు. మనలోని చెడు తగ్గించుకుని, మనలో మంచిని పెంచుకొనవలెను.

భగవంతుని కొరకు చేసే సాధనకూడా ఒక సమగ్రమైన ప్రణాళిక. కేవలం మనలో ఉన్న చెడు అలవాట్లను తగ్గించుకున్నంత మాత్రమున సరిపోదు. మన మనస్సును కూడా నియంత్రించాలి. మన మనస్సు కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములతో అపవిత్రమై పోతున్నది. ఇట్టి మనస్సును పవిత్రమొనర్చ వలెను. అది ఎట్లు సాధ్యమగును? సాధనా సంపత్తి అయిన శమము, దమము, ఉపరతి, దీక్ష, శ్రద్ధ, సమాధానములతో మనమనస్సును నిరంతరము పవిత్రముగా ఉంచుకోవలెను. పవిత్రమైన మనస్సుతోనే మనలోని ఆత్మను దర్శించవీలగును, అనగా మనలోని ఆత్మయొక్క ప్రతిబింబము మన మనస్సుపై ప్రతిబింబించును. అప్పటిదాకా మనము మనలోని ఆత్మను గ్రహించలేము.

మలినపడిన గాజు తలపులను శుభ్రపరచగానే వెలుగు ఇంటి లోనికి ప్రవేశించును. అదేరీతిలో మనమనస్సు పవిత్రముగాను, హృదయమును విశాలముగానూ మార్చుకొనగానే ద్వంద్వములతో కూడిన ఈ ప్రపంచమును సమదర్శనముతో శాంతిని అనుభవిస్తాము.

ద్వంద్వములతో కూడినది ఈ ప్రపంచము. మానవుడు ఆశించేది మూడు. అవి సత్,చిత్ మరియు ఆనందములు. సత్ అనగా శాశ్వతమైనది. చిత్ అనగా తెలుసుకొనుట. ఏమి తెలుసుకొనుట? భగవంతుని జ్ఞానము. అనగా మానవుని తృప్తిపరచేది సచ్చిదానంద స్వరూపుడైన భగవంతుడే అని భావము. అసతోమా సద్గమయ తమసోమా జ్యోతిర్గమయ మృత్యోర్మా అమృతంగమయ ఓం శాంతి, శాంతి, శాంతిః

మానవుని సాధనలో మూడు ఆటంకములు కలవు. అవి సమయము, శరీరము, అనేకత్వము. మానవుడు భగవంతుని కాలస్వరూపునిగా భావించినంత కాలము భగవంతుని సత్పురుషునిగా భావించలేడు. అది ఒక అర్థంకాని అనంత తత్త్వముగా భావించడం వల్ల భగవంతుని ప్రేమకు, అనుగ్రహానికి, జ్ఞానమునకు, ఆనందమునకు దూరమవుచున్నాడు. భగవంతుని ఈ విధంగా కొలవడం వల్ల, స్వార్థముతో లబ్ధిపొందేందుకు కృషి సలుపుతూ, భగవంతుని ఆరాధించడం మరచిపోతున్నారు.

భగవద్గీత ద్వారా శ్రీకృష్ణభగవానుడు అర్జునుడికి తన విశ్వరూపమును చూపించెను. దివ్యనేత్రములతో అర్జునుడు ఆ విశ్వరూపమును దర్శించ గలిగెను. యుద్ధము ప్రారంభమవ్వకుండానే కౌరవులు ఆ యుద్ధమున హతమగుట ఆ విశ్వరూపమున గాంచెను. ఇట్టి జ్ఞానముతో కూడిన భగవంతుడు కాలస్వరూపుడని, అన్నీ ముందుగా నిర్ణయమై పోతుంటాయి అన్న భావములు మానవులలో ఏర్పడెను. తప్పులు చేసిన మానవులు కాలస్వరూపుడైన భగవంతుని మెప్పుకోసం ప్రయత్నం చేస్తారు. కాల

స్వరూపుడైన భగవంతుని కోరికలతో ఆరాధించుట జరుగుతున్నది. కాల స్వరూపుడైన భగవంతుడు మానవులను సృజించుచు, పోషించుచూ, నాశన మొనర్చుచున్నాడని వీరి భావము. మానవుడు తన స్వార్థం కోసం ఇచ్చిపుచ్చుకొను విధమునకు అలవాటుపడెను.

మానవులు భగవంతుని కాలస్వరూపుని గానే కాక ప్రకృతి స్వరూపుని గాను ఆరాధించుచుండెను. భవిష్యత్తులో ఒక లబ్ధిని పొందుటకు, లేదా గతంలో చేసిన తప్పులకు శిక్షను తప్పించి, లేకుండా చేయుటకు మానవుడు కాలమును, ప్రకృతిని ఆరాధించుచున్నాడు. మతపరముగాను, సిద్ధాంత పరంగానూ కాలము చాలా తీవ్రముగా భావించి జరిగిన యుద్ధములు చరిత్రలో మనకు విదితమే.

భగవంతుడు భూమిపై అవతరించినపుడు భగవంతుని యొక్క సహజ లక్షణములన్నీ ఈ అవతార పురుషునిలో కూడా ఉండును. కానీ అవతారము పరిమితమైన మానవరూపమున, తన అవతార కాలములో ఒక భౌతికరూపమున వ్యవహరించును. అవతారము సమకాలీనులుగాను, అవతారము సమీపమున గడిపిన మానవులు అవతారము యొక్క మహిమాన్విత లక్షణములను గ్రహింతురు.

భూమిమీద అవతారములేని సమయములో భగవంతుడు లేడు అని అనము కదా! ఈ విశ్వమును నియంత్రించు భగవంతుడు లేకపోవుట అనునది అసందర్భము. భగవంతుని అందుకే సత్, చిత్, ఆనంద స్వరూపునిగా కొలుచుట, భగవంతుని సాధనలో లభించిన ప్రశాంతత, భగవంతుని యొక్క ఫలమే అని గుర్తించవలెను.

నిత్యజీవితములో మనము అనుభవించు ప్రశాంతత మన స్వేచ్ఛకు మూలము. దౌర్జన్యము, హింసలు మానవుని నుంచి దూరముగా ఉంచును.

ప్రతి ఒక్కరు ఓపిక, అహింసలకు అలవాటుపడాలి. భగవానుడు ఎప్పుడు శాంతి మార్గమునే సూచించును. భగవంతుని ఆదేశమును భంగపరుస్తు హింసా, దౌర్జన్యములకు తావివ్వరాదు.

భగవంతునికి విధేయుడైనవాడు, ప్రకృతి నియమాలకు కట్టుబడిన వాడు చావుకు భయపడడు. కారణము వాడికి మంచి కర్మల యొక్క చెడు కర్మల యొక్క ఫలితముల అవగాహన కలదు. మన కర్తవ్యకర్మలను మనమే నియంత్రించుకోవాలన్న బుద్ధి, జ్ఞానము వీరికి కలదు. కొన్ని సంఘటనలు మనచేతిలో ఉండవు. అటువంటి సంఘటనలకు మనకు బాధ్యత ఉండదు. మన అధీనములో ఉన్న కర్తవ్యకర్మలకు ప్రశంస, విమర్శలు తోడగును.

జ్ఞానం తెలిసిన మానవుడు, తన మంచి చెడులను విధివ్రాతగా అంగీకరించడు. వచ్చిన అవకాశములను మానవుడు తన విజ్ఞతతో సద్వినియోగము చేసుకుని మంచి కార్యములు చేయవచ్చును. లేదా దుర్వినియోగముతో దుష్కర్మలకు పాటుపడవచ్చును. ఈ కారణము చేత మానవుడు తన బుద్ధికుశలతను ఉపయోగించుకొనవలెను. మానవుడు ఒకటి తలచిన దైవము వేరొకటి తలచును అన్న సామెతను అనుసరించి, మానవుడు తలపెట్టిన పనులు తాను అనుకున్న విధముగా పూర్తిచేయలేక పోవచ్చును, లేదా తాను ఏమీ అనుకోకుండా నిమిత్త మాత్రముగా తలచి చేపట్టిన కర్మలు ఘనముగా పూర్తికావచ్చును.

ఏమి జరిగినా నా మంచికే జరుగును; తనను తాను ప్రేమించినట్లుగా సాటి మానవుని ప్రేమించవలెను; మతపరముగా ఏమీ ఆశించక, భగవంతుని ప్రీతి నిమిత్తము కార్యములు నిర్వహించుట; మనచుట్టూ ఉన్న మానవుల క్షేమమును కోరుట; తాను ఏ విధముగా ఇతరులనుండి మంచి ఆశించునో, అదే విధముగా తాను ఇతరులకు మంచిని చేయుట; మనకు

హానిగాతోచిన పనులను ఇతరులకు కలిగించకుండుట; సర్వేజనాః స్సుఖినోభవంతు, లోకా సమస్తా స్సుఖినోభవంతు అను లోకనానుడికి అనుగుణంగా మన జీవన విధానమును ఆచరించాలి. మన సనాతన ధర్మము అన్ని జీవులలో ఉన్న దివ్యత్వమును మనకు ఎఱుకపరచుచున్నది. స్వార్థములేక, సంకుచిత భావములు లేక, పవిత్రమైన మనస్సుతో, విశాలమైన హృదయమును అభివృద్ధి పరచుకొని భగవంతుని యొక్క దివ్య ప్రేమను అందుకోవాలి.

పైన ఉదాహరించిన రీతితో మనకు మతము బోధిస్తున్నది. మతము రాజకీయములకు హింసా, దౌర్జన్యములకు అతీతమైనది. హిందూమతము, బౌద్ధమతము యుద్ధములను ఎన్నడూ ప్రోత్సహించలేదు, మతపరమైన మార్పులను కూడా ఎన్నడూ ప్రోత్సహించలేదు. అయినప్పటికి పూర్వము జూడాయిజమ్, క్రిస్టియన్ మతము, సుఫీలు మరియు మహమ్మదీయ మతమువారు మత మార్పిడీలను ప్రోత్సహించారు. అన్ని జీవులు భగవంతుని ప్రతి రూపములే అన్న జ్ఞానముతో జంతువుల పట్ల, బీదబలహీనుల పట్ల దయ, ప్రేమ, కారుణ్యములను పెంచుకొనుట జరుగుతున్నది.

# 5. మానవ జన్మ

## ఆ. మానవ స్వభావం:

శరీరం, మనసు, ఆత్మల కలయికయే మానవుడు. మనస్సు ఆత్మల కలయికను మానసిక, ఆధ్యాత్మిక స్థితి అంటారు. కాబట్టి మానవుని స్వభావము ఈ మూడింటి కలయికతో కూడినది. మానవుడు తన జీవనమును రెండు స్థితులలో కొనసాగించుచున్నాడు. 1. ఇహము 2. పరము. 1. భౌతికము 2. ఆధ్యాత్మికము. 1. అశాశ్వతము 2. శాశ్వతము. నిజముగా మానవునికి తనదంటూ ఏమీలేదు. మానవుడు జీరో. భగవంతుడు హీరో. సున్నాముందు '1' చేర్చితే సున్నాకు విలువ పెరుగుతుంది. మానవునిచుట్టూ భగవంతుడు ఉంటున్నాడు. అయినప్పటికీ మానవుడు ఎట్లు వర్తిస్తున్నాడయ్యా అంటే కొంతమంది జీరోలుగాను (అనగా ఆధ్యాత్మికములో పేదవారిగాను) మరికొందరు ఆధ్యాత్మికమార్గమున భగవంతునిపై భక్తి శ్రద్ధలతో తమ జీవితములను భగవంతునికి సమర్పించు కుంటున్నారు.

మానవుడు రెండు స్థితులను అనుభవించుచున్నాడు. మనస్సు మరియు మనస్సునకు లోబడిన శరీరముతో కూడినస్థితి ఒకటి. మనస్సు నకు అతీతమైనస్థితి రెండవది. మానవుడు మనస్సు, ఇంద్రియాతీత స్థితిలో తన మనస్సు, శరీరస్థితులను ఆధ్యాత్మిక స్థితితో తెలుసుకో గలుగుతాడు. అప్పుడే మానవునకు తన శరీర, మనస్సు, జీవితములకు నిజస్థితి తెలుస్తుంది. జీవిత పరమార్థము అర్థమవుతుంది. అప్పుడు మనస్సు పవిత్రమై ఉన్నత శిఖరాలను చేరుకుంటుంది మానవ జీవితము భగవంతుని శక్తితో నడిచే యంత్రము. ఈ సత్యమును గ్రహించినవాడు భగవంతుని ప్రతిరూపముగా మారును. ఈ సాధన ఎన్నో శ్రమలతో కూడినది. ఈ సాధనలో మొదట అంతా స్పష్టంగా గోచరం కాదు, కానీ సాధనద్వారా అన్ని స్పష్టముగా తేటతెల్లమవును.

శరీరముపై మనస్సు నాలుగు విధముల ప్రభావము చూపును. 1. మనస్సు పూర్తి స్పృహలేని సూక్ష్మస్థితితో శరీరముపై ప్రభావము చూపును. 2. పూర్తితెలివితో, మానవుడు తన ఇష్టానుసారముగా వ్యవహరించును. 3. తన మానసిక స్థితి ఆధారముగా మళ్ళీ స్పృహలేని స్థితిలో పనిచేయును. ఇట్టిస్థితిలో శరీర భాగములకు పని కల్పించకపోవచ్చు. 4. స్పృహలో ఉండి గానీ, స్పృహలేకగానీ ఆధ్యాత్మిక అనుభవములను (ఆనందమును) అనుభవించుట.

శరీరము వెలుపల ఉన్న భౌతిక పదార్థములపై మనస్సు యొక్క ప్రభావము రెండు రకములుగా ఉండును. మొదటిది తన ఇంద్రియ జ్ఞానముతో, రెండవది మానవాతీత పద్ధతులతో. ఈ పద్ధతిలో మనస్సు ఇతరుల మనస్సుతో సంఘీభావంతో పనిచేయును. ఉదా: మాట్లాడుట, వ్రాయుట. మానవాతీత పద్ధతిలో ఇతరుల మనస్సులోని అభిప్రాయములు సేకరించుట, దూరదృష్టి, ఇంద్రియాతీత శక్తులు కలిగి ఉండటం ఇందుకు కొన్ని ఉదాహరణలు.

మన శరీర నిర్మాణ వ్యవస్థలో ఎన్నో పనులు గాలిపీల్చుట, వదలుట, ఆహార జీర్ణ వ్యవస్థ మొదలైన ఎన్నో కర్మలు మానవుని మనస్సు ప్రమేయము లేకుండా జరిగిపోచున్నవి. మరికొన్ని పనులను మానవుడు పూర్తి స్పృహతోనే నిర్వహిస్తాడు. మానవుడు తనలోని రక్తనాళములను, నరములను, కండరాలను పూర్తిగా తన స్వాధీనములో ఉంచలేడు.

మానవునకు సమస్య ఎదురయినప్పుడు, మనస్సు ఆ సమస్యకు తట్టుకొన లేకపోతున్నది. నరములు నీరసపడుచున్నవి. మానవుడు తన భయము వల్ల, క్రోధము వల్ల, అసూయద్వేషముల వల్లను ఉద్రేకమునకు లోనై ఎంతో శక్తిని కోల్పోవుచున్నాడు. ఎప్పుడయితే ఈ శక్తిని కోల్పోతున్నాడో అప్పుడు నరముల బలహీనత ఏర్పడును. ఈ నరముల బలహీనత

శరీరములో మరెన్నో రుగ్మతలకు కారణమగును. ఈ నేపథ్యములోనే గుండె జబ్బులు, జీర్ణకోశ వ్యాధులు మొదలైనవి సంక్రమించును. అందుకే వైద్యుడు రోగియొక్క మానసిక స్థితిని గ్రహించి రోగికి తొందరగా  నయమగునని ఉత్సాహపరచి, మంచి మాటలు చెప్పును. శాంతమును, ఉత్సాహమును అనుభవించు రోగి తన రుగ్మతల నుండి తొందరగా కోలుకొనును.

నమ్మకములు కూడా మనస్సుపై ప్రభావము చూపును. నమ్మకముతో కొందరు రోగములను తగ్గిస్తారు. ఈ నమ్మకములతో రోగములు నయమవ్వడమనేది ఎవరికీ అంతుబట్టదు. కానీ ఇవిజరుగుతునే ఉంటాయి. ఇదే విధముగా మానవాతీత శక్తులు మానవుని మనస్సుపై ప్రభావితము చూపుట కూడా జరుగును. ఈ ప్రక్రియను ప్రొఫెసర్ రైన్ ఆచరణ పూర్వకముగా నిరూపించెను. మనకు పాచికల ఆట తెలుసు. ఈ పాచికల ఆటలో పాచికలు ఏ సంఖ్యను చూపునో సామాన్యమానవులకు తెలియదు. కానీ పాచికల సంఖ్యను ముందుగా నిర్ణయించగల వారున్నారు.

మనస్సుకోరిన పనులు శరీరనిర్మాణ వ్యవస్థతో జరిగిపోవుచున్నది. మనస్సు యొక్క మంచిచెడుల మానసిక స్థితి శరీరముపై ప్రభావము చూపును.

శరీరము కాలములో భాగము. కానీ మనస్సునకు కాల ప్రభావము సోకదు. మనస్సు ఒక కప్పలాంటిది. కప్ప ఏ విధముగా అయితే నీటిలోనూ, నేలమీద ఉండ గలదో అదే విధమున మనస్సు కూడా శరీరముతోను, ఆధ్యాత్మిక స్థితిలోను ఉండ గలదు. మానవుడు తాను కల్పించుకున్న స్థితుల వల్ల తన మనస్సును పూర్తిగా ఆధ్యాత్మిక స్థితిలో ఉంచలేకపోతున్నాడు. శరీరము పరిమితమైనది. కాలమునకు లోబడినది. ఆధ్యాత్మికము అనంతమైనది, కాలాతీతమైనది. మనస్సు ఈ రెండు స్థితులలో ఊగిస లాడుచున్నది.

ఈనాటి మానసిక శాస్త్రవేత్తలు మానవుని స్వభావమును ఈ రెండింటి యొక్క విడదీయలేని కలయికగా వివరించినారు. ఇదే మానవుని వ్యక్తిత్వమనెను. శరీరము, మనస్సులతో కూడినది ఈ వ్యక్తిత్వము. మూడవది ఆత్మ. ఆత్మ పరమాత్మ స్వరూపము. అది కూడా మనలోనే ఉన్నది. ఆత్మయొక్క ఎఱుకను గుర్తించవలెనన్న శరీరము, మనస్సుల ప్రభావమును మానవుడు కోల్పోవలెను.

మానవుడు స్వేచ్ఛాజీవి. మానవుడు తన జీవితగమనమును తను నిర్ణయించు కోగలడు. మానవుడు తన జీవితమును ఆధ్యాత్మికముగా గానీ, భౌతికముగా గానీ జీవించనేర్చును. అది అతని ఇష్టము. తన శరీర, మనస్సులతో ఈ భౌతిక ప్రపంచములో అనేక అనుభవములను కోరుకుంటున్నాడు మానవుడు. అవి సుఖము, సంతోషము, సంపదలు, అధికారము, అలవాట్లు, వ్యాపారములు, పేరుప్రతిష్టలు, భౌతిక వస్తు వాహనములు, ఉద్యోగములు, ఎన్నో ఆశలుఆశయాలు మొదలయినవి. భావితరాలకు ఎన్నో పథకములను రూపొందిస్తున్నాడు. ఈ ప్రపంచము ద్వంద్వములతో కూడినది. మానవుడు ఆశించినది జరగవచ్చు జరగక పోవచ్చు. అంతేకాదు, మానవుని ఆరోగ్యసమస్యలతో బాధపెట్టవచ్చు. ఎన్నో భయములు, సమస్యలు ఎదురవ్వవచ్చు. ఈ కారణముననే మానవ జీవితము సులభముగా అర్థముకాని అనేకసమస్యల సుడిగుండములా తయారయినది.

గతజన్మ సంస్కారములవల్ల ఈ జన్మలో మన సంస్కారములు బయట పడుచున్నవి. కొందరు భౌతిక జీవితంపై ఆధారపడుతున్నారు. మరికొందరు ఆధ్యాత్మిక జీవనముపై మక్కువ చూపుతున్నారు. భౌతిక జీవన విధానము కోరుతున్నవారు శరీరం, మనసు, ఇంద్రియములకు లోబడి తమ జీవితములను అనుభవిస్తారు. ఆధ్యాత్మిక పిపాస కలవారు, ఇంద్రియముల

కతీతమైన బుద్ధి బలములతో ఈ తాపత్రయములకు లోబడక వ్యవహరింతురు. కాలము హాయిగా గడచినంతకాలము మానవునకు సుఖము విలువ తెలియదు. కష్టసమయములలోనే మానవుడు సుఖము యొక్క విలువను గ్రహించగలడు. కష్ట సమయములందే మానవుడు మంచికి నిలబడవలెను. అందుకే ఆధ్యాత్మిక జీవనములో ప్రతిక్షణం అప్రమత్తతతో జీవించెదరు. ఏ క్షణములో ఏమి జరుగునో ఎవరూ ఊహించలేరు. ఏ క్షణములో ఏ ఆపద సంభవించునో? ఏక్షణములో ఏ సమస్య వచ్చి మీదపడునో? జీవితము అంధకారబంధురమగును. అట్టి జీవన్మరణసమస్యలకు పరిష్కారమేమిటి? అంధకారమయము చేసిన జీవితమునకు వెలుగు అవసరము. అజ్ఞానముతో కూడిన జీవితమునకు జ్ఞానము అవసరము. కొందరు సమస్యలకు శాశ్వత పరిష్కారములను ఆశిస్తే, మరికొందరు తాత్కాలిక ప్రణాళికలను సూచిస్తారు. మానవ స్వభావరీత్యా ఇచ్ఛానుసారము, ఎవరినిర్ణయము వారు తీసుకుంటున్నారు.

జీవితములో ఎదరురయ్యే సమస్యలకు, ఆధ్యాత్మిక మార్గమున సాధనా పద్ధతులను ప్రవేశపెట్టెను. ఈ సాధనా మార్గమున శరీరమును, మనుస్సులను  అదుపులో ఉంచుట జరుగును. మానవుడు అంతర్దృష్టిని అభివృద్ధి పరచుకొనవలెను. మనలో జరుగుతున్న మంచి చెడుల యుద్ధమున విజయము సాధించవలెనన్న మన అంతరాత్మ బోధను లెక్కచేయనివాడు పతనమగును. మానవుడు తన జీవన విధానమును గూర్చి సరి అయిన అవగాహనకలిగి ఉండవలెను. ప్రేమతో, సమత్వముతో మానవుడు తనలోని చెడు అలవాట్లను, చెడు భావములకు స్వస్తి పలికి జ్ఞానము కలిగి ఉండవలెను. ఆధ్యాత్మిక శిక్షణలో ప్రేమకు పెద్దపీట వెయ్యబడినది. ఈ దివ్య ప్రేమతో మానవుడు అన్ని ఆటంకములను అధిగమించగలడు. ఆధ్యాత్మిక మార్గము ఎంతో ఉత్తమమైనది, సారవంత మైనది, ఎంతో నేర్పుగలది, ఎంతో అప్రమత్తతో కూడినది. ప్రతి అడుగు

ఎంతో శ్రద్ధాభక్తులతో కూడినది. కాలము అమూల్యమైనది. మిలటరీ శిక్షణ కంటె కఠినమైనది ఈ ఆధ్యాత్మిక శిక్షణ, జీవనము. అందుకే మనమధ్య సాధువులకంటే ఎక్కువ సంఖ్యలో సైనికులు ఎదురవుచున్నారు.

మహానుభావుల జీవితచరిత్రలు మనకు ఆదర్శము. వారి చరిత్రల నుండి మనకు ఎన్నో పాఠములు బోధపడును. మన జీవన సమస్యలకు పరిష్కారములు దొరుకును. మానవజీవితములో ఎదురయ్యే సంఘటనలకు గురియైన జ్ఞానముతో వారి జీవితము అద్దముపట్టును. ఒక సాధువు తన శత్రువులను ప్రేమించును. అనగా సాధువులు ఎవరినీ ద్వేషించరు. వీరు అందరిలోనూ భగవంతుని చూస్తారు. ఈ కారణముచే అందరి యెడల సమానమైన ప్రేమ, కారుణ్యములను ప్రసరిస్తారు. ఈ సాధువులు ద్వంద్వములకు లోబడక సమత్వమును అనుభవించెదరు. వారు ఎంత మేధావు లైనప్పటికినీ, సామాన్య జీవితములనే కోరుకుంటారు. వారు త్యాగభావముతో, ఓపికతో, వైరాగ్యభావములతో తమ జీవితములను గడుపుదురు. వీరి చరిత్రలు మనము చదివినప్పుడు, మనకు తెలిసే సత్యము ఒక్కటే. వారంతా నేను, నాది అనే అహంకార, మమకారములను వదిలి తమ జీవితములను సార్థక్యము గావించుకున్న మహానుభావులు.

## ఆ. మానవుల బేధాభిప్రాయాలు:

ఏ ఇద్దరు వ్యక్తుల మనస్తత్వం ఒక రీతిన ఉండదు. మానవులలో అనేక స్వభావములు గలవారు ఉంటారు. షెల్‌డన్ ఈ బేధాభిప్రాయములను చక్కగా వివరించెను. మానవులందరు వివిధ శారీరక మానసిక స్థితులలో ఒక ముక్కోణపు కుండలిలో మసులుతూ ఉంటారు. ఈ మూడు భౌతిక, మానసిక స్థాయిల కలయికతో మానవుల ప్రవర్తన సాగుతుంది. ఈ మూడు భౌతిక స్థాయిలను గుర్తించి నిర్ణయించవచ్చు.

మొదటి భౌతికస్థాయిని ఎండోమార్ఫిక్ స్థితి లేదా విసిరోటోనియా అని అంటారు. ఈ స్థితిలో ఉన్నవారు భోజనప్రియులుగాను, సుఖ సంతోషముల కొరకు ప్రాకులాడే వారిగాను, పండుగలయందు అధిక శ్రద్ధగలవారిగాను, జనసమూహము లంటే ఇష్టముతో వ్యవహరించుట, ఏకాంతమంటే వీరికి భయము. నలుగురితోను కలవాలనే అభిలాష, నిర్మొహమాటముగా భావప్రకటన చేయుట, కుటుంబ సభ్యులపై అంతులేని ప్రేమానురాగములను వ్యక్తముచేయుట, ఇతరుల ఆత్మీయతకోసం, ఇతరుల మన్ననల కోసం తాపత్రయపడుట మొదలగు లక్షణములు కలవారిగా ఉందురు. ఈ స్థితిలో నేర్చుకోతగ్గ అంశములు. క్రమశిక్షణకు అలవాటు పడాలి. తన భావోద్రేకములను అదుపులో ఉంచుకోవాలి. ఇతరులపై గల వీరి ప్రేమను దయ, కరుణ, త్యాగములతో వ్యక్తం చేయుట, అందరిమేలు కోసం పాటుపడడం అన్నట్టుగా వీరి జీవితములను తీర్చిదిద్దుకోవాలి.

రెండవ భౌతికస్థితిని మెసోమార్ఫిక్ స్థితి లేదా సొమటోనియా అని వ్యవహరిస్తారు. వీరు తమ శారీరక శ్రమపై ఎక్కువ శ్రద్ధ చూపుతారు. వీరు ఉద్రేక స్వభావులు. వీరికి పదవీ కాంక్ష హెచ్చు, వీరు ఇతరుల కష్టనష్టములను పట్టించుకోరు; వీరికి పోటీతత్త్వం ఎక్కువ. వీరికి ధైర్యమెక్కువ, ఎప్పుడూ ఏదో ఒక కార్యక్రమములో మునిగి ఉంటారు. వీరు నేర్చుకోవలసినది తమ భావోద్రేకములను నియంత్రించుకోవడం.

మూడవ భౌతికస్థితిని ఎక్టోమార్ఫిక్ స్థితి లేదా సెరిబ్రోటోనియా అని వ్యవహరింతురు. వీరు ప్రతి విషయానికి అధికంగా ఆరాటపడతారు. చాలా సున్నిత మనస్కులు; ఇతరులపై పెత్తనం చెలాయించడానికి ఇష్టపడరు. ఏకాంతమును కోరుకుంటారు. అధికంగా భయపడటం, సిగ్గు పడటం, పరధ్యానముగా ఉండడం వీరి లక్షణములు వీరు నేర్చుకోవలసినది వీరు అంతర్ముఖులవ్వాలి. జ్ఞానంతో తమలోని లోటుపాట్లను సరిదిద్దు కోవాలి. వీరు తమ అహంకార, మమకార నాశముతో ఎంతో ఉన్నతస్థితికి చేరుదురు.

# 6. ఆధ్యాత్మికానుభవం

ధ్యానములో నాలుగు స్థితులున్నవి. మొదటి స్థితిలో ధ్యాని ఇంకా ధ్యానము మొదలుపెట్టలేదు. మానవుడు అనుభవించు శారీరక, మానసిక రుగ్మతలకు ధ్యానము చాలా మేలు చేయుననే సదుద్దేశముతో ధ్యానము మొదలు పెట్టుటకు నిర్ణయించు కొనును. ధ్యానము సాగేకొద్దీ తనలో కలిగే మార్పులు గురించిన జ్ఞానమును గ్రహించును.

రెండవస్థితిలో ధ్యానము సాగుచున్నది ఆత్మ పరిశీలనతో తనలోని లోపములను గ్రహించును. అహంకార మమకారములను త్యజించు ప్రయత్నము మొదలవును. భగవంతుని గూర్చి కొన్ని అనుభవములు అనుభూతికి వచ్చును.

మూడవ స్థితిలో ధ్యాని అహంకార, మమకార నిర్మూలనతో భగవంతుని యందు మనస్సును లగ్నము చేయుట జరుగును.

నాల్గవ స్థితిలో నిరాకార పరబ్రహ్మమును గుర్తించుట జరుగును. అది ఆనందమయము. అది దివ్యమైన జ్ఞానస్థితి. భవబంధములకు అతీతమైన స్థితి. అహంకార మమకారములకు అతీతమైన స్థితి. తాను శ్రమించి ఆశించిన దానికంటె ఎన్నోరెట్లు అధికమైన స్థితి. భౌతికమైన మానవ జన్మకు పరమార్థము సిద్ధించిన స్థితి.

సామాన్య మానవులు ఇట్టి స్థితులను గ్రహించరు. వారు తమ పశు లక్షణముల తోనే భౌతిక జీవనమును సాగిస్తారు. వీరు తమ పశు ప్రవృత్తితోనే జీవిస్తారు తప్ప ఆధ్యాత్మిక జీవనముక్తికై అసలు ప్రయత్నము చేయరు.

కారణము అనేది మానవునికి తన జీవితమున ఎంతో మేలుచేసే ఉపకరణము. కాల, కారణ, కర్మలఫలితములను భూత, వర్తమాన, భవిష్య దృష్టితో పరికించి మానవుడు ఆశాజీవిగా జీవించును. మానవునికి ఎవరూ వచ్చి చెప్పరు. తన సొంత తెలివితేటలను ఉపయోగించవలెను. ఎవరో వచ్చి తనను ఆధ్యాత్మిక మార్గమున ప్రవేశ పెట్టనక్కరలేదు. మానవుడు ఎప్పుడూ తన పరిస్థితిని గమనిస్తూ ఉండవలెను. తనలో నిరంతరము మంచిచెడుల పోరాటము జరుగుతూనే ఉంటున్నది. తన అహంకార, మమకారములు ఒకవైపు ఆధ్యాత్మికతలు మరోవైపు అన్నట్టుగా ఈ రెండిటి నడుమ నలుగుతున్న మానవుడు సాధనతో, జ్ఞానముతో ఆధ్యాత్మికమువైపు మొగ్గు చూపవలెను.

అలసట, బడలిక, విసుగులను కలిగించే ఈ మానవ జీవితమునకు ఆధ్యాత్మిక జ్ఞానము చాలా అవసరమైయున్నది. మానవుడు పరిమిత స్థితినుండి అనంతమైన స్థితిని పొందవలెను. మానవజన్మ ఎంతో దుర్లభము. మానవుడు తనలోని పశువృత్తులకే పరిమితమై మానవజన్మను వృధాపరచరాదు. పశుగుణములను అహంకార, మమకారములను మానవుడు త్యజించవలెను. తనలోనే అగోచరముగా ఉన్న అనంత తత్త్వమును గుర్తెరిగి, అట్టి ఏకాంతములో నిమగ్నుడు కావలెను.

కారణము, తెలివితేటలు అనునవి రెండు శక్తులు. అవి సాధనలోని వృత్తులు. కారణశక్తితో మానవుడు తన అంతర్, బాహ్య స్థితుల అవగాహన కలిగి సాధనకు మార్గము సుగమము చేసుకొనును. తెలివితేటలు లేదా జ్ఞానము సత్యమును తెలుపును. కారణము వివరములతో కూడినదిగా ఉండును.

కొందరు మేధావులు భగవంతుని ఉనికినే ప్రశ్నిస్తున్నారు. శరీర, మనసు, ఆత్మలతో కూడినది ఈ మానవజన్మ అని అందరు గుర్తించవలెను. శరీరము మరియు మనస్సు పరిమితమైన స్థితియందు ఉండును. ఆత్మ

అనంతమైన స్థితి యందు ఉండును. ఆత్మ గుణాతీతమై శరీర, మనసు, ఇంద్రియములకు అతీతమై ఉంటున్నది. మానవుడు స్వేచ్ఛాజీవి. పరిమిత, అనంతమైన ఈ రెండుస్థితులలో ఏ స్థితినైనా మానవుడు అనుభవించుటకు స్వేచ్ఛ కలదు.

ఆధ్యాత్మిక మార్గములో పయనించేవారు కూడా ఎల్ల వేళలా అనంతమైన స్థితిలోనే ఉండడమనేది జరగదు. ఇహము, పరములతో కూడినది మానవ జీవితము. ఒకసారి తాను పరిమితమైన మానవునిగాను, మరియొకసారి అనంతమైన ఆత్మతత్త్వముతో భాసిల్లుతున్నట్లుగా వ్యవహరించును. ఈ స్థితులు సహజముగాగానీ, అవసరముగా గానీ మారుచుండును.

సత్పురుషులు తమ శరీర,మనస్సులను ఆధ్యాత్మిక మార్గమున పయనింప చేయుదురు. దుర్మార్గులు తమ మేధాశక్తిని ప్రయోగించు చుందురు. సత్పురుషులు జీవన్ముక్తులు. వారు మరణము తరువాత అమరత్వమును పొందెదరు. భగవంతుని సాధన చేయనివారు, తమ మరణానంతరం ఊహాజనితమైన ఒక స్థితిని ఊహించుకొందురు.

మానవుని మరణానంతరము ఏమి మిగులుతున్నది? మానవుని వ్యక్తిత్వమా? కాదు కాదు. మనస్సు, ఆత్మలు మిగులుతున్నవి. ఆత్మ అనంతమైనది. ఆత్మ తోడు ఈ మనస్సు ప్రయాణము చేయుచున్నది. ప్రతి జన్మకు ఈ మనసులో మార్పులు కలుగుచున్నవి.

అనుభవమన్నది మాటలకందనిది. ఆ అనుభవం కేవలం ఒక పవిత్రమైన మనస్సు, మరియు విశాలమైన హృదయము కలిగిన వారికి మాత్రమే అర్థమగును. మానవుడు చేసిన తప్పులకు పశ్చాత్తాపమును అనుభవిస్తాడు. ఈ పశ్చాత్తాప అనుభవము బాధాకరమైనది. పశ్చాత్తాపము

వలన తనమీద మరింత ప్రేమ కలిగి ఉంటున్నాడు మానవుడు. పశ్చాత్తాపము వల్ల కలిగే బాధకు కారణము మానవుని అహంకారమే. అహంకారమున్నంతవరకు మానవుడు తన దృష్టిని భగవంతునిపై పెట్టలేడు. తనపై శ్రద్ధ చూపుతున్నంతసేపు మానవుని అహంకారమునకు మనుగడ ఉండును. తనపై శ్రద్ధ తగ్గేకొద్దీ మానవునిలోని అహంకారము కూడా రూపు మాయును.

పశ్చాత్తాపమే ఆధ్యాత్మిక మార్గమున ప్రథమ సోపానము. ఈ పశ్చాత్తాపము వలన తనమీద తనకే అసహ్యము, బాధ కలుగును. ఈ ప్రక్రియ ద్వారా 'మనస్సు మారును' చేసిన తప్పే మళ్ళీమళ్ళీ చేసి, ప్రతిసారి పశ్చాత్తాపపడుటకు అలవాటు పడకూడదు. మానవుడు పశ్చాత్తాపముతో తనను తాను ఎన్నడు కించపరచకూడదు. పశ్చాత్తాపముతో మళ్ళీ తప్పులు చేయరాదు. నిజమును వ్యక్తం చేయవలెను. చేసిన తప్పులను ఒప్పు కోవలెను, దాచరాదు. పశ్చాత్తాపముతో మానవుడు ఆధ్యాత్మిక మార్గమున ముందుకు సాగవలెను కానీ వెనుకంజ మాత్రం వేయరాదు.

ఆధ్యాత్మిక మార్గమున ఉన్న ప్రమాదములను కూడా మానవాళి గుర్తించవలెను. ఛాందసులు మూఢభక్తితో తమ మతము యొక్క ఆధిక్యము కొరకు కృషిచేసెదరు. మరికొందరు తమ మతమును పునరుజ్జీవింప చేయు దిశగా కార్యక్రమములు చేయుదురు. మరికొందరు ఆధ్యాత్మికమును విగ్రహారాధనకే పరిమితము చేయుచున్నారు.

అనంతమైన ఆధ్యాత్మికమునందు కూడా పరిమితమైన భౌతికము ప్రవేశించినది. అహంకారముతో, ఆడంబరముగా ఈ మతపరమైన కార్య క్రమాలు తమతమ ఆధిపత్యములను నిరూపించుటకు ప్రయత్నిస్తున్నారు. ఇట్టిస్థితిలో మతమును అర్థముచేసుకున్న ఆధ్యాత్మిక పరులు కొద్దిమంది మాత్రమే కనపడుచున్నారు. మిగతావారు కాలచక్రములో కలసిపోతున్నారు.

# 7. ఆధ్యాత్మిక సాధనలు

## అ. అందరి అభిప్రాయం:

ఆధ్యాత్మిక సాధనలు మానవునకు ఎంతో అవసరమై ఉన్నవి. మానవుని మనస్సు భౌతిక ప్రపంచములో మునిగి ఉండును. ఇట్టి భౌతిక జీవితమునకు అలవాటుపడిన మనస్సు భగవంతునిపై శ్రద్ధచూపదు. ఇట్టి భౌతికమైన మనస్సునకు భగవంతుని రుచిచూపవలెను. తనలో ఉన్న అనంతమైన భగవతత్త్వమును గుర్తించుటకు, గ్రహించుటకు, ఆనందించుటకు ముందు తనను తాను తెలుసుకొనవలెను. అటు పిదప తను తన అహంకార, మమకారములను నాశనము చేసుకొనవలెను. సుఫీ సన్యాసి అయిన అన్సారీ మాటలలో, మానవుడు ఆధ్యాత్మిక మార్గమున పయనించి భగవంతుని ప్రీతిని పొందవలెనన్న తనను తాను (అహంకార, మమకార ములను) కోల్పోవలెను.

కామ, క్రోధ, లోభ, మోహ, మద మాత్సర్యములనే అరిషడ్వర్గములు మానవుని మనస్సును అపవిత్ర పరచుచున్నవి. ఇట్టి అరిషడ్వర్గములను పార ద్రోలుటకు మానవుడు శమము, దమము, ఉపరతి, దీక్ష, శ్రద్ధ, సమాధానము మొదలైన షట్కర్మలను తనలో ప్రవేశపెట్టుకొనవలెను. ఈ సాధనల వల్ల మనస్సు పవిత్రమగును. భగవంతునిపై ప్రేమను పెంచుకొనును. భగవంతుని జ్ఞానము కలుగును. తన చైతన్యము విశ్వ చైతన్యములోని భాగముగా గుర్తించును.

ఈ ప్రపంచము ద్వంద్వములతో కూడినది. ఇట్టి ద్వంద్వముల వలన మనస్సు తరచు ఆటుపోట్లకు గురిఅగును. మనస్సు పవిత్రమైన వేళ ప్రశాంతతను అనుభవించును. ప్రశాంతమైన మనస్సుతో ధ్యానము చక్కగా సాగును. ఇట్టి ధ్యానము భగవత్ సాక్షాత్కారమునకు దారితీయును.

జ్ఞానము అయిదు స్థితులలో ఉండును. పుస్తక జ్ఞానము, మిడిమిడి జ్ఞానము, లోకజ్ఞానము, విచక్షణా జ్ఞానము, అనుభవ జ్ఞానము. అనుభవ జ్ఞానమే అసలైన జ్ఞానము. ఇట్టి అనుభవ జ్ఞానముతో మానవునిలో మంచిమార్పులు కలుగును. ఈ మంచి మార్పుల వల్ల మానవుడు తన పాత అలవాట్లను క్రమేపీ వదిలివేయును. మానవుడు ఇట్టి జ్ఞానముతో తాను చేయు కర్మలపై సరి అయిన అవగాహన కలిగియుండును. అతనిలో భగవంతునిపై నమ్మకము పెరుగును. తనపై తనకు ఆత్మ విశ్వాసము, తృప్తి, ప్రశాంతతలు కలుగును, పెరుగును. ఇట్టి బ్రహ్మజ్ఞానముతో మానవుడు బ్రహ్మములోనే లీనమగును.

ఆధ్యాత్మిక సాధనలకు మానవుడు ఓర్పు, శ్రద్ధ కలిగి ఉండవలెను. మొదట్లో అనుభవ లేమి కారణముగా సాధన సరిగా సాగకపోవచ్చును. కానీ నిరాశ చెందరాదు. చేసిన సాధనకు ఎట్టి పరిస్థితులలోను మానవుడు తృప్తిచెందరాదు. మన సాటి మనిషియొక్క తప్పిదములను భరించలేని మనము, మనలోని తప్పిదములను ఎట్లు భరించగలుగుతున్నాము? తన తప్పులకు చిరాకు పడేవాడు, నిరాశ చెందేవాడు వాటిని ఎన్నటికి సరిదిద్దలేడు. మానవుడు శాంతము, సమచిత్తముతో తనలోని లోటుపాట్లను సవరించుకోవలెను.

చక్కగా సాగుతున్న ఆధ్యాత్మిక సాధనను ఎన్నడూ మానరాదు. చేతికి దొరికిన పక్షిని వదిలితే మళ్ళీ దొరుకుతుందా? దొరకదు కదా. కాబట్టి మొదలుపెట్టి చక్కగా సాగుతున్న సాధనను మానకూడదు.

నేను చేసిన సాధన చాలు, అనే పరిస్థితి సాధనలో ఉండదు. అలా భావించి సాధనకు స్వస్తి చెప్పినవాడు, అప్పటి దాకా సాధించిన దానిని పూర్తిగా కోల్పోతాడు. కారణము సాధన సాగేకొద్దీ మనలోని లోపములు బయటపడతూ ఉంటాయి. అట్టి లోపములను సరి చేసుకుంటూ సాధనలో

పురోగమించవలెను. మనలోని నైపుణ్యము మనలోని లోపములను బహిర్గతపరచును. ఇట్టి నైపుణ్యము, జ్ఞానముతో సాధన సాగవలెను.

మన దైనందిన జీవితములో భగవంతుని జ్ఞాపకము చేసుకొనుట ఎట్లు? జపము ద్వారా మనము ప్రతిరోజు ఆ భగవంతుని యొక్క నామమును గానీ మంత్రమును గానీ స్మరించుచుందుము. భౌతికమైన కర్మల నాచరించే సమయములో మనస్సును పూర్తిగా వాటిపైనే లగ్నము చేయవలెను. ఈ భౌతిక కర్మలు మొదలు పెట్టడానికి పూర్వము, పూర్తి అయిన పిదప తిరిగి ఆధ్యాత్మిక సాధనలు చేసుకొనవచ్చును. నిరాటంకముగా మన పనులయందు శ్రద్ధ చూపవలెను. మధ్యమధ్యలో విరామము అవసరము ఉండును. ఈ విరామ సమయములలో మానవుడు పగటికలలు కనవచ్చు లేదా తనకు తోచిన రీతిని భగవంతుని ధ్యాసలో గడపవచ్చును.

**ఆ. ధ్యానము**

అన్నిటికంటె తేలికయిన ఆధ్యాత్మిక సాధన జపము. ఈ జపములో మంత్రమునుగానీ, భగవంతుని నామముగానీ ఉచ్ఛరించెదము. అన్నిటి కంటె తేలికైన తేజోవంతమైన మంత్రము ఓంకారము. హిందువులే కాక బౌద్ధులు కూడా ఈ ఓంకారోపాసన చేయుదురు. ఈ జపము వల్ల భగవంతుని నామము సదా ఉచ్ఛరింపబడును. జపము వలన శాంతి లభించును.

మంత్రోచ్చారణ ఒక పవిత్రమైన సాధన. మంత్రోచ్చారణ వలన భగవంతుని అనుగ్రహమునకు పాత్రులమగుదము. మంత్రోచ్చారణ వలన మంత్రశక్తి అభివృద్ధి యగునని హిందువుల అభిప్రాయము. ఇట్టి మంత్రోచ్చారణ యొక్క ప్రభావము మానవుడు స్పృహలేని స్థితిలో కూడా అనుభవించును. ఎట్టి ఆటంకములు లేకుండా నిరంతరము ఈ మంత్రోచ్చారణ వలన ఆత్మ పరబ్రహ్మములో లీనమైపోవును.

సుఫీ అభిప్రాయము ప్రకారము మంత్రోచ్ఛారణ వలన భగవంతుని తలుపులు తెరవబడునని, ఆ తెరవబడిన తలుపుల నుండి మన ఆత్మలు పరమాత్మలో విలీన మగునని తెలిపిరి. మంత్రోచ్ఛారణ జరిగే సమయములో ఆర్తికావలెను. ఆర్తిలేని సాధన వల్ల ఫలితము శూన్యమగును. కాబట్టి మంత్రోచ్ఛారణకు మనస్సు ఏకాగ్రత చాలా ముఖ్యము. ఏకాగ్రత కలిగిన మంత్రోచ్ఛారణ మనలో భగవంతుని ద్వారములను తెరచును.

ఏకాగ్రతతో రూపనామములతో చేయు ధ్యానమువలన మానవులు కొన్ని అనుభవములను పొందవచ్చును. వీరికి కొన్ని సిద్ధులు కలిగిన అనుభూతులు కలుగును. ఈ సాధనలలో వీరు కొన్ని దృశ్యములను చూచుట, మాటలను వినుట, భవిష్యత్ జ్ఞానము, దూరదృష్టి మొదలగునవి అనుభవమునకు వచ్చును. ఈ అనుభవముల వల్ల సాధకులలో అహంకారం పెరిగి చెడు ఫలితములు కలుగవచ్చును.

తీక్షణమైన శ్రమ చేయు శారీరక సాధనల వల్ల శరీరము లోపల వేడి జనించును. ఇది సర్వసాధారణము. ఈ వేడిని నియంత్రించుట సాధకులు సాధనతో సాధింతురు. ఈ కారణము చేతనే ఎంతో చలిప్రదేశములైన హిమాలయములలో సహితము ఋషులు, సాధువులు తక్కువ వస్త్రధారణతో ఎంతో దీక్షతో సాధనలు సలుపుతారు.

సాధన మనస్సును అనుసరించి సాగును. కోరికలతో సాగిన సాధన అసంపూర్ణ స్థితిలో ఆగిపోవును. అహంకార, మమకారములు లేని స్థితిలో ధ్యానము సాగిన నిరాకార పరబ్రహ్మము అనుభవమునకు వచ్చును. అప్పుడు సంసారమే నిర్వాణమగును, జీవన్ముక్తి లభించును.

మరణమునకు సంబంధించిన టిబటిన్ పుస్తకములో ఇట్లు తెలిపెనది. మనస్సున కులదేవత విగ్రహమును గూర్చి తదేక ధ్యానము చేయగా, ఆ విగ్రహము యొక్క రూపము నెమ్మదిగా సమసిపోవును. అనగా

సాకారసాధన చేయగా చేయగా, మెల్లగా నిరాకార స్థితికి చేరుకుంటాము. మానవుడు ఈ విధముగా సాకార, మరియు నిరాకార సాధనలు చేయగా చేయగా మెల్లిగా నిరాకార స్థితి అనుభవమునకు వచ్చును.

ఆధ్యాత్మిక సాధనలైన జపము, ధ్యానముల వలన మనలో పవిత్రత పెరిగి, విశాల భావములు అభివృద్ధియై మనలను ఉత్తమ గతులకు చేర్చిన సంతోషము, అట్లుకాక ఈ సాధనల వల్ల స్వార్థము, అహంకారము పెరిగిన యెడల అట్టి సాధనలను వెంటనే మాని వేయవలెను.

ఎక్‌హార్ట్ విగ్రహారాధనకు పరిమితమవ్వరాదని హెచ్చరించెను. సాకార రూపములే మొదలుపెట్టిన సాధన గమ్యము. నిరాకారమని, ఆ నిరాకారము మెల్లి మెల్లిగా సాధకుని అనుభవమునకు వచ్చునని శెలవిచ్చెను.

అజ్ఞానము, స్వార్థము మన సాధనలకు మూల విఘ్నములు. తీవ్రమైన సాధకులు కూడా స్వార్థము వల్ల భ్రష్టు పట్టుచున్నారు.

నిరంతరము భగవంతుని ధ్యాసకు అలవాటు పడవలెను. పార్ట్‌టైమ్ డివోషన్ పనికిరాదు. పార్ట్‌టైమ్ భక్తి అనగా జోడిగుర్రాల స్వారీ వంటిది. అది చాలా కష్టము. మనకు హానికరము. నిరంతరము భగవన్నామముతో సాగే జపముతో మనము మనస్సును భగవంతునిపై మరల్చుటకు వీలగును. భౌతికమైన ప్రపంచ విషయ వాసనల నుండి ఆధ్యాత్మిక దృష్టికి ఈ జపము ఎంతో సహాయకారిగా ఉండును.

బలవంతముగా ఆధ్యాత్మిక కార్యక్రమములను ఆచరించరాదు. కుక్క తోక వంకర అన్నట్టుగా బలవంతంగా ఆధ్యాత్మిక మార్గములో ప్రవేశ పెట్టడానికి కొందరు ఆధ్యాత్మిక గురువులు తమ శిష్యుల చేత సాధన చేయించెదరు. అవి ఫలింపక పోగా భగవంతునిపై సాధకునికి ఉన్న ప్రేమ కూడా నశించిపోవును.

బలవంతముగా కాక భగవంతునిపై ప్రేమతో ఆధ్యాత్మిక సాధన మొదలు పెట్టేటట్లు గురువులు శిష్యులకు శిక్షణ నివ్వవలెను. సాధకునికి సాధన శ్రమ అనిపించకూడదు. సాధన ఇష్టముగా సాగవలెను. ఇష్టముగా సాగే సాధనల వల్ల తనలో ఉన్న ఇబ్బందులను మెల్లిమెల్లిగా అధిగమించును.

సాధనలలో ఉన్న ఇబ్బందులను జయించవలెనన్న, తనను తాను ఆత్మ పరిశీలన చేసుకొనవలెను. తన కర్మలను, భావములను తన స్వశక్తికి అనుగుణముగా తీర్చి దిద్దుకోవలెను. ఈ ఆత్మపరిశీలనా శక్తితో మనల్ని మనము పరిశీలించుకుని, మనలోపములను గుర్తించి, వాటిని అధిగమించ వీలగును. స్వార్థమే అన్ని చింతలకు మూలము అన్నట్లుగా స్వార్థమే ఆధ్యాత్మిక సాధనలకు ప్రధాన ప్రతిబంధకము.

సాధనమున ఎదురయ్యే స్వానుభవముల నుండి సత్యమును గ్రహించవలెను. అట్టి సత్యముతోనే ముందుకు సాగవలెను. అనంతమైన భగవత్తత్వము పరిమితమైన విగ్రహారాధనతో సాధ్యమయ్యేది కాదు. మానవుడికి తత్వజ్ఞానము అవసరము. ఈ తత్త్వజ్ఞానముతో మానవుడు తన అహమును నాశనమొనర్చి భగవంతుని యందు ప్రేమ, వినయ విధేయతలు కలిగి, సంపూర్ణ శరణాగతిలో ఆత్మసాక్షాత్కారమును పొందాలి. సాధనలో పొందినదానిని స్వలాభములకు స్వార్థము కొరకు ఉపయోగించ రాదని మానవుడు గ్రహించవలెను. ఈ హెచ్చరికను నిర్లక్ష్యము చేసిన భగవంతుని మరచిపోవును.

**ఇ. చింతన**

భగవంతుని గూర్చి ఆర్తిగా ప్రార్థించడమే చింతన. భగవంతుని చింతన అందరూ చేయవలెను. భగవంతుని చింతన ద్వారా బ్రహ్మ జ్ఞానమును బడసి బ్రహ్మములో ఐక్యమగును. అంతర్ముఖులైన సాధకులకు భగవత్

చింతన సహజముగానే జరుగును. ఈ భగవత్ చింతన నిర్మల మైనది, పవిత్రమైనది, నిశ్చలమైనది, స్వార్థ స్వప్రయో జనములు కానిది. అంతర్ద ృష్టి , భగవత్ చింతన రెండూ ఒకటే. భగవత్ చింతనతోనే అంతర్దృష్టి సాధ్యపడును. ఈ రెండిటి గమ్యము ఆ పరబ్రహ్మతత్త్వమే. ఈ భగవత్ చింతయే మానవుని శాశ్వతమైన ఆనందస్థితికి మూలము.

మన సంఘములో సత్పురుషులు జ్ఞానానికి ప్రతినిధులు. వారికి మంచిచెడుల అవగాహన కలదు. వారు మన సంఘము పతనము కాకుండా నిలబెడతారు. ఇట్టి సత్పురుషులు అన్ని కాలములలోను ఉందురు. ఈ మహాపురుషుల విషయములో భగవంతుడు ఎన్నడూ లోటుచేయడు. ఇట్టి నిస్వార్థ, పవిత్రమూర్తుల కారణముననే సంఘములో నిరంతరము మంచి కార్యక్రమములకు ఎట్టి ఆటంకములు లేక, ఇతరులకు స్ఫూర్తిదాయకులై, మానవత్వమును ప్రోత్సహించుచున్నారు.

కొందరు సాధకులు సమర్పణా భావముతో సాధన చేయుదురు. కర్మ, భక్తి, జ్ఞానములతో కూడినది సాధన. మనలో చాలామంది కర్మ చేయడానికి వెనుకంజ వేస్తారు. కానీ తప్పదు. ఓపికతో అందరూ కర్మ మార్గమున ప్రవేశించవలసినదే. కర్మ, భక్తితో కూడిన సాధన జ్ఞానమును సంపాదించును. భక్తిలేని జ్ఞానము నిరర్థకము. కాబట్టి కర్మ, భక్తి, జ్ఞాన మార్గములతో కూడిన ఈ సాధనను అందరూ ఓపికతో మొదలుపెట్టి, సాధించవలెను.

సాధకులు తమ నైజంరీత్యా, కర్మమార్గమున గానీ, భక్తి మార్గమున గానీ, జ్ఞానమార్గమున గానీ ప్రవేశింతురు. ఎవరూ ఏ మార్గమున ప్రవేశించినప్పటికీ మిగతా రెండు మార్గములలో కూడా సాధకుల ప్రవేశము సహజముగా జరిగిపోవుచుండును. ఈ మూడు మార్గముల మధ్యనున్న అవినాభావ సంబంధము అట్టిది. కర్మ యోగమున ప్రవేశించి భక్తి, జ్ఞానములను కూడా సాధించును. భక్తి మార్గమున ప్రారంభించినవారు

కర్మ, జ్ఞానమార్గములను అభివృద్ధి పరచుకొందురు. అదే విధముగా జ్ఞానమార్గమున ప్రవేశించినవారు సహితము కర్మ, భక్తి యోగములకు అలవాటు పడుదురు.

భగవత్ చింతనవల్ల భగవంతుడు మాత్రమే అనుగ్రహించుట కాదు. అనేక దివ్యమైన తత్త్వములతో కూడినది భగవత్తత్వము. తత్వజ్ఞానము పెరుగును, పవిత్రత పెరుగును, శాస్త్రీయ పరిజ్ఞానము పెరుగును. ఇట్టి తరుణమున కేవలం భౌతిక విషయముల పట్ల చింతన చేయుట ప్రమాదకరముగా మారును.

భగవత్ చింతన ఏక పక్షమున సాగకూడదు. అనగా భగవంతుని సాధనలో అనవసరము అనుకున్న వాటిని వదిలి వేసుకుంటూ వెళ్ళిపోతే, మన సర్వాంగములు ఖండింపబడినట్లుగా తయారగును. ఇది సరికాదు. మన సాధనలో ఉపయోగములేని వాటిని వదులుకుంటూ, ఉపయోగ మైనటువంటి వాటిని కలుపుకుంటూ వెళ్ళాలి. అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుడైన ఆ పరమాత్మను గ్రహించడానికి మనముకూడా శుద్ధ, బుద్ధ, ముక్త స్వరూప స్థితికి చేరుకోవాలి.

బ్రహ్మజ్ఞానులు సమాచిత్తులు, ద్వంద్వాతీతులు తమ చుట్టూ ఉన్న పదార్థములలోను, జీవులలోనూ, సందర్భములలోను వారు పరమాత్మనే దర్శింతురు. అనేకత్వములో ఏకత్వమునే దర్శింతురు. కానీ ఈ ఏకత్వము మానవుని పరిమితునిగా చేయునది కాదు. ఇట్టి ఏకత్వముతో మానవుని అన్ని శక్తులు అభివృద్ధియగును. తాను వికసించుటయే కాక, తన స్వరూప స్వభావములు కూడా మారిపోవును. భగవదనుగ్రహము పొంది బాధపడిన సంఘటనలు లోకమున ఇంతవరకు లేవు.

అనేక కర్మల సమాహారమే భగవత్సాధన. ఉపయోగపడని, గమ్యము లేని, మంచిచెడులు తెలియని కర్మలను పరిత్యజించుట జరుగుచున్నది.

ఈ పరిత్యజించుట కూడా ఒక కర్మయే. కొన్ని సందర్భములలో మనకు ఏ కర్మ చేయవలెనో, ఏ కర్మ త్యజించవలెనో సందిగ్ధము కలుగును. అట్టి సందర్భములలో సమర్పణా భావమే ప్రధానము. మన దైనందిన జీవితములో మన ఆదాయము, ఖర్చులు లెక్క చూసుకుంటాము. ఇదే నేపథ్యములో మనము ఆర్జించిన మంచిని మనము అనుభవింపవలెను, ఆనందించవలెను. ఇట్టి సాధనలో శారీరక శ్రమ కలుగవచ్చు. ఆ శారీరక శ్రమకు తగిన విశ్రాంతి అవసరమై ఉంటుంది. ఈ శారీరక శ్రమలో మనస్సు కొంత చికాకుకు గురికావచ్చు. అట్టి మనస్సుకు కొంత విశ్రాంతి అవసరము. మన గుండె విశ్రాంతి లేకుండా పనిచేయుచున్నది. అట్టి గుండె కూడా గుండె చప్పుళ్ళకు మధ్య కొంత విశ్రాంతి పొందుతున్నది. భగవత్ చింతన ద్వారా మానవుడు ఏది పొందుతున్నాడో దానిని ప్రేమగా బయటికి వ్యక్తం చేయుచున్నాడు.

ఆధ్యాత్మిక సాధన కత్తిమీద సామువంటిది. ఒకవైపు వ్యతిరేకత మరోవైపు అగోచరమైన అనంతమైన స్థితిపై నమ్మకము. మొదలు పెట్టడానికి ప్రయత్నం. ఇట్టి అగోచరమైన వాటిని సాధించుటకు దృఢ సంకల్పము ఎంతో అవసరమైయున్నది. శరీరము, మనసు, ఇంద్రియములను వశము చేసుకొనవలెను, అహంకార, మమకారములతో కూడిన నేను– నాది స్థితి నుండి అందరూ నావారే, అందరూ ఒక్కటే అనే విశ్వచైతన్యమును గ్రహించ వలెను. అమనస్క స్థితికి చేరవలెను. మనస్సుతో కాక హృదయముతో పనిచేయుటకు అలవాటుపడవలెను. హృదయము ఎంతో విశాలమైనది. మానవుడు ఏనాడైతే తనలోని పరిమితమైన స్వార్థ, సంకుచిత భావములను త్యజించి విశాల భావములను అభివృద్ధి పరచుకొనునో, అప్పుడే సమిష్టి స్వరూపుడైన భగవంతుడు అనుభవమునకు వచ్చును. భగవంతునికి శరణాగతితోనే ఇది సాధ్యము. హవేంగ్ పో ఇట్లు తెలిపెను. 'మనస్సు అమనస్కమైనప్పుడు నిశ్శబ్దముతో కూడి మనస్సును దాటిన స్థితిని చేరుకొనును, అనుభవించును'.

మానవ జీవిత లక్ష్యము ముక్తి. ఈ మార్గమున మానవుడు చెడు కర్మలకు స్వస్తిపలికి మంచికర్మలను స్వీకరించును, ఆచరించును. ఈ మార్గము కర్మ, భక్తి, జ్ఞానములతో కూడినది.

గౌతమబుద్ధుడు ఆత్మసాక్షాత్కారానికి ఎనిమిది సూత్రములను ప్రతిపాదించెను. మొదటిది తన కష్టము, బాధలకు కారణము తన అహంకార, మమకారములే అని తెలుసుకొనుట. రెండవది మోక్షాపేక్ష కలిగియుండుట. ఈ మోక్షాపేక్ష తననేకాక ఇతరులను కూడా ఉద్ధరించును. మూడవది అందరినీ సేవించు అనే రీతిన అందరి యెడల కారుణ్యము, త్యాగభావము కలిగియుండుట. నాల్గవది, సత్కార్యములతో శాంతిని నెలకొల్పి శాంతి సామరస్యములను ప్రసరింపచేయుట. ఐదవది ధర్మ బద్ధమయిన కర్తవ్యమునకు అలవాటుపడాలి. తాను ఆచరించే కర్మలవల్ల ఏ ఒక్క మానవునికి గానీ జీవికి గానీ హాని కలిగించరాదు. ఆరవది, సత్కర్మలతో తనను తాను నియంత్రించుకొనుట. ఏడవది ఎల్లవేళలా త్రికరణశుద్ధిగా సత్కార్యములకు అలవాటుపడాలి. కనీసం చెడు ఆలోచనలు కూడా చేయకుండా ఉండగలగాలి. ఎనిమిది సదా సదాలోచనలతో మనవలెను. ప్రతిమానవుడు ఈ ఎనిమిది సూత్రములను పాటించవలెను. ఈ విధముగా ఆచరించి మానవుడు తనను తాను భవబంధముల నుండి రక్షించుకుని, ఆత్మసాక్షాత్కారమును పొందవలెను.

ఆధ్యాత్మిక ఆనందమునకు, శారీరక,మానసిక కారణమున లభించే సంతోషమునకు ఒక తేడాగలదు. భౌతికమైన కోరికలు తీరే కొలది, కొత్త కోరికలు పుట్టుచుండును. ఆ భౌతికమైన కోరికలు తీరనప్పుడు మానవునకు దుఃఖము కలుగును. ఆధ్యాత్మిక మార్గమున కోరికలు ఆశించని కారణమున ఫలితముల కొరకు ఎదురుచూడడము జరగదు. కానీ ఏనాడైతే ఆనందమును అనుభవించ మొదలు పెడతామో, ఈ ఆనందమును శాశ్వతముగా ఆనందించుటకై ప్రయత్నము జరుగును.

ఆధ్యాత్మిక మార్గములో లభించే ఆనందము భౌతికమైన సంతోషమున కంటే అధికమైనది. ఈ ఆధ్యాత్మిక ఆనందము వైరాగ్యము, నిస్వార్థములతో కూడినది. సంతృప్తిని ఇచ్చునది, ప్రశాంతిని కలుగ జేయునది అనంతమైన దివ్యత్వముతో కూడినది. ఈ కారణముచే ఈ ఆనందము శాశ్వతమైనది. సాక్షాత్కారము పొందిన సాధకుడు బ్రహ్మత్వమును పొంది బ్రహ్మానందమును అనుభవించును.

అనేక మార్గముల ద్వారా సాక్షాత్కారము సాధ్యమగును. ఈ సాధనలో సాధకుడు ఏ స్థితికి చేరుకున్నాడు అనేది, సాధకుడు ఎంత వరకు తన అజ్ఞానమును ఈ సాధన ద్వారా తొలగించుకున్నాడో అన్నదానిని బట్టి ఆధారపడును.

శరీరము అశాశ్వతము. ఏ క్షణములో అయినా మరణం సంభవించ వచ్చును. ఈ శరీరములోనే ఆత్మస్వరూపుడైన భగవంతుడు నిరాకారిగా ఉంటున్నాడు. ఈ ఆత్మ భౌతికమైన శరీరం, మనస్సులతో కలసినపుడు జీవభ్రాంతిలో కష్టనష్టములకు, సుఖసంతోషములకు లోనగుచున్నాడు. భౌతిక దృష్టితో జీవించినంతకాలం మానవుడు ఈ ద్వంద్వములకు లోబడే ఉంటాడు. ఆత్మ – శరీర, మనస్సులకు భిన్నమని గుర్తించి మానవుడు సత్యపదార్థమును గ్రహించవలెను. ఈ జ్ఞానమే మోక్షము. ఈ మోక్షమే ఆనందమని చాంద్యోగోపనిషత్తు నందు తెలుపబడెను.

తనను తాను తెలుసుకున్నవాడు వైరాగ్యభావములతో స్వార్థము వీడును. ఈ ఎఱుకతో భవబంధముల కతీతమైన స్థితిని చేరుకొనును. శరీర, మనసులతో భవబంధములు వీడును. దాస్యము తొలగును. ద్వంద్వముల యెడ సమభావము అభివృద్ధియగును. పరిమితమైన భౌతిక స్థితిలో మానవుడు ఎన్ని సత్కార్యములు చేసినప్పటికీ మానవుడు ఆనందమును పొందలేడు. మానవుడు తన దేహేంద్రియ, మనస్సులను

పరిత్యజించనంతవరకు ఆనందమును పొందలేదని మైత్రేయుణ ఉపనిషత్తు తెలుపుతున్నది.

నీవు తత్వజ్ఞానమును ఎంతైనా చర్చించవచ్చు, నీకు నచ్చినన్ని భగవత్ రూపములను పూజించవచ్చు, నీ భక్తిని అనేక రీతులలో వ్యక్తము చేయవచ్చునుగాక, కానీ నిన్ను నీవు తెలుసుకోనంతవరకు ఎన్ని వందల జన్మలెత్తినా మోక్షము మాత్రము లభించదని ఆదిశంకరాచార్యుల వారు శలవిచ్చెను. పరిమితమైన భౌతికస్థితి నుండి మానవుడు సాధనతో మొదట తన అజ్ఞానమును తొలగించు కొనవలెను. ఆ పిదప తానెవరో గ్రహించ వలెను. అహంకార, మమకారములున్నంత వరకు ఈ సాధన సాగదు. ఈ అజ్ఞానంలో బంధీగా ఉన్నంత కాలం మానవుడు మోక్షముకొరకు ముందుకు సాగలేడు.

బౌద్ధమతము కూడా అదే తెలుపుతున్నది. చావు పుట్టుకలు లేని స్థితే నిర్వాణము. ఈ స్థితిలో మనస్సు తన పరిమితులు కోల్పోయి అనంతమైన స్థితిలో ప్రవేశించును.

'అసతోమా సద్గమయా', 'తమసోమా జ్యోతిర్గమయా', 'మృత్యోర్మా అమృతంగమయా'. ఇట్టి మార్గమున అమరత్వము, అంతులేని జ్ఞానము, ఆనందము లభించును. జీవన్ముక్తుడిగా భగవంతుని ప్రేమిస్తూ, ఆనంద మయముగా జీవితమును సాగించవలెను.

### ఈ. మౌనము (నిశ్శబ్దం)

నిశ్శబ్దంలోనే భగవంతుని గొంతువినబడుతుంది. నిశ్శబ్దంలోనే మనలో ఉన్న భగవంతుని గుర్తించడం జరుగుతుంది. కాబట్టి ఆధ్యాత్మిక సాధకులు నిశ్శబ్దానికి అలవాటుపడాలి. ఈ నేపథ్యంలో ఆధ్యాత్మిక అనుభవములను బహిర్గతపరచుట వలన సాధనకు విఘ్నము కలుగవచ్చును.

నియంత్రణ, విచక్షణ లేని మాటలు మానవుని నైతిక, ఆధ్యాత్మిక స్థితికి హాని కలుగజేయును. మనము మాట్లాడే మాటలు మూడు రకములుగా ఉంటున్నవి. మొదటిది, మన చుట్టూ ఉన్నవారిపై నిందా వాక్యములను వల్లించుట, స్వార్థ స్వప్రయోజనాలకై ఇతరులపై చెడుగా మాట్లాడుట. మూడవది, బుద్ధిమాంద్యంతో పలికెడు అనాలోచితమైన పలుకులు. ఈ పై ఉదహరించిన మాటలన్నీ వ్యర్థపు మాటలే. మంచి మాటల కంటే చెడు మాటలకే జనులు అలవాటుపడుతున్నారు.

మనలో మనం చాలా మాట్లాడుకుంటూ ఉంటాము. సాధారణముగా ఈ మాటలన్నీ వ్యర్థపు మాటలే. ఆధ్యాత్మిక మార్గమున సాధన చేసేవారు అనేకత్వమున ఏకత్వమును దర్శింతురు. ఇదే నివృత్తి మార్గము. ఈ నివృత్తి మార్గమునకు ఈ వ్యర్థమైన మాటలు మొదటికే ప్రతిబంధకమౌతాయి. మాటలను, మనస్సులను నియంత్రించుట కష్టమైన సాధన. అయినప్పటికీ మౌనము ఈ ఆధ్యాత్మిక సాధనకు ఎంతో అవసరమై ఉన్నది.

మౌనము మూడు విధములు. అవి మాటల మౌనము, మానసిక మౌనం మరియు ఇచ్ఛామౌనం. ఉపయోగములేని మాటల నియంత్రణ కష్టమైన సాధన. మనసు ఎప్పుడో గతించిన కర్మల జ్ఞాపకాలను నెమరువేసుకుంటూ, ఊహాలోకాలలో విహరించుచుండును. ఇట్టి మనస్సును నియంత్రించుట మరింత కష్టమైన సాధన. ఇచ్ఛాపూరితమైన రాగద్వేషాలను అరికట్టుట మరింత కష్టమైనది. మాటలవల్ల మనస్సు చెల్లాచెదురగును, కానీ మౌనం వల్ల, కర్మవల్ల ఆలోచనలు సంఘీభావం చెంది ఆధ్యాత్మిక శక్తిగా మారును.

మౌనం నాలుగు విధములు. మాటల మౌనం, ఇంద్రియముల మౌనం, హింసను అదుపుచేయు మౌనం, గాఢనిద్రలో నిశ్శబ్దం. మొదటి

మూడు మౌనములు కఠినమైనవి. నాల్గవది మోక్షమును తలపించునది. నిద్రలో ప్రాణశక్తి హెచ్చుతగ్గులు లేకుండా ఉంటుంది. ఇంద్రియములు బలవంతము, నిర్వీర్యము కాకుండా ఉండును. ద్వంద్వవైఖరి వ్యక్తము కాదు. మనస్సు లేని స్థితి. నిద్రలో ధ్యానం చేయవచ్చు చేయకపోవచ్చు. అనుమానములు లేనిస్థితి. శూన్యావస్థ, ఆధారము లేనిస్థితి. పరిపూర్ణమైన శాంతిని అనుభవించు స్థితి.

రెండు రకముల మునులు కలరు. మౌనం వహించువారు మునులు. ఒకరు ప్రయత్నంతో కూడిన ముని, వేరొకరు నిర్వాణము పొందినముని. ప్రయత్నపూర్వకమైన ముని తన ఇంద్రియములను బలవంతముగా అదుపులో పెట్టుకొని, సంపూర్ణమైన జ్ఞానములేక కార్యములలో పాల్గొనును. సాక్షాత్కారము పొందిన మౌని సత్యమును తెలిసినవాడై, ఆత్మజ్ఞానము కలవాడై కూడా సామాన్యమానవుని వలె జీవించును. మౌని తన ప్రవర్తనతోను, భావములలోనూ తాను ఎట్టి మౌనియో తెలుపును.

గత వంద సంవత్సరముల నుండి శబ్దకాలుష్యము పెరిగి పోయినది. అది భౌతికమైనది, మానసికమైనది మరియు కోరికలతో కూడినది. ఈనాటి శాస్త్ర సాంకేతిక ప్రగతి వల్ల శబ్దకాలుష్యం బాగా పెరిగింది. నిశ్శబ్దమునకు ఆటంకముగా తయారయింది. రేడియో మరియు టీవీలు మొబైల్ ఫోన్లు మన ఇండ్లలో, ప్రయాణములలో, పనిచేయు ప్రదేశములలో గందరగోళ స్థితిని కలిగించుచున్నవి. అర్థం లేని సంగీతము చెవులను ఛిద్రము చేయుచున్నది. మనస్సున ప్రవేశించి శాంతికి భంగము కలిగించుచున్నది. టీవీలలోని వ్యాపార ప్రకటనలు సహజత్వమునకు దూరముగా, కోరికలను రెచ్చగొట్టుచున్నవి. అన్ని రకముల వ్యాపార ప్రకటనలు శబ్దకాలుష్యమును విపరీతముగా పెంచుచున్నది. కోరికలు లేని స్థితిలో మనము జ్ఞానము ఆర్జించి మోక్షము సాధించగలము. కానీ ఈనాటి వ్యాపార ప్రకటనలు

మానవునిలో కోరికలను పెంచుతూ మానవుని పెడమార్గమున పెట్టి బాధలకు గురి చేయుచున్నవి. సాధనకు ఈనాడు ఇదే అన్నిటికంటె పెద్ద ప్రతిబంధకమైనది.

**ఉ. ప్రార్థన**

ప్రార్థన నాలుగురకాలు. విన్నపము, మధ్యవర్తిత్వము, ఆరాధన, దైవచింతన. విన్నపములో తన గోడును భగవంతునికి విన్నవించుట. మధ్యవర్తిత్వము ద్వారా తనవారి కోసం భగవంతుని ప్రార్థించుట, భగవంతుని యొక్క గుణగణములను గుర్తు చేసుకుంటూ ఆరాధించుట, భగవత్ చింతన ద్వారా భగవంతుని సాక్షాత్కారమునకు మార్గము సుగమము చేసుకొనుట.

విన్నపము ద్వారా తమ కోరికలను సిద్ధింప చేసుకోవాలనే తపన. వీరికి భగవంతునిపై ప్రేమ, భక్తులు ఉండవు. వీరికి అగోచరమైన ఒకశక్తి ఉన్నదని, ఆ శక్తి తమకోరికలను తీర్చునన్న భావము కలవారై ఉందురు. వీరి నమ్మకము ప్రయత్నములతో వీరి కోరికలు తీరవచ్చును.

భగవంతునిపై అచంచలమైన భక్తివిశ్వాసములు గలవారికి భగవంతుడు వారి కోరికలను నెరవేర్చును. మానవుడు తాను భగవంతుని కోరిన కోరికలు మంచివా, కాదా అన్నది కాలమే నిర్ణయించును. మానవుడు తనకు కావలసిన మంచిచెడులను సరిగా నిర్ణయించుకొనలేక, భగవంతుని ఏమి కోరాలో కూడా తోచక ఇబ్బంది పడుతున్నాడు. ఈ నేపథ్యములోనే ఎన్నో హాస్యాస్పద సంఘటనలు వెలుగుచూచుచున్నవి. అడగందే అమ్మైనా పెట్టదు అన్నట్టుగా భగవంతుని మనము ఎల్ల వేళలా మనమంచినే కోరుకోవలెను. మన మంచి ఏదో మనము నిర్ణయించుకోలేక పోవచ్చును. కానీ సమర్పణ భావముతో మనము మన భారము భగవంతునిపై పెట్టి ప్రార్థించవచ్చు. నేరాలు చేయకూడని పనులు చేసి మంచి ఫలితాలను ఆశించకూడదు.

మధ్యవర్తిత్వము ద్వారా భగవంతుని వేడుకొనుట ఎంతో ఉత్తమమైన సంప్రదాయము. సాటి మనిషిపై ప్రేమ గౌరవములు వ్యక్తమగును, స్నేహము పెరుగును, మనలోని కోపావేశములు నాశనమగును, మితిమీరిన కోరికలు మనలో ఉండవు. అందరిక్షేమం కోరడం వీరికి ఆనందం. సర్వేజనాః సుఖినోభవంతు, లోకాసమస్తా స్సుఖినోభవంతు అంటూ అందరిపైన ప్రేమను వ్యక్తపరచెదరు.

భగవంతునిపై గల ప్రేమను వ్యక్తం చేయుటే ఆరాధన. రూపాలు వేరైనా భగవంతుడు ఒక్కడే. మనకు నచ్చిన రూపంతో భగవంతుని ఆరాధించుటకు మనము సిద్ధపడతాము.

భగవత్ చింతన ద్వారా మానవుడు భగవంతునిలో లీనమగును. అత్యున్నతమైన ప్రార్థనలో కోరికలుండవు, హడావిడి ఉండదు, స్వార్థము ఉండదు. భగవంతుని ప్రేమే ఉంటుంది. ఫలాపేక్ష లేని స్థితి కాబట్టి ఇట్టి ప్రార్థనపై ఎవరికీ మక్కువ కలుగదు. భగవంతుని కొరకే తన జీవితమును అంకితము చేస్తాడు. తన మంచి చెడ్డలన్నీ భగవంతుడే చూసుకుంటున్నాడన్న నమ్మకంతో భగవంతునికి తనను తాను ఆత్మనివేదనము చేసుకుంటాడు.

భక్తిలో నటన ఉండకూడదు. వినయ విధేయతలు, వైరాగ్యము భక్తునిలో లక్షణాలు. ఆడంబరములతో రాత్రిపగలు ప్రార్థించినప్పటికీ అది భక్తి కానేరదు. వాడు భక్తుడు కాబోడు.

మనదంటూ ఈ జగత్తులో ఏమీ లేదు. అన్నీ ఆ భగవంతునివే. ఆ భగవంతుడు మన నుండి ఏమికోరుకుంటాడో అదే భగవంతునికి సమర్పించవలెను. ఉన్న స్థితి నుండి ఉన్నత స్థితికి ప్రయాణించుటే భగవత్ సాధన. తనలోని అహంకార, మమకారాలను నాశన మొనరించి భగవంతునిపై ప్రేమను పెంచుకుని, ఆరాధించి వినయ విధేయతలతో సేవించి, ఆర్తితో ప్రార్థించి భగవంతుని మహిమలను మననం చేసుకుంటూ

భగవంతునికి ఆత్మ సమర్పణ చేసుకొనవలెను. భగవంతునిలో లీనము కావలెను. మానవుడు తానున్న స్థానము నుండి, అప్పటికప్పుడు ఆ భగవంతునికి ప్రార్థన చేసుకుంటాడు. శాంతిని పొందుతాడు. కాబట్టి ప్రార్థన యొక్క మహత్తును సాధకుడు చక్కగా గ్రహించవలెను.

**ఊ. సరళత్వము – నిరంబరాడత్వం** (Simplicity)

సామాన్యమైన, సరళమైన జీవితములోనే ఎంతో హుందాతనం వ్యక్తమగును. సత్పురుషులు సరళమైన జీవితానికే ఇష్టపడతారు. సరళ భావాలు తేలికయినవి. కల్మషము లేనిది అహంకారం లేని స్థితి. సరళత్వము నిజాయితీ ఒకటి కాదు. నిజాయితీ ఎంతో ఉన్నతమైన సద్గుణము.

మనలో చాలామంది నిజాయితీ పరులుగా ఉండవచ్చు, కానీ సరళహృదయులు కాకపోవచ్చు. నిజాయితీగా బ్రతికేవారు తాము నమ్ముకున్న సిద్ధాంతాల కొరకు కట్టుబడి ఉన్నామని భావిస్తారు. ఈ ఆలోచనలతో వారు ఎల్లవేళలా తమగురించే ఎక్కువగా ఆలోచిస్తూంటారు. ఈ కారణము చేత వీరు ఇతరులతో సరిగా కలవలేరు. అలాగే ఇతరులు కూడా వీరితో సరిగాకలవలేరు. వీరికి మొహమాటంలేదు. ఉన్నది ఉన్నట్లుగా వ్యవహరిస్తారు. వీరితో వ్యవహారం సులువు కాదు.

బాహ్యదృష్టి కలవారు అంతర్దృష్టిపై సుముఖత వ్యక్తం చేయరు. అనగా వీరు సరళమైన జీవితమును వ్యతిరేకిస్తారు. బాహ్యదృష్టితో ఆడంబరంగా జీవించడం అనునది రెండవ కోణం. కొందరు సరళమైన జీవితమునకు అలవాటుపడి అందులో ఆనందాన్ని అనుభవిస్తారు. మరికొందరు ఆడంబరమైన జీవితానికి అలవాటుపడి అందులో సుఖసంతోషాలను వెతుక్కుంటారు. సరళమైన జీవితమున ఆలోచనా సరళి ఉండదు. మమకారాలు ఉండవు. బాహ్యమైన జగత్పరిణామాలకు ఒత్తిడి చెందరు. ఆధ్యాత్మిక సాధనకు అనువుగా వీరి జీవనవిధానం సరళముగా

రూపొందుతుంది. సరళమైన జీవితానికి అలవాటు పడినవారు బాహ్యా ఒత్తిడులకు లొంగక, ఆత్మ ధ్యానమందే నిమగ్నుమగునని ఫెనిలిన్ మహాశయుడు తెలిపినారు.

సరళమైన జీవితము అనాయాస మరణానికి చిహ్నాము. సరళమైన జీవితము ఒక గొప్ప నిధి. ఈ సరళమైన జీవితానికి అలవాటుపడాలంటే మూడు అడుగులు వేయాలి. మొదటిది బాహ్యాదృష్టి తగ్గించి అంతర్దృష్టిని పెంచుకోవాలి. రెండవది దైవచింతన, దైవముపై ప్రేమ అలవరచుకోవాలి. భగవంతునిపై భయభక్తులు కలిగినంత మాత్రమున సరిపోదు. బాహ్యా జీవితము, సరళమైన జీవితముల మధ్య ఊగిసలాడు వారికి శాశ్వతమైన ఆనందము దుర్లభం. మూడవది దైవముతో గడుపుటకు అలవాటు పడుదురు. భగవంతుని వైపు ఒక్కొక్క మెట్టే ఎక్కుతారు. ఎన్నో మధురమైన భగవంతుని అనుభవాలను పొందెదరు. ఈ అనుభవాలను మరింతగా పొందగోరెదరు. కడకు ప్రతిక్షణం ఆ భగవంతుని ధ్యాసతో జీవితాన్ని గడుపుతారు.

సత్కర్మకు ప్రతీక సరళమైన జీవిన విధానం. చెడుకర్మలు, సాంఘిక దురలవాట్లు దైవ తిరస్కారమువల్లనే జరుగుచున్నవి. ఈ తప్పిదములు స్వయంకృతాపరాధములే. అహంకార మమకారాలు రూపుమాపి భగవంతుని ధ్యాసలో ఉండినవారికి సరళమైన జీవితానికి తేలికగా అలవాటుపడతారు. అలవాటు లేనివారికి సరళమైన జీవితమంత కష్టమైన కార్యము మరొకటి ఉండదు.

## ఎ. నమ్మకం

నమ్మకమునకు అనేక అర్థములు కలవు. సందర్భమును బట్టి నమ్మకం అనగా విశ్వాసం. విశ్వాసం ఒక అధికార హోదా కలిగించునది. గతములో

జరిగిన కార్యకలాపాల దృష్ట్యా, ఆ కార్యక్రమాలు ప్రజలకు విశ్వాసమును కలుగజేయును. ఈ విశ్వాసములు సత్యమైనవి. నమ్మకమును మనము గతంలో పరీక్షించలేదు. అవసరమైన పరిస్థితులలో నమ్మకమును పరీక్షింపవచ్చును. అయితే అన్ని సందర్భములలోనూ ఈ నమ్మకమును పరీక్షింప సాధ్యముకాదు. ఈ నమ్మకాలను మనము నమ్మవచ్చు, నమ్మకపోవచ్చు. నమ్మకమనేది మన సొంత నిర్ణయం.

మనము దైనందిన జీవితములో చేసే ప్రతికర్మా నమ్మకంపై ఆధారపడి ఉంటుంది. మంచిపనులకు మంచి ఫలితాలు, చెడుపనులకు చెడు ఫలితాలు సంభవించును అని మనము చిన్ననాటనే వింటాము, నమ్ముతాము. అందుకు తగినట్లుగా మన జీవితాన్ని తీర్చిదిద్దుకుంటాం. ఈ జీవితం మనకు ఎన్నో గుణపాఠాలు నేర్పుతుంది. అనుభవాలతో కూడిన ఆచరణ మనకు విశ్వాసపాత్రమగును. నమ్మకమున్నచోట క్రమశిక్షణతో కూడిన వ్యవస్థ రూపొందును. ఈ విశ్వాసములో జరుగుచున్న శాస్త్ర సాంకేతిక రంగముల అభివృద్ధికి మూలము ఈ నమ్మకమే.

నాల్గవ నమ్మకమే మతపరమైన నమ్మకం. ఆధ్యాత్మిక మార్గము అగోచరమైనది. గుణములకు అతీతమైనది. నిరూపించ వీలుకానిది, శాశ్వతమైనది, అంతులేనిది.

ఎందరో మహానుభావులు అందరికీ వందనములు. ఎందరో మహానుభావుల జీవితచరిత్రలే మనకు పునాదిరాళ్ళుగా ఉపయోగ పడుతున్నాయి. వారు తమ జీవితాలను త్యాగము చేసి, ఎన్నో కష్టనష్టముల కోర్చి అంతులేని ఆనందప్రాప్తిని పొందారు. వారి జీవితాలే ఈనాడు మనకు ఆదర్శాలు. ఆ మహానుభావుల ధ్యేయము లోకకళ్యాణం. వీరిలో ఆనందమును మనముకూడా పొందవలెనన్న వారు నడచిన బాటలో మనము కూడా నడువవలెను.

నిచ్చెన ద్వారా మనం ఉన్నతస్థితికి చేరుకోగలం. నిచ్చెనకు రెండు ఆధారాలు కావాలి. ఒకటి క్రింద, మరొకటి పైన. ఈరెండు ఆధారాలు లేకుండా నిచ్చెన నిలబడదు. అదే రీతిగా ఆధ్యాత్మిక సాధనకు భగవంతునిపై నమ్మకం మరియు ప్రేమ ఉండాలి. భగవంతునిపై నమ్మకం లేకపోయినా, ప్రేమలేకపోయినా ఆధ్యాత్మిక సాధన సాగదు. భగవంతునిపై నమ్మకం, ప్రేమలు ఉన్నప్పుడే ఆధ్యాత్మికమార్గంలో ఒక్కొక్క మెట్టు పురోగతి సాగుతుంది. సంపూర్ణమైన శరణాగతితో పరిపూర్ణమైన ఆనందాన్ని అందుకునే వరకు భగవంతునిపై నమ్మకం, ప్రేమ కలిగి ఉండాలి.

సత్కార్యముల ద్వారా మనము భగవంతుని కాక మరేదానిని కోరుకున్నప్పటికి అది మనకు శాశ్వతమైన ఆనందాన్ని ఇవ్వదు. కాబట్టి భగవంతుడినే మనము కోరుకోవాలి. భగవంతుని లక్ష్యముతోనే, సాధించి తీరవలెనన్న నమ్మకంతో, భగవంతుని పైగల ప్రేమతో మనము కర్మ ఫలాలను ఆశించక ముందుకు సాగవలెను. సచ్చిదానంద స్వరూపుడు భగవంతుడు, అనగా సత్ చిత్ ఆనంద స్వరూపుడు భగవంతుడు. ఈ ఆధ్యాత్మిక మార్గమున మనయొక్క ప్రతి అడుగు ఈ సత్ చిత్ ఆనందముల కలయికగా మేళవించును. ఇదే సాక్షాత్కారానికి దారితీయును.

కర్మవల్ల, జన్మవల్ల, ధర్మంవల్ల వెంటనే ఫలితములు దక్కకపోవచ్చు కానీ త్యాగము వల్ల వెంటనే ఫలితములు దక్కునని రామాయణం ద్వారా శ్రీరాముడు మానవాళికి అందించిన సందేశం. మనము ఈ జన్మలో చేసిన కర్మల ఫలితమేమిటో మనము తెలుసుకోలేము. మనము మన స్థితిని తెలుసుకోలేము. కానీ ప్రయాణము సాగించవలసినదే. ఈ జన్మ కాకపోతే మరోజన్మ. లేదంటే మరోజన్మ. ఈ విధముగా తప్పొప్పుల నిర్ణయాలు భగవంతునికి వదిలేసి మానవుడు సత్కర్మలకు అలవాటుపడాలి. ఈ సత్కర్మలతో అహంకార, మమకార నిర్మూలనం సాగించాలి. సముద్ర

జలాలు ఏవిధముగా గాలిలో చేరి మేఘములై వర్షించి తిరిగి నదీజలాలతో కలిసి సముద్రాన్ని చేరునో, అదే రీతిలో ఆత్మ స్వరూపుడైన మానవుడు తిరిగి పరమాత్మలో చేరేవరకు తన ప్రయత్నాన్ని సాగించాలి.

## ఏ. అనుగ్రహం

మానవుడు తన స్వభావాన్ని అనుసరించి కర్మల నాచరించును. మనిషి యొక్క స్వభావము ముందుగా అతని మనసుపై ఆధారపడియున్నది. మానవుని స్వభావ రీత్యానే కోరికలు, అతని ఆలోచనలు, అతని నమ్మకాలు, అతని ఊహలు. ఉత్తమ సంస్కారాలతో కూడినవాడు మంచి పనులకు అలవాటుపడును. స్వార్థ చింతనలతో కూడినవాడు నీచమైన మరియు చెడు కర్మలకు అలవాటుపడును.

మానవుడు శక్త్యానుసారము భగవంతుని దిశగాగానీ, లేదా భగవంతునికి వ్యతిరేకముగా ప్రవర్తించును. మానవుడు చేసే కర్మలను బట్టి మంచి వ్యక్తి, చెడు వ్యక్తిగా నిర్ణయింపబడుతున్నాడు. మానవుడు స్వభావరీత్యా తనలో జరుగుచున్న మంచి, చెడుల ప్రభావం వల్లనే మంచి వ్యక్తిగానో, చెడు వ్యక్తిగానో వ్యక్తమగుచున్నాడు.

అత్యాశ, అసూయ, డంబము, ద్వేషము అను నాలుగు లక్షణములు నా అను మమకార లక్షణాలు. అత్యాశ, అసూయ, డంబములకు ఎదురు దెబ్బ తగిలినపుడు ద్వేషము జనించును.

ఈ నాలుగు లక్షణాలు మానవునికి శత్రువులు. అవి మానవుని బాధించును. ఈ నాలుగు లక్షణాలకు బలమైన బాహ్య, అంతఃకరణాలు ఉండవు. చెడుకు బాధ తోడుగా ఉండును. చెడు బాధ స్వార్థముతో కూడి పెరుగును. అవి దైవభక్తితో తొలగును.

మంచి అనునది మమకారమును తగ్గించి, నాశనమొనర్చునది. చెడు అనునది మమకారమును మరింత బలపరచి, ఆధ్యాత్మిక స్థితిని నిరాకరింప చేయును. సంఘములో నేడు ఎన్నో సంఘ విద్రోహ చర్యలను అందరూ ఖండించెదరు. అయినప్పటికి తెలిసి ఈ తప్పులు చేయుచున్నారు. మంచి చెడులకు పొత్తు కుదరదు.

మానవుడు తన ఇచ్ఛానుసారముగా కాక భగవంతుని అనుగ్రహం కొరకు జీవించవలెను. ఏనాడయితే మానవుడు తన కర్మలనన్నిటిని భగవంతుని దిశగా పయనింప జేయునో ఆనాడు భగవంతుని సాక్షాత్కారము లభించును.

అనుగ్రహమనునది మానవునికి అందిపుచ్చుకునేది కాదు. అనుగ్రహ అనుభవాలు మూడు రకాలు. అవి జంతువుల అనుగ్రహం, మానవ అనుగ్రహం మరియు భగవంతుని అనుగ్రహం.

జంతువులు పరిమితమైన పశులక్షణములతో జీవించును. పశు లక్షణములు పూర్తిగా స్వార్థపూరితమైన జీవితం. తనకు నొప్పి కలుగకుండా తనకోసమే జీవించేది పశువు. పశువుల అనుగ్రహం కేవలం పశువులకు మాత్రమే పరిమితమై ఉంటున్నది. మానవుడు మంచి చెడుల స్పృహతో జీవనం సాగించును. పశువులకు మంచి చెడు విచక్షణ తెలియదు. మంచి చెడుల విచక్షణ లేని స్థితిలో మానవుడు జంతువుల అనుగ్రహాన్ని అనుభవిస్తాడు.

మానవ అనుగ్రహం అనునది సాటి మానవుల నుండి, కొన్ని వర్గముల నుండి, మన ఊహల నుండి, మన ఆశయాల నుండి మన కోరికల నుండి లభించును. ఉదాహరణకు: చిన్నప్పుడు మనతల్లి, తండ్రి మరియు కుటుంబసభ్యుల నుండి ఈ మానవ అనుగ్రహం పొందుతాము.

అటుపిదప స్నేహితుల నుండి మరియు మనకంటే ఉత్తములైన స్త్రీ, పురుషుల నుండి మానవ అనుగ్రహం లభిస్తుంది. వీరేకాక గురువు యొక్క అనుగ్రహం కూడా మనల్ని ఉన్నత ఆశయంలో తీర్చిదిద్దుతుంది.

భగవంతుడు తన అనుగ్రహాన్ని అందరిపై సమానముగా కురిపిస్తారు. కానీ అహంకార మమకారాలున్నంత వరకు మానవుడు భగవంతుని అనుగ్రహమును గుర్తించలేడు. ఎవరయితే తన అహంకార మమకారాలను త్యజించి, తనను తాను భగవంతునికి సమర్పించుకుంటాడో, అట్టి వ్యక్తి సంపూర్ణమైన భగవంతుని అనుగ్రహాన్ని అనుభవిస్తాడు. తనకు ఏమి జరిగినా, అది భగవంతుని ప్రసాదంగా, అనుగ్రహంగా భావిస్తాడు. భగవంతుని అనుగ్రహం మానవుని ఉన్నతికి ఎంతో అవసరం. భగవంతుడు అగోచరుడు. అట్టి భగవంతుని వైపు మనము ఒక అడుగువేస్తే, భగవంతుడు మనవైపు పది అడుగులు వేస్తాడు. భగవంతునికి మనపైగల ప్రేమ, సాయము అట్టిది. అదే భగవంతుని అనుగ్రహం.

ఈనాడు మానవులు ఎన్నో కళలలో, తమ తమ రంగాలలో ఎంతో నైపుణ్యమును, అభివృద్ధిని సాధిస్తున్నారు. అహంకార, మమకార రహిత స్థితిలో చేసిన సాధనకు వీరిలో ఎంతో నైపుణ్యము బయటపడును. అట్టి నైపుణ్యము అందరికీ ఆమోదయోగ్యమైనది, ఆదర్శవంతమైనది. ఈనాడు అందుకే ఏ కళారంగమైనప్పటికీ, కార్యక్రమమైనప్పటికీ భగవంతుని అనుగ్రహం కొరకు భగవంతుని ప్రార్థనతో కార్యక్రమాలు మొదలు పెట్టుకొనుట మన ఆనవాయితీ.

యంత్రమునకు అనుగ్రహంతో పనిలేదు. మానవుడు యంత్రంలా జీవించకూడదు. యాంత్రికమైన జీవితానికి అలవాటుపడిన వ్యక్తి ఉన్నతమైన భావాలకు, ఉన్నతమైన ఆశయాలకు స్పందించడు.

## ఐ. ప్రేమ – త్యాగం

ప్రేమ ఒక ప్రవాహం. ప్రేమలో ఎట్టి వికారాలు ఉండవు. మనకు తెలిసిన దానినే ప్రేమించగలం. మనకు తెలియనిదానిని మనము ప్రేమించలేము. ప్రేమ కూడా ఒక జ్ఞానమే. అట్టి భగవంతుని జ్ఞానము నిర్మలమైనది, నిస్వార్థమైనది, నిశ్చలమైనది. సామాన్యమైన ప్రేమ స్వార్థముతో కూడినది. పక్షపాత ధోరణి కలది, భౌతికమైన విషయముల పట్ల అజ్ఞానంతో కూడినదిగా ఉండును.

త్యాగం నిస్వార్థప్రేమ. దురదృష్టవశాత్తు ఆంగ్లమున త్యాగం అనగా ధర్మము/దానము చేయుట అనే అర్థమును గ్రహించుచున్నారు. నిజానికి త్యాగం ఎంతో యోగంతో కూడినది. త్యాగం నిస్వార్థమైనది. ఫలితములను ఆశించదు. ఇచ్చిపుచ్చుకునే బేరము కానిది. త్యాగం విశ్వజనీనమైనది.

దివ్యమైన ప్రేమ నిర్గుణం, నిరంజనం, సనాతన నికేతనం, నిత్యమైనది, శుద్ధ బుద్ధి, ముక్తి నిర్మల స్వరూపిణి. అట్టి దివ్యమైన ప్రేమ సర్వవ్యాపకమైనది. అదే పరమాత్మ స్వరూపము.

దివ్యమైన ప్రేమ కారణమునకు ఫలితాలకు అతీతమైనది. ఈ దివ్యమైన స్థితే ఫలం. ఆనందం. ప్రేమకు క్రింది స్థాయిలు ఉండవచ్చును కానీ, త్యాగం భావాతీతమైనది. త్యాగం తన ఇచ్ఛానుసారము నిర్వహించిన ఒక సత్కర్మ. భగవంతుని పట్ల మనకు గల ప్రేమ, భక్తి యొక్క సారమే ఈ త్యాగం.

భగవంతునిపై మనకు గల ప్రేమ అన్నిటికంటె ఉన్నతమైనది. ఎందుకంటే తెలుసుకునేవాడు, తెలుసుకునేది, తెలుసుకున్నది అన్నీ ఒక్కటే. ఈ సాధనలో అహంకార, మమకారాలు త్రికరణశుద్ధిగా తొలగి వైరాగ్య

భావాలు పెరుగును. కోరికలు తగ్గును. ఈ పవిత్ర జీవనవిధానంలో కష్టములను, బాధలను చిరునవ్వుతో స్వీకరించుట, పరులనుండి సానుభూతి ఆశించకుండుట ఇతరులు తాము చేసిన హానికి తిరిగి హాని చేయకుండుట జరుగును.

ఒడిదుడుకుల, భావోద్రేకాల నుండి శాంతిని అనుభవించ వలెనన్న త్యాగమే మార్గం. త్యాగం నివృత్తి మార్గముతో కూడినది. అనేకత్వములో ఏకత్వమును సూచించునది. వినయ విధేయతలు కూడా త్యాగం యొక్క చిహ్నాలే. వినయ విధేయతల ప్రకటన కూడా దివ్యప్రేమకు సంకేతమే. మనలోని అహంకార, మమకార నిర్మూలనం ఈ వినయ విధేయతల ద్వారా ప్రకటితమవుతుంది. సుఫీ సన్యాసి అన్సారీ మాటలలో, ఈ వినయ విధేయతలే భగవంతుని దివ్యమైన ప్రేమ యాత్రలో సాధకుని ఒక యాత్రికునిగా తీర్చిదిద్దును. వీరు తమను తాము భగవంతుని పాద ధూళిగా భావించి, తరించెదరు.

సేవాభావములు మనలో త్యాగనిరతిని పెంచును. ఈ త్యాగం మనలో శాంతి, ఓపికలను పెంచును. సాటిమనిషి పట్ల దయ, వినయ విధేయతలు పెంచును. త్యాగం స్వార్థమును ఆశించదు. ఓపికతో త్యాగ నిరతిని అభివృద్ధి పరచుకొనవలెను.

ప్రేమతో కూడిన సద్భావాలు కూడా త్యాగముతో కూడినవే. భగవంతుని కోసం ధైర్యముగా కష్టాలను ఎదర్కోవడం కూడా త్యాగమే అనిపించును. నిర్మల బుద్ధి, నిశ్చల బుద్ధి, నిస్వార్థ బుద్ధులతో త్యాగాన్ని నాచరించవలెను.

వినయవిధేయతలు, వైరాగ్యభావం కలిగి ఉండుట, సమచిత్తమును ప్రదర్శించుట ఈ త్యాగం యొక్క లక్షణాలు. వైరాగ్య భావముల వల్ల

ఆడంబరాలను గానీ, స్వలాభాలను గానీ ఆశించుట జరుగదు. నిర్దయగా వ్యవహరింతురు. సమచిత్తము వల్ల ఇష్టాయిష్టములకు అతీతులుగా మారి, కేవలం భగవంతునిపై తమ ఇష్టమును ప్రకటింతురు. వినయ విధేయతల కారణముగా తమలోని అహంకార మమకారాలను నాశనము చేసుకొందురు. తమ స్వార్థం కోసం ఇతరులకు హాని తలపెట్టరు. త్యాగము కూడా ఆధ్యాత్మిక సాధనలో ఒక ముఖ్యమైన భాగం.

మానవుని యొక్క సంస్కారవంతమైన జీవితానికి త్యాగమే మూలం. త్యాగం ఉన్నచోట చెడుకు స్థానం ఉండదు. త్యాగం ఉన్నచోట వ్యతిరేకత ఉండదు. త్యాగం ఉన్నచోట ప్రేమ విస్తరించును. త్యాగం స్వచ్ఛమైనది. త్యాగం ఎంతో శక్తివంతమైనది. త్యాగం ఎక్కడ ఉండునో యోగం అక్కడే ఉండును.

ప్రస్తుత మనఆర్థిక, సామాజిక మరియు అంతర్జాతీయ కార్యక్రమాలన్నీ ప్రేమ రహితమైనవే. మనకు మన ప్రవృత్తిపై త్యాగభావం లేదు. మానవుడు ఆధిపత్యంతో భూగర్భములోని ఖనిజములను సేకరిస్తున్నాడు. మనం పీల్చే స్వచ్ఛమైన గాలిని విషపూరితం చేస్తున్నాడు. మనం నివసిస్తున్న ప్రకృతిపై మానవునికి ఎట్టి ప్రేమలేదు. ప్రకృతిపైనే కాదు, సాటి మానవునిపై కూడా ప్రేమ ఉండుటలేదు. ఈనాడు కొంతమంది పెద్ద వ్యాపారుల చేతిలో వస్తువుల ఉత్పత్తి, వాటి పంపిణీ జరుగుచున్నది. ఈ కారణముచే సామాన్యమైన వ్యాపారం చేసుకునే వారికి ఈ పోటీని తట్టుకోవడం కష్టమై, అప్పులపాలగుచున్నారు. ప్రభుత్వము కూడా పన్నులను పెంచే నేపథ్యంలో సామాన్య ప్రజల జీవనవిధానం కష్టమైనందువల్ల ఈ పరిస్థితులలో ఏ కోణం నుండీ ప్రేమను పంచలేని స్థితిలో మన సమాజం తయారవుతున్నది.

మన సాంఘిక జీవన విధానం బాగుపడవలెనన్న ఎట్టి ప్రలోభాలకు లోబడకూడదు. ఈనాడు మానవులలో త్యాగబుద్ధి కొరవడుతున్నది.

ఈనాడు భగవంతునిపై గానీ, ప్రకృతిపైన గానీ, సాటి మానవునిపై గానీ మానవునికి సహజమైన ప్రేమ కరువగుచున్నది. ఈనాడు విగ్రహారాధనకే పరిమితమై ఆలయాలలో త్యాగం పేరుతో జంతుబలులు జరుగుచున్నవి. మానవునిలో మానవత్వం కానరావడం లేదు. ఈ నేపథ్యములోనే మానవుడు స్వార్థంతో ఎట్టి ప్రలోభములకు లోబడకూడదు. అధికార మరియు ఆర్థిక పెత్తందారి తత్వాన్ని ప్రోత్సహించరాదు.

ఈనాడు రాష్ట్రాలకు రాష్ట్రాలకు మధ్య సామరస్యము కనబడుటలేదు. తమ రాష్ట్ర స్వప్రయోజనముల కోసం పొరుగు రాష్ట్రాల అభివృద్ధికి ఆటంకాలు కలిగించు చున్నారు, వాదించుకుంటున్నారు, సమన్వయం కోల్పోవుచున్నారు. దివ్యమైన ప్రేమ లేకుండా మన ఆర్థిక విధానం అభివృద్ధి చెందదు, మన సాంఘిక జీవన విధానం మరుగుపడదు, రాజకీయములలో నిజాయితీ పెరుగదు. హక్స్లే మహాశయుడు 'ఎక్కడైతే మానవతా విలువలు కరువగునో అక్కడ శాంతి, సామరస్యములు కరువై యుద్ధ వాతావరణం పెరుగును. ఈ యుద్ధ వాతావరణం వలన సంఘంపై ఆర్థికంగాను మరియు ఆధ్యాత్మికంగాను చెడు ప్రభావము చూపును. మానవత్వం లేని విజ్ఞానం మానవ మనుగడకు హానికరముగా తయారగును' అని తెలిపెను.

**ఒ. మోక్షాపేక్షకు కఠిన సాధన**

శరీరంతోనే మోక్ష సాధన వీలగును. మానవుడు ఆత్మ స్వరూపుడు. మానవుడు తన నిజస్వరూపమును గ్రహించవలెనన్న శరీరము ఉన్నప్పుడే అది సాధ్యమగును. మానవజన్మ ఎంతో దుర్లభం. అట్టి విలువైన మానవజన్మ లభించినప్పుడు మానవుడు దానిని వృధా చేయక, సద్వినియోగ పరచుకుని భగవత్ సాక్షాత్కారాన్ని సాధించవలెను.

సాధన కఠినమైనదే, కానీ కష్టమైనది కాదు. అలవాటు పడే వరకూ సాధన కష్టం అనిపించవచ్చు. చేతకాని తనం ఉన్నంతవరకు, ఐకమత్యం

లోపించినంత వరకు, శ్రద్ధ లేనంతవరకు సాధన కష్టంగా అనిపించును. మనలో తీవ్రమైన భగవత్ కాంక్ష కలిగేవరకు ఈ మూడు మనలో తిష్టవేసుకుని ఉంటాయి. కాబట్టి శ్రద్ధాభక్తులతో సాధనకు అలవాటుపడాలి.

బౌద్ధులు గ్రహించిన నాలుగు సత్యాలను గ్రహించాలి. మానవజీవితం కష్టాలతో కూడినది. మన వ్యక్తిగతమైన జీవితాన్ననుసరించి మనకు దుఃఖములు కలుగును. కోరికలు తగ్గేకొలది మనలోని దుఃఖం నాశనమగును. దుఃఖ నాశనమునకు 8 సూత్ర ప్రణాళికలు అనుసరించవలెను.

శారీరక, మానసిక స్థాయిలలో మానవుడు స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలతో కూడిన జీవితాన్ని కోరుకుంటాడు. మానవుడు ఈ స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం సంపూర్ణమైన వైరాగ్యమును గానీ పాక్షికమైన వైరాగ్యమును గానీ అనుసరిస్తాడు.

అభిమానం నుండి, అహంకారము నుండి, కోరికల నుండి, చెడుపై గల మక్కువ నుండి పూర్తి వైరాగ్యమును మానవుడు కోరుకుంటాడు. అనారోగ్య కారణాల వల్ల, శారీరక బాధలవల్ల పాక్షికమైన వైరాగ్యమును మానవుడు ఆశిస్తాడు. ఈ రెండు పరిస్థితులలోను సాధకుడు తాను కష్టపడుటేగాక తన సాటివారికి కూడా కష్టం కలిగించవచ్చు.

బాధ అనునది వ్యక్తిగతమైనది, మరియు అంటువ్యాధి లాంటిది. ఒకరు కష్టపడుతూ ఉన్నా, బాధపడుతూ ఉన్నా సాటిమనిషి ఆ బాధను చూసి పట్టించు కోకుండా ఉండలేడు. ఆ బాధలో తనవంతు తాను కూడా పాలుపంచుకుంటాడు. ఈ కష్టనష్టాల వల్ల, చెడు ఫలితాల వల్ల మానవునిలో వైరాగ్యభావం అభివృద్ధి అవుతుంది.

అయితే ఈనాటి మానవునకు ఆధ్యాత్మికంపై మక్కువలేదు. తన ఇష్టాను సారం స్వేచ్ఛాయుత జీవితానికి అలవాటు పడతాడు. అనైతికమైన

పనులకు అలవాటు పడుతున్నాడు. ఈ అనైతికకార్యముల వల్ల తన శరీరంలో అనేక మార్పులు కలుగుచున్నవి. ఆధ్యాత్మికజీవనం క్రమశిక్షణతో కూడినది. కానీ నాగరికత పేరుతో, నియంత్రణ లేని స్వేచ్ఛాజీవితానికి మానవుడు అలవాటు పడుతున్నాడు. వీరు తమ పనులు అతిగా చేయుటకు అలవాటుపడుదురు. అధికమైన ఆహారం, నిషిద్ధమైన ఆహారాన్ని అధికముగా సేవించుట, ధనార్జనపై అధికంగా తాపత్రయపడుట, ఉద్రేకంతో కూడిన ఉత్సాహం కొరకు వెంపర్లాడుట, తాము చేయు కర్తవ్య కర్మల వల్ల తొందరగా అలసిపోవుట, విసుగు చెందుట, నిరాశపడుట, సమయాన్ని పాటించక, తమకు నచ్చిన కార్యాలను వేళకాని వేళలలో చేయుటకు అలవాటు పడుదురు.

ఈ విధమైన అనైతిక జీవితానికి అలవాటుపడిన వారికి హృదయ సంబంధమైన, మూత్రపిండముల వ్యాధులు, మరియు ఉదరకోశ వ్యాధులు బాధించును. వీరు బాధపడుటే కాక, వీరివల్ల వీరి అనుయాయులు కూడా బాధకు గురియగుదురు. ఇదే విధముగా ఆధ్యాత్మిక జీవనాన్ని తిరస్కరించిన వ్యక్తి తాను కష్టముల పాలగుటే కాక, తన తోటివారికి కూడా కష్టాలు కలిగించును. ఆధ్యాత్మికానికి దూరమైన వారికి ఈ కష్టాలు తప్పవు.

మనకు కలిగిన కష్టాలు మనపై నైతికంగాను, ఆధ్యాత్మికంగాను మూడు విధాలైన మార్పులు కలిగించును. అవి మంచి, చెడు మరియు సమభావాలు. మానవులు కష్టాలను అనుభవించుచున్నప్పటికి తమ తప్పిదాలను గుర్తించక తమ కోరికలపై మరింత ఆశక్తి పెంచుకొనుట వల్ల వీరిలో చెడుమార్పులే బయటపడుతూంది. రెండవ రకంవారు కష్టములు అనుభవించుచున్నప్పటికీ వీరి కోరికలలో ఏ విధమైన మార్పులు లేని కారణముగా వీరిలో ఏవిధమైన మార్పులు రావు. ఇక మూడవ రకంవారు తమ కష్టాలకు తమ కోరికలే కారణమని గ్రహించినవారై తమ

కోరికలను తగ్గించుకుని భగవంతునిపై శ్రద్ధా, భక్తులను పెంచుకొందురు. తనకి జరిగిన అనుభవాల దృష్ట్యా మానవునిలో మార్పులు కలుగవచ్చును, కలుకగపోవచ్చును.

తన అహంకార మమకారాలను త్యజించిన మానవుడు భగవంతునికి దగ్గరవుతాడు. భగవంతునిపై శ్రద్ధాభక్తులు పెరుగుతాయి. భగవంతుని అనుగ్రహానికి పాత్రుడవుతాడు. అతనిలోని భయాలు తొలగును. తనపై తనకు శ్రద్ధ తగ్గుతుంది. తన కష్టనష్టాలకు బాధపడటం తగ్గుతుంది.

ఏనాడయితే మానవుడు తన కష్టాలను ఓపికతో భరిస్తాడో, ఆనాడు తన ఇంద్రియాలపై నియంత్రణ సాధిస్తాడు. బాధలను తట్టుకోగలడు. ఎక్‌హార్ట్ మహాశయుడు, "ప్రేమకోసం కష్టాలను కోరు వ్యక్తి, కష్టాలను మరచిపోతాడు" అని తెలిపెను. మహానుభావులు ఈ సత్యాన్ని గ్రహించి అట్టి ఉన్నత స్థితికి చేరుకుని తమ శరీరంపై ఎట్టి వ్యామోహాలు లేక, ఎట్టి శారీరక బాధలనైనను, ఆఖరికి శస్త్రచికిత్సలనైనను మత్తుమందు లేకుండా చేయించు కొనుట మనం చూస్తున్నాం.

మన కష్టాలకు కారణం మన చెడు అలవాట్లే. మనలోని చెడును తగ్గించుకునే వరకూ ఈ కష్టాలు తప్పవు. ఆధ్యాత్మికమనగా తన తప్పులను తెలుసుకోవడం. కాబట్టి మనం చేసే ప్రతి చెడు పనివల్ల మనం ఆధ్యాత్మికంగా బాధను అనుభవిస్తూ ఉంటాము. చెడు పనులకు అలవాటు పడినవారు మూర్ఖత్వముతో మరిన్ని చెడుపనులకు దోహదపడుతున్నారు. కష్టాలకు దూరంగా ఉండడం కోసం మానవుడు తప్పులకే అలవాడు పడుతున్నాడు.

స్వార్థం లేక భగవచ్చింతనగల సదాచారపరులు తమ సాటివారి కష్టాలను పంచుకొనుటకు సిద్ధంగా ఉందురు. ఇతరులు కష్టాలను తాము పంచుకొందురు. అజ్ఞానంతో కష్టాలలో కూరుకుపోయిన వారికి ఉ

పశమనం కలిగించుచున్నారు. సాధు సత్పురుషులు తమ ధార్మిక జీవితంతో అందరికీ ఆదర్శంగా నిలబడుతున్నారు. మానవులు అజ్ఞానంను తొలగించుటకు తమవంతు ప్రయత్నం చేయుచున్నారు. వీరు తమ సందేశమును బలవంతముగా ఇతరులతో ఆచరింపచేయరు. ఎవరికి వారు తమ విచక్షణా జ్ఞానంతో, ఈ మహానుభావుల దివ్య సందేశాలను ఆచరించి, తమలోని అజ్ఞానాన్ని వీడవలెను.

దేహరీత్యా, ప్రకృతిరీత్యా మానవులంతా ఒక్కటే. ప్రకృతి ద్వంద్వములతో కూడినది. కాబట్టి ప్రకృతిలో మానవులకు సహజమైన కష్టాలు తప్పవు. అయినప్పటకీ మానవుడు తన అజ్ఞానంతో భగవంతుని, ప్రకృతి పట్ల అవగాహన లేక వ్యవహరిస్తున్నాడు. మానవుడు సాటి మానవునిలో దివ్యత్వాన్ని గ్రహించడంలేదు.

మానవుడు తన అజ్ఞానం వల్ల చెడుకు ఎక్కువగా ప్రభావిత మవుతున్నాడు. స్వార్థచింతనతో సాటిమనిషిని స్వలాభానికి ఉపయోగించు కుంటున్నాడు. క్రమశిక్షణా రాహిత్యానికి అలవాటుపడుతున్నాడు. తిరుగుబాటు తనానికి యుద్ధాలకు కారణమవుతున్నాడు.

ప్రకృతిస్థాయిలో మానవుడు ప్రకృతి వనరులను దుర్వినియోగ పరచి ఎంతో నష్టం కలిగించుచున్నాడు. శారీరక స్థాయిలో అనేకమైన రోగాలకు గురి అవుచున్నాడు. నైతికస్థాయిలో తన డొల్లతనమును ప్రకటిస్తున్నాడు. ఆధ్యాత్మిక స్థితిలో గుడ్డివాడిగా తయారవుతున్నాడు. మానవజన్మ విలువను గ్రహించక, లక్ష్యాన్ని తెలుసుకొనక తన జీవితాన్ని వృధాపరుచుచున్నాడు.

నోటిని అదుపులో పెట్టుకోలేక అధికమైన ఆహారాన్ని భుజించువాడికి ఏవిధంగా అయితే గుండె నొప్పులు, మూత్ర పిండాల వ్యాధులు, ఉదరకోశ వ్యాధులు వస్తాయో, అదే రీతిన మన సంఘంలో కొందరి అధర్మప్రవర్తనం వల్ల సాధువులు, సత్పురుషులు బాధలకు గురియగుచున్నారు. సాధువులు,

సత్పురుషులు ఎన్ని కష్టాలు వచ్చినా ధర్మవర్తనమునకే అలవాటు పడుదురు. వారిలోని నిస్వార్థత, భగవత్‌చింతన వారిని ధర్మపరాయణులను చేయును. వారి ధార్మిక జీవితములో ఎన్నో కష్టాలు ఎదురైనప్పటికీ వారు ధర్మానికే కట్టుబడుదురు.

విధి అనగా చేయదగిన కర్మ. మానవుని విధులు అనగా మానవుడు తప్పకుండా ఆచరించదగ్గ కర్మలు అని అర్థం. విధి నిర్వహణ ఉన్నచోట క్రమశిక్షణకు తావు ఉండును. భారతీయ ఆధ్యాత్మికవేత్తలు, వారిలో ఒకరైన విద్యారణ్యులవారు ఆధ్యాత్మికం ప్రతి మానవునికి తప్పనిసరి అని ప్రబోధించెను. యుక్తమైనవి ఆచరణ యోగ్యములు. యుక్తము కానివి ఆచరణ యోగ్యముకానివి. అనగా చెడు కర్మలు.

మన విధులు రెండు రకాలుగా చెప్పుకొనవచ్చును. కొన్ని విధులు తప్పక ఆచరించేవిగాను, మరికొన్ని ఎవరి ఇష్టానుసారం వారు ఆచరించేవిగాను నిర్ణయించారు. ముక్తిని పొందడం, ధనార్జన మొదలైన విధులు ఇష్టానుసారం నిర్వహించే విధులు. నైతికమైన విలువలు తప్పక ఆచరించేవి. కాబట్టి నైతిక విలువలు, ముక్తి మార్గమున ఆచరించే విధులు సమమని భావించరాదు. నైతిక విలువలు మానవుని ఎంతో ఉన్నతస్థితికి గొనిపోవును. సాటివారి పట్ల తన బాధ్యతలు తెలియజేయును. నైతిక విలువలతోపాటు ఆత్మ సాక్షాత్కారాన్ని ఆశించి సాధకులు అదనముగా విధులు నిర్వహించి తమ జీవితాలను సార్థకం గావించి, అందరికీ ఆదర్శముగా నిలుస్తారు.

### ఓ. వైరాగ్యం

వైరాగ్యమే గమ్యం కాదు. ఆధ్యాత్మికం వైరాగ్యంతోనే మొదలవుతుంది. వైరాగ్యానికి పవిత్రత గానీ పుణ్యముగానీ ఆపాదించబడలేదు. అయితే

వైరాగ్యం యొక్క లాభము చాలా అవసరమైనది. ఆధ్యాత్మిక మార్గమున ఎదురయ్యే ఆటంకములను దాటటానికి వైరాగ్యము అత్యవసరము. వైరాగ్యముతో మన కోరికలు నాశనమవుతాయి. మనలో జ్ఞానము పెరుగుతుంది. జ్ఞానము యొక్క సుగుణములను మనము నిరంతరము అనుభవిస్తాము.

వైరాగ్యమును ఆదరించే వారంతా మంచిమార్గములో పయనిస్తున్నా రనడానికి వీలులేదు. వైరాగ్యభావముతో ఎన్నో మంచి లక్షణాలను అనగా వివేకముతో ధైర్యంగా, మితంగా, పవిత్ర జీవనంతో జీవించవచ్చు. కానీ పూర్తిగా చెడు ప్రవర్తనకలిగి ఉండవచ్చు. ఈ చెడు ప్రవర్తనకు కారణం అతనిలోని కామ, క్రోధ, లోభ, మోహ, మద మాత్సర్యాలే. మరియు ఇతరులపై దౌర్జన్యం, హింసలకు సిద్ధపడేవారు. ఆధ్యాత్మిక కార్యక్రమాలు ఆచరించే వారికి అహం పెరుగుతుంది. వీరికి భగవంతునిపై సరి అయిన అవగాహన ఉండదు ఆధ్యాత్మిక కార్యక్రమాలు పుణ్యకార్యక్రమాల చేయుటే ముఖ్యమనుకుంటారు తప్పితే తమలోని లోపాలను సరిదిద్దుకునే ప్రయత్నం అసలు చేయనే చేయరు. వైరాగ్యంతో అహంకార మమకారాలను త్యజించి భగవంతునిపై ప్రేమ, భక్తి, శ్రద్ధలు ఏర్పడును. 'నేను, నాది' అనుకున్నంత వరకు భగవంతునిపై శ్రద్ధాభక్తులు కలుగవు.

వైరాగ్యంతో శరీర వ్యామోహాన్ని తగ్గించుకోవాలి. కానీ వైరాగ్యంతో అహంకారం పెంచుకోవడం జరగుతున్నది. సిద్ధులు సాధించడానికి వైరాగ్యంతో తీవ్ర సాధనలు చేపడుతున్నారు. ఈ సిద్ధుల వలన తమలోని అహంకారం పెరుగును. ఈ సిద్ధులు పరుల హానికి వినియోగిస్తున్నారు. సాటిమనిషిని జయించడానికి తనవద్ద శక్తి చాలనప్పుడు, తీవ్రమైన సాధన లతో సిద్ధులు సాధించి వాటిని దుర్వినియోగం చేయుట జరుగుచున్నది.

వైరాగ్యంతో తీవ్రమైన సాధనలు చేయపనిలేదు. అయినప్పటికి తీవ్రమైన సాధనలు చేయువారు తమ లక్ష్యం భగవంతునివైపు గాక ఇతర స్వార్థచింతనలతో చేస్తారు. ఇట్టి తీవ్ర సాధనలవలన భగవత్‌సాక్షాత్కారం లభ్యం కాదు. కానీ కొన్ని సిద్ధులు లభించవచ్చు. ఈ సిద్ధులు వివిధ రీతులలో ఉండవచ్చు. కొందరు ప్రశ్నలకు సమాధానాలు చెబుతారు. కొందరు రోగాలను నయము చేయుటకు ఉపయోగిస్తారు. కొందరు లీలలు చేస్తారు, కొందరు సాటి మనిషిలోని భావాలను గ్రహిస్తారు, మరి కొందరు తమ సిద్ధులతో భవిష్యత్తును గ్రహిస్తారు.

ఇట్టి సిద్ధులతో మోక్షము వస్తుందనుట కల్ల. నిజానికి ఇవి సాధకునికి అడ్డంకులు. ఇట్టి తీవ్రసాధనలు ప్రాణానికి ముప్పుగా పరిణమించవచ్చు. ఆరోగ్యం బాగుండనప్పుడు, శరీరము సాధనకు సహకరించదు. శారీరక బాధలు శ్రమతో, బాధతో కూడుకున్న వైయుండి ఫలితము శూన్యముగా అనిపించినప్పుడు సాధకుని పతనానికి దారితీస్తాయి.

వైరాగ్యంతో నేను,నాది అనే భావములు, కోరికలు, అహంకార మమకారాలు నాశనము చేసికొనవలెను. శారీరక మార్పుల వల్ల ఇట్టి మార్పులు సంభవించవచ్చు. ఏది జరిగినా నా మంచికే అన్న భావనతో మన కర్తవ్యకర్మలు ఆచరించుట వల్ల ఉత్తమ ఫలితాలు కలుగును. అహంకార మమకార నిర్మూలన కోసం చేపట్టిన సాధనలు ఆరోగ్యానికి హానిచేయరాదు, వాటి తత్వము పెంచరాదు, సహజముగా ఉండవలెను.

ఉదాహరణకు సంఘములో మంచి ప్రవర్తన గలవారు వినయ విధేయతలతో, మృదుమధుర సంభాషణలతో, ఏ విధమైన ఉద్రేకాలకు లోనుకాకుండా వ్యవహరిస్తారు. అనుచితమైన వ్యాఖ్యలు చేయరు. అబద్ధాలు ఆడరు. పరిస్థితులు ఏమైనప్పటికి ప్రశాంతంగా, హుషారుగా జీవిస్తారు.

వైరాగ్యములన్నిటిలోకి కష్టమైనది, ఉత్తమమైన నేను నాది యను అహంకార మమకారాల నిర్మూలన. భగవద్గీతలో శ్రీకృష్ణుడు అర్జునుడికి ఇదే విషయము తెలిపెను. ప్రతి మానవుడు తన కర్తవ్యకర్మలను నిర్భయముగా, ఫలాపేక్ష లేకుండా చేయవలెను. భౌతిక దృష్టి ఉన్నంత వరకు చేపట్టే కార్యక్రమాలు అశాశ్వతములు, కానీ నివృత్తి మార్గమున చేసే కర్మలకు శాశ్వతమైన ఆనందము లభిస్తుంది. ఈ నివృత్తి మార్గములో సాధకుడు ఫలాపేక్షలేని స్థితిలో ద్వంద్వాలకు అతీతుడిగా తయారవుతాడు. ఇట్టి సాధనలో విజయమువల్ల మరి అపజయము వల్లనూ కూడా సాధకునికి మంచే జరుగును.

ఆధ్యాత్మిక సాధనకు భగవంతునియందు అచంచలమైన భక్తి, శ్రద్ధ అవసరము. భవబంధాలకు అతీతముగా ఉండవలెను. కేవలం భగవంతుడిని మాత్రమే ప్రేమించే స్థితికి ఎదగాలి. అట్లుకాని యెడల భగవత్ సాధన ఫలించదు.

వైరాగ్యం వల్ల భౌతికప్రపంచముపై మనస్సు నిర్లిప్తముగా మారును. అహంకార మమకారాలు నాశనమగును. మనస్సు, శరీరాలు సాధనకు పనిముట్లుగా తయారగును. 'నిజమైన సాధకుడు తన హృదయమును భగవంతుని ప్రేమతో నింపును, భవబంధాలకు అతీతముగా ఉండును' అని కబీరు విన్నవించెను.

మానవుడు భవబంధాలనుండి విముక్తి పొందేవరకు త్రికరణ శుద్ధిగా భగవంతుడిని ప్రేమించలేడు. విశ్వకల్యాణము కొరకు అతను త్యాగానికి సిద్ధము కాలేడు. హృదయమును భగవంతుని ప్రేమతో నింపుకోవాలి. భగవంతుని ప్రేమలో భవబంధాలు గుర్తుకురావు. ఆధ్యాత్మిక జీవనానికి అలవాటుపడిన వ్యక్తికి ఎవరూ హానిచేయరు.

వైరాగ్యం బాధాకరమే, కష్టమైనదే. కానీ ఈ కష్టం, బాధ మనమంచికే. వైరాగ్యముతో కూడిన జీవితము అందరికీ అవసరమే. కాబట్టి భౌతిక జీవనమును సుఖమయం గావించుటకు క్రమేపీ వైరాగ్యము పెంచుకోవాలి.

మనము జీవితములో ఎందరో ఆర్టిస్టులను, తత్వవేత్తలను, శాస్త్రవేత్తలను చూస్తూ ఉంటాము. వారు తమ కృషికి తగిన ఫలితమును ఆశించక, పేదరికములో జీవిస్తూ ఉంటారు. వీరు అందరిలా ఆలోచించరు. తత్వవేత్త సామాన్య మానవునిలా ఆలోచించడు. పేరు ప్రతిష్టలు ఆశించని శాస్త్రవేత్తలు మానవ శ్రేయస్సుకై పాటుపడుతూ ఉంటారు. ఈ కోవలోనే గెలీలియో, సోక్రటీస్ మొదలైన మహాశయులు విశ్వకల్యాణానికి తమ ఆధ్యాత్మికతను వ్యక్తం చేశారు. ఇట్టి మహానుభావులు భౌతికమైన సుఖ సంతోషాలను ఆశించనప్పటికీ శాశ్వతమైన ఆనందమును అనుభవించారు.

ఫలాపేక్ష లేకుండా చేసిన అవిరళ కృషి కారణంగానే ఈ మహానుభావులు తమతమ రంగాలలో ఎంతో నైపుణ్యమును సంపాదించారు. వీరందరూ కూడా తమను తాము ఎప్పుడూ గొప్పగా, అహంకారముతో భావించలేదు. వారిలోని క్రియాత్మక శక్తికే వారు తలవంచారు. వీరందరికీ తమతమ రంగాలలో ఉన్న పరిమితులు ఎఱుకనే. ఈ పరిమితులకు లోబడి వారు పనిచేశారు. వాటిని వీరు త్రోసిపుచ్చలేదు, నిర్లక్ష్యం చేయలేదు. తమ రంగంలో తానొక దాసానుదాసుడిగా కృషిచేశారు. తమ రంగంలలో తమ కృషితో సంపూర్ణమైన స్వేచ్ఛాస్వాతంత్ర్యాలతో వ్యవహరించారు. జీవితమే ఒక కళ. ప్రతిమానవుడు ఇదే రీతిలో కృషి చేయవలెను. ఉన్నతిని సాధించవలెను.

మేధావులు తమ తెలివితేటలతో, ఆలోచనలతో, ఊహలతో జీవిస్తూ ఉంటారు. వీరు ఇంతటితో తృప్తి పడకూడదు. అదే వారి అంతిమ

లక్ష్యంకాదు. వారు ఏఏ రంగాలలో అయితే నిష్ణాతులో ఆయా రంగాలలో మంచిని ప్రోత్సహించి, చెడును త్యజించే రీతిలో వైరాగ్యభావాలు కలిగియుండవలెను. బాహ్యదృష్టితో వ్యవహరించక అంతర్దృష్టిని కూడా అభివృద్ధి పరచుకుని విశ్వకల్యాణానికి తోడ్పడవలెను. మానవశ్రేయస్సుకు కృషిచేసిన వారి పవిత్రతను, అంతర్దృష్టిని అందరూ గుర్తించాలి.

**ఔ. ఆచారకర్మలు, సంస్కారం, ఆచారం**

ఇహము పరములతో కూడిన జీవితమునకు ఇహము పరముల యొక్క విధివిధానములను చక్కగా నిర్వర్తించుటకు ఆచారకర్మలు, సంస్కారము, ఆచారముల ఆవశ్యకతను గుర్తించి వర్తించవలెను. ఆచార కర్మలు గానీ, పుణ్యకార్యములుగానీ మంచిని సూచించుకర్మలు. వాటివల్ల మంచి ఫలితాలను పొందగలము. మనము ఒక పద్ధతి జీవనవిధానమునకు అలవాటుపడి ఉంటున్నాము. మన మార్గములోనే భగవంతుని గురించి మనకు గతములో చెప్పిన సూచనలమేరకు అనుభవించు చున్నాము. సమస్య ఎక్కడ వస్తుందంటే మనము మరో కొత్తపద్ధతిని ఎదుర్కొనినప్పుడు ఆ కొత్త ఆచారాలు, సంస్కారాలు, సూచనలు, మాటలు, మూర్తులు మన భగవంతుని అనుభవమును మరిపింప లేకపోవుచున్నది.

భగవంతునిపై మనస్సు లగ్నము చేయుటకు విగ్రహారాధన చాలా ఉపయోగ పడుతుంది. భగవంతుడు సర్వవ్యాపి అని గుర్తెరిగి కూడా భక్తులు విగ్రహారాధనపై మక్కువ చూపుతారు. ఆవునిండా పాలు ఉన్నా ఆవు పొదుగునుండే పాలను పిండుకోవడం జరుగుతుంది కదా!

ఈనాడు ప్రతి ఒక్కరు తమ జీవితములో విజయము సాధించు కొనుటకై భగవంతుని ఆరాధించుచున్నారు. వారు ఆశించే ఆ భౌతికమయిన విజయాలు వారు తొందరగా పొందుతున్నారు. మానవుని విచక్షణ

భౌతికమైన కోరికల వల్ల వక్రింపబడి తన నైజమునకు తగిన రీతిన దైవారాధనలకు అలవాటు పడుతున్నాడు.

నిర్మలమైన, నిశ్చలమైన మనస్సుతో దైవాన్ని సంపూర్ణమైన విశ్వాసముతో కొలువవలెను. నమ్మకముతో భగవంతుని ఆరాధించి తాను అనుకున్నవన్నీ సాధిస్తున్నాడు మానవుడు. కానీ భౌతిక సుఖాల కొరకు విచక్షణ కోల్పోయిన మానవుడు అశాశ్వతమైన, అల్పమైన కోరికలనే ఆశిస్తున్నాడు. కోరికలతో పూజలు చేసేవారు చిన్న దేవుళ్ళను ఆరాధిస్తున్నారు. భగవత్ సాక్షాత్కారమును ఆశించేవారు అఖిలాండకోటి బ్రహ్మాండనాయకునే ఆరాధిస్తారు.

మన సంస్కృతి మనలను సంస్కారవంతులను చేయును. మన ఆచారము ప్రకారము మనము ఎల్లవేళలా భక్తి, విశ్వాసములతో ఆచరించే పుణ్యకర్మల కనుగుణముగా మన మానసిక స్థితి ఉంటుంది. అట్టి ఆచార వ్యవహారాలకు అలవాటు పడినవారంతా మళ్ళీ వ్యక్తిగత సాధనతో తమ లక్ష్యము వైపు పయనిస్తారు.

ఈ విధముగా సంస్కారము, ఆచారముల ననుసరించేవారు విధిగా తాము ఆశించిన దానికన్నా ఎక్కువే పొందుతారు. ఈ కారణముచే ఆచారాలు, సంప్రదాయాల పట్ల ప్రజలకు గౌరవము పెరుగుచున్నది. ఇట్టి సంస్కారము, ఆచారాలననుసరించి మనము మన సాటిమానవుల యోగక్షేమముల కోసం ప్రార్థిస్తాము. ఈ జగత్తునందు ఏమి జరిగినా అది భగవంతుని అధీనములో జరుగుచున్నదని మానవుని నమ్మకము.

దేవతలు తమకు సమర్పించినవాటిని ఆహారముగా స్వీకరిస్తారని ప్రజల నమ్మకము. ఎప్పుడయితే ఈ దేవతలకు చేసిన పూజలు ఫలించినవో అప్పుడు ఈ దేవతలకు క్రమేపీ ఆదరణ తగ్గిపోతుంది. చాలా దేవాలయాలలో,

చర్చిలలో, మసీదులలోని మహాత్మ్యమును నాస్తికవాదుల సహితం గ్రహిస్తున్నారు. గత వైభవమును పునశ్చరణకు తెచ్చుకుని ఈ పవిత్ర స్థలముల ప్రాశస్త్యమును అనుభవించుచున్నారు. ఈ దేవాలయాలలో ఆచరించే సాంస్కృతిక కార్యక్రమాలు, అక్కడి ప్రతిమకు ఉన్న మహిమ, ఆ పవిత్ర స్థలమహిమ మొదలగు అంశములన్నీ దివ్యత్వాన్ని సూచిస్తాయి.

పూజలు నిర్వహించడములో భక్తి, శ్రద్ధలు అవసరం. చాలామంది దేవుని ప్రతిమకు పూజచేస్తున్నట్లుగా భావిస్తారు. మరికొందరు సాక్షాత్ భగవంతునికే పూజలు చేస్తున్నట్లుగా భావిస్తారు. సాక్షాత్ భగవంతుడినే పూజిస్తున్న పూజలకు భగవంతుని నిదర్శనాలు ఎన్నో కనబడతాయి. ఆ నిదర్శాలకు అక్కడ పూజకు చేరినవారంతా ఎంతో ఆనందందోత్సాహములు ? అనుభవిస్తారు.

ఆర్తితో పూజించే భక్తులకు ఇటువంటి అనుభవాలే ఉంటాయి. ఆర్తితో భగవంతుని పూజించిన అతని హృదయములో భగవంతుడు తిష్ట వేసుకుంటాడు. భగవంతుని భావమును వీరు ఎల్లవేళలా అనుభవిస్తారు. భగవంతుడు వేరుగా వీరు వేరుగా భావించరు. అగరవత్తులు తయారుచేసే ప్రదేశములో ఏ విధముగా పరిమళమయ మగునో అదే విధముగా భక్తుల జీవితాలు దివ్యజీవితాలుగా విరాజిస్తాయి. కబీరు, త్యాగయ్య, మీరాల జీవితగాథలు భగవంతుని దివ్యత్వానికి నిదర్శనలు.

శ్రద్ధాభక్తులతో చేసిన సాధనలు ఫలవంతమవుతాయి. వీరు భక్తితో భగవంతునితో సంబంధము ఏర్పాటుచేసుకుంటారు. భగవంతునితో నివేదించు కుంటారు. వీరి మొర భగవంతుడు వింటాడు. వీరు చేసే పవిత్రకర్మపై సాటివారికి కూడా ఎంతో శ్రద్ధా, భక్తులు కలుగుతాయి. వీరి ఆలోచనలు పవిత్రతను వ్యక్తం చేస్తాయి. వీరి మాటలకు ఎంతో శక్తి చేకూరుతుంది. వీరి మాటలు జరిగి తీరుతాయి. వారి మాటలకున్న మహిమ

అట్టిది. మంత్రాలు సత్ఫలితములనిస్తాయి. త్యాగము యాగమును కల్పించును. పుణ్యము అనుగ్రహమును రాబట్టును. శ్రద్ధా, భక్తులతో ఎవరైనా సరే ఇట్టి అనుభవాలను పొందవచ్చును.

మనముచేసే ఆధ్యాత్మిక కార్యక్రమాలకు అనుభవించే అనుగ్రహము, ఎల్లవేళలా భగవంతుని అనుగ్రహమే కానక్కరలేదు. సాటిమనిషి నుండి ఈ అనుగ్రహాన్ని పొందవచ్చును లేదా సత్కర్మలకు ఆదర్శముగా నిలచిన మహానుభావుల అనుగ్రహాన్ని పొందవచ్చును. సత్కర్మల ఫలితములు మతము కానక్కరలేదు. కానీ ఈ సత్కర్మల ఫలితములు అద్భుతమైన ఫలితాలను సాధించును. సత్కర్మాచరణ అనునది ఒక పద్ధతి. అర్థవంతమైన నియమావళి. ఈ నియమావళి అందరూ అనుసరించవలసినదే.

సత్కర్మాచరణ అందరికీ అనుసరణీయమే. సత్కర్మాచరణకు మతమును ఆపాదించరాదు. కానీ ఈ సత్కర్మాచరణ అందరిచేత ఆచరింప చేయు ఉద్దేశ్యముతో వీటికి మతము ఆపాదింపబడుచున్నది. భగవంతుని పేరుతో సత్కర్మాచరణకు ప్రోత్సాహమివ్వ వలెనని వీరి ఉద్దేశ్యము. అయితే సత్కర్మాచరణ వల్ల సదాలోచనలు పెంచుకోవాలి తప్పితే, విగ్రహారాధనకు ఒక ప్రక్రియగా ఈ సత్కర్మా చరణ జరుగరాదు. విగ్రహారాధన అనునది మానవాళికి ఉన్నతమైన ఆరాధన ప్రక్రియ. కానీ ఈ విగ్రహారాధనకు పరిమితమైన మానవుడు తన స్వభావములో ఏ విధమైన సత్ఫలితాలను సాధించలేకపోతున్నాడు. అట్టి విగ్రహారాధన వల్ల భగవత్ సాక్షాత్కారము చాలా ఆలస్యమవుతుంది.

ఆధ్యాత్మిక మహానుభావులు ఈ పూజా విధానాల పట్ల అంత శ్రద్ధ చూపించరు. కానీ అన్ని మతాల ప్రజలు మాత్రం ఈ క్రతువులపట్ల, పండగలపట్ల, మంత్రాలపట్ల అతిశ్రద్ధ చూపిస్తారు. వీరికి భగవంతునిపై

ఎక్కువ ఆసక్తి ఉండక పోవచ్చును. కానీ ఈ విధముగానయినా వారు భగవదారాధనతో తృప్తి చెందుతారు. వీరు భగవదారాధన వల్ల మానసిక తృప్తి, జ్ఞానమును పొందుట, కొన్ని అతీంద్రియ శక్తులు కలుగును అను నమ్మకము కలవారు.

ఆధ్యాత్మికమును ఆశించువారు ఆరాధన క్రతువులను, పండుగలను, మంత్రాలను, భగవన్నామస్మరణలను ఎంతో ఆసక్తితో చేపట్టి క్రమము తప్పక ఆచరించెదరు. ఈ కారణమున మనలోని చైతన్యశక్తి విశ్వచైతన్య శక్తితో విలీనమగును. ఈ కారణము చేతనే నామస్మరణ మొదలైన సాధనాలు సాక్షాత్కారానికి ఎంతో సహాయపడతాయి. అదే విధముగా విశ్వచైతన్యము ఈ సాధకుల ద్వారా ప్రకటిత మవుతుంది, ఇంత తీవ్రముగా సాధన చేసినప్పటికీ, అహంకార మమకారాలు త్యజించనప్పుడు, ఆత్మ సాక్షాత్కారము సాధ్యపడదు.

బ్రహ్మజ్ఞానంతోనే మోక్షం లభించగలదు. ముందుగా తనను తాను తెలుసుకోవలెను. ఇట్టి జ్ఞానమును మననం చేసుకుంటూ మానవుడు తన దైనందిన కార్యక్రమాలను భగవత్ ప్రీతితో చేపట్టవలెను. ఏమి జరిగినా అది భగవంతుని నిర్ణయముగా భావించవలెను. భగవంతుని తలచి చేపట్టిన కార్యములన్నీ పవిత్ర మవుతాయి. సంపూర్ణ శరణాగతిని పొందుతాడు. విశ్వచైతన్యములో తానుకూడా ఒక భాగమే అన్న అనుభవాన్ని పొందుతాడు.

అందరూ ఆత్మస్వరూపులే. అందరిలోను భగవంతుడు ఉన్నాడు, అని వేదాంతము తెలుపుచున్నది. అందరిలోనూ ఉన్న ఆత్మ తత్వమును గ్రహించుటే యదార్థము. కానీ ఈనాడు మానవులు అజ్ఞానముతో తాము వేరు భగవంతుడు వేరు, వస్తువులు వేరు అని భావిస్తున్నారు. మానవులలో ఇట్టి అజ్ఞానం ఉన్నంతవరకు మనషులతో, వస్తువులతో బంధము లేర్పరచుకుంటాడు. ఈ కారణముచే భగవంతునికి దూరమగుచున్నాడు.

ఈనాడు వస్తువులలో వస్తువును చూస్తున్నారు. అనగా భౌతికదృష్టితోనే మానవుడు జీవించుచున్నాడు. ఆచరించే కర్మలను సామాన్య కర్మలుగా ఆచరిస్తున్నాడు తప్ప, పవిత్ర భావాలతో కర్మలనాచరించుటలేదు. ఈ విషయములో అందరూ సత్యాన్ని గ్రహించాలి.

మనము ఆచరించే ప్రతికార్యాన్ని పవిత్ర కర్మలుగా మార్చుకోవాలి. ఈ నేపథ్యముతో చేయకూడని పనులను పూర్తిగా మానుకుంటాము. సత్కర్మలకే పరిమితమవుతాము.

పుణ్యకర్మలు, పూజలు, పండుగలు, గ్రంథపఠనము మొదలైన కార్యాలు భగవదారాధన నిమిత్తమే ఆచరించేవి. ఈ సాధనలు వ్యష్టిగా, సమిష్టిగా ఆచరించే కార్యక్రమాలు. సామూహిక సాధనలవల్ల సాటి మనిషిపై ప్రేమ జనించును. మనుషుల మధ్య సత్సంబంధాలు నెలకొనును. అందరితో కలసి చేసినపుడు సమిష్టి సాధనగాను, ఒక్కరే చేసుకుంటే వ్యష్టి సాధనగాను గుర్తింపబడును. భగవదారాధనలో భాగముగా మానవుడు వ్యష్టిగాను, సమిష్టిగాను సాధన చేయవలెను.

## ౨౦. లీలలు – మహిమలు

భగవంతుని ఉనికికి నిదర్శనముగా అన్నట్లుగా ప్రకృతికి అసహజమైన కొన్ని సంఘటనలు జరుగుతాయి. అవి తేలికగా మారిపోవడం, శరీరమును వదిలి ఆత్మ మరోచోటికి పోవడం, ఇంద్రియాతీతమైన పనులు చేయడం మొదలైనవి కొన్ని ఇట్టి స్థితులు. ఈ స్థితులను భగవంతుని అనుగ్రహముగా కాక, శారీరక బలహీనత వల్లనే అని కొందరి అభిప్రాయం. భగవంతుని అనుగ్రహమును మించినది మరేదీ ఉండదని సెయింట్ ఫ్రాన్సిస్ తెలిపెను. కొందరు ఇట్టి స్థితులను అనుభవించినప్పటికి చెడు పనులకే అలవాటుపడి ఉంటున్నారు. ఇట్టి స్థితులు మోక్షమును సాధించిపెట్టవు.

చాలామంది మహానుభావులు ఈ సిద్ధులను సాధనలో ఆటంకములుగా భావింతురు. అయాచితముగా సంకల్పించిన ఈ సిద్ధులపై శ్రద్ధ చూపరాదని మహానుభావుల సలహా ఏకాగ్రచిత్తముతో చేసిన సాధనాఫలితముగా ఈ సిద్ధులు కలుగునని వీరి భావన. అప్పటిదాకా భగవత్ సాక్షాత్కారమే పరమావధిగా సాగిన సాధన, ఈ సిద్ధులు సంక్రమించగానే లక్ష్యమును మరచిపోదురు. ఈ సిద్ధులకు లోబడిపోదురు. అజ్ఞానములో పడిపోదురు.

హేతువాదులు భౌతికమైన దృశ్యప్రపంచమునకే విలువనిస్తారు తప్ప ఆధ్యాత్మికము గురించి ఏమీ తెలుసుకోరు. వీరు ఎట్టి పరిస్థితులలోను సిద్ధులను ఒప్పుకోరు. ఆధ్యాత్మిక మార్గమున ఉన్నవారు ఈ సిద్ధులను ఒప్పుకుంటారు, కానీ వీటిపై మంచి అభిప్రాయం లోపించి ఉండును. వీరు ఈ సిద్ధులను చెడుగాను, ఆధ్యాత్మికమునకు ఆటంకములుగాను భావిస్తారు.

మానసిక శక్తితో రోగనివారణ జరగటం ఈనాడు ఎంతో అవసరమై ఉన్నది. కాబట్టి ఈ విధమైన రోగనివారణ పలుచోట్ల జరుగుచున్నది. ఈ విధమైన మానసికశక్తితో రోగము నివారించే వారు ఎంతో పవిత్రముగా, నిస్వార్థ చింతనతో వ్యవహరించవలెను. వీరు అనుసరించు రోగనివారణ పద్ధతి క్షేమముతో కూడినది. అయితే ఇక్కడ రోగికి కూడా ఒక పరీక్ష అన్నట్టుగా ఉంటుంది. రోగి ముందుగా తాను చేసిన తప్పులకు క్షమాపణ కోరవలెను. మరియు రోగనివారణపై పూర్తి నమ్మకము కలిగి ఉండవలెను. పవిత్రమైన మనస్సుతో, నిస్వార్థ చింతనతో రోగనివారణ చేయువారికి తమ వద్దకు వచ్చిన రోగి పరిస్థితి అర్థమైపోతుంది. ఏ రోగులు ఈ పద్ధతి ద్వారా నివారణ పొందగలరో వీరికి అర్థమవుతుంది. ఈ పద్ధతిలో అందరూ సంతోషించెదరు.

దురదృష్టవశాత్తు ఈ రోగనివారణ పద్ధతి కొందరిలో సహజముగా వస్తే, మరికొందరు పవిత్రత, నిస్వార్థత తమలో లేకపోయినప్పటికీ సాధనతో సాధిస్తున్నారు. పైగ అనుకున్నట్లుగానే వీరు తమ శక్తులను ఉపయోగిస్తూనే చెడు పనులకు అలవాటుపడి ఉంటారు. వీరు తమశక్తులను తమ అధికారం కోసం, స్వలాభం కోసం ఏ పనికైనా వాడుతారు. వీరు తరచు అద్భుతరీతిన రోగ నివారణలు గావించెదరు. అయితే రోగిలో పశ్చాత్తాప భావములు కలుగకుండా రోగనివారణ కలిగించడం వల్ల, ఇటువంటి సందర్భములలో రోగనివారణ జరిగినప్పటికీ రోగికి మంచికంటె కీడే ఎక్కువ జరుగుతున్నదని గ్రహించవలెను.

**ఆః. ఆరాధన**

ఆరాధన మూడు విధాలుగా వుంటుంది. శాస్త్ర సాంకేతిక పరంగాను, రాజకీయంగాను, నైతికంగాను. శాస్త్ర సాంకేతిక పరమైన ఆరాధనలో భౌతికమైన వస్తువులను విడుదల చేయుటలో శ్రద్ధ చూపుతారు. వీరు తమ సిద్ధాంతాలను న్యూస్‌పేపర్లు మరియు టీ.వీ అడ్వర్‌టైజ్‌మెంట్ల ద్వారా వ్యక్త పరుస్తారు. రాజకీయ భక్తులు సాంఘిక సంస్థలపై మరియు ఆర్థిక సంస్థలపై శ్రద్ధ చూపుతారు. వీరి ఉద్దేశ్యంలో చక్కని సంస్థల వల్ల ప్రజలకు కష్టములు లేకుండా, చెడుకు దూరంగా, సుఖసంతోషాలతో జీవించ గలుగుతారు. జాతీయ భావము పెరిగి యుద్ధాలు జరగవు.

నైతిక విలువలను ఆరాధించే వారే అసలైన ఆరాధకులు. వీరు భౌతిక విషయములు, సంస్థలు సంఘములో మంచిని, సుఖ సంతోషములను పెంచలేవని తెలిసినవారు. అయితే భౌతిక వాదులు మంచిని ప్రక్కనపెట్టి తమకు తోచినరీతిలో తమ ఆశయాలను సాధనలో కృషిచేయుచున్నారు. వీరు సహజత్వమునకు దూరముగా వ్యవహరింతురు. నైతిక విలువలను

త్రోసిపుచ్చుతారు. సంఘమునకు మేలు చేయాలన్నా, పదికాలాలు మంచిగా నిలబడాలన్నా భగవంతునిపై శ్రద్ధ, జ్ఞానము, ప్రేమ అవసరం.

నైతిక తప్పిదములకు మానవుడు అలవాటుపడుతున్నాడు. సత్యము, న్యాయము అనునవి అందరూ అనుసరించవలసినదే. భగవంతుని కార్యక్రమాలలో సత్యము, న్యాయం, వినయం, ఆరాధన, ప్రేమలు ఇమిడి ఉండును. కాబట్టి ఆరాధించ దగ్గది భగవంతుడు మాత్రమే. అట్లుకానిచో సంకుచితత్వము పెరిగి, మూర్ఖత్వము పెరిగి నైతిక పతనం జరుగుతున్నది.

ఈనాటి శాస్త్రసాంకేతికరంగ అభివృద్ధి మానవుని నైతిక పతనానికి దోహదపడుతున్నది. ఈనాటి ఈ అభివృద్ధి మానవుని సమగ్రాభివృద్ధికి దోహద పడుటలేదు. ఈనాటి ఈ అభివృద్ధి మానవుడికి భగవంతునిపై ఉన్న శ్రద్ధాభక్తులనే హరించివేసి మింగి వేయుచున్నది.

ఆధ్యాత్మిక మార్గములో ఆధ్యాత్మిక సాధనలు సలిపేవారు ముందుకు సాగుతారు. ఇతరులు ఎక్కడవేసిన గొంగలి అక్కడే అన్నమాదిరి అభివృద్ధి చెందరు. మూఢనమ్మకాలతో ముందుకు సాగలేరు. అటువంటి ఆలోచనలతో ఆధ్యాత్మికమును పూర్తిగా విస్మరించడం కూడా సరికాదు.

# 8. నైతిక దృష్టి

సత్కర్మలు చేయడం వల్ల ఆధ్యాత్మిక జ్ఞానం పెరుగుతుంది. ఎంత ఎక్కువగా సత్కర్మలకు అలవాటు పడితే అంత ఎక్కువగా మనకు ఆధ్యాత్మిక జ్ఞానం పెరుగుతుంది. మనలో స్వార్థచింతన లేని నిస్వార్థ ప్రవర్తన వల్ల కలిగే జ్ఞానము మనలో మరింత నిస్వార్థతను పెంచుతుంది. మనలో నిస్వార్థత పెరిగే కొద్దీ తెలుసుకోవాలన్న జ్ఞానం కూడా బాగా పెరుగుతుంది. త్రికరణశుద్ధిగా, సామరస్యముగా ఈ సత్కర్మలు జరుగుకొలది, నేర్చు కోవాలన్న తృష్ణ అనంతముగా పెరుగుతూనే ఉంటుంది.

మనసాధన మనకోరికపై ఆధారపడి ఉండును. తీవ్రమైన కోరిక కలవారు ఎంతో శ్రద్ధాభక్తులతో సాధన చేస్తారు. ఆ చేసిన సాధనకు వారికి తగ్గ జ్ఞానము లభించును. ఈ నేపథ్యములో పరిస్థితుల ప్రభావము కూడా అవగతమగును. మానవుని కోరికకి అనుగుణము శాస్త్రసాంకేతిక రంగములో ఎన్నో కొత్త విషయములను కనిపెట్టడం జరుగుతున్నది. మానవుడు ఏదైనా కోరుకుంటే, దానిని అనతికాలము లోనే తాను కోరుకున్న విధంగా తయారుచేసుకుంటున్నాడు.

ఆధ్యాత్మిక మార్గమున కూడా అదే పద్ధతిని అనుసరించుచున్నారు. “నీవు ఎంత పవిత్రుడవు కావాలంటే అంత పవిత్రుడవు కావచ్చు”, “నీవు ఎంత జ్ఞానము సంపాదించాలనుకుంటే అంత జ్ఞానము సంపాదించవచ్చు”, అంటూ సాధు సత్పురుషులు చెబుతారు. సాధకుని శ్రద్ధాభక్తులపై సాధన సాగుతుంది. అతని  అభిరుచిని బట్టి సాధన సాగుతుంది. సాధన అనునది సాధకుని గుణములపై ఆధారపడి వుంటుంది. భగవంతునిపై అత్యంత శ్రద్ధాభక్తులు కలిగి, పవిత్ర హృదయు లైనవారు ఆత్మజ్ఞానమును తొందరగా పొందుతారు. ఈ సాక్షాత్కార జ్ఞానము ఎంతో కష్టతరమైనది, అయినప్పటికీ సాధకులు పట్టుదలతో, శ్రద్ధాభక్తులతో సాధించవచ్చు.

వివేక విచక్షణలతో మానసిక పరివర్తన సాధించవలెను. నోటిని అదుపులో పెట్టుకోవడం, హృదయ పవిత్రత ఎంతముఖ్యమో అదే విధముగా సాధకునికి మానసిక పరివర్తనము కూడా చాలా ముఖ్యము.

మానవుని నైతిక జీవితమే మానవుని ఆధ్యాత్మికానికి ఆధారమగును. మానవుడు ప్రతి విషయములోను నేను, నాది అను వ్యవహారముతో ప్రవర్తించును. పరిస్థితుల ప్రభావముచే తన తెలివి తేటలను అభివృద్ధి చేసుకుంటున్నాడు. పరిస్థితుల యొక్క ప్రభావమును కూడా గుర్తిస్తున్నాడు. కాబట్టి మానవుడు తన జీవితములో ఎంతో నేర్చుకోవడానికి అవకాశము ఏర్పడుతున్నది. కాబట్టి అనుకోని పరిస్థితులను ఎదుర్కోవడానికి, పరిస్థితులను చక్కదిద్దుకోవడానికి మానవునికి నైతిక విలువలు ఎంతో అవసరం. గతములో జరిగిన అనుభవముల రీత్యా ఎంత నేర్చుకున్నావనే దానికంటె, భవిష్యత్తులో ఎంత సంపాదించవలసి ఉందో అన్న ఉత్సాహముతో ముందుకు సాగవలెను. మనము ఏ పరిస్థితులలో ఉన్నా, ఎట్టి పరిస్థితులను ఎదుర్కొంటున్నా ఉన్నత భావాలతో మన ఉన్నతిని సాధించవలెను. మన వివేక విచక్షణలనుపయోగించి నైతిక మార్గమునకే అలవాటుపడుట శ్రేయో మార్గమని రాబర్ట్ జోహాన్ తెలియజేశాడు.

మానవులు కోరికలతో, ఇష్టాయిష్టములతో తన ఇచ్ఛానుసారము జీవిస్తున్నాడు. మానవుడు మొదట్లో స్పృహలేక, ఆ తరువాత స్పృహతో తాను చేసే మంచి, చెడులను గుర్తిస్తాడు. మానవుడు తన అవసరమును దృష్టిలో పెట్టుకుని తనకు ఏదిమంచో, దేనిని ఆచరించాలో, తనకు ఏది చెడో, తాను ఏది ఆచరించకూడదో నిర్ణయించు కుంటాడు. ఈ నిర్ణయాలు అప్పటికి సరి అని భావించవచ్చు. మానవుడు తన ఇష్టాయిష్టాలను దృష్టిలో పెట్టుకుని మంచిచెడులను నిర్ణయించుకుంటున్నాడు. ఈ నేపథ్యములోనే మనము గమనించేది ఏమిటంటే మొదట్లో తాను మంచిదని స్వీకరించిన

దానిని తరువాత కాలంలో దానిని చెడుగా భావించడం, అలాగే కొన్ని సందర్భాలలో చెడుగా భావించిన విషయాన్ని తరువాత కాలంలో మంచిగా భావించి స్వీకరించుట జరుగుచున్నది.

నైతిక విలువలతో జీవనము సాగించేవ్యక్తి ఎంతో దూరదృష్టితో వ్యవహరించును. అతని దూరదృష్టిని అందరూ గ్రహించగలరు. అంతర్దృష్టితో భవిష్యత్తులో ఏదిమంచో ఇతను గ్రహించి చెప్పగలడు. నైతికవిలువలతో జీవించి వారు మంచిని పెంచుకుంటూ, చెడును తగ్గించుకుంటూ, తమ జీవితాలను తీర్చిదిద్దుకుంటారు. ఈ నేపథ్యంలో వీరు దూరదృష్టితో సత్యాన్ని వెల్లడిస్తారు. ఈ సత్యము కొందరికి రుచించవచ్చు, రుచించకపోవచ్చు.

అంతర్దృష్టితో వచించే పలుకులు వ్యక్తిగతమైనవి కాదు. వారు కొన్ని సిద్ధాంతాలను అనుసరించి నిర్ణయాలు చేస్తారు. ఇదే రీతిన ప్రతి సమాజం వారు సంఘంకు ఏది మంచోదానిని ఆచరించడానికి స్వీకరిస్తారు. సంఘ శ్రేయస్సు కోరి, పదికాలాలపాటు అందరికీ మేలుకోరే మంచిని అన్ని సమాజముల వారు ఆమోదించి, ఆచరిస్తారు. అయితే కొన్ని సమాజాలవారు కొన్ని మార్పులను చేసుకుంటారు. వీరిలో కొంతమంది మరింత మంచిని ఆశించి మార్పులను చేసుకుంటారు.

సర్వ మానవుల శ్రేయస్సుకు ధార్మిక జీవనము అవసరమై ఉన్నది. ఇట్టి ధార్మిక జీవనానికి ఎన్నో సూత్రాలు ప్రతిపాదించబడతాయి. ఈ సూత్రాలు మార్పులు లేనటువంటివి. అయితే ఈ సూత్రాలు పూర్వాపరాలను వివరించి చెప్పడమనేది సాధ్యమైన విషయము కాదు. అయితే మార్పులకు తావులేని ఈ సూత్రాలను యధావిధిగా స్వీకరించి ఆమోదించే స్థితిలో మానవులు భిన్నాభి ప్రాయాలను వ్యక్తం చేస్తున్నారు.

ఈ సూత్రాలు కేవలం స్వార్థం కోసం సూచించిన నియమావళిగా మరికొందరి అభిప్రాయము. అయితే, విషయాన్ని చక్కగా పరిశీలించి అవగాహన చేసుకోవాలి. ఉదాహరణకు, ఒక మానవునికి ఒక సమస్య వచ్చింది. ఆ సమస్యకు పరిష్కారము ఏమిటి అన్న విషయంపై పూర్తిగా వివరాలు ఉండవు. సమస్యను ఎదుర్కోవాలి. ఎలా? సమస్యను సరిగా అర్థము చేసుకోవాలి. ఆ సమస్యను సరిగా అర్థము చేసుకున్నాక, సమస్య పరిష్కారము గురించి ఆలోచించాలి. ఇది తన వ్యక్తిగత సమస్య. వ్యక్తిగత నిర్ణయం తీసుకుంటున్నాడు. సమస్యను ఏ విధముగా స్వీకరించాడో? సమస్య పరిష్కార జ్ఞానము తన వద్ద కలదో లేదో? సమస్య పరిష్కారానికి నైతిక బాట లేక అనైతిక బాటను అనుసరించాలా? సమస్య పరిష్కారం తన ఆధ్యాత్మిక జీవనానికి అనుగుణంగా ఉండునా లేక ప్రతిబంధకంగా ఉండునా? ఇన్ని కారణాల దృష్ట్యా ఏ సమస్యకు పరిష్కారాలు సూచింప ఎవరి తరముకాదు. ఈ కారణము చేతనే అందరినీ దృష్టిలోనే పెట్టుకుని ఈ సూత్రాలు నిర్దేశింపబడతాయి.

# 9. సత్కర్మ

సత్కర్మకు సనాతనధర్మము, మీమాంస మరియు భగవద్గీత కొలతబద్దలు. మీమాంసానుసారం సత్కర్మలు మూడురకాలు. మొదటిది తప్పక ఆచరించవలసినది. మానవజన్మమెత్తినందుకు మానవుడిగా ఆచరించవలసిన కర్మలు. ఇట్టి కర్మలు చేయటం వలన మానవునికి, సంఘానికి, విశ్వానికి మేలు జరుగును. అంతేకానీ ప్రత్యేకమైన లాభాలు చేకూరవు. అయితే ఈ కర్మలు చేయపోకపోవడం వల్ల మాత్రం మానవాళికి కీడు జరుగును. రెండవది నిషిద్ధకర్మలు. ఈ నిషిద్ధకర్మలు చేయడం వల్ల కీడు తప్పక కలుగును. ఈ నిషిద్ధకర్మలను ఆచరించకపోవడం వల్ల ఏ విధమైన లాభాలు కలగవు. అయితే ఈ నిషిద్ధకర్మ ఆచరించ యోగ్యము కానిది. మూడవది, ఈ కర్మలు ఆచరించవచ్చు, ఆచరించకపోవచ్చు. ఈ కర్మలు ఆచరించడం వల్ల ప్రత్యేకమైన లాభాలు కలుగును. కోరికల ననుసరించి ఈ ప్రత్యేకమైన కర్మలు చేపడుదురు. కాబట్టి ఈ కర్మలు కోరికల ననుసరించి ఆచరించువారి ఇష్టానుసారము ఆచరించబడును. ఈ కర్మాచరణ త్యాగముతో కూడి ఉంటున్నది.

మీమాంస ద్వారా ప్రేతవిద్యలు లాంటి కర్మలను నిరుత్సాహపరచెను. ఈ తంత్ర విద్యల ద్వారా ఒక మనిషిని (శత్రువును) చంపుట, తీవ్రముగా గాయపరచుట జరుగును. ఇట్టి విద్యల వలన రెండువైపుల వారు హాని పొందెదరు. మీమాంస ఇట్టి కర్మలకు పరిమితమైన రీతిలో అనుమతి నిచ్చుచున్నది, కానీ ఒక మనిషిని చంపుటలో కానీ, తీవ్రముగా గాయ పరచుటకు గానీ, దొంగతనమునకు గానీ ఎట్టి పరిస్థితుల లోనూ ఒప్పుకోవడం జరగదు.

భగవద్గీత మీమాంసను కర్మాచరణ విషయంలో, జీవన విధానంలో, మోక్ష సాధనను సమర్థించుచున్నది. కర్మఫలాలకు బందీగా ఉన్నంతవరకు

మోక్షము సాధ్యము కాదని శ్రీకృష్ణుడు గీత ద్వారా వచించెను. శారీరక వ్యామోహము ఉన్నంత వరకు కర్మ ఫలితము నాశించుట జరుగునని, మానవునిలోని ఆత్మ మాత్రం ఎప్పుడు కర్మఫలితమును ఆశించదని కృష్ణుడు తెలిపెను. ఈ కారణము చేత ఆత్మవేరు, ప్రకృతివేరు అని మానవుడు గ్రహించవలెను. మన శరీరము ప్రకృతిధర్మములో ఒక భాగము. కాబట్టి మానవుడు దేహభ్రాంతిని వీడవలెను.

మానవుడు ఆత్మస్వరూపుడు. శరీరమునను సరించి జీవుడు ఉన్నంత వరకు సత్కర్మలను ఆచరించవలసినదే. ఆత్మ సహజ లక్షణం ఆనందం. కాబట్టి మానవుడు తన సహజమైన ఆనందాన్ని అనుభవించడం అనునది అనుచితమై ఉన్నది. ఈ నేపథ్యములో అతను తన అహంకార మమకారాల కతీతంగా కర్మను ఆచరించుటకు అలవాటుపడును. ఆత్మసాక్షాత్కారానికి సంబంధంలేని, త్యాగంతో కూడిన కర్మలను ప్రోత్సహించిన మీమాంసను భగవద్గీత సమర్థించుట లేదు. భగవద్గీత వేదాలను సమర్థించెను. అట్లు కాని యెడల తాను వేదస్వరూపుడనని శ్రీకృష్ణుడు ప్రకటించడు కదా!

భగవద్గీత కర్మఫలితాలను వివరించును. ప్రతి ఒక్కరు ఏది సత్కర్మయో, ఏది దుష్కర్మయో, ఏది వికర్మో తెలుసుకోవాలని భగవద్గీత బోధించుచున్నది. దుష్కర్మలు నిషిద్ధమైనవి. జ్ఞాని కర్మయందు వికర్మను, వికర్మయందు కర్మను గ్రహించును. వికర్మ అనగా ఇంద్రియాలకు విశ్రాంతి నివ్వడం కాదు, ఇంద్రియాలకే విశ్రాంతి నిచ్చిన జీవితమే సాగదు కదా! నైతికమైన వికర్మ అహంకార రహితమైనది. ఇట్టి అహంకార రహితమైన కర్మలు మంచిచెడుల కతీతముగా, ఫలాపేక్ష లేకుండా ఉండును. కర్మాచరణలో తాను నిమిత్త మాత్రుడనని గ్రహించును. ఈ శరీరము కర్మ చేయుచున్నది నేను కాదు అన్న భావంతో వీరు కర్మచేయుదురు. మానవుడు వైరాగ్యంతో, నిస్వార్థంతో కర్మాచరణకు అలవాటుపడవలెను.

ఈ విశ్వములో నిర్జీవం తప్ప మిగతా అన్ని జీవరాసులు ఏదో కర్మ చేస్తూనే ఉంటాయి. ఆ చేసిన కర్మకు తగిన ఫలమును పొందుతాడు. ఉదాహరణకు ఒక జ్యోతిష్య శాస్త్రవేత్త ఒక మానవుడిని గొప్ప పండితు డవునని శలవిస్తాడు. అలా అన్నంతలోనే ఆ వ్యక్తి గొప్ప పండితుడవుతాడా? అవ్వడు. ఆ వ్యక్తి గొప్ప పండితు డవ్వడానికి తగిన కృషి చేస్తాడు. అంతా అదృష్టం పైననే ఆధారపడి ఉందనుకోవడం తప్పు. అంతా ముందే నిర్ణయమైపోయి ఉంటుంది అని అనుకోవడం కూడా భావ్యం కాదు. ఎవరైనా సరే కష్టపడి తన మంచికి తానే దోహదపడాలి.

స్వప్రయత్నమనేది రెండు రకాలు. ఒకటి గతజీవితములకు సంబంధించిన కర్మలు. రెండవది వర్తమాన జీవితంలోని కర్మలకు సంబంధించనది. గతజన్మల కర్మల ఫలితం ఈ జన్మలో ప్రభావితం చూపుతుంది. గతజన్మల కర్మల ఫలితమే విధివ్రాత అని అనవచ్చు. గతజన్మల ఫలితములకు వర్తమాన జన్మ కర్మఫలితాలకు మధ్యన మానవుడు నిరంతరము పోరాటము చేస్తూనే ఉంటాడు. ఈ రెండింటిలో దేనిది పై చెయ్యి అవుతుందో అదే విజయం సాధిస్తుంది.

శాస్త్రాన్ని అనుసరించి స్వప్రయత్నము చేయాలి, అంతేకానీ మాయకు లోబడి స్వప్రయత్నం చేయడం వల్ల అనుకున్న ఫలితం దక్కదు. అటువంటి పరిస్థితులలో ప్రతి ఒక్కరు ఆత్మపరిశీలనతో తమతప్పులను సరిదిద్దు కోవాలి. సత్కర్మను మించిన శక్తి మరేదియూ లేదు. కాబట్టి ప్రతి ఒక్కరూ మంచిపనులతో చెడును, విధివ్రాతను మార్చుకోవాలి.

జరిగిపోయిన క్షణము తిరిగిరాదు. కాబట్టి మనము బద్ధకమును వదలి, బంధనల నుండి విముక్తిని పొంది సాక్షాత్కారములను సాధించాలి. పురుగులు మురుగులో జీవించినట్లుగా మానవుడు ఇంద్రియలోలుడుగా

జీవించరాదు. ప్రయత్నముతో జ్ఞానమును సంపాదించి, ఆ జ్ఞానంతో సత్యాన్ని తెలుసుకుని, తమ జీవితాలను సార్థక్యం చేసుకోవాలి.

శాస్త్రాలు బోధించిన మంచి విషయాలను మానవులు చక్కగా అర్థము చేసుకోవాలి. అట్టి సద్భావములతో సాధన చేయాలి. సత్కర్మలతో సత్యమును తెలుసుకోవాలి.

స్వప్రయత్నమనేది మూడంచుల మూలమును ఆధారము చేసుకుని ఉన్నది. కాబట్టి దాని ఫలితాలు కూడా మూడంచులలో ఫలించును. అవి హృదయ  స్థానమున, మానసిక స్థానమున మరియు శారీరక ప్రయత్నంతో.

ఈ జ్ఞానము శాస్త్రగ్రంథముల ద్వారాను, గురువు ద్వారాను, స్వానుభవం ద్వారాను పొందుచున్నాము. విధివ్రాత, భగవంతుని పాత్ర అనువాటికి ఇక్కడ  తావులేదు. అన్ని శాస్త్రాల సారము ఒక్కటే. మానవుడు ఉన్నతస్థానాన్ని పొందాలి అనుభవించాలి. అట్టి ఉన్నతస్థితి కోసం మానవుడు తన మనసులోని మాలిన్యాన్ని పరిత్యజించి పవిత్రుడు కావాలి.

గతంలో జరిగిన పొరపాటును సరిదిద్దుకుని ఈనాడు మంచికర్మలతో ముందుకుపోవచ్చును. మనలో ఉన్న చెడు అలవాట్లు, గత సంస్కారాలు, విషయవాసనలను ప్రస్తుతం మంచి కర్మలతో వాటిని నియంత్రించవచ్చు. మానవుడు తనలోని జీవభ్రాంతిని మోక్షసాధనతోనే పోగొట్టుకొనవలెను.

గతజన్మ సంస్కారాలు, వాసనలు మానువుడిపై రెండు విధాలుగా ప్రభావం వుంటుంది. మంచి సంస్కారాలు మానవుడిని మోక్షం వైపు మళ్ళిస్తున్నవి, చెడు సంస్కారాలు మానవుని మాయలో అనగా బంధాలలో పడవేయుచున్నవి. అందరూ ఆత్మస్వరూపులే, జడస్వరూపులు కాదు. మానవుడు తన కర్మను తనే నిర్దేశించుకుంటాడు. ప్రతి ఒక్కరు తమ కర్మలతో మంచినే ఆశిస్తారు. ఈ మంచిని గ్రహించినవారు, మరింత

మంచికోసమై తాపత్రయపడతారు. ఎంత ఎక్కువ మంచి ప్రయత్నం జరిగితే అంత ఎక్కువ మంచి వీరికి జరుగుతుందని వీరి నమ్మకం. ఈ ప్రయత్నము స్వప్రయత్నమే. భగవంతుని ప్రమేయం ఏమీ ఉండదు. తన ఈ జ్ఞానాన్ని ఇనుమడింప చేసుకోవడానికి శాస్త్రాలను చదువుతాడు. తెలుసుకున్న మంచిని ఆచరణలో పెడతాడు. మంచివారితో సత్సంగం చేస్తాడు. సత్సంగంలోని మంచి విషయాలను ఆచరణలో పెడతాడు.

సత్కర్మల ఫలమే వైరాగ్యం. త్యాగం, దానగుణం. తపస్సుల ఫలితమే ఈ వైరాగ్యం. ఈ మూడు సత్కర్మలే. ఇవి మనస్సును పవిత్రపరచును. హృదయాన్ని విశాలపరచును. ఇవి నిస్వార్థముతో నిర్వహించవలసిన కృతులు. తామసిక భావాలతో కానీ, రాజసిక భావాలతో కానీ ఈ క్రతువులను చేయరాదు. సత్వ గుణముతో ఫలాపేక్ష లేకుండా ఈ క్రతువులు చేయాలి. అట్టివాడే జ్ఞాని. అతడే ముక్తిని సాధించును.

కర్మకు కారణం ముగ్గురు. ఒకరు కర్మ చేయువాడు. ముందే తెలుసుకున్న జ్ఞానం. మూడవది తెలుసుకో తగ్గది, గమ్యము అయినది. గుణప్రాతిపదికముగా మూడురకాల కర్మలు చేయుటకు మానవులు అలవాటుపడుతున్నారు. నివృత్తిలో నివసించేవారు అనేకత్వములో ఏకత్వమును దర్శిస్తారు. వీరు సాత్వికులు. వీరు ఫలాపేక్ష లేకుండా కర్మలు నిర్వహిస్తారు. వీరు తమ కర్మలతో లోక కల్యాణాన్ని కాంక్షిస్తారు. రెండవ రకమువారు, అనగా ప్రవృత్తిలో జీవించువారు ఏకత్వములో అనేకత్వ ములను దర్శిస్తారు. ఈ విధమైన దృష్టి కలవారు స్వార్థముతో జీవిస్తారు. వీరే రాజసిక స్వభావులు. వీరు ఫలితాలను వెంటనే ఆశించి కర్మలు చేస్తారు. ఇక మూడవ గుణమైన తామసిక లక్షణము కలవారు సరియైన జ్ఞానము లేక, అజ్ఞానముతో కర్మలు ఆచరిస్తారు. వీరి కర్మలు పశులక్షణములతో కూడి ఉంటాయి.

భగవద్గీత కర్మలను 5 విధములుగా విభజించెను. కారణములను ఆధారము చేసుకుని ఈ కర్మలు జరుగుచున్నవి. అవి శరీరమును ఆధారము చేసుకుని జరుగు కర్మలు, ఆత్మ కారణముగా జరుగుతున్న కర్మలు, ఇంద్రియ ప్రేరణతో జరిగేకర్మలు. మానవ శరీరములో తన ప్రమేయం లేకుండా జరుగు కర్మలు మరియు విధిని అనుసరించి జరుగు కర్మలు. మనము ఒక కర్మ అనుకున్నంత మాత్రాన ఆ కర్మ సఫలంకాదు. అన్నీ సానుకూల మైతేనే కర్మ సఫలమవుతుంది. కర్మ మూడు రకాలు. అవి మనసు, వాక్ మరియు శారీరక కర్మలు. మానవునకు కర్మాచరణలో త్రికరణశుద్ధి అవసరము. ఈ పవిత్రతలో దాపరికము ఉండదు.

మానవుడు సంఘజీవి. సంఘంలో మానవుడనుసరించవలసిన ధర్మాలను భగవద్గీత ఎంతో చక్కగా వివరించెను. మానవుడు తన ధర్మాన్ని తాను ఆచరించవలెను, అంతేకాని లోకోద్ధరణ మాత్రం భగవంతుడే చూసుకుంటాడు. ఎలా అంటారా? భారత యుద్ధం మొదలయింది. యుద్ధభూమిలో ప్రవేశించగానే అర్జునుడిలో వైరాగ్యభావాలు పెళ్ళుబికాయి. యుద్ధము చేయనన్నాడు. ఈ యుద్ధము కారణంగా ఎందరో బంధువులు, రాజులు హతులవుతారు. అప్పుడు ప్రజలను పరిపాలించుటకు సమర్థులైన రాజులు ఉండరు. వర్ణ సంక్రమము జరుగుతుంది. ఆడ, మగ తేడా లేకుండా, అధికారము మూర్ఖుల చేతులలోకి, అసమర్థుల చేతులలోనికి, కపట రాజుల చేతులలోనికి వెడుతుంది. అప్పుడు నియమాలు గాలికి వదలడం జరుగుతుంది, అంటూ అర్జునుడు యుద్ధమునకు తన విముఖతను శ్రీకృష్ణునికి విన్నవించెను.

అయితే అర్జునుని విన్నపమును శ్రీకృష్ణుడు నిరాకరించెను. అర్జునుడు సంఘ శ్రేయస్సుకై తాను యుద్ధము చేయకపోవడమనుట అనుచితము కాదంటూ, యుద్ధములోనే లోక కల్యాణము జరుగుతుందని, అర్జునుడు

క్షత్రియునిగా తన ధర్మమును ఆచరించవలెనని, న్యాయమును పరిరక్షించ వలెనని బోధించెను. ప్రతి మానవుడు తన ధర్మాన్ని తాను వదలక ఆచరించ వలెను. శ్రీకృష్ణుడు సాక్షాత్తు భగవంతు డైనప్పటికీ, మానవ దేహముతో ఉన్నంతవరకూ తన ధర్మానికి కట్టుబడి ఉండవలసినదే. కర్మఫలములకు అతీతుడు భగవంతుడు అయినప్పటికీ కర్మ ఆచరించవలసినదే. భగవంతుడు కర్మ ఆచరించకపోతే, మానవులు కూడా అజ్ఞానముతో కర్మలు ఆచరించరు. ఈ కారణముచే ప్రాపంచిక వ్యాపకాలు కుంటుబడును. అంతేకాదు, నియంత్రణ కోల్పోవును, అనిశ్చిత పెరిగిపోవును, ప్రపంచము పతనమగును. అట్టి దుస్థితిరాకుండా భగవంతుడు అవతరించును. భగవంతుడు అవతరించి, ముందుగా తాను ఆచరించి, ధర్మాచరణమును అభివృద్ధి చేయును.

భగవంతుడు అవతరించునది మానవుని ఉద్ధరించుటకే, మానవునకు అతని విధులలో సహాయపడుటకే. మానవుడు తనను తాను తెలుసు కొనుటకు, భగవంతునిలో లీనమగుటకు భగవంతుడు మానవునికి మార్గదర్శిగా ఉండును. భగవంతుడు మానవునికి మూడు విధాలుగా సాయపడును. మొదట, మానవునిలో ఉన్న అజ్ఞానమును తన దివ్యమైన సందేశముతో పారదోలును. రెండవది మానవతా విలువలను బోధిస్తూ మానవులచే వాటిని ఆచరింపచేస్తారు. మానవతా విలువలను ఎల్లవేళలా ఆచరించేవారు దైవీలక్షణాలను అభివృద్ధి చేసుకుని విశ్వమానవాళిని ప్రేమించగలుగుతారు. మూడవది, భగవంతుని సూచనలను అనుసరించి, జీవనము సాగించి, భగవంతుని అనుగ్రహాని పాత్రులగుదురు.

భగవద్గీత యజ్ఞమునకు కొత్త అర్థమును అందించెను. యజ్ఞము మానవ ధర్మములోని భాగమే. అర్జునుడు క్షత్రియునిగా యుద్ధ భూమిలో శత్రువులను హతమార్చవలెను. అయితే మనుషులను చంపడం పాపమని

మానవుల సాధారణ భావం. కానీ స్వార్థ చింతనలేక, యుద్ధ భూమిలో క్షత్రియధర్మముగా ఎంతమందిని వధించినా ఎట్టిపాపము అంటదు. ఫలాపేక్ష లేకుండా కర్మలాచరించినపుడు, ఆ కర్మ చేయునది చేయించునది ఆ పరమాత్మే అని అర్థమగును. భగవంతునికి సంపూర్ణ శరణాగతితోనే ఇది సాధ్యమగును. ఈ విధముగా భగవంతునికి శరణువేడటమే యజ్ఞము. మానవుడు తన కర్మల ఫలాలను భగవంతునికి అంకితం గావించవలెను.

భగవంతుని అనేక రీతులలో శరణు పొందుతున్నాడు మానవుడు. యోగులు భగవంతునికి సంపూర్ణ శరణాగతులవుతారు. యోగులు తమ కర్మలను భగవదర్పితం చేస్తారు. ఆ పరబ్రహ్మమే తమలో ఉండి కర్మలు జరిపిస్తుందని వీరి భావన. ఆ విధముగా వీరు ఆ పరమాత్మలో విడదీయరాని బంధాన్ని ఏర్పరచుకుంటారు. ఇతరులు తమ జ్ఞానమునను సరించి భగవంతునికి వివిధ రీతులలో సమర్పించుకుంటారు.

మానవుడు తన పవిత్రతను పెంచుకొనుటకు అనేక సాధనలు, యజ్ఞములు, కర్మలను చేపట్టును. కొందరు తమ ఇంద్రియాలను నియంత్రించుకొందురు. కొందరు ఆహారపదార్థమును తినడం మానుకొందురు. కొందరు యోగసాధనాలను చేబడుదురు. కొందరు గ్రంథ పఠనం ద్వారా జ్ఞానమును సముపార్జించి వాటిని ఆచరణలో పెడదురు. ఇట్టి కర్మలలో మనస్సు పవిత్రమగునని భగవద్గీత బోధించుచున్నది.

సత్కర్మల వల్ల మనస్సు కుదుటపడుతుంది. మనసు కుదుట పడటానికి మానవుడు ఈ నాలుగు సత్కర్మలను ఆచరించవలెను. అవి సాటి మనిషిని ద్వేషించక ప్రేమించవలెను, వైరాగ్యము అభివృద్ధి పరచుకోవాలి, కోరికలు త్యజించాలి, నిస్వార్థ చింతనలో తన ధర్మాన్ని ఆచరించాలి. అట్టి పవిత్ర మనస్సుతో సాక్షాత్కారము సాధ్యమగును. బౌద్ధమతము కూడా తన అష్టసూత్ర ప్రణాళికతో, మానవులందరు తమ దైనందిన జీవితాన్ని నిర్వాణ మార్గముగా స్వీకరించి, ఆచరించి తరించవచ్చని శలవిచ్చెను.

# 10 . నైతిక విలువలు

ధర్మమనగా ముఖ్యముగా మానవుని అంతరంగమునకు, సత్కర్మలకు, త్యాగమునకు, పవిత్రతకు సంబంధించినదై ఉన్నది. ఇట్టి ధర్మముతో మానవుని అంతిమలక్ష్యమైన సాక్షాత్కారము సాధ్యమగును. సామాన్యముగా పశ్చిమ దేశాలలో ధర్మమనగా సంఘంలో మానవుడు అనుసరించవలసిన తీరును ధర్మమందురు.

నైతిక విలువలు అనగా ఆచరించవలసిన నియమాలు. సామూహికంగా ఈ నైతికవిలువలు అందరూ ఆచరింతురు. ఈ నైతిక విలువలను సామూహికంగా ఆచరిస్తూ వీటిలోని లోటుపాట్లను ఎప్పటికప్పుడు సరిచేయుట జరుగును. ఇట్టి మార్పులను అత్యంత సూక్ష్మంగా పరిశీలించి సంఘంలో నైతిక విలువలు పెరిగే దిశగా సూచింపబడును.

తత్వవేత్తలు ఈ నైతిక విలువలను రూపొందించెదరు, మరియు మార్పులను సూచించెదరు. సామూహికంగా ఆచరించు ఈ నైతిక విలువలను మార్చడానికి ముందు వారు కర్తవ్యకర్మలను, బాధ్యతలను, న్యాయపరమైన రీతిలోనూ, సమత్వమను, హక్కులను, అధికారము మొదలైన అంశాలను పరిశీలించి పరిగణించెదరు.

కొన్ని పరిస్థితులలో నైతిక విషయమై నిర్ణయాలు చేయలేని పరిస్థితులు ఎదురగుచుండును. అవి చిన్న సమస్యలు లేదా పెద్ద సమస్యలు కావచ్చును. గొప్ప విషయములు కావచ్చును లేదా పట్టించుకోవలసిన అంశాలు కాకపోవచ్చును. భౌతిక విషయాలు కావచ్చును లేదా ఆధ్యాత్మిక విషయాలు కావచ్చును, వ్యక్తిగతమైన విషయము కావచ్చును లేదా కుటుంబపరమైన వ్యవహారము కావచ్చును. సాంఘికమైన సమస్యకావచ్చు, రాజకీయమైన సమస్య కావచ్చు ప్రతి ఒక్కరు ఏదో ఒక సమస్యకు గురి అగుట జరుగును.

కాబట్టి అట్టిపరిస్థితులలో నైతికంగా చర్చకు అవకాశమేర్పడి సంతృప్తికరమైన పరిష్కారము పొందవలెను.

నైతిక విషయములపట్ల చర్చించువారు బుద్ధిమంతులై, చక్కని విషయ పరిజ్ఞానము కలిగి ఉండవలెను. సాధారణముగా అజ్ఞానము వల్లనే నైతికవిలువల పట్ల బేధభావాలు, బేధాభిప్రాయాలు ఏర్పడును. ఇట్టి సందర్భములో ఎప్పటి నుండో ఆచరణలో ఉన్న సిద్ధాంతాల సాయంతో ఈ విషయాలను చర్చించవలెను. అయితే చాలా సందర్భాలలో ఈ సిద్ధాంతాలలోనే బేధాలు వ్యక్తమగును. అట్టి పరిస్థితులలో ఏది మంచో, ఏది చెడో బేరీజు వేసుకుని చర్చించవలెను. ఈ చర్చ అనుకున్నంత తేలికైనది కాదు.

మానవుడు సంఘజీవి. ఈ కారణముచే నైతిక విషయాలలో వ్యక్తిగతంగా నిర్ణయాలు చేపట్టినప్పుడు సంఘము యొక్క ప్రభావము పరోక్షముగా గానీ ప్రత్యక్షముగాగానీ తప్పక ఉండును.

నైతిక విలువల పట్ల తగిన అవగాహనతో చర్చజరిపి, సిద్ధాంతాలను పరిశీలించి, అటు పిదప నిర్ణయించవలెను. ఈ చర్చలలో మానసిక పరిస్థితులు వ్యక్తమగును. చివరగా మనసును నియంత్రించే నిర్ణయమునకు కట్టుబడవలెను. సాధారణముగా ఎవరి నైతిక సమస్యలు వారివి. కాబట్టి ఎవరికి వారు తమకు ఏది మంచిదని భావిస్తారో దానినే సమస్య పరిష్కారానికి ఎంచుకుంటారు. అయితే, సామాన్యంగా ఈ నైతిక విలువలు మనల్ని అప్పటికి ఏది 'ఒప్పు' అనే విషయమై నిర్ణయం చేయడానికి సహాయపడేటట్లు జరుగుతున్నది.

నైతిక సూత్రాలను ఆధారంగా చేసుకుని నైతిక జీవనం ఉంటుంది. నైతిక సమస్యలు ఎదురయినపుడు ఈ నైతిక సూత్రాలననుసరించే

పరిష్కరించవలెను. నైతిక జీవనమునకు అలవాటు పడినవారు సమయ సందర్భాలను బట్టి ఏది మంచో, ఏది ఒప్పో, ఏఏ పనులు చేయదగినవో నిర్ణయింతురు. తాము తీసుకున్న నిర్ణయాలకు ఇతరులు ఏ విధముగా స్పందించెదరో అని వీరు ఆలోచించరు. ఈ నైతిక సూత్రాలు అందరికీ ఆదర్శమును అందించునదే, అనగా ఎల్లవేళలా మంచికి కట్టుబడుటకే ప్రోత్సహించును.

దాతృత్వము, మితాహారము, సాటిమనిషికి సాయపడుట, త్యాగము మొదలైన సద్గుణములు మానవునికి అలవాటుగా ఏర్పడును. Ethike = Ethics అను పదమునకు అలవాటు అను అర్థము కలదు. కాబట్టి సహజముగా మానవునికి మంచి లక్షణములనునవి అలవాటుకావు. ప్రకృతికి విరుద్ధముగా మానవుడు అలవాట్లను అభివృద్ధి చేసుకుంటాడు. కొన్ని అలవాట్లకు శిక్షణ పొంది కూడా అందుకు భిన్నమైన అలవాట్లకు అలవాటుపడుతుంటారు.

మానవుడు సంపూర్ణమైన వ్యక్తిత్వముగలవాడు, ఆధ్యాత్మికత మూర్తీభవించినవాడు, సర్వస్వతంత్రుడు, మంచిచెడుల నిర్ణయము చేయగలవాడు. తన జీవితాన్ని తనే తీర్చిదిద్దుకోగలడు. మానవుడు భగవంతుని సృష్టిలో అద్భుతమైన జీవి. ఈ కారణముచే మానవుడు భగవంతునికి ఋణపడి వున్నాడు. ఈ కారణముచే సాటిమనిషి పెడత్రోవను పట్టినప్పుడు అతనిని సరిచేయు బాధ్యత ప్రతిమానవుడికి కలదు.

మంచిని సాధించడానికి మానవునికి హక్కుకలదు. అయితే మానవుడు తన హక్కుల కోసం తాపత్రయ పడుతున్నాడు తప్పితే వాటిని ఆచరణలో పెట్టలేక పోతున్నాడు. వ్యక్తి అనగా స్పృహతో, లక్ష్యముతో భౌతిక దృష్టికి అలవాటుపడి అభివృద్ధికి కారకమైన, సమగ్రమైన ఆలోచనా సరళితో తన కోరికలను విశ్లేషించుకుంటు వాటిని అనుభవిస్తున్నాడు.

నైతికత అనగా వివేక విచక్షణలతో ఏది మంచో, ఏది చెడో, ఏది తప్పో ఏది ఒప్పో, ఏది బాధ్యతో, ఏది కర్తవ్యమో తెలియ జేయునది. ఇవి సిద్ధాంతరీత్యా మానవుని అందుబాటులో ఉంటున్నవి. ఈ నియమాలు మానవుని ప్రవర్తనను, కర్తవ్యమును, జీవన విధానమును, హక్కులను నియంత్రించుచున్నవి. వివేక విచక్షణలతో కూడిన ఆచరణ ఒక్క మానవులకు మాత్రమే వర్తించును. జంతువులు, యంత్రములు పనిచేస్తాయి, ప్రవర్తిస్తాయి కానీ వాటికి నైతిక విలువలతో పనిలేదు.

# 11. నైతిక పురోగతి

**సిద్ధాంతాలు:**

నైతిక సిద్ధాంతాలు లేదా అవసరములు అనేవి వ్యక్తిగత నమ్మకాలు కాదు. ఇవి మన వాడుక విషయాలు. సంప్రదాయము, పద్ధతులు ఇవి మన దైనందిన జీవనానికి అవసరమైన నియమాలను సూచించెను. ఈనాటి ఈ నియమాలు సమగ్ర పరిశీలనే తక్షణ మన నైతిక సమస్య. ప్రతి నైతిక విషయము లోను అగోచరముగా ఎన్నో విషయములు దాగి ఉంటాయి. మన న్యాయవ్యవస్థ ఈ నైతిక సిద్ధాంతాలు, అలవాట్లు కలయిక. ఈ న్యాయవ్యవస్థ వీటియొక్క శక్తిని, స్థితిని వివరించును. ఈ నైతిక సిద్ధాంతాల ఆచరణ ఎన్నో కట్టుబాట్లకు లోబడి ఉంటున్నవి. ఈనాడు అనేక సంస్థలు తమ సభ్యుల బహిరంగ మరియు రహస్య కార్యకలాపాలకు తమకు తోచిన రీతిలో బహుమతులు, శిక్షలను రూపొందించయినాయి.

ఈ నైతిక సిద్ధాంతాలను మానవులు ఆచరిస్తారు. ఈ నియమాల ఆచరణ వల్ల వీటి శక్తియుక్తులు తేటతెల్లమగును. ప్రజలు ఈ నియమాలను కొద్దికొద్దిగా మార్పు చేయుదురనుట అందరూ ఒప్పుకోవలసిన సత్యము. అయితే మానవులు ఈ నియమాలను తగిన కట్టుబాట్లకు లోబడి ఆచరించవలసినదే. ఎవరైతే ఈ నైతిక పద్ధతులకు లోబడి ఉంటారో, వారికి ఈ నియమాలు రుచించిక, తిరస్కరించ దలచుకున్నప్పటికీ అది సాధ్యముకాదు. ఈ నియమాలు ఏ ఒక్క వ్యక్తినో దృష్టిలో పెట్టుకుని రూపొందించినవి కాదు. కాబట్టి ఎవరో ఒక వ్యక్తి తన వ్యక్తిగత కారణాలతో ఈ నియమాలను నిరాకరించారని చెప్పి వీటిని మార్చడం జరగదు. అయితే ఇట్టి ఘటనలు మార్పులకు పునాది వంటిది. ఎప్పుడయితే ఈ పద్ధతిలో ఏదైనా మార్పును ఎక్కువ సంఖ్యలో కోరుతారో అప్పుడు ఈ సిద్ధాంతాలలో మార్పులు చేపట్టబడును.

అధికసంఖ్యలో ఈ నైతిక సిద్ధాంతాలకు స్పష్టత లోపించడం జరిగింది. ఈ కారణముచేత మనము వినే మతపరమైన, ఆధ్యాత్మిక, సాంఘిక, రాజకీయ విషయాల యందు వినడములో శ్రద్ధ చూపించినప్పటికీ, ఆచరణలో అంత శ్రద్ధ చూపించము. మనకు ఎప్పుడైనా ఒక నైతిక సమస్య ఎదురైనప్పుడు, మనము ఈ నైతిక సమస్య పరిష్కారమునకై ఈ సిద్ధాంతాలను ఒకసారి పరిశీలిస్తాము. ఈవిధమైన సిద్ధాంతాల పరిశీలన అంత సులువైన పనికాదు. సాధారణంగా ప్రజలు ఒక నైతిక సమస్యకు చాలా ఎక్కువగా స్పందిస్తారు కానీ, ఆ సమస్య పరిష్కారానికి తగిన అవగాహనా జ్ఞానం మాత్రం వీరికి లోపిస్తున్నది.

ఈ నైతిక సిద్ధాంతాలు ఏ విధముగా రూపొందించబడినవి. ఈ తత్వము వివేక విచక్షణలతో కూడినది. క్రమశిక్షణలతో కూడినది, ఎన్నో రంగములతో ఇమిడి ఉన్నది. మనస్సు ఇంద్రియాలకు లోబడవచ్చు. కానీ బుద్ధి మాత్రం ఇంద్రియాలకు ఎన్నడూ లోబడదు. కాబట్టి ఈ నైతిక సిద్ధాంతాలు సామాన్యంగా మానవుల స్వభావము, ప్రవర్తనల కోసమే రూపొందించబడెను.

మహా మహా తత్వవేత్తలు, తమ తమ కాలములలో, తమ తమ ప్రదేశములలో ఈ తాత్విక సిద్ధాంతాలను మానవులందరి ఆచరణ కొరకై రూపొందించినారు. ఏ విధముగా అయితే లెక్కల మాష్టారు పిల్లలచే లెక్కలు చేయుట నేర్పిస్తారో అదే విధముగా ఈ తత్వవేత్తలు సారవంతమైన ప్రత్యక్ష ప్రమాణాలతో ఈ నైతిక విలువల ఆవశ్యకతను మానవాళికి బోధించారు. పశ్చిమదేశాలలో జీసస్‌క్రైస్తు, కెంట్, స్పినోజా; తూర్పు దేశాలలో మనువు, కన్‌ఫూసియస్, బుద్ధుడు శ్రీ సత్యసాయి మొదలైనవారు కాలానుగుణంగా ఈ నైతిక విలువలను మానవాళికి అందించారు.

మహానుభావులు తమ సిద్ధాంతాలను మానవాళికి అందించడమే కాదు వారుకూడా ఆచరించి అందరికీ ఆదర్శమవుతారు. ఈ నైతిక విలువల యొక్క ఆవశ్యకతను అందరికీ ఎఱుకపరచుతారు. ఈ నైతిక సిద్ధాంతాలు ప్రజల ఆమోద ముద్రను పొందాలంటే స్థిరముగా ఆటుపోట్లకు ఇది తట్టుకొని ఉండాలి. కాబట్టి, ఈ నైతిక సిద్ధాంతాల రూపకల్పనలో ఎన్నో జాగ్రత్తలు, మెళుకువలు వివిధ కోణాలలో నిశితంగా పరిశీలించిన పిమ్మట ఇది ప్రజల ముందుకు వచ్చును.

ఆంతరంగిక స్థిరత్వమునకు తోడు ప్రాకృతిక, సాంఘిక పరిణామాలను దృష్టిలో పెట్టుకుని ఈ నైతిక విలువలను, సిద్ధాంతాలను తమ వయస్సుతో కూడిన స్వానుభవముల నాధారముగా రూపొందించెదరు. అయితే ఈ సిద్ధాంతాలలో ఒక ప్రదేశానికి, మరొక ప్రదేశానికి, ఒక కాలానికి మరో కాలానికి కొన్ని వ్యత్యాసములకు తావు ఏర్పడుతున్నది. అయితే అన్నిటినీ సూక్ష్మంగా పరిశీలించి అందరికీ ఆచరణ యోగ్యంగాను, మంచిని చేకూరే విధంగాను ఈ నైతిక విలువలు మనకు అందుబాటులో ఉంచటం జరిగింది.

ప్రతివ్యవస్థకు, ప్రతి రంగానికి నైతిక విలువలు రూపొందించబడినవి. ఉదాహరణకు కార్ల్‌మార్క్స్ సూత్రాన్ననుసరించి ఒక వస్తువు యొక్క విలువ ఆ వస్తువు తయారీలో వినియోగించిన శ్రమశక్తిపై ఆధారపడి ఉంటుందని చెప్పెను. ఇదే రాజకీయ విప్లవానికి కారణమైనదని విన్నవించెను. ఇదే విధంగా ఈ నైతిక విలువలపై ఎంతో పరిశీలనచేసి, తెలియని విషయాలు రాబట్టుటే కాక, ఒక రంగానికి మరో రంగానికి ఉన్న అవినాభావ సంబంధమును కూడా గ్రహించుట జరుగుతున్నది. కార్ల్‌మార్క్స్ ఏవిధంగా నయితే ఆర్థిక విధానములకు నైతికవిలువలు రూపొందించెనో, అదే విధముగా అన్నిరంగాలకు ఈ నైతిక విలువలు రూపొందింపబడెను.

ఈ నైతిక విలువల పట్ల ప్రశ్నలు ఉదయించే కొలది, మరింత విచారణకు అవకాశమేర్పడుతున్నది. శాస్త్ర సాంకేతిక రంగాలలో ఇట్టి మార్పులను మన చరిత్ర మనకు తెలుపుతున్నది. తత్వవేత్తల ప్రశ్నలకు నైతికతకు దూరంగా జవాబులు ఉంటున్నవి. ఈ కారణం చేతనే ఒక జవాబు మరిన్ని ప్రశ్నలకు కారణమవుతున్నది.

కొద్దిమంది నైతిక తత్వవేత్తలు ఈ నైతిక సిద్ధాంతాలకు సాయము సదాచారము, సత్కర్మాచరణ అవసరమని భావిస్తున్నారు. సిద్ధాంతాలపట్ల శ్రద్ధ కలగడానికి ఇవి అవసరమని వీరి ఉద్దేశ్యం. ఒక సత్కర్మ పూర్వా ఫలాలను వివరిస్తూ, ఈ నైతిక సిద్ధాంతాల ఆచరణకు వీటి ఆవశ్యకతను తెలియ జేయు కోణమును గుర్తిస్తున్నారు.

సత్కర్మాచరణ యొక్క ఆవశ్యకతను అందరు గుర్తించాలి. సత్కర్మా చరణపై ప్రచారము ఉండకూడదు. సత్కర్మాచరణ అన్నది న్యాయబద్ధమైనది, సాంఘిక విలువలతో కూడినది. నైతిక విలువల పట్ల మానవునికి సరి అయిన అవగాహన కలుగవలెనన్న ఈ సదాచార సంపత్తి ఎంతో తోడ్పడును.

మహానుభావులు తాము ఆచరించి ఇతరులకు ఆదర్శవంతు లవుతారు. వారి జీవితాలే మనకు నైతిక విలువలపట్ల, సత్కర్మల పట్ల మన శ్రద్ధను ఇనుమడింప చేస్తుంది. అన్ని నైతిక విలువలు, అన్ని సత్కర్మలు ముఖ్యమే. అంతేకానీ ఫలానా సత్కర్మలు, ఫలానా విలువలే ముఖ్యం అన్నట్లు వీరు బోధించరు. అట్టి మహానుభావులే జీసస్ క్రైస్తు మరియు శ్రీసత్యసాయి.

సత్యమును పలుకవలెను అనునది నైతిక విలువ. సత్యమును పరుషముగా కాక, మృదుమధురముగా మాట్లాడవలెను అనునది ధార్మిక విలువ. మనము సత్యమును పలకడం వల్ల ఎవరికీ హాని కలుగరాదన్నది ఆధ్యాత్మిక విలువ. చూశారా ఒక్కొక్క విలువకు ఎంతటి వ్యత్యాసం.

సత్యమునకు సంబంధించిన ఈ మూడు విలువలు ఆచరణ యోగ్యములే, అయినప్పటికి సత్యమును పలుకుటలోని వివిధ స్థాయిలను ఎంత చక్కగా మన పూర్వీకులు అందించారో కదా!

మహానుభావుల జీవన విధానములో ఈ నైతిక, ధార్మిక, ఆధ్యాత్మిక విలువల వ్యత్యాసము కనపడదు. అందుకే వారి జీవనము నైతిక విలువలకు, ధార్మిక విలువలకు, ఆధ్యాత్మిక విలువలకు నిలువుటద్దముగా నిలబడును. ఈ విషయములనే వారు తమ సందేశములద్వారాను, రచనలద్వారాను మానవులకు జ్ఞానోదయాన్ని కలిగింతురు. వీరు మానవాళికి అందించిన సందేశములు శాశ్వతమై అలరారుతున్నవి. కాబట్టి నైతిక విలువలకే పరిమితం గాక ధార్మిక, ఆధ్యాత్మిక విలువలకు కూడా అందరూ అలవాటుపడాలి.

సదాచారము వలన మానవతా విలువలు పెరుగును. మానవులమధ్య సత్సంబంధాలు మెరుగుపడును. ప్రజలకు, ప్రభుత్వమునకు మధ్య సంబంధ బాంధవ్యాలు అభివృద్ధియగును. సదాచారము అనునది భగవద్ విషయమై మతమునకు సంబంధించిన విషయము. మంచికర్మలకు మంచి ఫలితములు, చెడు కర్మలకు చెడుఫలితములు అన్నట్లు మంచివారిని భగవంతుడు అనుగ్రహించునని, చెడు కర్మలనాచరించువారిని భగవంతుడు శిక్షించునని కాంట్ మహాశయుడనెను.

రెండూ ఒకటిగా అనిపించినా సత్కర్మలు వేరు మతము వేరు. మంచి కర్మ లనునవి సంఘములో అందరూ ఆచరించవలసిన నియమానికి సాంఘిక పరిస్థితులలో ఉత్పన్నమయ్యే సమస్యలకు పరిష్కారము ఈ సత్కర్మల ఆచరణ. అప్పుడప్పుడు బల ప్రయోగము నుపయోగించి సమస్యల పరిష్కారము చేయవచ్చును. అయితే న్యాయబద్ధంగా సత్కర్మాచరణ వేరు,

బలప్రయోగము వేరు. సత్కర్మల వల్ల చట్టబద్దంగా అందరికీ న్యాయము జరుగును. సత్కర్మల ననుసరించి సమస్యలు పరిష్కరించిన సందర్భాలలో బలహీనులు నష్టపోవడం జరగదు. న్యాయానికి పెద్దపీట వేసిన సందర్భాలలో ఎక్కువమందికి ఆమోదయోగ్యమగును. మానవ శ్రేయస్సు కోరి, మరి ఇతర కారణముల రీత్యా ప్రతిసారి ఇట్లు సాధ్యంకాదు.

సత్కర్మాచరణ అన్నివేళలా ఆమోదయోగ్యమే. అనగా సత్కర్మాచరణ వ్యక్తిగత మైనదికాదు, స్వార్థచింతనలకు తావులేదు. దేనినయితే మనము నైతికముగా మంచిది కాదని నిర్ణయిస్తామో దానిని ఆచరించకూడదని భావించవలెను. అట్టి పనులకు దూరముగా ఉండవలెను. మానవుని బుద్ధిని అనుసరించి న్యాయమైన తీర్పు వెలువడును. అయితే అసలు కారణాలను ప్రక్కకు పెట్టి, స్వార్థముతో వ్యవహరించుట వలన న్యాయము జరగదు.

నిర్మల మనస్సుతో నా పర బేధములు లేకుండా అందరికీ సాంఘిక న్యాయము జరగవలెను. వివిధ రీతులలో సదాచారముల నాచరిస్తూ, సమగ్రమైన దృష్టితో నిర్ణయశక్తికి తోడ్పడవలెను.

**ఆ. కాలానుగుణంగా మార్పులు:**

కాలముతోపాటు నైతిక సిద్ధాంతాలు మారును. మంచిచెడుల నిర్ణయాలు కూడా కాలానుగుణంగా మారును.

మానవ మనుగడలో ఈ కాలానుగుణ మార్పులు కూడా ఒక భాగమే. సృష్టి మొదలు నేటి ప్రపంచస్థితి వరకు కూడా ఒక సమగ్రమైన మార్పుల క్రమము వ్యక్తమగుచున్నది. పదార్థ జ్ఞానముతో బాటు మానవుని మేధస్సు కూడా మారుతున్నది. ఈ మార్పు క్రియాశీలకమైనది. ఈ మార్పులు సంభవించేటప్పుడు ఎన్నో కొత్తవి, క్లిష్టమైన అంకురార్పణలే కాక నూతనమైన ప్రణాళికలకు అవకాశ మేర్పరచుచున్నది.

కాలముతో బాటు ఏవ్యవస్థలోనైనా మార్పులు సహజమే. అయితే కొన్ని సందర్భాలలో ఈ మార్పులు నూతనముగాను, నూతన వొరవడిని సంతరించుకుంటున్నాయి. ఈ మార్పులు మరిన్ని మార్పులకు కారణ మవుతున్నవి. అటువంటి రెండు సందర్భాలు. మొదటిగా ప్రాణములేని పదార్థంనుండి ప్రాణోత్పత్తి జరుగుట. రెండవది, జంతువుల నుండి మానవుని ఆవిర్భావము జరుగుట. శారీరక ధర్మశాస్త్ర రీత్యా మరియు రసాయనిక శాస్త్రరీత్యా ఈ మార్పులు సాధ్యమే.

భూమిమీద మొట్టమొదటిసారి ప్రాణోత్పత్తి జరిగినప్పుడు, అది ఎట్లు సంభవించెనో అన్న క్లిష్ట విషయములను గుర్తించడమైనది. డార్విన్ తన సూత్రాలతో ఈ విషయాలను వివరించెను.

ఈ వంద కోట్ల సంవత్సరాలతో అనేకానేక మార్పులు జరిగినవి. అవి నియంత్రణకు సంబంధించినవి, స్వేచ్ఛ, సామరస్యములకు సంబంధించినవి. కొన్ని జంతువులలో విశేషముగా మానసిక స్థాయిలో మార్పులు జరిగెను. భూమిమీద నివసించే జంతువులలో మానసికమైన మార్పులు ప్రస్ఫుటముగా కానవచ్చెనని శాస్త్రవేత్తల అభిప్రాయము. కొన్ని పక్షులలోను, జంతువులలోను మానవుని వలె వాటి మానసిక స్థితి ఎంతో అభివృద్ధి చెందెను. ఈ మార్పుల వల్ల సొంత నిర్ణయాలు, సొంత కోరికలు, విషయ పరిజ్ఞానము మొదలైన అంశములు అభివృద్ధి అయ్యెను. అయితే మానవులలో మాత్రం మెదడు చాలా అభివృద్ధిగాంచెను.

అభివృద్ధి పేరుతో ఈ యుగమార్పులు అనేకరీతులలో వ్యక్తమయ్యెను. ఇది ఒక అంతములేని ప్రయాణమువంటిది. కొన్ని సందర్భాలలో మార్పులకు తావులేనట్లుగా, ఆయా జీవరాసులు భూమిపైన తమ ఉనికి లేకుండా కోల్పోయెను. అయితే చాలా జీవరాసులలో మార్పులు జరుగుతూనే

ఉన్నవి. మూడుకోట్ల సంవత్సరములకు పూర్వము పురుగులకు, అటు పిదప పక్షులకు ఈ విధమైన అంతము సంభవించెనని తెలుపడమైనది.

గత 5 లక్షల సంవత్సరాలలో ఈ యుగమార్పులు నూతన వ్యవస్థ రూపకల్పనకు కారణమయ్యెను. ఈ కొత్త వ్యవస్థలో, ఎన్నో నూతన ఒరవడులలో యుగమార్పులు సంభవించుట మొదలయ్యెను. జీవరాసుల శారీరక మార్పులు క్రమంగా సాంఘిక మార్పులలో లీనమయ్యెనన్నట్లుగా మానవుని మానసిక స్థితి ఉన్నతస్థాయిలో వ్యక్తమయ్యెను.

అనాది మానవుడు తన సొంత ఆలోచనలకు, మాటలకు అలవాటు పడినాడు. తన మాటలకు భావాలతో కూడిన ప్రకటనలు మొదలయ్యెను. కారణాలను తెలుపుతు వ్యక్తిగత అనుభవాలు సమీకరణ మొదలయ్యెను. మొదటిసారి విద్యకు, సంస్కృతీ సంప్రదాయాలకు అవకాశమేర్పడి, నిరంతర ప్రవాహంగా యుగ మార్పులు సంభవించుచూనే యున్నవి.

ఈ యుగ మార్పులు సామాజిక స్థాయికీ, మానసిక స్థాయికీ అన్నట్లుగా మార్పులు కలిగెను. మానవులకు మానవులకు మధ్య జరిగే వివాదాలు, అతని జీవనపోరాటమును వ్యక్తము చేయుచున్నది. ఇది వ్యక్తి పోరాటము కావచ్చు లేదా సమిష్టి పోరాటము కావచ్చు. వంశపరంగా జరుగు మార్పులు చాలా నెమ్మదిగా జరుగును. అయితే అనుభవపూర్వక మయిన మార్పులతో మానవుడు త్వరితగతిన మార్పులకు కారణ మగుచున్నాడు. ప్రయత్న పూర్వకంగా, ఒకసారి ప్రయత్నం చేసి చూద్దాం అన్న భావనతో మానవుడు నూతన ఆలోచనా సరళికి అలవాటు పడుతున్నాడు.

ఏనాడైతే మానవుని స్పృహతో ఈ యుగమార్పులు సంభవించు చున్నవో, నైతికవిలువల ఆవశ్యకతను గుర్తించడం మొదలయ్యెను.

మానవుడు భూమి మీదికి రాక పూర్వము ద్వంద్వరీతికి తావులేక ఉండెను. కానీ ఎప్పుడయితే మానవుడు తన ఉనికిని గుర్తించ మొదలిడినాడో ద్వంద్వరీతి మొదలయ్యెను. ఈ నేపథ్యంలోనే నమ్మకం, ధైర్యం, ప్రేమ, సత్యం, మంచి, సత్కర్మలు అనునవి యుగమార్పులుగా సంభవించెను.

సాంఘిక జీవనానికి అలవాటుపడిన మానవునకు అనేకరీతులలో యుగ మార్పులకు తావు ఏర్పడెను. ప్రకృతిలో లభ్యమయ్యే వాటిపై సరి అయిన అవగాహన కలిగి ఉంటున్నాడు. ద్వంద్వాలతో కూడినది ఈ ప్రపంచం. ఈ ద్వంద్వాలకు మానవుడు అలవాటు పడుతున్నాడు. ఈ ద్వంద్వాలు మానవునిలో సౌందర్యం, ప్రేమ, సత్యం మొదలైన విలువల ఆవశ్యకతలను తెలుపుచున్నవి. మంచి, చెడుల బేధాలు తెలియుచున్నవి. ప్రేమ, ఆరాధన, సుఖం, సంతోషం, శాంతి మొదలైనవి మానవుడు గుర్తించుచున్నాడు. ఈ భావ ప్రకటనలు ప్రతి సన్నివేశంలో గుర్తించడం జరుగుతున్నది. ఈ అనుభవాలన్నిటికీ ఎంతో విలువ ఏర్పడుతున్నది. ఈ విధముగా గోచరం, అగోచరమైన అంశాలతో కూడిన ఈ యుగమార్పులు నిత్యనూతనమునకై అనంతమైన ప్రవాహంవలె సాగిపోవుచున్నది.

# 12. మానవుని మేధాశక్తి

మానవుని మెదడుకు 4 స్థితులు ఉన్నవి. అన్నిటి కంటే ఉత్తమమైనది బుద్ధి రెండవది ఆలోచన, మూడవది నమ్మకము, నాల్గవది ఊహించుట. ఈ నాలుగు స్థితులను మానవుడు తగిన నిష్పత్తిలో ఉపయోగించుకుని సరి అయిన అవగాహనతో, నిస్సంకోచంగా ఈ భౌతికమైన విషయాల స్వభావ స్వరూపాల సత్యాన్ని తెలుసుకోవలెను.

బుద్ధి మానవుని మేధాశక్తిని తెలియజేయును. మన సమస్యలకు పరిష్కారం మన మెదడులోనే దొరకును. ఈ అనుభవంతో మనమంచికి కారణమైన వాటిని మనం గుర్తించగలుగుతాము.

స్పినోజా మనస్సు యొక్క శక్తిని, మన భావములకు మానసిక స్థితికి ఉన్న సంబంధాలను తెలియజేసెను. భావము యొక్క శక్తి ఆ భావము యొక్క కారణముపై ఆధారపడియున్నది. అందుచే భావమునకు కారణము, నియంత్రణ కారణమే అయివున్నది.

ఏ విధంగా అయితే మన ఆలోచనలు, భావనలు మన మనస్సుతో సంబంధ మేర్పరచుకున్నదో అదే విధంగా శరీరములోని మార్పులు చేర్పులు కానీ మన ఊహలు, భావాలు కానీ శరీరముతో సంబంధము కలిగి యుంటున్నవి. మనలోని ఒక భావమును ఒక భౌతికమైన ఆలోచనతో త్రుంచి వేరుచేసి మరియొక ఆలోచనతో జతకలిపినపుడు, ఆ భౌతికమైన ఏర్పాటువల్ల కలిగిన ప్రేమగానీ, ద్వేషముగానీ, మానసిక వత్తిడిగానీ నాశనమగును.

ఒక విషయముపై మనకొక అభిప్రాయము ఏర్పడును. ఎప్పుడయితే ఆ వస్తువుపై స్పష్టమైన అవగాహన ఏర్పడునో అప్పుడు ఆ వస్తువు పట్ల

మనకున్న వ్యామోహము నశించును. అనగా ఈ అభిప్రాయము మనలో గట్టిగా ఉన్నంతవరకు మన మనస్సుకు ఆ అభిప్రాయము వల్ల ఇబ్బంది ఉండదు. మన శరీరములో కూడా ఏ విధమైన మార్పులు చోటుచేసుకోవు. మన ఆలోచనలలో, భావములో ఏ విధమైన మార్పు సంభవించినా మన శారీరక ప్రవర్తనలో మార్పు సూచించును.

ఈ జగతిపై ఉన్న ప్రతివస్తువు తన ఉనికిని ప్రదర్శించును. తన ప్రభావమును చూపును. మనలో జనించిన ఆలోచన కూడా అట్టిదే. మనలో జనించిన ఈ ఆలోచనల కారణమున మనము ఎన్నో విషయములను మనస్థాయికి తగ్గట్టుగా అర్థము చేసుకుంటాము. సదవగాహనతో కలిగిన ఆలోచనలకు మనము తక్కువ బాధను అనుభవిస్తాము.

కాబట్టి మనము ఎప్పుడయినా ఒక అభిప్రాయానికి వచ్చినప్పుడు, స్పష్టమైన జ్ఞానము కలిగి ఉండవలెను. ఆ అభిప్రాయమును క్షుణ్ణంగా మన మనస్సు పరిశీలన చేయవలెను. తృప్తి చెందవలెను. మన మనస్సు కూడా మన సొంత అభిప్రాయాలకు కట్టుబడక నిజాన్ని తెలుసుకొన ప్రయత్నించవలెను. అట్లు చేయవలెనన్న మన సొంత అభిప్రాయాలను మనము వేరు చేయవలెను. ఈ విధంగా చేయడంవల్ల మనము రాగద్వేషాల కతీతంగా ఉంటాము. ఎప్పుడయితే మనం రాగద్వేషాల కతీతంగా ఉండ గలమో, మనకు కొత్త కోరికలు జనించవు. అనగా సొంత నిర్ణయాలు, సొంత అభిప్రాయాలు అనునవి మనలో తగ్గును, అనగా మనలో కోరికలు నశించును. మనలో కోరికలు పెరగడానికి కారణం, ఆ వస్తువుల పట్ల మనకు సరియైన అవగాహన లేకనే కాబట్టి వస్తువుల పట్ల సరి అయిన జ్ఞానము, అవగాహన మనకు ఎంతో అవసరము.

మానవుని కవసరమైన వాటిని మన మనస్సు నిర్ణయిస్తుంది. మనలో కలిగిన భావాలపై మనకు సదవగాహన కలదు. మనము మన మానసిక

స్థితికి బాధను అనుభవించడం లేదు. మన మనస్సు ద్వారా మనము అన్ని రకాల భావప్రకటనలు మనము ప్రకటించ గలుగుతున్నాము. మనము భగవంతుని చక్కగా ఊహించ గలుగుతున్నాము. తనను తాను ఎవరైతే సరిగా అర్థము చేసుకుంటారో, ఎవరైతే తమ భావాలను చక్కగా ప్రకటిస్తారో, వారు భగవంతుని అధికంగా ప్రేమించ గలుగుతారు.

మానవుని మనస్సు భగవంతుని కొరకై తపించవలెను. భగవంతుని తపనలో ఎట్టి కోరికలు ఉండవు. సమస్థితిని అనుభవించును. భగవంతుడు తనను ప్రేమించవలెను స్వార్థము మానవునకు ఉండరాదు. భగవంతుని ప్రేమకు రాగద్వేషాలు అంటవు. ఎవరయితే ఎక్కువగా భగవంతుని ప్రేమించగలుగుతారో వారు ఎక్కువగా భగవంతునితో సంబంధము కలిగి ఉంటారు. భగవంతుని దివ్య ప్రేమకు సాటిలేదు. కాబట్టి భగవంతుని ప్రేమ నిర్మలమైనది, నిశ్చలమైనది, నిస్వార్థమైనది.

మనస్సు ఎంతో శక్తివంతమైనది. మన భావాల యొక్క స్పష్టతను అది గుర్తించును. అక్కరలేని ఆలోచనలను నియంత్రించును. అస్పష్టమైన ఆలోచనలను సత్యము ద్వారా పరిశీలించి అవసరమైన ఆలోచనలను విసర్జించును. అనేక ఆలోచనలతో సతమతమయ్యే మానవుడికి భగవంతుని ఆలోచనలతో అతనికి ఆనందము నొసగును.

మనస్సు యొక్క శక్తి ఇతరుల ఆలోచనలతో పోల్చుకుని తెలుసుకొన వచ్చును. కొందరు తమ భావాలకు, ఆలోచనలకు ఎక్కువగా స్పందిస్తారు, మరికొందరు చాలా తక్కువగా స్పందిస్తారు.

మన భావాల, ఆలోచనల శక్తిని భౌతిక విషయాల ప్రభావముచే నియంత్రించ బడుతున్నది, నిరోధించ బడుతున్నది. మన మానసిక శక్తిని ఉపయోగించే అవసరము ఉండవచ్చు, ఉండక పోవచ్చు. అయితే మన

మనస్సు యొక్క శక్తి, మనము సాధించిన జ్ఞానమును బట్టి ఉండును. జ్ఞానముతో మన కోరికల యొక్క పరిమితిని మనము గ్రహించవచ్చు. అసంపూర్ణమైన ఆలోచనల వల్ల మన మనస్సు భారముగా అనిపించును. అనగా అసంపూర్ణమైన ఆలోచనలకు మన అజ్ఞానమే కారణము. అనగా మన మనస్సు ఎంత పనిచేయుచున్నది? ఎంత బాధ పడుచున్నది? అన్న ప్రశ్నలకు జ్ఞానముతో కూడిన మనస్సు ఎక్కువగా పనిచేయుచున్నదని, అస్పష్టమైన ఆలోచనలతో కూడిన మనస్సు ఎక్కువగా బాధపడు తున్నదని అర్థమవుతున్నది. సద్భావాలతో కూడిన మనస్సు శాంతిని అనుభవించు చున్నది, కోరికలతో కూడిన మనస్సు దుఃఖాన్ని అనుభవించుచున్నది.

ఈ దృశ్యప్రపంచము అశాశ్వతమైనది, చంచలమైనది. అశాశ్వతమైన, చంచలమైన వస్తువులు మనకు తాత్కాలికమైన సంతోషమునే అందించును. ఏనాడయితే ఈ భౌతిక వస్తువుల పట్ల మనకు ప్రేమ పెరుగుతుందో, ఆనాడు వాటిని పొందలేక దుఃఖమును, నష్టమును అనుభవించుచున్నాము. మనము ఏ వస్తువును ప్రేమించ నంతవరకు మనము ఆ వస్తువు మన వద్దలేదని బాధపడము. శాశ్వతముగా ఎవ్వరూ ఏ వస్తువును పొందలేరు. కాబట్టి వస్తువుల పట్ల సరియైన జ్ఞానము కలిగియుండవలెను.

మనలో కోరికలు ఉన్నంతవరకు, ఆ కోరికలకు బానిసయై మనసు బాధపడును. కాబట్టి కోరికలను త్యజించవలెను. వస్తువుల పట్ల కోరికలు బలపడకూడదు. కోరికల పట్ల శ్రద్ధ పెరిగేకొలది మనస్సులో భారము పెరుగును.

మన మనస్సులో ఏమి ఉన్నది? అన్ని విషయాల పట్ల మనస్సు కొన్ని అభిప్రాయాలు ఏర్పరచుకున్నది. చూడటం, వినడం, నిర్ణయించడం, ద్వేషించడం, ఆలోచించడం మొదలైనవి ఇట్టి నిర్ణయాలకు చెందినవి. మంచి, చెడుల నిర్ణయాలు కూడా మనకు ముందుగా ఊహించుకున్నవే.

ఒక విషయాన్ని ఆమోదించడం, మరొక విషయాన్ని ఖండించడం కూడా మనస్సు ముందుగా ఊహించుకున్నదే.

మనస్సు గ్రహించే విషయాలు రెండు రకాలు. మొదటిది దృఢముగా నాటుకొనిన ముద్రలు. రెండవది ఆలోచనలు. మన ఆలోచనల ద్వారా ఏది మంచో, ఏది చెడో నిర్ణయిస్తాము; ఏది తప్పో ఏది ఒప్పో నిర్ణయిస్తాము. మంచిని ఆధారము చేసుకుని ఈ నిర్ణయం చేసినట్లు చెబుతాము. భౌతికమైన పరిస్థితులను ఒకేరీతిలో భావించు కుంటారు. మంచిచెడుల నిర్ణయాలు మార్పులేని విధంగా మనుషుల మనస్సుపై ముద్రింపబడుచున్నది. ఈ విధంగా అనేక విషయాలను పోల్చుకుని ఆలోచనలు, ముద్రలు ఏర్పడు తున్నవి. ఇటువంటి పరిస్థితులను సమీక్షించి మంచిచెడుల నిర్ణయము చేయవలెనన్న మనకు ఇతరత్రా సిద్ధాంతముల అవసరం ఉన్నది.

మన మనస్సే అన్నిటికీ అనగా మంచిచెడులకు, రాగద్వేషాలకు కారణ మగుచున్నది. ఈ ఆలోచనలు మానసికమైనవి. న్యాయము, ధర్మము, దయా దాక్షిణ్యములు మొదలగు అంశాలతో ఈ పై విషయాలను గ్రహించవలెను.

అందరి మనస్సులు ఒకే రీతిన స్పందించును, పనిచేయును. ఒకరు ఏ విధముగా అయితే ప్రభావితులవుతారో అదే విధముగా ఇతరులలో కూడా ప్రతిధ్వనించును. ఈ స్పందనలకు ప్రతిస్పందనలు అందరిలో జనించును. ఈ కారణముచే కష్టాలకు, నష్టాలకు, సుఖాలకు సాటిమనిషి సానుభూతితో స్పందించును. ఇతరుల కోరికలు, భావాలు మనకు తెలియకపోవచ్చును. కానీ ఆ ఘటనలకు కారణాలు విని, మనసులో స్పందనలు కలుగును.

# 13. నైతిక ప్రక్రియ

నైతికమునకు అస్తిత్వములేదు. ఒక ప్రత్యేకమైన మానసిక ప్రక్రియ యొక్క ఫలితమే ఈ నైతిక ప్రక్రియ. ఈ నైతిక ప్రక్రియ కారణముగా మన భావాలు, ఆలోచనలు, క్రియలు అన్నీకూడా మంచిచెడుల నిర్ణయానికి గురి అవుతూ ఉంటాయి. దీనినే నైతికత అందురు. ఈ విధమైన తప్పు ఒప్పుల నిర్ణయాలు మనము నమ్ముకున్న నమ్మకాలకు, సిద్ధాంతాలకు వర్తింప చేసుకుంటాము. అయితే ఈ నైతిక కారణంగా మనము నిర్ణయించే మంచిచెడుల నిర్ణయాలు, వాస్తవమునకు ఋజువు ఉండదు.

ఈ నైతిక ప్రక్రియ మానసిక కార్యక్రమాలను బలపరుస్తుంది. మన నైపుణ్యం, మనఅలవాట్లు, మన ఇష్టాయిష్టాలు మరియు ఇతర ఉద్దేశపూర్వక కర్మలకు ఇవి వర్తిస్తాయి. ఈ నైతిక ప్రక్రియలోని ప్రత్యేకత ఏమిటంటే, మన ఆలోచనలను, భావాలను, కర్మలను ఇవి ప్రతిసారి మంచిచెడుల విమర్శకు గురిచేస్తుంది.

ఈ నైతికత అనునది ప్రతి ఒక్కరిలో చిన్నతనంనుండే మొదలవుతుంది. కడుపులో బిడ్డ ఏ విధముగానైతే దినదినము పెరిగి చంటిబిడ్డ రూపు దాలుస్తాడో అదే రీతిలో ఈ నైతిక ప్రక్రియ కూడా ప్రతిమనిషిలోనూ రూపుదిద్దుకుంటుంది. కడుపులో పెరిగేబిడ్డకు మొదట్లో వెన్నెముక ఉండదు. ఈ వెన్నెముక తరువాత రోజులలో పుట్టుకొచ్చి అభివృద్ధి అవుతుంది. అదే విధముగా పుట్టిన ప్రతి మనిషిలో ఈ నైతికత మొదట్లో ఉండదు, కానీ అటు పిదపనే అది వృద్ధి అవుతుంది. ఏ విధంగా అయితే కడుపులోని బిడ్డకు వెన్నెముక క్రమేపీ గట్టిపడి బలపడుతుందో, అదే రీతిలో మానవుని నైతికత కూడా వయస్సు పెరిగేకొద్దీ అభివృద్ధి చెందుతుంది.

పుట్టిన బిడ్డ రెండవ సంవత్సరం మొదట్లో ............ కనబడుతుంది. ? ఆ చంటిబిడ్డలో జరుగుతున్న ఒక ప్రత్యేకమైన అలజడి కారణముగా ఇది ఉత్పత్తి అవుతున్నది.

ఫ్రూడ్ తన విశ్లేషణలో చంటిబిడ్డ యొక్క నైతిక తర్కము ఏ విధముగా మొదలయి అభివృద్ధి అవుతున్నదో తెలియజేసెను. చంటిబిడ్డ యొక్క స్వభావము పరిపూర్ణమైన ప్రశాంతతను అనుభవించడం. అయితే ఈ ప్రశాంతతకు తరచు భంగం వాటిల్లుతుంది. ఈ కారణముచే చంటిబిడ్డ బిగ్గరగా ఏడుస్తాడు, అనగా తనకు ఏదో అనర్థము జరిగిందని ఆ బిడ్డకు తెలుస్తుంది.

మానవుడు భౌతికమైన దృశ్య ప్రపంచము నుండి శాశ్వతమైన ప్రశాంతతను ఆశిస్తాడు. ఈ నేపథ్యములోనే చంటిబిడ్డ తన తల్లి ఒడిలో ఈ ప్రశాంతతను అనుభవించడానికి అలవాటుపడుతుంది.

ప్రశాంతతకు భంగము కలుగగానే చంటిబిడ్డ కెవ్వున అరుస్తుంది. మొదట్లో ఆ బిడ్డకు తన పర బేధములు లేవు. తన ప్రశాంతతకు భంగము కలిగించిన వాటిపై ప్రతిఘటనకు పూనుకుంటుంది. బాహ్యామైన వస్తువుల పట్ల ఇష్టాయిష్టాలను ప్రకటిస్తుంది తన చిన్నారి చేష్టలతో. మెల్లిగా తన పర బేధములు ఈ బిడ్డలో మొదలవుతాయి. అప్పుడు మెల్లిగా తన చెడును ఇతరులపై ప్రదర్శిస్తుంది. తన వారెవరో, పరాయివారెవరో బిడ్డ గుర్తించడం మొదలెడుతుంది. ఇదే సమయములో బిడ్డ చేష్టలకు ఏది మంచో ఏది చెడో తెలియజేయడానికి ప్రయత్నం మొదలౌతుంది.

బిడ్డ చంటిపాపగా పెరిగే కొద్దీ తన, పర బేధములను గుర్తిస్తుంది. ఆ చంటిబిడ్డకు తల్లిగానీ, తల్లిస్థానంలో ఉన్నవారు కానీ అలవాటుపడతారు. వారే తన సర్వస్వం అనుకుంటుంది. బిడ్డ పెరిగేకొద్దీ తల్లి తరువాత తండ్రికి

అలవాటుపడుతుంది. వీరే ఆ పాపకు సర్వం. పాప తృప్తికి, క్షేమానికి, శాంతికి వీరే కారణం. అయితే బిడ్డకు తల్లి స్థానం చాలా ప్రత్యేకము. భౌతికమైన దృశ్యాలను తల్లి తనబిడ్డకు ఏ విధముగా తెలియజేస్తుందో, అదే విధముగా ఆ బిడ్డలో స్పందనలు వృద్ధిచెందుతాయి.

చంటిబిడ్డలో ఈ స్పందనలకు భంగము కలుగగానే ద్వేషము, కోపము మొదలైన విధ్వంసకర కోరికలు ఈ బిడ్డలో మొదలవుతాయి. ఈ ప్రతిఘటన మంత్రమును బయట పెట్టడానికి ఈ బిడ్డకు నేర్పుతారు.

చంటిబిడ్డగానే పోరాటము మొదలవుతున్నది. ఒకే వస్తువు యొక్క ద్వంద్వ వైఖరిని ఈ బిడ్డపై ప్రయోగించడం జరుగుతుంది. బాల్యములో, చేతకానితనము వల్లనూ, అధిక కాలగమనము వలననూ బిడ్డకు తనను ప్రేమించే వారిపైననే మక్కువ లోపించుచుండును. ఇదే స్థితి ఆ బిడ్డలో చాలాకాలము ముద్రపడిపోతుంది. ఈ ప్రవర్తనకు కారణము తల్లిదండ్రులే. పిల్లల ఆలోచనలకు తల్లిదండ్రులే మూలకారణం.

తల్లిదండ్రులు తమ పిల్లలను నియంత్రించవలెను. అయితే వారు తమపిల్లలను మరి కఠినంగాను, క్రూరంగాను పెంచరాదు. వారి కాఠిన్యము వలన పిల్లలలోని ఉత్సాహానికి భంగము ఏర్పడును. ఈ భాషా బేధము కారణముగా ఈ బిడ్డ తన అసలు తండ్రి స్థానములో మరొకరిని ఊహించుకొనును. ఈ నేపథ్యంలోనే ఈ బిడ్డలో నీచమైన, క్రూరమైన ఆలోచనలు బయల్దేరుతాయి. స్పృహలోను, స్పృహలేని స్థితిలోనూ ఇవే ఆలోచనలు ఈ బిడ్డలో కొనసాగడం వల్ల అతనికి ఒక శాపమై తీరుతుంది.

బిడ్డలోని పోరాటమును ప్రేమతో జయించాలి. బిడ్డయొక్క చెడు వర్తనము, తన తల్లిదండ్రుల ప్రేమలో మరచిపోవలెను. కోపము, ద్వేషము మొదలైనవి వీరు ప్రదర్శించినప్పటికీ అవి క్రమేపీ, స్పృహతో వీటిని

తగ్గించుకుంటారు. మరుగునపడిన చెడు మళ్ళీ అప్పుడప్పుడు బయట పడుతుంది. అనగా వీరికి తెలియకుండా వీరిలో ఈ చెడులక్షణాలు అణగి ఉంటాయి. అవి అందరి సమక్షములోనో, దాపరికము గానో బయట పడుతూ ఉంటాయి.

చిన్నపిల్లలలో అహంకారము మొదలవుతుంది. వారు తమకు అనుగుణముగా నైతిక ప్రక్రియను రూపొందించుకుంటారు అని జూలియన్ హక్స్‌లే విశ్లేషించెను. బిడ్డ పరిసరముల దృష్ట్యా ఈ ప్రత్యేకమైన నైతిక ప్రక్రియకు ఆ చంటిబిడ్డ అలవాటు పడుతుంది. మనిషి యొక్క వివిధ మానసిక రీతులననుసరించి మానవుడు అనేకరకమైన ఒత్తిడులకు గురి అగుచున్నాడు. ఈ విధమైన ఒత్తిడులు జంతువులలో కానరావు. పెద్దవారు తమ సమస్యలను, ఒత్తిడులను తమ తమ అనుభవజ్ఞానములతో ఎదుర్కొందురు. కానీ చంటిబిడ్డలకు ఈ అనుభవ జ్ఞానము ఉండదు. అందుకే ప్రతిచర్యకు వారు సిద్ధపడతారు. ప్రస్తుతము ఉన్న ఒత్తిడి, మరో కొత్త ఒత్తిడికి అడుగున పడుతుంది. ఈ ప్రతిచర్య మూడు విధాలుగా బయటపడుతుంది. అవి కండరాల స్థాయిలో, ప్రతికారచర్యగా, సహజ స్థాయిలోను, జంతువులలో కూడా ఈ విధంగానే ప్రతిచర్య వ్యక్తమగును. అయితే అణచివేత కారణముచే పిల్లలలో ఈ ప్రవర్తన ప్రస్ఫుటంగా వ్యక్తమగును.

అయితే పిల్లలలో ఈ నమూనా, నైతిక ప్రక్రియలో భాగముగా ఆలోచించకుండా ముందు ప్రతిచర్యకు పాల్గొంటారు. ఈ నేపథ్యంలో వారు వివేకము కోల్పోయి ఒక చర్యకు బదులు వేరొక చర్యకు దిగుతారు. దీనివల్ల తప్పుచేస్తామనే భావన వీరిలో పెరుగుతూ ఉంటుంది. ఈ విధముగా వీరు తమ లోటును వీరు పూర్తిగా కానీ లేదా పాక్షికముగా గ్రహించగలరు. తమలోని నైతిక ప్రక్రియ ఆధారముగా వీరిలోని చెడు క్రమముగా

నశించును. అయితే ఏ బాలుడిలో ఎంతవరకు మారుతుంది అన్నది అతని నైజమును బట్టి మరియు అతని తల్లితో అతనికి ఉన్న సంబంధాన్ని బట్టి ఉంటుంది.

ప్రతి పిల్లవాడు క్రమేపీ తన నైతిక ప్రక్రియను వంశపారంపర్య రీతిలో అన్నట్లుగా అభివృద్ధి చేసుకుంటాడు. తన తల్లి ఆదేశానుసారము ఈ నైతిక ప్రక్రియ అభివృద్ధి అవుతుంది. ప్రాథమికస్థాయిలోనే బిడ్డయొక్క స్పందనలపై తల్లిదండ్రుల ప్రభావము ఉంటుంది. అయితే ఈ ప్రభావము ఈ పిల్లలకు రుచించకపోవచ్చు. వారు ఊహించిన ఊహాలోకానికి వ్యతిరేకముగా ఉండవచ్చు. ఇట్టి వైరుధ్య కారణముచే పిల్లలలో నైతిక ప్రక్రియ మొదలవుతుంది. చిన్న వయస్సులో ప్రేమతో వీరు ద్వేషమును జయించగలుగుతారు. ఈ విధముగా వారి నైతిక ప్రక్రియలో ఏదిమంచో, ఏది చెడో అన్నది తమ ఆలోచనలకు, క్రియలకు వర్తించుకోవడం మొదలు పెడతారు.

అయితే చిన్నపిల్లలు అనేకమైన చెడు, హింసాత్మక చర్యలకు తొందరగా స్పందిస్తారు. పిల్లలయొక్క అమాయకత్వము కారణముగానే వీరినుండి చెడు భావములను తొలగించటం కష్టమగుచున్నది. ఈ నేపథ్యములో ఈ పిల్లలు పెరిగి పెద్దవారై ఎన్నిరకాల నైతిక ఒత్తిడులకు గురి అవుతారో మనము ఊహించు కోవలసినదే.

మరొక అసహ్యమైన అలవాటు పిల్లలలో ఉంటున్నది. అదే, వారు అనుకున్నది తమకు జరిగి తీరాలని పట్టుబడతారు. వారు అమాయకులు. సరి అయిన  అవగాహన ఉండదు. అట్టి అవగాహన లేని స్థితిలో తమ కోరికలన్నీ జరిగిపోవా లనుకుంటారు. అందులో తప్పేమీ లేదని అనుకుంటారు. ఆ విధముగా అనుకుని తమ తల్లిదండ్రులపై, తమ కోర్కెలు

తీర్చలేదని కోపము, ద్వేషము ప్రకటిస్తారు. మెల్లిగా కోపము తగ్గుతుంది. తమ తల్లిదండ్రులను బాధించామన్న భావనకు లోనవుతారు. ఏదో పోగొట్టుకున్న బాధ మొదలవుతుంది. వీరిలో ఏదో కోల్పోయామన్న భావన జీవితాంతం ఉండిపోతుంది. దీనికి సాయం పిల్లలకు దూరంగా తల్లి దండ్రులు కూడా తాము ఏది కోరుకుంటే అది జరగాలన్న భావనలో జీవిస్తారు.

పుట్టిన ప్రతి శిశువుకు, సహజముగా అంతులేని కోరికలు ఉంటాయి. అయితే ఆ శిశువు పెరిగేకొద్దీ, తన కోరికలలో కొన్ని మాత్రమే నెరవేరునని గుర్తిస్తాడు. చిన్నపిల్లలుగా ఉన్నప్పుడు వారికి అనుభవము, అవగాహన ఉండదు. అయితే ఎప్పుడో ఒకప్పుడు నిజాన్ని గ్రహించక తప్పదు. తన బాహ్య పరిస్థితులకు అనుగుణముగా మారక తప్పదు. అప్పుడు ఆ శిశు వుకు అనుభవ జ్ఞానము కలుగుతుంది. ప్రతి శిశువు అంతర్, బహిర్ ముఖముగా ఒత్తిడులను ఎదుర్కొంటూనే ఉంటాడు. అయితే వీటిని చక్కని ఆలోచనలతోను, మంచి ప్రవర్తనలతోనూ పరిష్కరించుకుంటాడు.

శిశువు యొక్క మనస్సు ఒత్తిడుల కారణముగా తీవ్ర అలజడికి గురి అవుతూ ఉంటుంది. అయితే వీరు అభివృద్ధి చేసుకున్న నమూనా నైతిక ప్రక్రియ ప్రభావము వీరిలో చాలాకాలం ప్రభావం చూపుతూ ఉంటుంది.

మన చిన్ననాటి ఈ అనుభవాలు మనకు గుర్తుండవు. అయితే మానసిక శాస్త్రవేత్తలు ఈ విషయాలను రాబట్టగలరు. హిప్నోసిస్ ద్వారా పిల్లల చిన్నప్పటి విషయాలనే కాక గతజన్మ స్మృతులను కూడా మనస్తత్వ వేత్తలు రాబట్టగలుగుతున్నారు. చిన్నప్పటి నైతికస్థితి, మానసిక స్థితి, ఆధ్యాత్మిక స్థితులను వీరు తెలుసుకో గలుగుతున్నారు. ఈ నైతిక ప్రక్రియ అనునది ప్రతిమానవుని బుద్ధి అనుసారము జరిగే వివేక విచక్షణాల సమాహారము.

కాబట్టి బాల్యంలో చేసిన తప్పులు ప్రతి ఒక్కరూ కొంత భారముతోనే అనుభవిస్తూ ఉంటారు. దీనికి కారణము వీరు తమ కోరికలను చిన్ననాటనే అణుచుకోవడం వల్ల. ఆ విధంగా అణిగి ఉన్న కోరికలు, తప్పులు అని గ్రహించినప్పటికీ, అవి అప్పుడప్పుడు ఏదో రూపములో వ్యక్తమవుతాయి. ఆ విధముగా తనలో జనిస్తున్న ఉద్రిక్తతను తగ్గించుకోవడం జరుగుతుంది. మరో విధముగా మన చుట్టూ ఉన్న పరిస్థితుల కారణముగా మనలో ఉద్రిక్త స్థితికి గురి అవుతాము. మన చేతకాని తనానికి మన అహం బాగా ఇబ్బందిపడుతుంది. మనము ఆశించిన ఫలితాలను రాబట్టలేనప్పుడు మనకు ఈ పరిస్థితి ఎదురవుతుంది.

మనలో మనకు తెలియకుండానే మన చేతకానితనం కారణంగా మన అహం అణగగొట్టబడి ఉన్నది. అయితే మన స్పృహతో కూడిన మన చేతకానితనం వల్ల, మనలో దాగియున్న అహం మరింత బలం పుంజు కుంటుంది. అయితే ఈ ఉద్రిక్తత సానుకూల పరిస్థితులలో తగ్గుముఖం పట్టును. అలాగాక ఏకాంత సమయాలలోను, ఏ కార్యములోనయినా విఫలము పొందినప్పుడు నిరాశ చెందినపుడు మళ్ళీ ఈ ఉద్రిక్తత పెరుగును.

ఒకసారి నైతిక ప్రక్రియ ఒక శిశువులో అభివృద్ధి అయినప్పుడు, ఇక అప్పటి నుండీ తన వివేక విచక్షణలతో ముందుకు సాగుతుంది. తాను చేసిన చెడుపనుల భారమును అనుభవిస్తుంది, మంచిపనుల హాయిని అనుభవిస్తుంది. పెరిగేకొద్దీ ఈ నైతిక ప్రక్రియ ఉత్తమగతిని చేరుకోవాలి. తన సూక్ష్మ ప్రపంచము తనకొక నైతిక ప్రక్రియను ఒసగినది. ఈ నైతిక ప్రక్రియకు ధార్మికమును, ఆధ్యాత్మికమును తాను జోడించుకున్నాడు.

ఈ విధముగా మానవుడు నిరంతరము ఒక సత్యాన్వేషిగా జీవిస్తున్నాడు. మానవుడు మంచి గుణములతో నైతిక జీవనానికి అలవాటుపడాలి. అంతే కానీ అసహజత్వమునకు దూరముగా అనైతికముగా జీవించరాదు. మనలోని తప్పులను మనము గుర్తించడం అన్నది, మన నైతికతకు విలువను ఆపాదించడం లాంటిది.

# 14. నైతిక జీవి

పుట్టిన ఏ వ్యక్తి తన కుటుంబానికే పరిమితంకాదు. అలా పరిమితమైతే అది ఒక కల్పనగాథ అవుతుంది. మానవుడు పుట్టాక తనచుట్టూ ఉన్న వారందరితోను సంబంధ బాంధవ్యాలు ఏర్పరచుకుని వారితో కలసిమెలసి జీవిస్తాడు. జాతీయత, కులము, మతము, భాష, సంస్కృతి మొదలైన రంగాలతో అతను ముడి పెట్టుకుంటాడు. తను జన్మించిన వర్గమునకు అతను గుర్తింపు కలిగి ఉంటాడు.

మానవుడు కేవలం ఒక వ్యక్తికాదు. మానవుడు ఎవరో తెలుసు కోవాలంటె, మనము అతనిని ఏకాంతముగా పరిగణించరాదు. మానవుడు సంఘజీవి. కాబట్టి మానవుడు సత్యము. మానవుడు తనను తాను గుర్తించుకున్న విధమున, సంఘంలో కూడా తనగుర్తింపును కొనసాగిస్తాడు. మానవుడు ఏకాంతంగా మనగలడమన్నది ఒక మాయ. ఏ మానవుడైనా ఏకాంతంగా మోక్షము సాధించడమనేది మానవత్వానికే సిగ్గుచేటు.

అనుభవముతో కూడిన వ్యక్తి సత్కర్మలతో సత్యాన్ని గ్రహించి శాంతిని అనుభవిస్తాడు. అతను జనజీవన సరళిలో ఒక భాగము. సమాజమున నెలకొని ఉన్న చెడు అతనిపై ప్రభావము చూపదు. అతను భౌతిక దృష్టి లేక ఆంతరంగిక దృష్టి కలవాడు. అతను అనేకత్వంలో ఏకత్వాన్ని దర్శిస్తాడు. అందరిలో ఉన్న, అన్నింటినీ సంఘటిత పరుస్తున్న దైవశక్తిని గుర్తిస్తాడు. అతనికి దేశమంటే అభిమానము హెచ్చు. దేశ క్షేమం కోరి అతను తన జీవితమును కూడా పణంగా పెట్టగలడు.

చావుకంటె బలమైనది ప్రేమ, ద్వేషమని అందరికీ తెలుసు. ప్రేమ కోసం ద్వేషిస్తారు. ప్రేమకు చావంటే భయంలేదు. మనస్సు భౌతికమైనది, అంతరంగికమైనది. అందరి హృదయాలలో చోటు సంపాదిస్తుంది.

మాటతో శాసిస్తూ, ఆచరణతో దానిని సాధిస్తుంది. దేశభక్తితో, వినయ విధేయలతో ప్రజలకు అందుబాటులో ఉంటూ తృప్తిగా, సుఖంగా జీవించాలి.

సంఘము ఒక దివ్యమైన క్షేత్రము, పవిత్రమైన క్షేత్రము. సంఘజీవు లందరూ ఇట్టి పవిత్రతను అనుభవించాలి. ప్రతి మానవుడు సంఘములో సహజీవనము సాగిస్తూ సాటి మనిషిని ప్రేమించాలి.

న్యాయబద్ధమైన జీవనానికి ప్రతిమానవుడు అలవాటు పడాలి. అప్పుడు నైతిక జీవనము సులభమవుతుంది. నిరంకుశత్వమును, వ్యక్తిగత ప్రాబల్యమును సంఘము ఎప్పుడు నిరసించును. సత్యమును మాత్రమే సంఘము అనుసరించును. ప్రజలే సమాజమునకు వెన్నెముక. సంఘములో ఉన్నవారంతా తమతమ బాధ్యతలను, హక్కులను గుర్తెరిగి మసలవలెను. అట్లు కానిచో హక్కులు కోల్పోయి, నిరంకుశత్వము నకు అవకాశమిచ్చిన వారగుదురు.

సమాజములోని సభ్యులందరూ మంచి వారైనప్పుడు ఆ సమాజము మంచిదని గుర్తింపు పొందుతుంది. చెడు వర్తనముతో చెడు సమాజము లేర్పడతాయి. సంఘము నందు వ్యక్తిగత జీవనము, సాంఘిక జీవనము, రాజకీయ సంస్థలు మొదలైనవి అన్నిటిలో కూడినది. అందరూ కలిసే జీవనము సాగించాలి. అందరూ కలిసే కష్టసుఖాలను అనుభవించాలి. వ్యక్తిగతమైన సదాచారముతో కూడిన జీవనానికి సంఘము ఎంతో విలువనిస్తుంది. అందరి యోగ క్షేమాల కోసం ఆశిస్తుంది. పాటుపడుతుంది ఈ సంఘజీవనము.

మానవుడు ఒక పవిత్రమైన జీవి, కేవలం జంతువు కాదు. మానవుడు సదాచారములో తనను తాను తెలుసుకుంటాడు. భౌతికమైన జీవనముతో మానవుని పరిపూర్ణత్వమును గ్రహించలేము. మానవుడు స్వేచ్ఛాజీవి. తన

ఇష్టానుసారము జీవించవచ్చు. అయితే మానవుడు తన భౌతిక అవసరాలను తీర్చుకోవడానికే బ్రతకడం లేదు. తన జీవన పరమావధిని గుర్తిస్తున్నాడు. భౌతికమైన జీవనము నిస్సారవంతమైనది. ఇహపరాలతో కూడిన జీవన విధానమునకు అలవాటు పడి, తన జన్మను సార్థకం చేసుకుంటాడు.

ఇక్కడ ఒక ప్రశ్న ఉదయిస్తుంది. ఏది తప్పు? ఏది ఒప్పు? ఎలా ఈ విషయాన్ని తెలుసుకోవడం. నీతిశాస్త్రం నుండి సమాధానము గ్రహించవచ్చు. తత్త్వవేత్తలు తత్వమును అర్థం చేసుకుని మనకు సత్యమును అందించారు. సంఘంలో ఉన్న నీతిని, మంచిని బోధించేదే ఈ నీతిశాస్త్రము. వీటిని మానవులు గ్రహించాలి, అంతేకానీ వీరు కొత్తగా నీతిశాస్త్రములను రూపొందించరాదు. నైతికత అన్నది యావత్ప్రపంచమును నీతివంతముగా మార్చివేయడం లేదు. కానీ సంఘము లోని మంచిచెడులు ఏ స్థాయిలో ఉన్నదీ నిర్ణయిస్తున్నది. మన అంతరాత్మ మాత్రమే మనలో ఏది మంచో, ఏది చెడో నిర్ణయిస్తుంది.

ఏది మంచో, ఏది చెడో అన్నది ఒక న్యాయ నిర్ణయము ఆధారముగా గాని, అంతరాత్మ ప్రబోధముగా గానీ తెలుసుకోవచ్చును. న్యాయమైన తీర్పులో అన్నీ వివరింప సాధ్యముకాదు. న్యాయము కొన్ని కోణాలలో పరిశీలింపవీలగును. న్యాయ నిర్ణయము మరియు అంతరాత్మ ప్రబోధముతో మంచిచెడుల నిర్ణయము జరగాలి.

న్యాయ నిర్ణయమనునది క్షణములోనో, కొన్ని కారణముల ఆధారముతోనో జరుగునది కాదు. అయితే ఈ నిర్ణయాలు ఏకాంతముగా తీసుకున్న అభిప్రాయాలు కావు. న్యాయ నిర్ణయము, న్యాయ శాస్త్రమును ఆధారము చేసుకుని ఉంటుంది. అయితే మనము అనేక ప్రదేశాలలో న్యాయ నిర్ణయాలలో మార్పులు గమనిస్తూ ఉంటాము. కొన్ని సందర్భాలలో ప్రదేశము ఒక్కటయినప్పటికీ నిర్ణయాలు మాత్రం అనేకంగా ఉంటూ

ఉంటాయి. దీనికి కారణాలు మనకు తెలుసు. ప్రతి న్యాయ నిర్ణయంలోనూ అంతరాత్మ ప్రబోధంతో న్యాయ నిర్ణయము జరగడమే ఈ వ్యత్యాసాలకు కారణము. భౌతిక దృష్టితో కాక అంతరాత్మ ప్రబోధతో చేసిన న్యాయ నిర్ణయములే గొప్ప నిర్ణయాలుగా మిగిలిపోతాయి.

నీష్ మహాశయుడు, భౌతిక దృష్టికి పరిమితమైన న్యాయ నిర్ణయము విలువను సంతరించుకోదు అని శలవిచ్చెను. న్యాయ నిర్ణయము కేవలము వివేక విచక్షణలతో కూడినది. సత్యమేదో, అసత్యమేదో గ్రహించలేని స్థితిలో మానవుడు ఉంటున్నాడు. గోచరము అగోచరము యొక్క సత్యము వ్యక్త మవుతున్నది. ఈ కారణముచే మత సిద్ధాంతము, నైతిక సిద్ధాంతములలో స్పష్టత ఏర్పడటం లేదు. అయితే ఈ సిద్ధాంతాలలో మన అంతర్దర్శనం మరియు సంస్కృతి వ్యక్తమగుచున్నది. ఈ సమాచారము మనకు అమూల్య మైనది కాబట్టి నైతికత అనునది మనకు ఒక భాషగాను, కొలబద్దగానూ ఉపయోగపడుతున్నది. ఎవరయితే పరిపూర్ణంగా ఈ నైతిక సిద్ధాంతాన్ని గ్రహిస్తారో వారు మాత్రమే తప్పక లబ్ది పొందుతున్నారు.

అసలు మానవుని అభివృద్ధి కాంక్షతోనే ఈ నైతిక సిద్ధాంతాలు ఏర్పడినవి. మానవులు జంతువులను వశము చేసుకుని, ఉపయోగపడే రీతిలో వాటిని మలచు కోవటం, క్రూరమైన జంతువులను బంధించి ఆ జంతువులను భయంతోను, బాధ తోను, గాయములతోను, ఆకలితోనూ బలహీనపరుచుచున్నారు. ఆ తరువాత వాటిని లొంగదీసుకుని అవి మనకు ఉపయోగపడేలా శిక్షణ ఇస్తున్నాడు. ఈ శిక్షణ పొందిన జంతువులు మనకు ఏ మాత్రం హాని కూడా చేయవు. ఇదే రీతిలో నైతిక శిక్షణ పేరుతో మానవునిలో జంతులక్షణాలను నియంత్రించి మానవతా విలువలను పెంచుకుని మంచిమనిషిగా జీవించేందుకు ఈ నైతిక విలువలు తోడ్పడుతాయి.

అసలు మానవుడు ఏది మంచో గ్రహించవలెనన్న, అతను ముందుగా తాను జీవిస్తున్న సంఘం గురించి సరి అయిన అవగాహన కలిగి ఉండ వలెను. సంఘ నీతితో మంచిచెడులను మానవుడు గ్రహిస్తున్నాడు. అయితే దీనికి సాయం అంతరాత్మ ప్రబోధముగా ఏది మంచో ఏది చెడో మానవుడు నిర్ణయించుకోగలడు.

ఒక వస్తువుకు అనేక కోణాలున్నట్లుగానే ఒక కర్మకు కూడా అనేకమైన కోణాలు ఉంటున్నవి. ఈ కారణముచే, చేసే కర్మకు ఎన్నో లక్షణాలుంటున్నవి. అన్ని లక్షణాలను, అన్ని కోణాలలోనూ పరిశీలిస్తే మనకు ఏదిమంచో, ఏది చెడో తేలికగా అర్థమవుతుంది.

మనమాచరించే ప్రతికర్మకు ఏదో ఒక కోణమునుండి సమర్థత ఉంటున్నది. అవిచెడ్డ కర్మలయినప్పటికీ, ఉదాహరణకు దొంగతనము, బంధుత్వము కోసం తాపత్రయపడుట, చెడు సంస్థలను సమర్థించుట మొదలైనవి. అంతేకాదు, కర్తవ్య నిర్వహణలో వివేకముతో వర్తించినప్పటికీ అది పిరికితనముగా అనుకోవడం, ధైర్యం, నిర్లక్ష్యం మొదలయినవి ఇటువంటి అనేక కర్మలను అనేక కోణాలతో చూసినప్పుడు, ఏ కోణంలో చూస్తే మంచో, ఏ కోణంలో చూస్తే చెడు వ్యక్తమవుతుందో అన్నది వ్యక్తిగత నిర్ణయముపై ఆధారపడియున్నది. దొంగతనం ఆకలిబాధకు తట్టుకోలేక చేసానంటాడు. దొంగతనమన్నది ఎవరూ చేయకూడదు. ఆకలి బాధకు తట్టుకోలేక దొంగతనం తప్పని తెలిసి కూడా చేస్తాడు.

అయితే సామాన్యమైన నైతిక తీర్పును అన్ని కోణాలలోనూ విమర్శించడం జరగదు. కేవలం ఒకే కోణమును ఆధారము చేసుకుని ఉంటుంది. ఏ విషయమునకు సంబంధించి పరిశీలింపబడుతుందో, ఆ కోణమును మాత్రమే పరిశీలించబడును. మిగతా కోణాలతో విషయ పరిశీలన జరుగదు.

సత్కర్మాచరణ వల్ల ఏకాంతదృష్టి అలవడుతుంది. మానవుని దృష్టి మరల్చుడానికి విభిన్న కోణాలతో విషయమును పరిగ్రహించడం జరుగుతున్నది. ద్వంద్వవైఖరివల్ల విషయమును మరో రకముగా అర్థము చేసుకోవడం జరుగుతుంది.

ప్రకృతికి, భౌతిక పదార్థమునకు, జరిగిన సంఘటనలకు మధ్య సంబంధము కలిగి ఉండుట మనమెఱుగుదుము. మనము ఈ విశ్వములో ఒక భాగమే తప్ప వేరుకాదు. అందుకే ప్రకృతి శక్తులకు అతీతులుగా కాక లోబడి ఉంటున్నాము.

# 15. మతం, మానవత్వం

నైతిక విలువల యందు కొన్ని లోటుపాట్లు ఉండవచ్చును. ఆ లోటుపాట్లను మతము పేరుతో సరిదిద్దుకోవలెను. ఈ నేపథ్యములో మతము అవసరమైయున్నది.

వివిధ మత ప్రవచనాలలో మార్పులు వ్యక్తమగును. మత విషయముల పట్ల శ్రద్ధ చూపినపుడు, ఎవరికివారు తమ మత ప్రబోధలపై శ్రద్ధను వ్యక్తము చేయుదురు. ఇదే మత ఛాందసము. మతము అనునది అందరికీ మంచిని, ఆనందమును అందించును.

సత్కర్మాచరణ మతమునకు ఆపాదించబడినది. ప్రతి ఒక్కరూ సత్కర్మాచరణకు మరియు మతమునకు ఉన్న సన్నిహిత సంబంధమును గ్రహిస్తారు. మతము పేరు చెప్పుకుని బ్రతుకుతూ చెడుకర్మలకు అలవాటు పడినవాడు మోసగాడే. మత విషయములు తెలుసుకున్నంతలో సాఫల్యత ఉండదు, వాటిని ఆచరించుటలో సాఫల్యత ఉంటుంది. సత్కర్మాచరణే జ్ఞానం. ఈ జ్ఞానమే సాక్షాత్కారానికి దారితీస్తుంది.

సత్కర్మలు మతముకాదు. సత్కర్మాచరణే తన జీవితము. సత్కర్మా చరణలోనే తన ఉనికి. ఉన్నదంతా తనలోనే ఉంది. భౌతిక ప్రపంచమంతా పాక్షికమే. మనము, బయటి ప్రపంచము నైతికమునే నమ్ముకుని జీవించాలి. అదే మన సర్వస్వము. నైతికత అనునది మన లక్ష్యమును సూచించును, కానీ మన అనుభవమునకు గమ్యములేదు. నైతికత అనునది భావముల సమాహారము.

మతమనునది సత్కర్మాచరణ కన్నా మిన్న. మతపరముగా ఒక వస్తువును వస్తువుగా చూస్తాము. ఆ వస్తువు మనము కాదు, వేరుగా

ఉంది. ఆ వస్తువు నిజముగానే గోచరించును. ఈ విశ్వమున నిజము కానిదేదీ వస్తువుగా పరిగణింప బడదు. మానవుడు కూడా అశాశ్వతమే. ఈ కారణముచే కేవలం నైతికత అనునది మతపరముగా సరిపోదు.

మతమునకు ఒక వస్తువు కావాలి. ఆ వస్తువు గుణాతీతమైనది, అనంతమైనది, మనస్సునకు గ్రాహ్యము కానిది. అది నిరాకారమైనది, అనగా వస్తువుగా గానీ మనిషిగా గానీ ఉండనిది. అది ఎల్లవేళలా సంపూర్ణముగానే మనునది. అదే దివ్యత్వము.

దివ్యత్వం సత్యమైనది. దీనినే గ్రహించవలెను, అనుభవించవలెను. అందులోనే మనవలెను. నాలో ఉన్న భగవంతుడే సత్యము. అన్ని వస్తువుల లోనూ ఈ దివ్య పదార్థము ఉన్నది. ఆ ఎఱుకే సత్యము. దానినే అందరూ గ్రహించవలెను. అయితే ఏకత్వంలో అనేకత్వంను గ్రహించడం వల్ల, అనేక వస్తువులుగా మానవులు భ్రమపడుతున్నారు. ఉన్నది ఒకే సత్యము. అది అనేక రీతులలో గ్రహింపబడుతున్నది.

నేను నేనే. అహంబ్రహ్మాస్మి. అనగా మతపరముగా మన ఇచ్ఛకు మనలోని దివ్యత్వమునకు సంబంధము ఉన్నది. మన స్థితి మనకు అగోచరముగా ఉన్నది. ఆ దివ్యత్వముతో మనము వేరుగా భావించుకుని, మనము ఇది, మనము అది అని ఊహించుకుంటున్నాం. అలాకాక, ఆ దివ్యత్వముతో మనము విలీనమై సత్యమును గ్రహించవలెను.

మతమునకు నమ్మకము ప్రధానము. దేనినైతే మనము సత్యముగా గ్రహిస్తామో, దానిపై సంపూర్ణమైన నమ్మకం ఉండవలెను. అది మనకంటె వేరుకాదని గుర్తించవలెను. అదే మన గమ్యము, ఆదర్శము, కోరిక. మన అభిప్రాయం ఈ సత్యముతో ఏకీభవించవలెను. ఉన్నది ఒక్కటే సత్యము, అది అనేకముగా వ్యక్తమగుచున్నది. కారణము, తనను తానే ప్రేమించు కోవడానికి, తనను తెలుసుకోవడానికి.

సత్యమును గ్రహించడానికి నమ్మకమే ప్రధానం. భౌతికముగా ఈ సత్యము అనేకముగా వ్యక్తమగును. అంతరంగమున మానవత్వము దివ్యత్వమున ఇమిడిపోవును. నమ్మకమే ప్రధానము. ఎవరయితే ఈ దివ్య చైతన్యమును అనుభవిస్తుంటారో, వారు ఈ దివ్య చైతన్యములోనే జీవిస్తారు. అంతా భగవంతుని దయ. ఆయన అనుగ్రహమే. ఆయన సంకల్పమే.

ఆధ్యాత్మికములోనే నైతికము ఇమిడి ఉంటున్నది. మతము ఆచరణతో కూడినది. సత్కర్మాచరణే మానవుని కర్తవ్యమై ఉన్నది. అన్ని సత్కర్మలు మత పరమైనవే. కాబట్టి అన్ని మతాచారాలు నైతికమైనవే. మానవ మనుగడకే మతము అవసరము. ఈ ప్రపంచమున మానవునికి దిశ, గమ్యమును చూపించునవే మతము. ఈ విశ్వమునకు మతము నుండి వేరుచేసిన ఇంక చేయడానికి ఏమీ మిగలదు.

మతము అన్ని రంగములలోను ఇమిడి ఉంటున్నది. అవి శాస్త్ర సాంకేతికము నందు, సాంస్కృతిక కార్యక్రమాలందు, కళలయందు, సాంఘిక జీవనము మొదలైనవి. ఇందలి కర్మలన్నియు నైతికములే. మతము మతమునకు మధ్య సామరస్యము కోల్పోయిన పరిస్థితులలో, నైతికము గానూ బేధ భావములు పొడచూపును. కానీ మతమునకు నైతికతకు మధ్య బేధములు ఉండవు.

భగవత్ సాక్షాత్కార నిమిత్తమై జరిగే సాధన మతములో ఇమిడి ఉంటున్నది. మతం రుచిలేకుండా నైతికత నిలబడదు. నైతికతతో మతము నందు పురోగమనము ఉంటుంది. మతముమీద నమ్మకము ఏర్పడుతుంది. అనుభవజ్ఞానముతో ఏర్పడేదే మతమునకు సంబంధించిన పురోగతి. ఎక్కడైతే సాక్షాత్కారము కానరాదో అక్కడ నమ్మకము, మతము కనబడవు. మతముతో నైతిక ప్రవర్తన భగవంతునిలో ఇమిడి ఉంటుంది.

సంఘము యొక్క పరిస్థితి, మత నమ్మకముల మీద ఆచారముల మీద ఆధారపడి ఉండును. సంఘము యొక్క సంఘటిత ప్రభావము దేశములోని మతాచారముల కొక్క పెద్ద పరీక్ష. మానవతా విలువలతో, మానవత్వముతో అందరూ కలసి మెలసి సహజీవనము సాగించుటకు మతాచారములు, సత్కర్మాచరణా చాలా అవశ్యము.

అహము నాశనము చేసుకోకుండా భగవంతుని సాధన ముందుకు సాగదు. అహంకారము వల్ల ఎన్నో అనైతిక పనులు చేయుటకు అలవాటు పడుదురు. ముందు వీరు భగవంతుని తృప్తి పరచడానికి సాధన మొదలు పెడతారు. ఆ తరువాత తమ కోరికలు నెరవేర్చుకోవాలనుకుంటారు. ఆ తరువాత మంత్రతంత్రాలపై శ్రద్ధతో జంతు బలులనిచ్చుట, మరియు తనలోని అహంకారమును పెంచుకొనుట జరుగు చున్నది. రెండవ రకము దేవుని పేరు చెప్పుకుని పేరు ప్రతిష్టల కోసం, ధనం కోసం, అధికారం కోసం ప్రాకులాడుట. వీరు దేవునిపేరు చెప్పుకుని అసహ్యామైన కర్మలు చేయుదురు. మూడవరకం సిద్ధులకోసం తంత్రవిద్యల యందు శ్రద్ధ చూపువారు.

బలులు, మంత్రోచ్చారణలు బాహ్యాదృష్టితో చేసినప్పుడు వాటి ఫలితముగా సిద్ధులు కలుగునన్నది నిజము. ఎవరయితే ఉద్రేక పూరితముగా ఈ తాంత్రికవిద్యలు జరుపుతారో వాటికి తాంత్రిక ఫలితాలను పొందుతారు. వీరు తమకు తోచిన తాంత్రికవిద్యలను ప్రయత్నపూర్వకముగా సాధిస్తారు. మరికొందరు అధికారం కోసం తాపత్రయపడతారు. మరికొందరు అహంకార పూర్వకముగా భగవంతుని సాధనలు జరిపి, తమ కోర్కెలను నెరవేర్చుకుంటూ ఉంటారు. అయితే, వీరెవ్వరూ భగవంతుని తెలుసు కోలేకపోతున్నారు.

అయితే ఇక్కడ ఒక ప్రశ్న ఎదురౌతున్నది. అసలు ఈ తాంత్రిక శక్తుల వల్ల నైతికత అభివృద్ధి యగునా అని, తనకు సంబంధించినదేదియు త్యాగము చేయనంత వరకు ప్రతిమనిషి స్వార్థముతోనే వ్యవహరించును. బలుల సమర్పణ, మోసపూరిత కార్యకలాపాలు, తాంత్రిక కర్మలు బలవంతముగా మంత్రోచ్ఛరణ మొదలైన కార్యక్రమాలు తాంత్రిక శక్తికోసమే జరుపుదురు. ఈ తాంత్రిక శక్తివల్ల ఏ విధమైన లబ్ధి మానవుడు పొందడు. దశానిర్దేశం లేకుండా ప్రయత్నములు చేయడం, అహంకారం పెంచుకోవడం జరుగును. సత్యమును మరచి, మాయకు లోబడి ఇట్టి తాంత్రిక శక్తులకు ఆకర్షితులవుతున్నారు.

మన మతాచార రూపకర్తలు అహంకార నాశముకాని స్త్రీ పురుషులచే మరియు జ్ఞానము పూర్తిగా పొందని వారిచే రూపొందింపబడిన, మతములన్నిటిలోను చీకటి మరియు భయానక కోణాలు ఉంటున్నవి. వీరివల్ల అనుకున్న మంచి సాధించలేక పోతున్నారు. అన్ని మతాచారాలలోనూ ఉద్రేకములను రెచ్చగొట్టు పద్ధతులను సిద్ధాంతాలను పాటిస్తున్నారు. వీటివల్ల మంచి జరుగుతున్నది కానీ పాక్షికముగానే ఎవరి సాధనను అనుసరించి వారు మూల్యమును చెల్లిస్తున్నారు. కొంతమంది భావోద్రేకాలతో విగ్రహారాధనలు సలుపుతున్నారు. అయితే వీరి దురదృష్టం కొద్దీ, వీరు విగ్రహారాధనకే పరిమితమవుతున్నారు. అలా పరిమితము కానివారు, తమ అహమును నాశము చేసుకుని, ఆధ్యాత్మిక పురోగతి సాధించి, భావోద్రేకాలకు అతీతంగా భగవదారాధనలు సలిపి తరించుచున్నారు.

# 16. నైతిక సిద్ధాంతం

## అ. నైతిక శాస్త్రం:

అనేకత్వములతో కూడిన ఈ నైతిక సిద్ధాంతాల యందు ఏకత్వమును గ్రహించే దిశగా, సామరస్యముతో కూడిన లక్ష్యములను మానవుడు గుర్తించి, గ్రహించి సాధించవలెను. భగవంతుడికి సంపూర్ణ శరణాగతి వహించడమే ఈ అంతిమ లక్ష్యమని చాలామంది భావన. వీరిలో కొందరు భగవంతునికి సంపూర్ణ శరణాగతులవుతున్నారు. ఇంకొందరు ప్రజాక్షేమమే లక్ష్యముగా తమ జీవితాలను తీర్చిదిద్దు కుంటున్నారు. మరికొందరు అందరికీ మంచిని బోధించి, మంచిని అందించే ఆశ్రమాల సందేశములను పాటిస్తున్నారు, మరికొందరు తమ కర్తవ్యకర్మాను సారము నడుచుకుంటున్నారు. వీరందరూ కూడా ఒకే సిద్ధాంతమును అనుసరించి ముందుకు సాగుతున్నారు.

నీతి శాస్త్రమును అనుసరించి నైతిక విలువలను ఆచరించినంత ? మాత్రమున లక్ష్యము సాధ్యముకాదు. ఈ నైతికతకు ....... మరింత జోడించినప్పుడే మనకు మరింత ఫలితములు కలుగుచున్నవని మన అనుభవాలు తెలుపుచున్నవి. కొందరు ఆత్మ సాక్షాత్కారములోనే మనమంచి ఉందని, మరికొందరు పవిత్రతలోనే మనమంచి ఉందని, మరికొందరు సుఖ సంతోషములయందే మనమంచి ఉన్నదని, మరికొందరు తమ కోరికలను నెరవేర్చు కోవడంలోనే తను మంచి ఉందని భావిస్తున్నారు. వీరందరి అంతిమ లక్ష్యము ఒక్కటే.

ప్రతినైతిక పరిస్థితికి ఒక ప్రత్యేకమైన పరిణామము ఎదురవు ననునది నిజముకాదు. ఏ కర్మ ఆచరించాలన్నా ఫలితము ముందు ఊహించుకోవాలి. ఫలితము ననుసరించే కర్మాచరణ ఆధారపడి ఉంటుంది. ఫలితమును

దృష్టిలో పెట్టుకుని ఒక మంచి పద్ధతిని కనిపెట్టి దానిని అమలు చేయాలి. కాబట్టి విచారణ అన్నది చాలా అవసరం. అనగా బుద్ధికి పనిచెప్పాలి. నైతిక వైఫల్యాలకు కారణము మన నిర్లక్ష్యము, మన అసమర్థత, దయాదాక్షిణ్యముల లోపం, పక్షపాత వైఖరి. ఈ నేపథ్యములో నైతిక నైపుణ్యమునకు మనము శ్రద్ధతోను, దయాదాక్షిణ్యములతోను అందరికీ ఆమోదమైన మార్గములో పయనించుట, సమతుల్యముతో వ్యవహరించడం, విషయావగాహన కలిగి ఉండడం, వివేక విచక్షణలతో వ్యవహరించడం చేయాలి.

మనము ఎన్నో చిక్కుసమస్యలలో చిక్కుకుంటూ ఉంటాము. నేను పట్టిన కుందేలుకు మూడేకాళ్ళు అని వాదించేవారు ఉన్నంత వరకూ సమస్యలు సమసిపోవు. మనము నిత్యము ఎన్నో లక్ష్యముల కోసం ప్రయత్నిస్తున్నాము. అని ఆరోగ్యం కోసం, సంపదకోసం, పేరుప్రతిష్టల కోసం, స్నేహం కోసం, పవిత్రత కోసం, విద్యకోసం, నైతిక విలువల కోసం, న్యాయం కోసం, సామాజిక సేవలకోసం. అయితే వీటి సాధనలో మనము నిత్యము ఎన్నో విపత్కర పరిస్థితులను ఎదుర్కొంటున్నాము. కొన్ని పరిస్థితులలో సమాధానాలు దొరకక ఇబ్బందులు ఎదుర్కొంటున్నాము.

ప్రత్యేకంగా నైతిక విలువల ఆచరణలలో ఎదురయ్యే తారతమ్యాలను ఏవిధముగా పరిష్కరించుకోవాలి అన్నదానికి సరి అయిన జ్ఞానము లోపించుచున్నది మనము ఏది కోరుకుంటే దానిని పొందలేము. ఆరోగ్యమును, సంపదను, విద్యను, న్యాయము మొదలైనవాటిని కోరుకుంటాము కానీ దానిని పొందలేకపోవచ్చును. ఆచరణ కావాలి ఆచరణ ప్రత్యేకమైనది, శ్రద్ధతో కూడినది, విశిష్ట మైనది, వ్యక్తిగతమైనది. కాబట్టి కర్మల ఫలాలను నిర్ణయించేటప్పుడు ఈ అంశాలన్నీ పరిశీలించ వలసినదే.

ఒకవ్యక్తి ఆరోగ్యమును కోరుకుంటున్నాడు అంటే అతనికి ఆరోగ్యంగా బతకాలన్న కోరిక ఉండబట్టి, ఒక వ్యక్తి న్యాయం కోసం ఆరాటపడు తున్నాడంటే అతనికి న్యాయంగా బతకాలన్న కోరిక ఉండ బట్టి. అయితే వ్యక్తి వ్యక్తికీ ఆచరణలో బేధాలు వ్యక్తమవుతున్నవి. ఈ కారణముచే ఒకవ్యక్తి ఆచరణతో సఫలత చెందిన ఫలమును మరొకవ్యక్తి పొందలేక పోతున్నాడు. మనిషికి ఆరోగ్యము ముఖ్యమే. ఆరోగ్యం కోరని వ్యక్తి ఉండదు. అయితే జీవితమన్నది ఏదో ఒక్క వ్యాపకముతో సాగేదికాదు. ఎన్నో వ్యాపకాలతో సాగేది జీవితము. ఎన్ని వ్యాపకాలతో సాగినప్పటికీ ఆరోగ్యం ఉంటేనే అన్నీ సాధించవచ్చు, ఆనందించవచ్చు.

మనం ఏదైనా సాధించాలంటే నైతిక విలువలు అవసరం. నైతిక విలువల ఆచరణతోనే సత్ఫలితాలను ఆశించవచ్చు. మన వ్యవస్థలో ఎన్నో లోటుపాట్లు ఉంటున్నవి. ఈ లోటుపాట్లు కొన్ని ప్రత్యేకతలను సంతరించికుని ఉంటున్నవి ఈ లోటుపాట్లకు సామరస్యము లోపించును. ఈ కారణముచే పరిస్థితిని క్షుణ్ణంగా పరిశీలించవలెను. లోటుపాట్లను గుర్తించవలెను. అదే విధముగా ఆ పరిస్థితి నుండి మంచిని కూడా గ్రహించవలెను. అంతర్దృష్టితో పరిస్థితిని పరిశీలించవలెను. మన అనుభవాలను కూడా జతపరచవలెను. ఈ నైతిక విలువలను పరిశీలించవలసిన అంశములు ఆరోగ్యం, సంపదలు, శ్రమపడు తత్వం, మితాహారి కావడం, వినయం, సామరస్య ధోరణి, నేర్చుకోవాలనే తపన, పవిత్రతకు ప్రాధాన్యం, చొరవా, ధైర్యము, ఓపిక, నూతనత్వం, శ్రద్ధతో కూడిన పరిశ్రమలతో పాటు మరెన్నో లక్షణాల ఆవశ్యకతను గుర్తించాలి. ఈ విధమైన విశ్లేషణ కొలమానికమైనది. ఈ నేపథ్యంలో మన లోటుపాట్లను పరిశీలించిన వాటి నివారణకు సరియైన మార్గాలు దొరకును. మనకు ఆదర్శానికి నిలబడు వ్యక్తుల జీవితములే ఇట్టి పరిస్థితులకు సమాధానంగా అద్దము పడుతున్నాయి.

ఈ నైతికవిలువలు యాంత్రికముగా ఆచరించే నియమాలు కావు. ఈ నైతికవిలువల అవసరమును ముందుగా గ్రహించవలెను. ఏ సమస్యకు ఏఏ నైతిక విలువల అవసరమున్నదో ముందుగా సదావగాహనతో గ్రహించవలెను. మనము అచరించే నైతిక విలువలపై మనకు సదావగాహన ఉన్నరోజున, ఏ సమస్యకు పరిష్కారము ఏమిటో, ఎలా సాధించాలో తెలుస్తుంది. దాని ప్రకారము ఆచరణకు పూనుకుంటాము.

స్పష్టతతో కూడిన విలువల యొక్క గమ్యము రెండు రీతుల నిర్ణయమై ఉంటు న్నది. ఒకటి కారణము, రెండవది కార్యము. ఋజువైనది, నిరూపింపబడినవి. కారణమును బట్టి కార్యము ఆధారపడుచున్నది. కారణమునకు తగిన కార్యము ప్రాముఖ్యతను సంతరించుకొనును. దీని ఆధారముచే మళ్ళీ కారణములు రెండు రకములుగా గ్రహించడమైనది. ఒకటి అంతర్గత కారణాలు, రెండవది భౌతిక కారణాలు. అంతర్గత కారణములు అంతర్దృష్టిని, ఆదర్శమును అందించుచున్నది. భౌతిక కారణాలు భౌతిక పదార్థాలను చూపించుచున్నది. అంతర్దృష్టి పవిత్రతను ఆపాదించుచున్నది. భౌతిక కారణాలు ఆర్థికదృష్టి కలిగి ఉంటున్నది. ఈ రెండింటి మధ్య వ్యత్యాసము, ఆచరణలో చాలా బాధాకరముగా ఉంటున్నది. దైనందిన జీవితానికి ఈ రెండింటి మధ్య సామరస్యము వాంఛనీయము.

కొన్ని సందర్భాలలో ఈ నైతిక విలువలపట్ల, ఆరోగ్యము, సంపదలు, కళలు శాస్త్రసాంకేతిక నైపుణ్యాలను నిర్లక్ష్యముతో పక్కన పెడుతున్నాము. ఈ సందర్భాలలో ఎదురయ్యే లోటుపాట్లను వివేక విచక్షణలతో పరిష్కరించి సరిదిద్దవలెను. ప్రకృతి నియమాలు సహజముగా జరగవలెను. ప్రకృతికి విరుద్ధముగా వ్యవహరించిన తప్పిదాలు జరుగును. ఈ నేపథ్యములో మానవుడు తన నైతిక బాధ్యతలను గుర్తెరుగవలెను.

నైతిక వేత్తలు నైతికమునకు, ప్రకృతి సహజమగు కార్యక్రమాలకు మధ్యనున్న వ్యత్యాసాలను గుర్తించారు. అయితే నైతిక జీవితమునకు ప్రకృతి నియమాలకు మధ్య గల అవినాభావ సంబంధము, సామరస్యము అందరూ గ్రహించవలెను. ప్రకృతిరీత్యా మన దైనందిన జీవితములో ఎన్నో మార్పులు సంభవించుచుండును. ఈ కోణములో మనము గతమును, పర్యవసానాలను జతపరచవలెను. ఈనాడు నైతిక సిద్ధాంతులు ప్రకృతి సిద్ధమైన మార్పులను పరిగ్రహించకుండా తమ సిద్ధాంతాల రూపకల్పనకు పూనుకుంటున్నారు. ఇదే విధముగా ప్రకృతి తరఫున కూడా నైతికదృష్టి అలవరచు కొనవలెను.

ప్రకృతి నియమాలకు నైతిక సిద్ధాంతాలకు మధ్య వ్యత్యాసము, బేధభావాలు రాకుండా ప్రయత్నము చేయవలెను. వృక్షశాస్త్రము, రసాయనిక శాస్త్రము, వైద్యశాస్త్రము, భౌతిక శాస్త్రములు మానవుని కష్టముల నివారణకు సుఖానికి ఎంతగానో తోడ్పడుచున్నవి. ఈ శాస్త్రాలు నైతికతను ఇనుమడింప చేసుకున్నవి. ప్రకృతికి సంబంధించిన విషయాలు తెలుసుకోవడం కూడా ఆవశ్యమే. ఈ ప్రకృతి నియమానికి మానవత్వము జోడించడమైనది. అందుకే అన్నీ శాస్త్ర సాంకేతికపరమైన నిర్ణయాలుగా కాక మానవుడు సంఘజీవి కాబట్టి మానవతా ధోరణితో విషయమును పరిశీలించవలెను. ఇక్కడ సాంకేతికమనగా సాంఘిక మరియు నైతిక కోణముల సమీక్ష.

మనము ప్రకృతి నైజము మరియు మానవనైజాలను జత చేసినపుడు పదార్థములలో తలెత్తే యాంత్రికమైన, శాస్త్ర సాంకేతికమైన, నైతికమైన బేధాలను ప్రక్కనపెట్టవచ్చు. ఈ విధముగా స్పష్టతలేని మానవసంబంధమైన కొన్ని అంశాలు మధ్య సఖ్యత ఏర్పడి బలముచేకూరును. నైతికవిలువలను బుద్ధితో జోడించి అవి వివేక విచక్షణలతో బలపడును. అప్పుడు ప్రకృతి నియమాలకు మానవనైజమునకు ఉన్న బేధభావాలు రూపుమాపును.

**అ. ఆలోచనాసరళి :**

మనిషి ఏదైనా ఒక విషయానికి సంబంధించి ఇష్టాయిష్టాలు, ఆశలు, భయాలకు సంబంధించి ఆలోచిస్తూ ఉంటాడు. ఒక పనిచేయడం వల్ల లేదా మానడం వల్ల మంచి జరుగుతుందా, చెడు జరుగుతుందా అన్న ఆలోచనలు వరుసక్రమంలో వస్తాయి. ఈ కారణముచే అనుకున్నపని చేయడానికి మనము ఇష్టము చూపవచ్చు, లేదా అయిష్టముతో ప్రక్కన పెట్టవచ్చు, ఆశతో ప్రయత్నించవచ్చు లేదా భయముతో ప్రయత్నించక పోవచ్చు. ఈ ఇష్టాలు, అయిష్టాలు, ఆశలు, భయాలతో కూడినవే మన ఆలోచనాసరళి.

జరిగి పోయినదానికి ఆలోచనా సరళితో పనిలేదు. అయితే అసాధ్య మనుకున్న దానిని సాధించడానికి ఆలోచనాసరళి అవసరమైయున్నది. ఈ ఆలోచనా సరళి ఎప్పుడు అనివార్యమవుతున్నది. ఏదైనా ఒక కార్యము చేయడానికి మనకు స్వేచ్ఛ లేనప్పుడు ఈ ఆలోచనా సరళి అవసర మవుతున్నది. ఈ ఆలోచనా సరళి ఎప్పుడు ముగుస్తుంది? మనము చేపట్ట దలచుకున్న కార్యము సంభవమా అసంభవమా అన్న మీమాంస తేలే వరకూ ఈ ఆలోచనాసరళి కొనసాగుతుంది.

మన ఆలోచనాసరళిని అనుసరించి మన ఇష్టానుసారము ఆ కార్యమును చేపట్టవచ్చును లేదా మానుకొనవచ్చును.

ప్రతిమానవుడు తన స్వశక్తితోనే, తన ఆలోచనాసరళితో, కార్యాలను చేపట్టడం జరుగుతుంది. మనకు స్పష్టతలేని కార్యాలయందు, లక్ష్యము సాధించు నమ్మకము తగ్గినపుడు మనము ఆలోచనాసరళికి అవకాశ మిస్తాము. ఈ ఆలోచనాసరళితో మనము చేపట్టే విదివిధానాలను సమాలోచనలు చేస్తాము. అయినా మనము అనుకున్నట్లు జరగవచ్చు జరగకపోవచ్చు. మనము అనుకున్నట్లుగా జరగని కారణమున అనుకున్న

పనులు కూడా అనుకున్నట్లుగా జరగవు. ఈ నేపథ్యములో మనము లక్ష్యము గురించి కాక మనము ఎన్నుకున్న మార్గము, చేసిన ప్రయత్నము గురించి ఆలోచించుట ముఖ్యము. అలాగాక మనకు లక్ష్యము అగుపడుచున్నది. లక్ష్యము సాధించడానికి మార్గాలు కూడా మనకు గోచరిస్తున్నాయి. మనము ఏమి చేస్తాము? తేలికైన మార్గములో మంచి ఫలితమును పొందడానికి ప్రయత్నిస్తాము. కాబట్టి ఆలోచనాసరళి అన్నది వ్యక్తినియంత్రణలో ఉంటుంది. కానీ ఆచరణ మాత్రం తమ పరిధిని దాటి ఉంటుంది.

మనిషికి నిర్ణయాత్మక శక్తి చాలా అవసరము. తన ఆలోచనా సరళితో, తన ఇష్టానుసారము నిర్ణయాలు తీసుకోవాలి. మనకు నిర్ణయించు స్వేచ్ఛ కలదు. మన ఆలోచనా సరళిని అనుసరించి నిర్ణయము చేస్తాము. మన ఆలోచనా సరళిని అనుసరించు మార్గమునందే మన శక్తి యిమిడి ఉంది.

లక్ష్యము మన అందరికీ ముఖ్యమే. మనము అనుసరించు మార్గము మన ఆలోచనాసరళిని అనుసరించి ఉండును. కాబట్టి స్వేచ్ఛతోనే మనము కార్యాలు చేపడతాము. మనము సత్కర్మాచరణకు పూనుకోవలెను. సత్కర్మాచరణే మన బలము. అనైతిక మార్గమే మన బలహీనత. మంచిగానీ, చెడుగానీ ఆచరించవలెనా, వద్దా అనునది మన చేతులలోనే ఉన్నది. మనము ఒకపని మంచిది, చేయాలి అని అనుకున్నప్పుడు దానిని చేయడం చేయకపోవడం అన్నది మన ఇష్టానుసారం జరుగుతుంది. మనము చేపట్టిన కార్యాలు మంచిమార్గములోనా, చెడుమార్గములోనా అన్నది కూడా మన చేతులలోనే ఉన్నది. ఈకారణముచే మానవుడు సంతోషమును సహజముగా వ్యక్తము చేయలేకపోతున్నాడు, కానీ తన మూర్ఖత్వమును మాత్రము సహజముగానే వ్యక్తము చేయుచున్నాడు. మనమాచరించు మార్గమునే మనము వ్యక్తము చేస్తాము. మంచి మార్గమును ఎన్నుకున్నవాడు సహజముగా మంచినే వ్యక్తము చేస్తాడు, అదే విధముగా చెడుమార్గమునకు అలవాటుపడిన వాడు చెడునే సహజముగా వ్యక్తము చేస్తాడు.

### ఇ. నైతిక లక్ష్యం:

నైతికత అనునది అన్నిస్థాయిలలోను వెలువడే ప్రశ్నా పరంపర. “మనమెలా జీవించాలి? మన లక్ష్యమేమిటి? సుఖమా, జ్ఞానమా, నైతికతా లేక క్రొత్త వస్తువును సృజించడమా? ఒకవేళ మనము సుఖము కోరుకుంటే, ఆ సుఖము మన కోసమేనా లేక అందరి కోసమా? మనము ఒక మంచి పనికోసం మోసం చేయవచ్చా? సాటి మనిషి బాధలలో ఉన్నప్పుడు మనము సుఖముగా బ్రతకవచ్చా? పరిపాలన అసమర్థతతో ఉన్నప్పుడు, మనము అన్యాయ మార్గములో ప్రయాణించవచ్చా? భూమిమీద అందరితో జీవించే పౌరుడిగా మన బాధ్యతలేమిటి?”

నైతికతకు సంబంధించిన విషయాలు ఆచరణ పూర్వక నిర్ణయాలుగా ఉంటాయి. ఈ నైతికత అనునది విలువలతో కూడిన జీవనము. మానవ కర్మలు మంచివా, చెడ్డవా అని అద్దము పట్టేదే ఈ నైతికత.

నైతికత, సత్కర్మలు పరస్పరం సంబంధం కలిగిఉంటాయి. రెండింటికీ మధ్య బేధములేక ఒకే అర్థమును సూచించును. నైతికతకు మరికొంత విలువను పెంచేదే సత్కర్మ. ఒక్క మాటలో చెప్పాలంటే సత్కర్మ విచారణే నైతికత. ఈ నేపథ్యములో నైతికత మరియు తత్వము ఒక్కటే.

సాధారణంగా నైతికత అనునది తత్వముతో కూడినదిగా అనిపించినా, అది అన్ని శాస్త్రముల సారమై ఉన్నది. మనుష్య శాస్త్రము, సాంఘిక జీవనము, వేదాంత శాస్త్రము, జీవశాస్త్రము, చరిత్ర, ఆర్థిక శాస్త్రము, రాజనీతి మొదలైన శాస్త్రాలలో ఇమిడి ఉన్నది నైతికత. అయితే ఈ శాస్త్రాలలో ఈ నైతికత బాహ్యాముగా కనపడదు, వివరింపబడలేదు. మానవసంబంధ విషయాలలో, ఈ నైతికత, ఈ శాస్త్రాలలో ప్రాముఖ్యత సంతరించుకున్నది.

ఈ నైతికత అనునది ఎప్పుడు మొదలైంది? మనిషి పుట్టినప్పటి నుండీ విచారణా శక్తితో సుఖజీవనము కొరకై ప్రాకులాడుట మొదలు పెట్టెను. మనిషిలో జ్ఞానము పెరిగే కొద్దీ, సంఘములో వివిధ వర్గముల జీవన విధానాలను పరిశీలించిన మీదట, నైతిక అభివృద్ధికి అవకాశ మేర్పడెను. సంఘములోని వివిధ వర్గముల యొక్క ఆచార వ్యవహారాలను పరిశీలించిన మీదట, నైతికత అనునది మన జీవన విధానములో ఒక భాగమైపోయినది.

ఈ నైతిక సూత్రాలను ఎల్లవేళలా యావన్మందీ పాటించాలి అన్న నిబంధన ఏమీలేదు. ఒక ప్రదేశమునకు మరొక ప్రదేశమునకు, ఒక వర్గమునకు మరొక వర్గమునకు మధ్యనున్న సంస్కృతి, సంప్రదాయాల బేధముల వల్ల, ఒకే సూత్రమునకు యావన్మంది కట్టుబడుట జరగదు. అయినప్పటికీ సంఘక్షేమము కోసం పాటుపడే ప్రతి వర్గము మంచిదే అన్న అభిప్రాయము ప్రజలకు కలదు. ఈ నేపథ్యములోనే కొన్ని వర్గాలవారు కొన్ని కారణాలచే ఇతర జీవాలకు హాని తలపెట్టకూడదని, ఇతర జీవాలను చంపకూడదని శాసించిరి. వర్గమునకు వర్గమునకు మధ్యనున్న సామరస్యము కన్నా, వాటి మధ్యనున్న విబేధాలే ప్రాధాన్యత సంతరించుకుంటున్నాయి. సంఘ అభివృద్ధికి ఈ మార్పులు అడ్డుపడవు.

వివిధ వర్గాలలో ఉన్న సంస్కృతి, సంప్రదాయాలు నియమ నిబంధనలను వివరింప నైతికత యొక్క లక్ష్యము కాదు. నైతికత అనునది మనుష్య శాస్త్రమును, సాంఘిక జీవనమును మాత్రము వివరించును. అయితే ఈ నైతిక విలువలు ఆచరణకు మాత్రం పెద్దపీట వేయును.

సంఘములోని వివిధ వర్గముల మధ్య ఉన్న మార్పులను గ్రహించి వాటిని సమన్వయపరచు ఆవశ్యకత ఉందని కొందరు నైతిక సిద్ధాంతుల వాదన. అయితే ఈ సిద్ధాంతమునకు అంగీకారము లేదు. ప్రదేశముల

వారీగా, వర్గముల వారిగా ఎవరికివారు తమతమ సంస్కృతీసంప్రదాయా లకు కట్టుబడి జీవనము  సాగిస్తున్నారు.

అయితే కొందరు నైతిక సిద్ధాంతులు, అన్ని వర్గాలలో ఉన్న సామరస్య అంశాలను పరిగణలోకి తీసుకుని వర్తించాలని సూచించారు. అయితే అందరి అంగీకారముతో కూడిన అంశాలు ఆచరణ యోగ్యతకు నోచుకోవడం లేదు.

మానవ సమాజములో అనాదిగా ఆచరణలో ఉన్న నైతిక విలువలలో బేధములు ఉండవచ్చును, ఉండకపోవచ్చును. కానీ సందర్భమును బట్టి ప్రతివ్యక్తి ఎలా ప్రవర్తించాలో అనునది మాత్రం ఒక ప్రశ్నగానే మిగిలిపోతున్నది. అన్ని నియమాలకు కట్టుబడి జీవనము సాగించాలి అని మనము నియమమును పాటిస్తున్నాము. అయితే మనకు స్వేచ్ఛఉంటున్నది. ఈ స్వేచ్ఛతో మనము ఈ నియమ నిబంధనలకు ఎందుకు కట్టుబడి ఉండాలి. నా నియమం నాది అని ప్రవర్తిస్తూ ఉంటారు. ఇట్టి వారికి ఆచరణలో ఉన్న నియమావళి తెలియదు, తాము ఆచరించదలచుకున్నది అంతకన్నా తెలియదు. వీరు అయోమయంతో జీవిస్తుంటారు. ఈ కారణముచే నియంత్రణ అనునది అనాదిగా అందరూ పాటిస్తున్న వాస్తవం.

మన ఇంట్లో మన తల్లిదండ్రుల నోట మొట్ట మొదటిగా ఈ నీతి నియమాలు గురించి వింటాము. తెలుసుకుంటాము. తరువాత పుస్తకముల ద్వారా తెలుసుకుంటాము. ఈ విధముగా ఆదినుండీ ఆచరణలో ఉన్న నైతిక విలువలు మన చరిత్రలో చోటు చేసుకుంటున్నాము.

ఆదిలో భారతీయ నైతికత తత్వముతో కూడి ఉండెడిది. ఆదినుండి వేదాలు మరియు ఆధ్యాత్మిక గ్రంథాల తత్వవిచారణలో ఈ నైతికత ఒక భాగమై ఒప్పుతున్నది. వేదాలలో మొట్టమొదట మానవుడు ఎలా జీవించాలో

సూచించిన విధానమునే ఈ నైతిక సూత్రములందు కూడా పొందు పరచడమైనది.

వేదాలు ప్రధానముగా హక్కులను గురించి వివరించాయి. దీనిని బట్టి మానవులు గ్రహించవలసిన దేమనగా వేదాలు శాసించును తప్ప, మనుష్యులలో నమ్మకమును కలిగించవు. ఈ యావద్విశ్వము ఒక ప్రణాళికను అనుసరించి నియమనిబంధనలకు లోబడి అత్యద్భుత సామరస్యమును వ్యక్తము చేయుచున్నది. సత్యము, హక్కులకు సంబంధము కలిగిఉంటున్నది. సత్యమును గ్రహించలెనన్న మంచి తనమును ముందుగా గ్రహించవలెను. సత్యమును అనుసరించి జీవించుటే ధర్మము. సత్యము, ధర్మము వేరు వేరు కాదు. ఆచరణతో అనుభవజ్ఞానముతో ఈ సత్యము బోధపడును.

ఈ నైతిక సూత్రాలకు వేదాలు మూలముగా భాషించబడుతున్నవి. ఈ వేదాలు అన్ని అంశములన క్షుణ్ణముగా వివరించాయి. అవి ఆచరణ యోగ్యములు. ఈ వేదములు నాలుగు అంశాలను దృష్టిలో పెట్టుకుని బోధించాయి. అవి అభివృద్ధి, తృప్తి, ధార్మిక జీవనము మరియు ఆధ్యాత్మిక పురోభివృద్ధి ఈ నాలుగు లక్ష్యములు మనలో త్యాగమును, అహింసను, విధేయతను, నైతిక జీవనమును, వినయ విధేయతను, అణుకువను, పవిత్రతను పెంచుచున్నవి. అంతేకాదు మనలోని మాలిన్యములైన అహంకారమును, భ్రాంతులను, క్రూరత్వమును, దొంగతనమును, హింసను పారద్రోలుచున్నవి.

నైతిక సూత్రాలు వేదములలో భాగమై ఉంటున్నవి. ఈ వేదాలు ఈ విశ్వములో భాగమై ఉంటున్నవి. ప్రకృతిలో సయోధ్య అవసరం. ప్రకృతిలో సయోధ్య పొందిన కార్యక్రమాలు అందరి మన్ననలను పొందుతాయి.

అట్టి కార్యాలకు తగిన ఫలితాలు అందును. అలాకాక, తనను తాను అర్థంచేసుకొని కూడా, చెడుమార్గాలను పట్టినవాడు తన పతనమును తానే కొని తెచ్చుకొనును.

ఆచరణలో ఉన్న నియమావళితో ఈ నైతిక సిద్ధాంతాలను పోల్చడం సబబుకాదు. అయితే నైతికవిలువల ఆచరణ అందరి కోరికయై ఉంటున్నది. అందరి ఆంతరంగిక కోరికను అనుసరించి ఆధ్యాత్మిక చింతనాపరులై, జ్ఞాన సముపార్జనతో తమ జీవిత లక్ష్యాలను సాధించుచున్నారు.

ఏ విధముగానయితే మానవులకు అంతర్, బహిర్దృష్టి కలిగిఉంటుందో అదే విధముగా నైతిక నియమాలను కూడా అంతర్ బహిర్దృష్టితో పరిశీలించ వలెను. అయితే ముఖ్యముగా ఈ నైతిక విలువలనుండి ఏదిమంచో, ఏది చెడో గ్రహించవలసి ఉంటున్నది. రెండవది, నైతిక విలువలను ఆచరించా మన్న భావనలు మనలో కలుగుతున్నవి. అంతరాత్మ పరిశోధనతో మన అంతరంగమును పరిశీలించి మంచి చెడుల నిర్ణయము చేయుట మంచి ఆరోగ్యకర లక్షణము.

నైతికతకు సంబంధించిన భౌతిక విషయాలు కూడా ఎంతో ప్రాముఖ్యమును సంతరించుకున్నాయి. ఇహముపరములతో కూడినది జీవితము. రోగము, చావుపుట్టుకలు, శృంగారము మొదలైన అంశముల గురించి శ్రద్ధవహించవలెను. మానవ నైతికపురోభివృద్ధితో పాటు ఈ భౌతిక అంశాలపై మార్పులు వ్యక్తము చేయును. కాలముతోపాటు శాస్త్రసాంకేతిక అభివృద్ధిని సాధించిన తరుణములో ఈ నైతిక నియమావళికి మానవాళికి హాని కలుగజేయని విధముగా రూపొందించడానికి ప్రయత్నాలు జరుగు చున్నవి. శృంగార పరముగా కూడా ఈనైతిక సిద్ధాంతాలలో మార్పులు సూచించబడెను. కుటుంబ నియంత్రణ ఆపరేషన్‌లు జరుగుచున్నవి. రతికి

సంబంధించిన పరిజ్ఞానము కూడా గుప్తరోగముల నిరోధనకై బహిర్గత పరచుచున్నారు.

ప్రస్తుతమున్న నైతిక నియమాలు, సిద్ధాంతాలు వ్యక్తిగతముగా మానవులపై ప్రభావము చూపుచున్నవి. సాధారణంగా అమలులో ఉన్న సిద్ధాంతాలను వీరు చాలా ఇష్టముగా స్వీకరిస్తారు. ఈ సిద్ధాంతాలకు వ్యతిరేకముగా నడుచుకోవడమును చెడుగా వీరు భావిస్తారు. ఈ విధముగా మన నైతిక సిద్ధాంతం ప్రభావము చూపుతున్నది. ఎవరో కొద్దిమంది మాత్రమే ఈ నైతిక నియమాలను ప్రశ్నిస్తున్నారు.

అయితే, ఒక ముఖ్యమైన విషయము ఏమిటంటే, కాలముతో పాటు కొన్ని ముఖ్యమైన నైతిక సిద్ధాంతాలలో మార్పులు సంఘం ప్రభావముచే కలుగుచున్నవి. కొన్ని సందర్భాలలో నైతిక విధానము అనునది లేకుండా ఉంటున్నది, ఒకవేళ ఉన్నను అవి అస్పష్టముగా ఉంటున్నవి. అటువంటివి మన సమస్యల పరిష్కారమునకు ఉపయోగపడక ఉంటున్నవి.

అయితే శాస్త్రసాంకేతిక అభివృద్ధి కారణము వల్ల కొత్తగా నైతిక సమస్యలు ఉత్పన్నమవుతున్నాయి. ఆ సమస్యలు ముందుగా ఊహించినవి కాదు. మానవుడికి తీరిక సమయమును ఎలా గడపాలో అన్న విషయంపై ప్రస్తుత అంశము వీక్షించబడుతున్నది. విలువలకు తిలోదకాలు ఇచ్చి నేటి శాస్త్రసాంకేతిక రంగము ముందుకు దూసుకుపోతున్నది. సమాచారవ్యవస్థ అభివృద్ధి చెంది ప్రపంచమే బహుచిన్నదిగా మారిపోయినది. అన్నిదేశాలు మానవ శ్రేయస్సుకై ఏకాభిప్రాయ సాధనతో ముందుకు సాగవలెనని తాపత్రయ పడుచున్నవి. ప్రపంచ యుద్ధాలు నేర్పిన పాఠాలతో మానవుడు ఐకమత్యముతో కలసి మెలసి ముందుకైనా సాగవలెను. లేదా మానవ మనుగడకే ముప్పుగా పరిణమించగలదని గ్రహించినాడు.

మానవుని వ్యక్తిత్వంలో స్వేచ్ఛకు ప్రాధాన్యత ఇవ్వబడెను. స్వేచ్ఛగల దేశాలలో ఎక్కువ అభివృద్ధి సాధించడం జరుగుతున్నది. సంస్థలకన్నా మనుషులే గొప్ప. కాలంతో పాటు జనులు పుడుతున్నారు, గిడుతున్నారు. కానీ ఎవరు మిగిలిపోతున్నారంటే సమాజానికి మేలు చేసినవారే. మిగిలినవారు కాలగర్భంలో కలిసిపోతున్నారు. మానవునిలోని ఆధ్యాత్మికత వల్లనే అభివృద్ధి సాధ్యమవుతుంది. సంకుచిత భావాలతో అభివృద్ధి సాధ్యపడదు. ఎవరయితే పూర్తి స్వేచ్ఛాస్వాతంత్రాలతో జీవిస్తారో, అట్టివారే అత్యంత నైపుణ్యంతోనూ, సంతృప్తితోనూ మానవాళి శ్రేయస్సుకై కృషిచేస్తారు.

**ఈ. నైతికత – తారతమ్యం:**

మనిషి స్వేచ్ఛను కోరుకుంటాడు కానీ భయపడతాడు. మానవుడు స్వేచ్ఛతోనూ, పట్టుదలతోనూ తన కాళ్ళమీద తాను నిలబడాలనుకుంటాడు అయితే ఏకాంతానికి, బాధ్యతలకు భయపడతాడు. ఐకమత్యంతో కలసి మెలసి వర్గముగా పనిచేయాలని భావిస్తాడు. ఈ అంశానికి నైతికత ప్రాధాన్యత సంతరించుకుంటున్నది. సంఘంలో విశాల భావాలు పెరుగుతూ ఉంటాయి. వయస్సుతోపాటు మానవుడిలో నైతిక విలువలు పెరుగుతూ ఉంటాయి. కాలంతో బాటు జరుగుతున్న మార్పులను పరిశీలించి నట్లయితే విశాల భావాలతో నైతికత అభివృద్ధి జరుగుతున్నది.

అభివృద్ధి చెందుతున్న సాంఘిక సంస్థలలో, చరిత్రను తిరగేసినట్లయితే సంస్థ సంస్థకు వివిధరకాలైన నైతిక సిద్ధాంతతాలు ఆపాదించబడ్డాయి. ఈ తారతమ్యమును వ్యతిరేకించి పోరాడిన సంఘటనలు ఉన్నాయి, మరికొన్ని సందర్భాలలో నెరవేర్చే బాధ్యతలకు అనుగుణముగా ఈ తారతమ్యము మార్పులు తప్పనిసరిగా భావించడం జరిగింది.

**ఉదాహరణకు:–** పరిపాలనాశాఖవారు ప్రజల క్షేమంకోరి కొన్ని అధికారాలు జారీచేస్తారు. ప్రభుత్వ యంత్రాంగాలలో పనిచేసే సామాన్యమానవులకు పనితీరు నియంత్రణ మరో రీతిలో ఉంటున్నవి. అణచివేయబడ్డ తరగతులకు శరణాగతి తత్త్వముతో పనిచేయాలనే నియమ నిబంధనలను వారికి వర్తింపచేశారు. అణచి వేయబడ్డ తరగతులవారు తిరగబడకుండ శాసనాలు చేశారు. అయితే సామాన్య మానవులకు వ్యక్తిగతంగా ముక్తిని, మోక్షమును పొందడానికి, హింసను ప్రోత్సహించ కుండా జీవనము సాగించడానికి నియమ నిబంధనలు తయారు చేయబడ్డవి.

ఈ విధమైన వ్యత్యాసాలు, తారతమ్యములతో కూడిన నియమ నిబంధనలు అనేకము. ఈ నేపథ్యములో ప్రతి వర్గమునకు వర్గమునకు, ప్రతి ప్రదేశమునకు ప్రదేశమునకు ఈ నియమ బంధనలు మారుతున్నాయి. వీటిమధ్యన పొంతన కానరావడంలేదు. అంతర్గత కలహాల కారణముగానే ఈ తారతమ్యాలు వ్యక్తమగు చున్నవి. ఈ కారణముగా వర్గమునకు స్థాయిలకు పోటీలు ఏర్పడుతున్నవి. మానవుడు సంఘంలో ఉంటూ తన అవసరాలకోసం సంఘం కట్టుబాట్లతో పోటీపడుతున్నాడు. ఈ తారతమ్యాల వల్ల ఇబ్బందులు ఏర్పడినప్పటికీ అవి స్వల్పకాలిక ప్రయోజనముల దృష్ట్యా ఏర్పడినవిగా భావించవలెను.

నైతికత అనునది అస్తిత్వముకాదు. నైతికత అనునది వ్యక్తిగత మరియు సామాజిక జీవన విధానాల సమాహారము. ఈ నైతికత ఉద్దేశ్య మేమనగా అది సంఘంలో మంచిచెడుల నిర్ణయము చేయుటలో సహాయపడును. కాలముతోపాటు చరిత్ర చూపుతున్న ఆధారాలను బట్టి ప్రతి సంఘములోనూ మార్పులు అనివార్యమవుచున్నవి. ఈ మార్పులు సంఘశ్రేయస్సు దృష్టితో తలపెట్టినవే అయినప్పటికి వాటిమధ్య తారతమ్యాలు ఉంటున్నవి.

మనిషి తన శాస్త్రపరిశోధనలను ఏ విధముగా బయటి ప్రపంచానికి తెలియజేసినాడో, అదేవిధంగా నైతికతను కూడా ప్రపంచానికి అందించాడు. మానవ మనుగడలో మంచితోపాటు చెడుకూడా చోటు చేసుకుంటున్నది. మంచిచెడుల నిర్ణయానికి, తప్పొప్పుల నిర్ణయాలకు ఈ నైతికత తన ఉనికిని నిరూపించుకుంటున్నది. ఏ విధముగా అయితే మానవుడు కనిపెట్టిన ప్రకృతి నియమాలు సహజంగా మానవుని మనుగడలో చోటుచేసుకుంటున్నవో, అదే విధముగా ఈ నైతిక విలువలు కూడా మానవ జీవితములో ఒక భాగమైపోయెను. ప్రకృతిలో సహజముగా జరిగే ప్రక్రియలను మానవుడు కనిపెట్టి వాటిని శాస్త్రంగా రూపొందించెను. జూలియన్ హక్స్లే పరిశీల ననుసరించి, "ఈ విశ్వములోని అనంతమైన శక్తి సామర్థ్యాలు సంక్షిప్తముగా సూక్ష్మరూపమున ఈ నైతిక విలువల రూపమున అందించబడెను. ఎవరయితే ఈ నైతిక విలువలను సూక్ష్మరూపమున ఆచరిస్తారో వారు అనంతమైన స్థూల ప్రపంచమును తమ హృదయములో ఇముడ్చుకోగలరు".

నైతికతకు సంబంధించిన న్యాయపరమైన అంశాలు అనాదిగా అమలులో ఉంటున్నవి. సంఘములో మానవ సహజీవనమునకు ఈ నైతిక విలువలు అందించబడినవి. అయితే ఈ నైతిక విలువలను అతిక్రమించు వారిని అదుపుచేయు నిమిత్తమై, వారికి శిక్షలు విధించబడుచున్నవి. నేరమునకు తగ్గ శిక్షను రూపొందించడ మైనది.

బాగుచేయుట అనునది ఒక విధానము. తప్పుచేసిన వారికి, తన తప్పిదము తెలుసుకుని, ఆ నష్టము భర్తీచేయు విధానము ఉంటున్నది. దీని ప్రకారము అతను నష్టమును తన శ్రమశక్తితోగానీ లేదా ధనరూపమున కానీ చెల్లించవలెను. ఇది ఒకరకముగా నేరమునకు తగిన శిక్ష. మరొక పద్ధతి ప్రకారము, నేరమునకు చాలా అధికమైన శిక్షవేయుట ద్వారా, అసలు నేరములనే నిరోధించవలనన్న ఉద్దేశ్యము వ్యక్తమగుచున్నది. ఈ

కఠిన శిక్షల వల్ల తప్పు చేయువారు బయటపడుదురు. నేరములు తగ్గును. సంఘములోని ప్రజలు క్షేమంగా మనగలరు అని భావన.

కాలముతోబాటు శిక్షా విధానములో నూతనమైన మార్పులు వచ్చుచున్నవి. నేరానికి కఠినమైన శిక్ష విధించడం వల్ల నేరాల సంఖ్య తగ్గునని భావించినప్పటికీ అది వాస్తవంలో అట్లు జరుగుటలేదు. నేరాల సంఖ్య ఇంకా పెరుగుతున్నాయి. ఈ నేపథ్యంలో నేరానికి తగిన శిక్షకు బదులు తగినశిక్షణ ఇవ్వడం మొదలుపెట్టారు. ఏ సంఘమయితే నేరస్థుల యెడల ప్రేమ సానుభూతి వ్యక్తం చేస్తుందో, ఎక్కడ కాఠిన్యం ప్రదర్శించదో, ఎక్కడ కఠినమైన శిక్షలతో భయపెట్టదో అట్టి చోట్ల నేరాల సంఖ్య గణనీయముగా తగ్గుముఖం పట్టినది. నేరాలు చేయకుండా శిక్షణ ఇవ్వడం కూడా ఎంతో ప్రాముఖ్యత సంతరించుకొనెను. అదే విధంగా క్షణికోద్రేకములో నేరాలు చేసి, సంవత్సరముల తరబడి శిక్షింపబడుచున్న నేరస్థులకు తగిన శిక్షణలను ఇచ్చి భవిష్యత్తులో మళ్ళీ వారు నేరాలు చేయకుండా వారికి సాయపడుచున్నారు.

నేరస్థులకు శిక్షకు బదులుగా శిక్షణతో బాగుచేయుట అనునది చక్కని సాంఘిక ప్రయోగము. ఈ రీతిగా ఆ నేరస్థులకు నైతిక విలువలను బోధించడం జరుగుతున్నది. ఎప్పుడైతే ఈ నైతిక విలువలు బోధిస్తారో, అప్పుడు ఆ నేరస్థులలో అంతర్మధనం మొదలవుతుంది. ఈ అంతర్మధనం కారణంగా వారిలో మంచి మార్పులు కలుగుతాయి. వారికి జ్ఞానోదయ మవుతుంది. భవిష్యత్‌లో మరింత సామాజిక స్పృహతో జీవనము సాగిస్తారు.

సాంఘికముగా గానీ, మతపరముగా గానీ, న్యాయపరముగా గానీ, ప్రభుత్వ పరముగా గానీ ఆచరించే నియమనిబంధనలు నేర్వవలెనన్న పాక్షికముగానే వీలవుతున్నది. ఇందు చాలా భాగము వ్యక్తముకాని స్థితిలో

ఉంటున్నది. అయినప్పటికీ ఈ నైతికత మానవుల ఆలోచనలు, క్రియలపై అత్యంత శక్తివంతముగా పనిచేయుచున్నది.

ఇటువంటి మూడు అంశాలను ఇక్కడ ఉదహరించవలెను. మొదటిది, 'పెరుగుట విరుగుట కొరకే', 'దురాశ దుఃఖమునకు చేటు', అనే సామెతల ననుసరించి అన్ని సంస్కృతులలో, అన్ని కాలాలలో ఇందుకు అనేక ఉదాహరణలు కలవు.

రెండవది, ఫ్లూగల్ మహాశయుని సందేశము ఏమనగా, 'మానవుడు అనేకమార్లు అహంకారముతో అనేక తప్పిదాలను చేయుచున్నాడు. ఆ చేసిన తప్పులకు శిక్షను అనుభవించవలెనను జ్ఞానము కలిగి ఉంటున్నాడు. ఈ విధమైన పశ్చాత్తాపముతో తన మనసులోని బాధను ఉపశమనం చేసుకుంటున్నాడు. కొన్ని సందర్భాలలో అదృష్టవశాత్తు మరియు పరిస్థితులు సానుకూలించినప్పుడు ఈ పశ్చాత్తాప బాధ బహు తక్కువగా ఉండడంవల్ల, ఎప్పటికైనా శిక్ష తప్పదు అనే భావన మదిలో మిగిలిపోతున్నది. ఈ విధమైన భయాందోళనలతో మానవుడు తన సహజసిద్ధమైన అభివృద్ధికి, తనకు తెలియకుండా ఎంతో నష్టపోతున్నాడు.

మూడవది, నైతికమైన సాంఘిక జీవనంలో శత్రువులు బయట పడటం, వారిని ద్వేషించడం, వారిని అణచివేయు కార్యక్రమాలు చేపట్టడం, వారిపై దౌర్జన్యం చెయ్యడం మొదలైన విషయాలలో శిక్షకు గురి కావడం జరుగుతున్నది.

# 17. నైతికత మర్మం

ప్రకృతిలోని ప్రతి అంశము నియమానుసారమే జరుగుతుంది. బుద్ధిని అనుసరించువాడు మాత్రమే నీతి నియమానుసారము వర్తిస్తాడు. కారణము లేనిదే కార్యము జరగదు. ఇక్కడ మన ఇచ్ఛకు కారణమై ఉంటున్నది. తనకు ఏదిమంచిదో, తనకు ఏది ఇష్టమో అన్నదానిని అనుసరించి కార్యాలు చేపట్టుట జరుగుతున్నది. అనగా భౌతికమైన దృష్టితో వర్తించేవాడు బుద్ధిని అనుసరించడు.

భౌతికమైన సిద్ధాంతాలు మనపై బలవంతముగా ప్రభావము చూపుతున్నవి. అవి మనలను శాసించుచున్నవి. ఇమ్మోనియల్ కెంట్ తెలిపినట్లుగా 'ఈ భౌతిక సిద్ధాంతమును మనము కచ్ఛితంగా ఆచరించ వలసిన నియమము'. ఇట్టి భౌతిక సిద్ధాంతాలన్నీ తప్పకుండా ఆచరించ వలసినవే. ఈ శాసనాలకు అనుగుణముగా మన అభిప్రాయాలు మారుచున్నవి. ఈ శాసనాలను ఆచరించుటవలన మానవాళికి మంచి జరుగును. మన అభిప్రాయాన్ని బలవంతముగా మార్చు కుంటున్నాము. బుద్ధిని అనుసరించి కూడా ఈ శాసనాలను ఆచరించుట జరుగుతున్నది.

మంచి బుద్ధిగల మానవుడు ఈ శాసనాలను అమలు చేయుటలో పెద్దగా ఇబ్బందిపడడు. అనగా ఈ శాసనాల అమలును బలవంతముగా భావించడు. కారణము, ఈ శాసనాలు అమలుచేయడం వల్ల తనకు మంచి జరుగును కాబట్టి. అయితే భౌతికముగా ఇవి శాసించినప్పటికీ మానసిక స్థాయినందు అసమర్థతవల్ల కొంత సమన్వయము లోపించుచున్నది.

శాసనాలు రెండురకాలు. శాసనాలు మానవుని మంచికోసమే ఉద్దేశించ బడినవి. ఒకటి ఊహా జనిత శాసనాలు. రెండు శాసనాలు కారణాలతో ఋజువు చేయబడినవి. ఒక మంచి కార్యము ద్వారా మరియొక మంచి

కార్యానికి దారి తీయునను భావము కలిగించునది మొదటి రకము. ఒక మంచికార్యం, కారణంతో ఋజువు చేయబడి, నిస్సంశయముగా శాసన మనిపించుకొనును.

ఊహాజనిత శాసనాలు, ఒక మంచి కార్యము నిమిత్తము చేపట్టినవి. ఆచరణ యోగ్యము కావచ్చును, కాకపోవచ్చును. స్పష్టమైన విధానంలో ఆచరణ యోగ్యమైన శాసనాలు లక్ష్యమును తప్పక చేర్చును.

ప్రతి నియమముతో కూడిన ఆచరణకు ఒక పని సాఫల్యమగును. అనగా మనము అనుకున్న పనికి తగిన శాసనమును ఎంచుకోవాలి. ఈ శాసనాలు సూత్రములవంటివి. శాస్త్రములన్నియు ఆచరణయోగ్యములే. ఆచరణ వల్ల అనుభవజ్ఞానము కలిగి అవి నైపుణ్యముతో శాసనాలుగా పరిగణింపబడుచున్నవి.

మనము దైనందిన జీవితంలో ఆచరించవలసిన కర్మలు అసంఖ్యాకాలు. మనము అనుకున్నది సాధించడం ఒక సమస్య కానేకాదు. సమస్యల్లా మనము అనుకున్నది సాధించడానికి సరియైన నిర్ణయము తీసుకున్నామా లేదా అన్నదే.

ఒక కర్మకు ఒక లక్ష్యము ఉంటుంది. మనము శాసనాలను అనుసరించే సమయంలో మన లక్ష్యములను బట్టి శాసనాలను ఎంచుకుంటాము. మన లక్ష్యమును బట్టి యావత్ మానవాళి సహజముగా అందుకు తగిన శాసనాన్నే అనుసరించును. అందరి లక్ష్యము సుఖమే. ఈ సంతోషము అందరికీ అవసరం. సుఖంకోసం మానవుడు చాలా తాపత్రయపడుచున్నాడు. బుద్ధి పూర్వకంగా మానవుడు తన సుఖసంతోషాల కోసం నైపుణ్యముతో వ్యవహరించును. శాసన నిర్ణయమునకు పెద్దగా బుద్ధిని ఉపయోగింప పని ఉండుటలేదు. ఊహతో ఒక శాసనాన్ని

నిర్ణయించుకుని మనపని సాధించవచ్చును. ఈ విధముగా ఒక కార్యము తరువాత మరియొక కార్యము అన్నట్లుగా మనము ముందుకు సాగవచ్చును.

చివరగా శాసనాల గురించి ఒక మాట. శాసనాలను బేషరతుగా ఆలోచించాలి. ఈ శాసనాల వల్ల ఏమి సాధించామన్నది కాదు, ఎలా సాధించా మన్నది ముఖ్యం. ఒకసారి ఈ శాసనాల వల్ల మనకి మంచి జరుగునన్న అభిప్రాయము కలిగినపుడు, వాటిని ఇష్టముగాను, తప్పనిసరిగాను ఆచరించాలి.

ఈ శాసనాలు మన మనస్సుపై మూడు రకాల ప్రభావము చూపుతున్నాయి. మొదటిది నియమాలతో కూడిన నైపుణ్యము. రెండు వివేక విచక్షణలు. మూడు శాసనాలలోని నియమావళి. మొదటి అంశమైన నైపుణ్యము సాంకేతికపరమైనది. రెండవ అంశము వ్యవహారమునకు సంబంధించినది. మూడవ అంశము నైతికతతో కూడినది.

చేపట్టిన కార్యంలో ఇన్ని అంశాలు దాగి ఉన్నవా అని మనకు అనిపించ వచ్చు. నిజమే ఈ అంశాలన్నిటిని మనము గుర్తించాలి. మనము ఒక పని చేపట్టామంటే ఆపనిని చక్కగా పూర్తిచేసి లక్ష్యము సాధించాలి. వేరే అనవసరమైన ఆలోచనలు కూడదు. కాబట్టి అనుకున్నపనిని చక్కగా పూర్తి చేయడానికి నైపుణ్యము అవసరం. వివేక విచక్షణలు అవసరం మరియు నైతికమార్గము అభిలషణీయము. వాంఛనీయము. మనము ఎంత శ్రద్ధాభక్తులతో కార్యాలు నిర్వహిస్తే, అంత చక్కగా ఫలితాలు దక్కును.

మనము ఏపని చేసినా సుఖసంతోషాలనే కోరుకుంటాము. అయితే చేసే కార్యముపై ఏపాటి శ్రద్ధ చూపిస్తున్నాము? అన్నదే ఇక్కడ ప్రశ్న. ఈ ప్రశ్నకు సమాధానము, ఈ మూడు అంశాలలో మనము వివేక విచక్షణలతో నైతిక మార్గమునకు కట్టుబడాలి. అప్పుడే చేపట్టిన కార్యానికి అనుకున్న

ఫలితాలు దక్కును. అట్లు కాకున్న మనిషి మనిషికి ఒక్కొక్క రీతిన ఫలాలు అందుతాయి.

పై అంశాలను దృష్టిలో పెట్టుకుని కర్తవ్య నిర్వహణ నియమాలు రూపొందించ బడుచున్నవి. అప్పుజెప్పిన కర్తవ్యాన్ని తు.చ. తప్పక పాటించ వలసిన అవసరము ఉంది. అప్పుజెప్పిన కార్యములు బాధ్యతతో నిర్వహించ కున్న అసమర్థతకు దారితీయును.

ఉదాహరణకు, ఒక వ్యక్తి నిరాశనిస్పృహలకు లోనై ఆత్మహత్య చేసుకోవడానికి నిర్ణయించుకుంటాడు. తన నిర్ణయం వల్ల పదిమందికీ మేలు కలుగుతుందని భావిస్తాడు. తాను మంచిదారికే పరిమితమై చెడుకు దూరముగా ఉండేందుకే ఈ ఆత్మహత్యకు కారణమంటాడు. ఈ విధముగా ఆలోచించుట సరిగాదు. ప్రకృతిలో అన్ని నియమానుసారము సహజముగా జరిగిపోవుచున్నవి. మానవులంతా సుఖసంతోషాలతో జీవించాలన్నదే ప్రకృతి నియమము అటువంటప్పుడు ఒక వ్యక్తి ఆత్మహత్య చేసుకుంటే అది ప్రకృతి విరుద్ధమే అవుతుంది తప్ప, పదిమందిని మేలుకొలిపే కార్యము ఎలా అవుతుంది. కాబట్టి ఆత్మహత్య అనునది సరియైన నిర్ణయము కాదు.

మరొక సన్నివేశము చూడండి. ఒక వ్యక్తికి డబ్బు అవసరం. తనవద్ద డబ్బు లేదు. ఆ డబ్బుకోసం తాను అప్పుచేయాలి. ఆ ఋణం చేసేటప్పుడు అతను తిరిగి సకాలములో అతను తీసుకున్న ఋణాన్ని చెల్లిస్తానని మాటిస్తాడు. అలా మాటివ్వకపోతే తనకు ఋణము దొరకదు. అయితే తనకు తెలుసు, తాను ఋణం చెల్లించే పరిస్థితి తనకు లేదని. మనము దైనందిన జీవితంలో ఇటువంటి పరిస్థితులను ఎన్నో చూస్తాము. ఇక్కడ ఒక విషయం గమనించాలి. నిత్యం మనం చేసేపనులలో స్పష్టత ఉండాలి. మనము ఆడినమాట తప్పరాదు ఇచ్చిన మాట నిలబెట్టుకోవాలి. అప్పుడు మనమాటే వేదమవుతుంది.

మనము మనచుట్టూ ఉన్నవారి కర్మలను పరిశీలిస్తూ ఉంటాము. అందులో కొందరు ఆచరించే కర్మలకు వ్యతిరేకత వ్యక్తమగుతుంది. అందరి ఆమోదము లభించదు. మరి కొందరి కర్మలను పరిశీలించినట్లయితే ఆయా కార్యాలకు ఆంతరంగిక వ్యతిరేకత అనునది వ్యక్తము కాదు. అయినప్పటికీ అందరి ఆమోదమునకు నోచుకోదు. ఇందు, మొదట సూచించిన కర్మలు కర్తవ్య నిర్వహణకు పరిమిత మగుచున్నది. కాగా రెండవసారి సూచించిన కర్మలు విశాల దృక్పథముతో, సత్సంకల్పాలతో చేపట్టిన కార్యక్రమాలు.

ఇక్కడ ఒక ప్రశ్న ఉదయిస్తుంది. బుద్ధిని అనుసరించే వారంతా తాను అనుకున్నదే వేదము, తాను ఆచరించేదే సూత్రము. కాబట్టి అందరూ నన్ను అనుసరించాలి అని భావించవచ్చా? ఇది వారివారి బుద్ధిని అనుసరించి ఉంటుంది.

ఈ కర్మాచరణలో మరింత విచారించవలసి ఉన్నది. అలా విచారించినపుడు మనము చేయు కర్మలమధ్య సంబంధాలు గుర్తించగలము. మనము పరిశీలించే అంశము నైతికత యొక్క అంతర్మథనము. మనము ఒక కార్యము చేపట్టినప్పుడు ఆ కార్యము ఎలా జరుగుతున్నది అని ఆలోచించము, కానీ ఏమి కావాలో అని మాత్రము ఆలోచిస్తాము. అయితే మనము అనుకున్నది సాధించాలంటే దానికి తగిన ఆసక్తి ఉండాలి, కారణాలు ఉండాలి. అయితే కొంతమంది అనుకున్నవి సాధిస్తారు. కానీ వారికి శాస్త్రపరిజ్ఞానము ఉండదు. వీరికి అనుభవ జ్ఞానమున్నప్పటికీ శాస్త్రజ్ఞానము లేని కారణాన ప్రజలు వీరి నిర్ణయాలను ఆమోదించరు కాబట్టి కారణము, ఆచరణ రెండు కూడా పరిశోధనాంశాలే.

చేపట్టిన కార్యము మన ఇష్టానుసారమే అయినప్పటికీ, నియమాలతో కూడిన ఆచరణై ఉండవలెను. ఆ విధముగా నియమాల పాలన అన్నది కేవలం వివేకవంతుల లక్షణము మాత్రమే అయి ఉంటున్నది. మన ఇష్టము

మన పట్టుదలపై ఆధారపడి ఉన్నది. ఈ పట్టుదలకు మూలము కారణమై ఉంటున్నది. మరి ఈ సూత్రము బుద్ధిగలవారి అందరికీ వర్తించవలెను కదా.

అలాకాక ఒక కార్యము చేపట్టడానికి గల కారణము కనుగొనవలెను. ఆవిధముగా లక్ష్యమును సాధించు మార్గము కనుగొనవలెను. కోరిక అనునది ఒకకార్యము చేపట్టడానికి ప్రేరణ అవుతున్నది. అయితే లక్ష్యసాధన మాత్రం ఒక శక్తిగా ఆ కార్యమును ముందుకు తీసుకుపోతున్నది. ఈ విధముగా బుద్ధిని అనుసరించు వారికి కోరిక ఒక ప్రేరణాశక్తిగాను లక్ష్యము మన ఇష్టాన్ని బలపరిచే కార్యమును ముందుకు తీసుకువెళ్ళేదిగాను గ్రహించడమవుతుంది.

మనము ఎన్నో కోరికలు కోరుకుంటాము. అయితే ఈ కోరికల సాధ్యా సాధ్యములను ఆలోచించవలెను. ఒక బుద్ధిమంతుడు తన కోరికలను ఆచరణలో పెట్టడానికి ప్రయత్నిస్తాడు. కోరిక ననుసరించి వారు ప్రయత్నముతో సఫలులవుతారు. అయితే మనలో చాలామంది సాధ్యా సాధ్యాలను గుర్తించక కోరికలను అమలు పరచాలనుకుంటారు. ఇటువంటి కార్యాలు పేరుకు మాత్రమే కార్యములనిపించును.

ఎవరైనా ఒక మహత్కార్యమును తలపెట్టిన, ఆ కార్యములోనే ప్రేరణశక్తి, ఆచరణశక్తితోపాటు ఆచరణ నియమాలు కూడా ఇమిడి ఉంటున్నవి. అట్టి శుభప్రదమైన కార్యాలు శాసనములై వర్ధిల్లును.

బుద్ధిమంతులు తమ వివేక విచక్షణలతో గమ్యమును, లక్ష్యములను నిర్దేశించుకుంటారు. తన లక్ష్యాలకు అనుగుణముగా కోరికలను ఎంచుకుంటారు. అక్కరలేని వ్యాపకాలను తగ్గించుకుని, తమ లక్ష్యం వైపే శ్రద్ధాభక్తులు కలిగిఉంటారు. వీరు తాము ఆశించిన లక్ష్యాలను నెరవేర్చు

కుంటారు. తమ ఆచరణలతో నలుగురిలో గుర్తింపు పొందుతారు అందరికీ ఆదర్శవంతులవుతారు.

కాబట్టి మానవులందరికీ స్ఫూర్తిని కలిగించు కోరికలు, లక్ష్యముపై ఇచ్ఛా శక్తిని పెంచి ఆచరణను ప్రోత్సహించు విధమున కార్యాలు చేపట్టవలెను. ఉత్తమ మైన కోరికలు, ఉత్తమ పురుషులు సాధింతురు. సామాన్యమైన కోరికలతో సామాన్యులు ప్రయత్నము చేయుదురు. కాబట్టి యావత్ మానవాళిని దృష్టిలో పెట్టుకుని రూపొందించిన ఉత్తమ కోరికలను వివేకవంతులు ప్రేరణకలిగి, తమ ఇచ్ఛాశక్తితో వాటిని సాధించి మానవాళికి తమ వంతు బాధ్యతను నిర్వహించవలెను.

ఉత్తమమైన కార్యాలను సాధించవలెనన్న ఉత్తమమైన గుణాలను అభివృద్ధి చేసుకోవలెను. ఉత్తమ గుణాలు అభివృద్ధి కావలెనన్న సత్కర్మలకు పూనుకొనవలెను. మొట్టమొదట మానవుడు తన కర్తవ్యకర్మలను విధిగా నిర్వహించవలెను. అంతేకానీ అనుకున్నది సాధించలేదని నిరుత్సాహముతో ఆత్మహత్యలకు పాల్పడరాదు. మానవుడు యంత్రము కాదు. పనికిరాని యంత్రమును ప్రక్కన పడవేసినట్లుగా, మానవుడు తనను తాను ఎన్నడూ నిరాశపరచు కొనరాదు. జీవితము కష్టసుఖాలతో సాగును. ద్వంద్వములతో కూడినదే జీవితము. ఈ ద్వంద్వములే లేకపోతే మానవ అభివృద్ధే సాగదు. కాబట్టి ఆత్మహత్య తలంపు సరికాదు.

వివేక విచక్షణలతో వర్తించువాడు తన మాటకు విలువనిస్తాడు. చెప్పింది చేస్తాడు. నలుగురిలో వ్యవహరించేటప్పుడు తన సమగ్రతను నిరూపించుకుంటాడు. తన వ్యక్తిత్వమే తన లక్ష్యము. మానవత్వాన్ని నిలబెట్టుకుంటాడు. అలాకాక మనలో వంచన స్వభావులు ఉంటున్నారు. వీరు నలుగురిలో తమ మాటను పోషించుకోరు. మానవతా విలువలను పోషించక మానవత్వాన్ని కోల్పోవుచున్నారు.

ప్రతి ఒక్కరు మానవత్వమును ఆచరించి పోషించాలి. ఎవరికీ ఇబ్బంది లేదనుకుంటూ, మానవత్వమునకు వ్యతిరేకముగా ప్రవర్తించరాదు. ప్రతి ఒక్కరు తమ ఆచరణలతో సమానత్వమును పెంచాలి, పోషించాలి. నిరంతరం మానవత్వాన్ని దృష్టిలో పెట్టుకుని వర్తించాలి.

మనము ఆచరించే సత్కార్యాలు ఎల్లప్పుడు సాటిమనిషి మేలుకోరి చేయవలెను. మనము ఏ పని చేసినా సాటివారికి ఇబ్బంది కలుగ జేయరాదు. మనకు మనకి మంచి జరగాలని అనుకుంటాము. అదే విధంగా ప్రతి ఒక్కరు తమకు మంచి జరగాలనే అనుకుంటారు. మనము ఇతరులనుండి మంచిని ఆశించినట్లే ఇతరులు కూడా తమకు తమ చుట్టూ ఉన్నవారినుండి మంచిని ఆశిస్తారు. ఈ నేపథ్యములో కేవలం ఒక్కవ్యక్తి తమ సాటివారికి నష్టము గలిగించినంతలో సంఘానికి పెద్ద నష్టమేమీ జరగదు, అయినప్పటికీ సంఘంలో అందరితో సామరస్య ధోరణితో జీవనానికి అలవాటుపడాలి.

మనము ఎంతో అదృష్టవంతులం. మనందరికీ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో జీవించే హక్కు ఉన్నది. మనము ఏదీ అరువుగా తెచ్చుకోము. మనందరికీ వివేక విచక్షణలు కలవు. ముందు విషయాలను గ్రహించి, ఆచరించి, అనుభవ జ్ఞానాన్ని సంపాదిస్తారు. ఈనాడు మనము ఆచరించే కర్మలు మానవతా దృష్టితో మొదలు పెట్టకపోవచ్చును, కానీ మానవత్వమే మన గమ్యమని మనము గుర్తించవలెను. వివేకవంతుడు తన ప్రతిచర్యను మానవతా దృష్టితోనే ఆచరిస్తాడు. ప్రతి ఒక్కరు ఇష్టానుసారము వర్తిస్తారు. అయితే అందరి ఆమోదమైన పనులకు వివేకవంతుడు అలవాటుపడతాడు. వివేకవంతుడు తన ఆచారవ్యవహారాలు న్యాయపరంగా ఉండేలా తీర్చిదిద్దుకుంటాడు. అందరి ఆమోదమును పొందుతాడు.

ఆదేశాలు లేదా శాసనాలుగా భావించిన ప్రవర్తనావళికి న్యాయ పరమైన సమ్మతము లభించియుండవలెను. అవి వివేకవంతులు అధికారముగా భావింతురు. ఇట్టి ఆదేశాలలో ఏ విధమైన పక్షపాతవైఖరి ఉండదు. మానవుడన్నవాడు సహజంగా తన వివేక విచక్షణలతో, ఇచ్ఛాపూర్వకముగా నైతిక కర్మలకు అలవాటుపడవలెను. ఈ కర్మలు ప్రకృతి నియమాలతో ఏకీభవించి సర్వ మానవాళికి అంగీకారయోగ్యమై ఉంటున్నవి. కెరిట్ మహాశయుడు ఇట్టి ఇచ్ఛాశక్తిని సంపూర్ణ స్వేచ్ఛా ప్రతిపత్తులు కలదిగా వివరించెను.

వివేకవంతులు మానవాళికి అందించిన సూత్రాలు, అన్ని పరీక్షలకు నిలబడి, నలుగురి ఆమోదాన్ని పొందుచున్నవి. అనగా, ఈ సూత్రాలు ఆయా ప్రదేశాలలో ఆచరణకు స్వీకరించబడుచున్నవి. ఈ సూత్రాలు ఏ ఒక్కరి అభిప్రాయముగా భావించరాదు. ఈ సూత్రాలను వివేక చక్షణాలతో అందరి ఆమోదాన్ని పొందినవిగా ఉంటున్నవి. వివేకవంతులు అందరూ ఇట్టి సూత్రాలకు కట్టుబడి ఉంటారు. ఈ సూత్రంతో కూడిన జీవనానికి అందరూ బద్ధులై ఉంటారు.

వివేకవంతులు తాము ఆచరించి మానవాళికి అందించిన సూత్రాలను ఎన్నటికీ మీరరు. తమ సూత్రాలను తాము ఇష్ట పూర్వకంగా, స్వేచ్ఛగా ఆచరిస్తారు. తాము ఆచరించు సూత్రాలు నైతికతను పొందు పరచుకుని గమ్యం వైపు నడిపిస్తారు. నైతికత అవసరమని, ఒక శాసనమని, సాక్ష్యసాధనకు తోడ్పడునని వివేకవంతులు గ్రహింతురు. ఇట్టి నైతికతతో కూడిన కర్మలు అందరి ఆమోదమును పొందుతారు. ప్రతి ఒక్కరు తమ తమ కర్తవ్యకర్మల నిర్వహణలో నైతికరీతిలో బాధ్యతతో కర్మలాచరించవలెను.

కర్తవ్యము అనునది మన భావాలపైన, స్పందనలపైన, ఉద్దేశ్యాల పైనా ఆధారపడదు. అది వ్యక్తులమధ్య సంబంధాలు అభివృద్ధికి దోహద పడును. ప్రతి సూత్రానికి ఒక కారణం ఉంటుంది. అదే రీతిలో ఇష్టా యిష్టాలు కూడా ఉంటుంటాయి. ఇదే రీతిన ప్రతికార్యము కూడా ఇతర కార్యాలతో అవినాభావ సంబంధము కలిగి ఉంటాయి. వివేకవంతులు ఈ కారణముచే తమకు నచ్చిన సూత్రాలకు కట్టుబడి ఉంటారు.

మనకర్మల ముగింపుగా మనము ప్రతికర్మకు ఒక విలువను నిర్ణయిస్తాము. ఆ విలువ ధనరూపమున ఉండవచ్చు లేదా హెూదా రూపమున ఉండవచ్చు. ధనరూపమున విలువకట్టినప్పుడు, అంతకు సమాన విలువతో ఇతర వస్తువులతో మార్పిడి చేయవచ్చును. అయితే విలువ కట్టలేనిదే హెూదా. సాధారణంగా ప్రతి ఒక్కరి నైజము ప్రకారము మార్కెట్ విలువను అనుసరించి ఫలితాన్ని ఆశిస్తారు. సుఖసంతోషాలను ఆశించేవారు ధనమునకు ప్రాధాన్యతను ఇస్తారు. కానీ కొన్ని షరతులకు, విలువలకు మాత్రమే కట్టుబడినపుడు అక్కడ ధనము ప్రమేయము ఉండదు. కేవలం హెూదా మాత్రమే ఉంటుంది.

కాబట్టి నైతికత అనునది ధనమునకు అతీతమైనది. ఈ నైతికతే గమ్యమై ఉంటున్నది. ఈ నైతికత మరియు మానవత్వములు నైతిక మార్గమున పయనించినపుడు మాత్రమే హెూదా ఏర్పడును. నైపుణ్యము మరియు పనిమీద శ్రద్ధాభక్తులు కలిగిన మార్కెట్టులో మంచిగా ధనము సంపాదించవచ్చును. మన తెలివితేటలకు, సమయస్ఫూర్తికి మరియు సరదాగా కలుపుగోరుతనమునకు సమాజంలో మంచి గుర్తింపు, విలువ ఉండును. మాటమీద నిలబడటం మరియు మనము ఆచరించే కర్మలపై సదభిప్రాయమును కలిగి ఉండటం అనునవి ఆంతరంగికముగా ఎంతో విలువను సముపార్జించును.

నైతికత అందరికీ అవసరమే. నైతికతతో కూడిన కర్మాచరణ వల్ల వివేకవంతులు అందరికీ ఆదర్శమవుతున్నారు. నైతిక కర్మాచరణలతో వీరి స్వభావము కూడా వ్యక్తమవుతున్నది. వీరు నైతిక మార్గానికి కట్టుబడి ఉంటారు. అందరి యోగక్షేమాలు కోరి ఆచరించే ఈ కార్యక్రమాలలో తమవంతు కర్తవ్యకర్మలను వీరు ఆచరిస్తారు, పాలుపంచుకుంటారు.

ఏ వస్తువునకైనా ధర్మము ననుసరించే విలువ ఉంటుంది. అన్ని వస్తువులకు విలువలను తెలియజేసేది ఒక గౌరవప్రథమైన స్థానము. ఆ స్థానము నిర్మలమైనది, నిశ్చలమైనది, నిస్వార్థమైనది మరియు ఎట్టి షరతులకు లొంగనిది. అట్టి స్థానమునకు వివేకవంతులు ఎంతోగౌరవాన్ని ఆపాదిస్తారు. కాబట్టి సర్వస్వతంత్ర్య స్వయం ప్రతిపత్తితో అనునది సామాన్యమానవులకు, వివేకవంతులకు ఆధారమై ఉంటున్నది.

అన్ని సూత్రాలు ఒక ఆకారమును ఏర్పరచుకుంటున్నవి. ఈ సూత్రాలు సహజముగా ప్రకృతి నియమాలను ఇముడ్చుకుంటున్నాయి. ప్రతి సూత్రము ఒక లక్ష్యము అందించును, గమ్యమును చేర్చును. కాబట్టి వివేకవంతులు ఈ సూత్రాలను ఆచరించే సమయములో, నియమాలకు కట్టుబడి ఉంటారు. ఇట్టి నియమాలు సామరస్య ధోరణితో ఆచరణకు పూనుకోవాలి. నియమాలు లేదా క్రమశిక్షణ అనునది మొదట్లో భారమనిపించవచ్చు, కానీ వాటి విలువను గ్రహించిన మీదట అవి అవసరంగా గుర్తించిన రోజున అవి భారమనిపించదు. అప్పుడు ఆ నియమాలను సహజంగానే ఆచరించడం జరుగుతుంది. మొదట్లో మనకు ఈ నియమాలు అవసరం లేదనుకుంటాము, కానీ క్రమేపీ వీటికి అలవాటుపడ్డాక, వాటి విలువను గ్రహించాక, అవి చాలా ముఖ్యమని గ్రహించడం జరుగుతుంది. ఈ విధంగా నైతిక కర్మాచరణలో మొదట్లో మనము ఉత్సాహము చూపకపోవచ్చు, కానీ కార్యము ముందుకు సాగే కొద్దీ ఆ కార్యముపై మక్కువ పెరుగుతూ ఉంటుంది.

ఒక మంచి సూత్రం అందరికీ సమ్మతమయినది. ఆ సూత్రము మంచినే తప్ప చెడును అందించదు. ఇట్టి సూత్రాచరణలో బేధాభిప్రాయాలకు చోటులేదు. మనము ఈ సూత్రాలను మన ఇష్టము వచ్చినట్లు ఆచరించకూడదు. నియమనిబద్ధతతో ఇట్టి సూత్రాల ఆచరణకు పూనుకోవాలి. సూచించిన నియమాలకు లోబడి ఆచరించినంతవరకు ఎట్టివిభేదాలు కానరావు. అందుకే వీటిని శాసనాలుగా మనము గ్రహించవలసి యున్నది. ఈ కారణముచే అందరికీ మంచిని అందించే నీతినియమాలను, సూత్రాలను ఇష్టపూర్వకంగా ఆచరణకు స్వీకరించవలెను.

ఏ కార్యములైనను నియమనిబంధనలకు లోబడి ఆచరించినప్పుడే వాటి ఘనతను మనము గ్రహించగలుగుతాము. కాబట్టి ఈ సూత్రాలను అనుసరించ డానికి స్వీకరించినపుడే, ఈ సూత్రాలకు అనుబంధము కలిగిన నియమ నిబంధనలను మనము ఇష్టపూర్వకముగా స్వీకరించ వలెను. ప్రతి సూత్రము స్వయం ప్రతిపత్తి కలది, లక్ష్యమును అందించేది. కాబట్టి శాసనములై మానవుని శాసించుచున్నవి.

మానవులు తమ ఇష్టానుసారము కర్మలనాచరించెదరు. మంచి ఉద్దేశ్యముతో నియమాలను ఆచరించవచ్చును, లేదా నియమనిబంధన లను త్రోసిపుచ్చవచ్చును. ఒక కర్మాచరణలో నియమ నిబంధనలను పాటించకపోవడ మనునది అనైతిక చర్యతో సమానమవుతుంది. అట్టి అనైతిక కర్మలకు శిక్షలను విధించవలెను. కాబట్టి కార్యము సంకల్పించి నప్పుడు, ఆ కార్యమును చేపట్టువారు నైతికమార్గమునే ఎంచుకోవాలి.

మానవులంతా ఈ నియమాల విషయంలో సమానమే. వారు ఈ నియమాలకు అతీతులు కారు. మానవుడు తాను ఆశించినరీతిలో నడువవలెను. మానవుడు తాను మానవత్వముతో జీవించాలని, సుఖ

సంతోషాలను ఆశించి, నైతిక మార్గమున పయనించవలెనని కోరుకొనవచ్చును. ఆ కోరికలు ఉన్నంత మాత్రమున సరిపోదు. మానవుడు సంఘజీవి. అందరికీ సంబంధించినవాడు. కాబట్టి వ్యక్తి ప్రాతిపదికన అతని చర్యలను మనము నిర్ణయించకూడదు. సమిష్టిగా మానవుల కార్యక్రమాల మంచిచెడులను, సమర్థతను నిర్ణయించవలెను. మానవులకు సమిష్టిదృక్పథము అత్యవసరము.

స్కూపనోయర్ మహాశయుడు ఇట్లు తెలిపెను. ఆసక్తి అనునది ఒక స్వచ్ఛమైన అజ్ఞానముతోకూడిన నిరంతరప్రేరణ. సర్వ సామాన్యంగా స్వేచ్ఛ అనునది భౌతిక జీవనమునకు పరిమితమై ఉంటున్నది. తన కళ్ళకు కనిపించే దృశ్య ప్రపంచమునే నిజమని గ్రహించి, సమాజంలోని తారతమ్యాలను, హెచ్చు తగ్గులను గుర్తిస్తూ, మానవుడు స్వేచ్ఛ వహిస్తున్నాడు. ఏ విధముగానయితే మానవుని అనుసరించి అతని నీడ ఉండునో, అదేవిధముగా మానవుని అనుసరించి అతని ఇచ్ఛఉంటున్నది. ఈ ఇచ్ఛ అనునది స్వతంత్రమైనది, ఆంతరంగికమైనది, అదే సర్వజగత్ సారమై ఉంటున్నది.

ఈ గోచరమైన దృశ్యప్రపంచం వస్తువిజ్ఞాన సమాహారము. ఇట్టి దృశ్య ప్రపంచంలో మానవుడు స్వేచ్ఛ కలిగి ఉంటున్నాడు. ఇట్టి దృశ్య ప్రపంచం కాల, కారణ, కర్మలతో ఏర్పడినది. దేహముతో ఉన్నంత వరకు ఇట్టి జగత్తులో తన సంబంధము తాత్కాలికమై ఉంటున్నప్పటికీ, తన ఉనికిని శాశ్వతముగా నిరూపించాలని ఆసక్తి కలిగి ఉంటున్నాడు.

మన ఇచ్ఛ పూర్తిగా స్వేచ్ఛాయుతమైనది, తన ఉనికిని స్వయంగా ప్రకటించు శక్తి కలది. ఈ ఇచ్ఛాశక్తి ఏ నియమనిబంధనలకు లోబడనిది. ఈ దృశ్య జగత్తు కారణమునకు లోబడి నాలుగు విధములుగా ఉంటున్నది.

ప్రతివస్తువునకు కొన్ని ధర్మాలు ఉంటున్నవి. ప్రతివస్తువు తన ఉనికిని తెలుపుటే కాక ఈ జగత్తులో ఒక భాగమై ఉంటున్నది. ఈ వస్తువుల పట్ల ఇచ్ఛాశక్తి సర్వ స్వతంత్ర్యముగా ప్రకటిత మగుచున్నది. ఈ జగత్తులో జరిగే పరిణామ క్రమంలో ఈ వస్తువులు నిరంతరము తమ ఉనికిని చాటుకుంటూ ఉంటాయి. ఈ కాలచక్రమును ఆపుశక్తి దేనికీ లేదు. ఇది నిరంతరము సాగవలసినదే. ఇట్టి పొత్తు నియమనిబంధనలకు లోబడినది. మానవుని ఇచ్ఛ సర్వస్వతంత్రమైనది. ఈ రెండింటికీ నడుమ వున్న సంబంధమే రెండు విషయాలను ప్రకటించుచున్నది. అవి స్వేచ్ఛతో కూడిన అవసరము.

మానవుని ఇచ్ఛ అజ్ఞానముతో కూడి ఉండును. మానవుని అంతరంగము అతని ఆత్మలో ఇమిడి ఉంటున్నది. అంతరాత్మ స్వచ్ఛమైనది, నిగూఢమైనది. స్కూపనేయర్ అభిప్రాయం ప్రకారం ఇచ్ఛాశక్తి అనునది అన్నిటికి మూలము మరియు పవిత్రమైనది (నకిలీ కానిది). జ్ఞానమనునది ఈ ఇచ్ఛాశక్తికి జతపరచడమౌతున్నది. ప్రతిమానవుడు తన ఇచ్ఛాశక్తిని బట్టే తానేమిటో నిరూపించుకుంటాడు. జ్ఞాన సముపార్జనతో అతని ఇచ్ఛాశక్తిలో కూడా మార్పులు కలుగును. ఈ అనుభవజ్ఞానముతో సత్యదర్శనము చేసుకుంటాడు. అతనికి తెలిసిన జ్ఞానమునే వ్యక్తము చేయును. అంతకుమించి అతను ఏమీ చేయ సంకల్పించడు. మానవుడు తన ఇచ్ఛాశక్తికి జ్ఞాన సముపార్జన ఆవశ్యకతను గుర్తించి కృషి సలుపవలెను.

మనమాచరించే మంచిని పోలికతో గ్రహించవచ్చును. ఇదే పోలికతో మన లోని ఇచ్ఛాశక్తిని కూడా పరిశీలించవచ్చును. మన లక్ష్యాలను సాధించు దిశలో మన ఇచ్ఛాశక్తి మనకు ఎంతగానో తోడ్పడును. నైతిక విలువలకు కట్టుబడి, మంచిమార్గాన పయనించు వారికి ఇచ్ఛాశక్తి ఎంతో సహాయకారిగా ఉండును.

మనము ప్రతి విషయాన్ని మంచిగానే భావిస్తాము. అయితే ఒకరు ఒప్పుగా భావించిన దానిని మరొకరు తప్పుగా భావించడం జరుగుతుంది. మొదటిది ప్రస్తుత విషయం. కొందరు ప్రత్యక్షానికి, ప్రస్తుతానికి విలువనిచ్చి తమ అభిప్రాయమును వ్యక్తము చేస్తారు. రెండవ రకమువారు పరోక్షానికి, భవిష్యత్ ప్రణాళికను దృష్టిలో పెట్టుకుని తమ అభిప్రాయాలు వ్యక్తము చేస్తారు.

ఇచ్ఛాశక్తి కూడిన కార్యము మంచిదిగాను, ఇచ్ఛాశక్తిలేని కార్యము చెడుగాను మనము భావించుకుంటాము. అందరికీ అన్నిటికంటె ఉత్తమమైన కోరిక ఒకటి ఉంటున్నది. ఆ కోరికను కోరుకుంటె మిగిలిన కోరికలు క్రమేపీ తగ్గిపోతాయి. ఇట్టి ఉత్తమమైన కోరికను సాధించాలన్న ఇచ్ఛాశక్తి అందరూ కలిగి ఉండాలి. అయితే అందరికీ ఇట్టి కోరిక జనించాలనడం జరిగే విషయంకాదు కదా కనీసం ఆలోచించడానికి కూడా వీలుపడడంలేదు. ఈ జగత్తులో శాశ్వతమైన సంతృప్తిని, ఆనందమును కలిగించు ఇచ్ఛాశక్తి ఏమీలేదు. ఒకవేళ శాశ్వతమైన సంతృప్తిని, ఆనందమును అందించు కోరిక ఏదైనా ఉన్నయెడల, ఆ కోరిక వల్ల ఆత్మోన్నతి మరియు ఇచ్ఛాశక్తి నిర్మూలన జరుగును. ఈ కారణముచే మనలో అలజడి తగ్గి ప్రశాంతత చేకూరును. ఆ ప్రశాంతత, సంతృప్తి ఈ జగత్తును చక్కగా విశ్లేషించుటలో తోడ్పడును. ఈ రీతిగా సత్యాన్ని గ్రహించి, మంచి మార్గమునకు పరిమితమై, తన ఉద్ధరణకు ఉపక్రమించును. ఈ అంతరంగ ప్రహసనము ఆత్మకు సంబంధించినది.

ఒక వ్యక్తి చెడుకార్యము చేయసంకల్పించినపుడు, అతనిని అడ్డగించ లేనపుడు, అతనిని దుర్మార్గునిగా భావిస్తాము. చేసేది మంచిపని లేదా చెడుపని అని సామాన్యంగా అందరికి తెలుస్తుంది. అంటే ఒక చెడుపని సంకల్పించినపుడు ఆ వ్యక్తి ఇతరుల అభిప్రాయముతో కలవక బేదాభి

ప్రాయంతో వ్యవహరిస్తున్నాడని అర్థమవుతున్నది. ఈ తప్పిదానికి కారణము అహంకారము. ఈ అహంకార కారణము వలన రెండు విషయాలు గోచరమగుచున్నవి. ఒకటి, అనుకున్నది చేసెయ్యాలన్న బలమైన కోరిక, తపన. రెండు, తాము చేయాలనుకున్న పనిపట్ల స్వార్థముగా ఆలోచించుట. అనగా అందరి దృష్టిలో ఆ కార్యము తప్పని తెలిసినప్పటికీ స్వార్థముచేత అదే తప్పును చేయడానికి సిద్ధపడుదురు. అహంకార పూరిత కార్యాలు పూర్తిగా స్వార్థముతో కూడినవి. ఈ చెడు కార్యము చేయుటవల్ల ఇతరులకు నష్టము జరిగినా తనకు ఏమీ పట్టదు. చెడు శీలమునకు ప్రధానముగా ఈ రెండు లక్షణాలు కారణమై ఉంటున్నవి. ఇక్కడ గ్రహించవలసిన విషయము. ఇట్టి అహంకారంతో వర్తించు ఇచ్ఛాశక్తి కారణాన మానవుడు కష్టాల పాలగుచున్నాడు. ఎవరిలో ఈ ఇచ్ఛాశక్తి ఎక్కువగా ఉంటుందో వారు కష్టాలనుండి విడదీయరాని బంధంగా ఏర్పడుతుంది. దుర్మార్గులు అంతరంగమున చాలా బాధకు గురి అగుచుందురు. వారు ఆ విధముగా అంతరంగమున బాధపడుచు, సాటివారి బాధలను చూసి లోలోపల సంతోషంతో పొంగిపోవుదురు. ఇట్టి క్రూరత్వము, మూర్ఖత్వము వీరిలో వ్యక్తమగును. ఈ నేపథ్యంలో ఇతరులకు కష్టము, నష్టము కలిగించడం కూడా తన ధ్యేయముగా మారిపోతుంది.

ఈ పై విషయమును మరో విధముగా కూడా చెప్పవచ్చును. అసూయ కలిగిన వ్యక్తి ఇతరులకు ఉన్నదానిని చూసి ఓర్వలేక బాధపడతాడు. ఇతరులకు కూడా తనకుమాదిరి లేమితో బాధపడుచున్నాడని తెలిస్తే వీరికి అట్టి బాధ తగ్గును. ఇతరులు బాధపడటం, ఇతరులు అనారోగ్యముతో బాధపడటం చూస్తే వీరికి ఏ బాధగానీ మార్పుగానీ కలుగదు. ఇతరుల కష్టాలు చూసి వీరి బాధ కొంత నివారణమగును. అనగా ఇతరుల కష్టాన్ని

చూసి వీరు సంతోషముగా ఉందురు. ఇట్టి ఇచ్ఛాశక్తి కలవారిలో క్రూరత్వము, దౌర్జన్యము, హింస మొదలైనవి ప్రజ్వలిస్తాయి.

చెడుకార్యాలు చేయువారు అధికముగా తమ ఇచ్ఛాశక్తిని ఉప యోగిస్తుంటారు. వారి అంతరాత్మ వారి చర్యలను ఖండిస్తూనే ఉంటుంది. వీరు ఎన్ని దుర్మార్గపు పనులు చేస్తున్నప్పటికీ వారి అంతరంగంలో సత్యమేదో గ్రహిస్తూనే ఉంటారు. వీరు కూడా తమ తప్పులను గ్రహించి పశ్చాత్తాపము చెందుతారు.

మనము, మంచిచెడుల హద్దుల మధ్య నడిచే వ్యక్తిని, న్యాయమైన వ్యక్తిగా భావిస్తాము. అతను ఏ విధమైన ప్రలోభాలకు గురికాడు. ఈ వ్యక్తి తన ఇచ్ఛాశక్తిని ఇతరులపై రుద్దడు. అంతేకాదు ఇతరుల ఇచ్ఛాశక్తిని గౌరవిస్తాడు కూడా. ఇతరుల సంపదలను కాపాడుతాడు. ఇదంతా తన ఇష్టప్రకారము చేస్తాడు. ఇతని ఆదరణ న్యాయబద్ధంగా ఉంటుంది. కాబట్టి న్యాయంగా, అంతరంగమున ఆలోచించి నట్లయితే, ఎవరికివారు తమ ఇచ్ఛాశక్తితో వ్యవహరించవలెను కానీ, ఇతరుల ఇచ్ఛా శక్తి తూలనాడటం, కించపరచడం చేయరాదు.

మనలో సహజంగా చాలామంది సామాజికన్యాయాన్ని కోరుకుంటారు, ఆచరిస్తూ ఉంటారు. సాటిమనిషి కష్టాలలో ఉంటే వారి కష్టాలను చూస్తూ ఊరుకోరు. సహాయ తత్వములేనివారు ఇవేమీ పట్టించుకోరు. ఇతరులకు సాయపడేవాడు ఇతరుల కష్టాలను చూసి తన కష్టాలుగా భావిస్తాడు. తనకు, ఇతరులకు మధ్య ఉన్న అంతరములు ఇతనికి పట్టవు. ఇతను అందరితో కలసిపోతాడు. మనుషుల మధ్యనున్న బేధభావాలను మిధ్యగా భావిస్తాడు. అందరి కష్టనష్టాలు ఒకటిగానే భావిస్తాడు. అందరి ఇచ్ఛాశక్తిని గుర్తించి గౌరవిస్తాడు. ఈ కారణముచే తనకు హాని చేసిన దుర్మార్గులను సహితము క్షమతో వ్యవహరిస్తాడు. త్యాగభావముతో ఇతరుల కష్టాలకు స్పందించి వారికి సాయం చేస్తాడు.

ప్రతి ఒక్కరు విశాలభావాలను అలవరచుకోవాలి. మన హృదయమును విశాలభావాలతో నింపుకోవాలి. మన హృదయము నుండి సంకుచిత భావాలను విడనాడాలి. మన మనస్సును పవిత్రముగా, మంచి భావాలతో పెట్టుకోవాలి. పవిత్రమైన మనస్సు, విశాలమైన హృదయం గలవారు తమను తాము అందరిలో చూసుకుంటారు. ఎవరయితే ఈ స్థితిని అనుభవిస్తారో వారు ధన్యులు, సత్పురుషులు. ఇట్టి స్థితిలోని వారు మానవులంతా ఆత్మస్వరూపులుగా గుర్తించి, ఆనందాన్ని అనుభవిస్తారు.

మనిషిలో ఎప్పుడైతే వైరాగ్యం, త్యాగం బాగా పెరిగి ఉన్నత స్థితికి చేరుకుంటాడో, అతనిలో అనేక మార్పులు కలుగుతాయి. అవి అహంకార నిర్మూలన, భవబంధాల నుండి విముక్తి, తన ఇచ్ఛాశక్తిని పూర్తిగా కోల్పోవుట, వైరాగ్యము మొదలైనవి. ఇట్టి సద్గుణాలతో ఇతను సన్యాసిగా మారిపోతాడు.

సన్యాసి జీవితమునకు కావలసిన ముఖ్యమైన లక్షణాలు, సహజంగా పవిత్రమైన జీవనవిధానము, ఇచ్ఛాశక్తిని పూర్తిగా కోల్పోవుట, సామాన్యమైన జీవితానికి అలవాటుపడుట, ఇతరుల కష్టాలను చూసి, స్పందించి వారికి తగిన సాయం చేయుట, తన శరీర పోషణ నిమిత్తము పరిమితమైన సాత్విక ఆహారము స్వీకరించుట, మరియు అన్నివేళలా అంతర్దృష్టితో భగవంతునితో సంబంధాన్ని గరుపుచు భగవంతుని జ్ఞానమును పెంచుకుంటూ, దానిని ఇతరులతో పంచుకుంటూ నైతికమైన, పవిత్రమైన జీవన విధానాన్ని ఆచరిస్తూ ఉంటాడు. అంతరంగమున ఏది మంచి, ఏది చెడు? అని అందరూ ఆలోచిస్తూ ఉంటారు. గ్రహిస్తూ ఉంటారు. కానీ సన్యాసి స్థితికి ఎదిగినవాడు మాత్రమే అంతరాత్మ ప్రబోధాన్ని గౌరవించి ఉన్నత స్థితికి చేరుకుంటాడు.

# 18. నైతికత - వ్యక్తిగతం సాంఘికం

## అ. నైతికత  వ్యక్తిగతం మరియు సాంఘికం :-

మానవుడు తాను ఆచరించే సంస్కృతి సంప్రదాయాలను తన వంశీకులకు ఒక తేలికైన, నూతనమైన పద్ధతిలో అందించు ప్రయత్నము చేయుచున్నాడు. అవి లిఖిత రూపముగాను, బోధనల రూపముగాను మరియు కళాసృష్టి ద్వారాను. వీటిని సరళమైన భాషలో తన వంశీకులకు అందించుచున్నాడు. మానవ వికాసము యొక్క ముఖ్య విశేషము ఏమనగా, అది మనిషి యొక్క సాంఘిక జీవనవిధానముపై ఆధారపడియున్నది. మానవ వికాసంలో ఎంతో ఆచరణ జ్ఞానము మరియు సంఘ అభివృద్ధి కనబడుచున్నది.

నైతిక జీవన విధానముపై ఆధారపడి మానవ అభివృద్ధి సాగుతున్నది. ఒక బిడ్డ పుట్టి మాటలు పలికేముందే ఆ బిడ్డ తన తల్లిదండ్రులతో, కుటుంబ సభ్యులతో కానీ, నర్సుతో కానీ సాంఘిక సంబంధము నెలకొల్పుతుంది. మన సంఘంలో ఒక నూతన వ్యక్తిని కలుస్తున్న సందర్భంలో మనము ఒక పాఠము నేర్చుకుంటాము. ఆ నూతన బాలునికి మంచి వ్యక్తిత్వమును అందించడానికి ప్రయత్నం చేస్తాము. ఈ నేపథ్యంలో ఆ నూతన శిశువు భవితవ్యమునకు తల్లిదండ్రులు ఎంతో త్యాగమునకు సిద్ధపడుతున్నారు. ఇదంతా మనము సూక్ష్మంగా గ్రహించినట్లయితే మనకు రెండు విషయాలు బోధపడతాయి. ఒకటి, సంఘం యొక్క మనుగడపై శ్రద్ధవహించడం, రెండు సంఘం యొక్క అభివృద్ధి కొరకై పాటుపడటము.

నైతికతకు ఒక ప్రముఖ బాధ్యత ఉంటున్నది. అది ఏమనగా ఒక వ్యక్తిలో ఉన్న చెడును అది నిర్మూలింపచేస్తుంది. అంతేకాక ఒక మనిషికి జ్ఞానమునందించి అతని అభివృద్ధికి ఎంతగానో దోహదపడుతున్నది.

అతని నైతిక అభివృద్ధికి కారణ మగుచున్నది. అంతేకాక మానవుడు వ్యష్టిగా కంటె సమిష్టిగా కలసి ఉండే ప్రయోజనం చాలా ఎక్కువ అని చాటిచెబుతుంది. మానవుడు వ్యక్తిగా ఎన్నో పరిమితులకు లోబడినవాడు, ఎన్నో లోపాలతో కూడినవాడు. ఎన్నో షరతులకు లోబడినవాడు. అట్టి పరిమిత స్థితినుండి మానవుడు తన లోపాలను సవరించుకుని, పరిమితులను దాటి, బేషరతుగా, అనంతమైన స్థితికి ఎదగడానికి ప్రయత్నిస్తున్నాడు, సాధిస్తున్నాడు.

సాంఘికజీవనము మానవునిలో వికాసము కలిగించును. ప్రాంతమునకు ప్రాంతమునకు, సమయానుకూలముగా పరిస్థితులను బట్టి సాంఘిక జీవనములో, నైతికతలో కొన్ని మార్పులు చోటుచేసుకుంటున్నవి. ఈ మార్పులు మానవ అభివృద్ధికి లేదా పతనానికి దారితీయవచ్చును. సాధారణంగ ఈ మార్పులు మానవ వికాసమునకే దోహదపడును. నైతికత మానవ మనుగడకు తోడ్పడుతూ, మానవ వికాసమునకు కూడా దోహదపడుచున్నది.

నైతిక జీవనము వ్యక్తిగతమైనది. ఈ నైతిక జీవనమునకు అలవాటు పడినవారు నైతికముగా బద్ధులగుదురు. నైతికముగా అభివృద్ధి సాధింతురు. నైతిక దృష్టి కలిగి ఉంటారు. సంతృప్తితో జీవిస్తారు. ఈ నైతికత వ్యక్తి జీవితంపై రెండు విధాల ప్రభావము చూపును. ఒకటి తెలిసో తెలియకో తప్పుచేశామన్న బాధనుండి ఉపశమనం కలిగిస్తుంది. రెండు తనచుట్టూ ఉన్న సంఘంలో తానుకూడా ఒక భాగమే అన్న భావాన్ని కలుగజేస్తుంది.

మానవ వికాసము అనునది ముఖ్యంగ మనము ఆచరించే సంస్కృతి సాంప్రదాయాలపై ఆధారపడి ఉంది. ఈ సంస్కృతి సాంప్రదాయాలను మనకు అందించినది మహానుభావులే. సాంఘిక జీవనము వ్యక్తిగత నైతిక

జీవనాల సమ్మేళనము మాత్రమే కాదు, అని అనేక కారణ, కార్యముల ప్రతిఫలము. అయినప్పటికీ వ్యక్తిగతమైన నైతిక జీవనము సాంఘిక నైతికతకు తోడ్పడును, భాగము వహించును.

మనిషికి మంచి చెడులను నిర్ణయించే వివేక విచక్షణలు కలవు. అతను తన సొంతపనుల విషయాలలోనే గాక సంఘములో తనచుట్టూ ఉన్నవారి మంచి చెడులను గుర్తిస్తాడు. కర్మలతో పాటు ఆలోచనల మంచిచెడుతను కూడా అతను పరిశీలించగలడు. నైతిక స్పృహతో వివేకవంతులు ఈ మంచిచెడుల నిర్ణయాన్ని చేస్తారు. ఇట్టి చర్యలలోని భావాలను, స్పంధనలను, కారణాలను అతను తెలుసుకుంటాడు. తన ప్రమేయము లేకుండా జరిగే కార్యాలను కూడా మానవుడు గుర్తిస్తాడు.

నేడు సమాజములో జరుగుతున్న కార్యాలను వివేకవంతులే కాక పాక్షికంగా అవివేకవంతులు కూడా పరిశీలించి విశ్లేషిస్తూ ఉంటారు. స్పృహతోను, స్పృహ లేకుండానూ జరిగే ఈ కార్యాల విశ్లేషణ వల్ల అంతా గందరగోళంగా, అసహజంగా అనిపిస్తుంది. కార్యమునకు కారణమునకు పొంతన దొరకదు. ఈ నేపథ్యములో మానవుడు చేసే చెడుపనులకు శిక్ష అవసరమై ఉండవలెను. మూఢనమ్మకాలతో తన అదృష్టమును పరీక్షించాలనుకోవడం, కారణాలు లేకుండా బయటపడటం, కోరికలను నెరవేర్చుకోవాలనే తాపత్రయం, ముందుగానే కొన్ని నిర్ణయాలకు కట్టుబడి అందుకు విరుద్ధముగా జరిగే సంఘటనలపై మనుషులపై వర్గములపై ద్వేషం ప్రకటించడం లాంటి కార్యక్రమాలు ఈ కోవకు చెందుతాయి.

సామాజిక పరిణామ క్రమంలో మానవుడు కాలముతో బాటు మార్పు చెందుతూనే ఉన్నాడు. మానవుడి మార్పులతోపాటు నైతికతలో కూడా మార్పులు చోటు చేసుకుంటున్నవి. ఈ నైతికత కూడా కాలముతో

మారుచున్నది దైనందిన జీవితములో ఒక వ్యక్తి నైతికముగ అనేక మార్పులకు లోనవుతూవుంటాడు. తన అంతరంగమందు, తన భావాలతో తన స్పందనలతో బయటి వస్తు ప్రపంచముతో అనేకరీతుల అనుభూతులను పొంది తన అనుభవజ్ఞానమును వృద్ధిచేసుకుంటున్నాడు.

చర్యకు ప్రతిచర్య, తనలో బయటా, సూక్ష్మమైన స్థూలమైన ఇలా అనేక విధాలుగా జరిగే అనుభవాల కారణముగా తనలో నైతిక మార్పులు ఏర్పడుచున్నవి. ఇట్టి జీవనము పుట్టినది మొదలు చనిపోయేదాకా నిరంతరము కొనసాగుతూనే ఉంటుంది. ఈ అనుభవాలతోనే మన వ్యక్తిత్వం అభివృద్ధి జరుగుతుంది. ఈ క్రమంలో అనేక దశానిర్దేశకాలు, పాఠాలు అవగతమవుతాయి.

ప్రతి మానవుడు నైతికంగా మారుతూనే ఉంటాడు. ఇది తధ్యము. ఈ మార్పులు వివేకవిచక్షణలతో కూడి జరుగును. మానవుడు సంఘజీవిగా, సంఘ జీవనముతో సహకరిస్తూ, తన స్వార్థం కోసం జీవిస్తుంటాడు. సంఘజీవనము వలన తాను జ్ఞానమును, ప్రేమను మరియు ఆనందమును పంచుకుంటాడు. తన అంతరంగమున, మంచిచెడుల పోరాటము జరుగుతూనే ఉంటుంది. సంఘనీతిని పాటించినంత కాలం తనకు, సంఘానికి మధ్య బేధభావాలు చాలా అల్పముగానే ఉంటాయి. అనగా నైతికవంగా సంఘనీతి పాటించిన వారిలో పాపభీతి, దైవప్రీతి అభివృద్ధి యగును.

వ్యక్తి యొక్క నైతిక అభివృద్ధిలో స్పష్టమైన పరిమితులు మనకు అవగత మగును. మానవ నైజమురీత్యా, అన్ని నైతిక సిద్ధాంతాల కలయికతో కూడా మానవుని అత్యున్నతమైన నైతిక పురోగతికి బాటలు వేయలేక పోతున్నది. అంతేకాదు, కొందరు మహానుభావులు సాధించిన అత్యున్నత

స్థితిలో సహితము కొన్ని తారతమ్యాలను గుర్తించడం జరుగుతున్నది. ఏ ఒక్కరు కూడా తాను సాధించిన స్థితే సరియైనదని చెప్పనలవికాదు. దీనికి కారణాలు అనేకం కావచ్చు. అవి వంశపారంపర్యమైన కారణాలు, మరియు సంఘంలో మన కర్తవ్యకర్మల తారతమ్యాలు. ఇటువంటి పరిస్థితులలో ఎవరైనా ఒకదానిని సమర్థించినపుడు, సంఘంలో ఆచరణలో ఉన్న మిగిలిన ఆచరణలు కుంటుబడును.

నైతికత అనునది రెండు విధాల పరిశీలించవలెను. ఒకటి వ్యక్తి పరముగా, మరియు రెండవది సంఘపరముగా. మనమెప్పుడయితే సంఘనీతిని గురించి ఆలోచిస్తామో, అది మన ఆంతరంగిక మరియు భౌతిక కార్యకలాపాల సమాహార మగుచున్నది. ఒక వ్యక్తి సంఘనీతికి అలవాటుపడవచ్చు, కానీ అది అతనితో సహజముగా జరుగుటలేదు. దీనికి కారణము అజ్ఞానము. తన అజ్ఞానము వల్ల, తను ఆచరించే కార్యములపై సరియైన అవగాహన లోపిస్తున్నది.

పూర్వం రోజులలో ఏదైనా ఒక ఉపద్రవము జరిగితే, దానికి కారణము మంత్రశక్తో లేక ప్రకృతతీత శక్తో అని భావించెడివారు. కానీ నేటి రోజులలో మనము వీటిని అసలు నమ్మము. చూశారా, ఏది అయితే ఈనాడు మనము నైతికంగా సత్యమని నమ్ముతామో, అది భవిష్యత్తులో అసత్యముగా నిరూపింప బడవచ్చును. ఇంతటి మార్పునకు కారణము ఏమిటి? మానవుడు పెరుగుతున్న వాతావరణంలో పూర్తి మార్పులు వచ్చినపుడు, అనగా ఆర్థిక పురోభివృద్ధి సాధించినపుడు అంతేకాదు మానవుని జీవనవిధానము లోనే ఎంతో పురోభివృద్ధి సాధించినపుడు. ఈ విధమైన మార్పులు సంభవించుట వలన మానవుని స్వభావములో కూడా మార్పు కనబడుచున్నది. ఈ మార్పు అనివార్యము. ఇప్పుడున్నట్లు భవిష్యత్‌లో ఉండదు. అప్పుడు మళ్ళీ మార్పులు జరుగవచ్చు. ఈ విధముగా నిరంతరము మార్పులు కొనసాగుతూనే ఉంటాయి.

సాంఘికపరమైన మార్పులకు కారణాలు నాలుగు. ఒకటి, రాజకీయ కారణము. ఇది వర్గముల యొక్క స్వభావాన్ని బట్టి ఉంటుంది. రెండు, ప్రకృతిని లొంగదీసుకునే ప్రయత్నంలో మానవుడు అనుసరించే పద్ధతులు మూడు, మానవుడు తన తెలివితేటలతో స్థూల ప్రపంచమును అర్థము చేసుకుంటున్నాడు. నాలుగు, మానవుడు మానసిక, ఆధ్యాత్మిక దృష్టిని పెంచుకుని, సూక్ష్మ దృష్టితో తన స్వరూప స్వభావాలను గురించి, తాను ఆచరించే నైతిక విలువలు గురించి విచారిస్తున్నాడు.

**ఆ. అశాశ్వతమైన నైతికత :**

మన ఇంద్రియాలే మన అనుభవానికి సాక్షులుగా వ్యవహరిస్తున్నవి. మనకు జరిగిన అనుభూతితో, మనము అగోచరమైన వాటిని కనుగొన డానికి ప్రయత్నిస్తున్నాము. ఈ ప్రయత్నము ఆవశ్యకరమై యున్నది. మన ఇంద్రియాల చలనములకు, మనస్సు యొక్క భావనలకు మన ఆత్మయే కారణము. మన ఆత్మ మన శరీరములో ఉన్నంతవరకూ ఈ ప్రక్రియలు సాగుతూనే ఉంటాయి. మనము ఎప్పుడైతే ఇంద్రియాల యొక్క భౌతికక్రియలు మరియు అంతరంగమందు జరిగే మానసిక ప్రక్రియలను సూక్ష్మముగా పరిశీలిస్తామో అప్పుడే మనకు సరియైన కారణము అవగతమగును. అంతవరకూ మనము మానసిక ఆందోళనలకు, భయాలకు గురి అగుదుము. కారణాలు తెలిసిన పిమ్మట ఈ మానసిక ఆందోళనల నుండి, భయం నుండి ఉపశమనం కలుగును.

మంచి చెడులనునవి మన ఇంద్రియాల అనుభవములో ఉంటున్నవి, కానీ చావు మాత్రం మంచిచెడుల అనుభవానికి దూరంగా ఉంటుంది. చావంటే సరియైన అవగాహన కలవారు, మరణము సహజమే కాబట్టి మరణము గురించి చింతించక, జీవితము ఆనందించ ప్రయత్నిస్తారు.

మానవ జీవితము అశాశ్వతము. మరణము తప్పదు ఎప్పటికైనా ఈ కారణముచే అశాశ్వతమైన దానిపై మోజు తగ్గిపోతుంది. ఈ సత్యాన్ని గ్రహించిన మానవుడు తాను బ్రతికి సాధించేదానిని గురించి చింతించడు.

సాధారణ వ్యక్తి మరణమంటె భయపడతాడు. అతనికి చావు బాధాకర మైనదన్న భావము కంటే, మనిషికి చావు తప్పదు అన్న బాధే ఎక్కువగా పీడిస్తూ ఉంటుంది. అసలు మానవుడు చావు గురించి భయపడనేల? మానవుడు బ్రతికినంతకాలం చావంటే ఎలా ఉంటుందో తనకు తెలియదు. ఇక మరణము సంభవించాక, తన ఎఱుకే అతనికి ఉండదు కాబట్టి చావు బ్రతుకుల గురించి ఎక్కువగా ఆలోచించకూడదు, బాధపడకూడదు.

మనలో చాలామంది మరణమంటే చెడు అభిప్రాయము కలిగి ఉంటారు. అంతేకాదు, మానవుడు చేసిన అనేక తప్పిదాలకు మరుణమే శరణ్యమనుకుంటాడు. వివేకవంతుడు చావుకు భయపడడు. చావుకు దూరంగా పారిపోవడం జరగదు. చావు అతనికి ఏ విధంగానూ ఆటంకము కాదు. చావును చెడుగా భావించడమే జరగదు. ఇతను ఆహారమును జీవించడం కోసమే తీసుకుంటాడు తప్ప బలమైన ఆహారముతో చాలా కాలము బ్రతకాలన్న ఆశతో మాత్రం కాదు.

చావు మన చేతిలోలేదు. అది ఎప్పుడు ఎలా అన్నది మనకు అవగతము కాదు. కాబట్టి ఎప్పుడో వచ్చే చావుగురించి మానవుడు ఆలోచింప పనిలేదు. యువకులు తమ జీవితాలను చక్కగా జీవించాలి, వార్థక్యములో అది వీలుకాదు అని అనుట సబబుకాదు. జీవితము జీవించడానికే ఉంది అది ఏ వయసువారికైనా. కాబట్టి జీవించినంత కాలం చక్కగా జీవించి మంచి మరణమును ఆహ్వానించాలి.

నైతికత గురించి అన్ని వయసులవారు శ్రద్ధ చూపవలెను. జీవితంలో మానవుడు నేర్చుకోవలసింది ఎంతో ఉంటుంది. మానవజీవితం ఎంతో విలువైనది. మానవజీవితమును చిన్ననాటి నుండే సార్థకము చేసుకోవలెను. భవిష్యత్ ఎలా ఉంటుందో మనకు అగోచరము. కాబట్టి మంచిని నేర్చుకుని, మంచినడవడితో జీవనము సాగిస్తే, నము సంతోషించటమే కాకుండా, మన చుట్టూ ఉన్నవారు కూడా సంతోషిస్తారు.

నీతినియమాలతో కూడిన జీవన విధానమును ప్రోత్సహించేది మూడు విషయాలు అవి అమృతత్వముకై నమ్మకము, భగవంతుని అనుగ్రహము మరియు చావంటె భయపడక పోవడం వీరికి దేవుని యందు ప్రగాఢమైన నమ్మకంతోపాటు, భగవంతుని జ్ఞానం, దర్శనం, అనుభవాలు కలవు ఆత్మ సాక్షాత్కారముతోనే దేవుని గుర్తించుట సాధ్యము. సామాన్య మానవులకు భగవంతునిపై నమ్మకం ఉండదు. ఇంద్రియాతీతుడు భగవంతుడు. తప్పుచేసిన వారిని భగవంతుడు శిక్షించునని, మంచిచేసినవారిని భగవంతుడు అనుగ్రహించునని సామాన్యులు భావింతురు. కానీ భగవంతుని అనుభూతులు పొందినవారు ధన్యులు.

# 19. ఆత్మ సాక్షాత్కారం

సాధకులకు అంతిమ లక్ష్యము సాక్షాత్కారమే. ఈ సాక్షాత్కారం సాధనతోనే సాధ్యము. సాధించేవాడు, సాధించేది వేరుకాదు. ఒక త్రాడుకి మొదలు, చివర రెండూ ఉన్నట్లుగానే సాధకుడు సాధనతో మొదలుపెట్టి, సాధన చేస్తూ లక్ష్యమును చేరుకుంటాడు. ఈ సాధనలో చెడుస్థానం లేదు, అనగా మంచి అన్నది ఈ సాధనలో వ్యక్తమవుతూ ఉంటుంది. మంచికే పరిమితమైనవారు ఆత్మ సాక్షాత్కారానికి అర్హులవుతారు. సాధన అనునది స్వయంకృషి. ఆనందం కోసం కృషిచేసినపుడు, ఆ కృషిలోనే ఆనందం ఇమిడి ఉంది.

మనం కర్మలు చేస్తూ ఉంటాము. ఆ కర్మలు క్రమంగా కానీ లేదా అసమర్థతతో గానీ చేయవచ్చు. ఏ సాధనకైనా జ్ఞానం కలుగుతుంది. సాధనతో లక్ష్యం దిశగా పయనించడం జరుగుతుంది. ఈ సాధన దేని నిమిత్తం చేస్తున్నావు? నీకోసమే.

'నేను ఆలోచిస్తున్నాను', అన్న వాక్యంలో నేను మరియు ఆలోచన వ్యక్తమగు చున్నవి. ఇక్కడ నేను లేకుండా ఆలోచన ఉండదు. కాబట్టి నా అంతిమ లక్ష్యము, నేను లేకుండా ఉండదు. నా అంతిమలక్ష్యములన్నీ నా ఆలోచనలే, కానీ నా ఆలోచనలన్నీ నా అంతిమ లక్ష్యములు కావు. ఆత్మ సాక్షాత్కారమనగా, నేను భవిషత్తులో ఏదైనా ఒక గమ్యాన్ని సాధించాలని నిర్ణయించుకున్నప్పుడు, ఆ సన్నివేశాన్ని నేను అనుభవ పూర్వకంగా సాక్షాత్కరింప చేసుకోవాలి.

మనము ఒక కర్మచేశామంటే దానికి ఫలితాన్ని ఆశించి చేస్తాము. కానీ చివరలో మనము ఆశించినదానికంటె ఫలితము అధికముగా ఉంటుంది. మన ఆలోచనతో మనము ఎలా మమేకమైనామో, అదే రీతితో

మనము ఆశించిన ఫలితములతో కూడా మమేకమౌతాము. బ్రాడ్లీ మహాశయుడు ఈ నేపథ్యములో తెలియ జేసినది ఏమనగా, “మనము ఒక వస్తువు నుండి ఆశించేది మన స్థితిపై ఆధారపడి ఉంది. అయితే చివరలో ఆశించిన ఫలితము ఊహించిన దానికంటె అధికంగా ఉంటున్నది. దీనికి కారణం వస్తువా? శూన్యమా? లేక కోరిక లేక పోవడమా? ఈ ఆశించిన దానికంటె ఎక్కువ ఫలితం ఏదైతే ఉందో, అది మనల్ని ముందుకు నడిపిస్తున్నది. ఇట్టి నేపథ్యంలో మనము అధికముగా ఆశించకూడదు, కేవలం మన ప్రయత్నమునకు తగ్గట్టుగానే ఆశించవలెను. కాబట్టి ఇక్కడ మనము అందుకునే ఫలితము ఏమిటంటే, మనకోసం మనము ఏది ఆశిస్తామో, దానితో మమైకమును సాధించడం, అందుకు భిన్నంగా మనము పొందిన దానిని మనము వివరించలేము.

మనల్ని మనం ప్రశ్నించుకుంటే, సాధారణంగా మన కోరికలేమిటో మనకు తెలుస్తుంది, వీటినే మనము కోరి ఆశించడం జరుగుతుంది. మన జీవితములోకి ఒకసారి తొంగిచూస్తే, ఏ మానవుడు కోరికలు లేకుండా బ్రతకడం లేదు. ఈ కోరికలు అనేక రీతులలో ఉంటున్నవి. అవి పరిమితమైన కోరికలు మరియు విశాల భావాలతో కూడిన కోరికలై ఉంటున్నవి. విశాల భావముతో మనము మన కోరికలను పరిశీలించవలెను. మనము ఎన్నో కార్యములు చేస్తుంటాము. అయితే, సామూహికంగా అంతిమమున మనము ఆశించే ఫలితము సమగ్రమైనది, సంపూర్ణమైనది ఇక్కడ మనము ఒక సూక్ష్మమును గ్రహించాలి. అదేమిటంటే, చిన్న చిన్న పనులతో మానవుడు గొప్పగొప్ప కార్యములు సాధించవచ్చుని. కాబట్టి మనము ఏమిటో, మనలక్ష్యము లేమిటో, మన ప్రయత్నము ఏపాటిదో అన్న విషయాలు మనకు స్వయం విదితమే.

సాధారణంగా మానవునికి  కోరికలు మెండు. ఈ కోరికలు చిన్నవి మరియు పెద్దవి. ఈ చిన్న చేపలను పెద్దచేప మింగినట్లుగా, పెద్ద కోర్కెలను

మింగే అతిపెద్ద కోరిక ఏమై ఉంటుంది? ఈ విషయమై అందరూ పరిశోధన చెయ్యాలి. ప్రతి ఒక్కరు సుఖసంతోషాలతో జీవితమును అనుభవించా లనుకుంటారు. కానీ నిజానికి చాలామందికి ఈ సుఖసంతోషాలంటే ఏమిటో సరి అయిన అవగాహన ఉండదు. ప్రతి ఒక్కరు తమ పరిధిలో తమ జీవితాలను వెల్లబుచ్చుచున్నారు. వీరు కొన్ని పద్ధతులకు అలవాటు పడియున్నారు. ఒక పెద్ద చక్రంలో చిన్న చక్రం ఇమిడినట్లుగా, వీరి కోరికలు కూడా ఒక పెద్ద కోరిక ననుసరించి, చిన్నచిన్న కోరికలతో సాగుచున్నవి.

మనలో చాలామందికి కొన్ని ఆదర్శాలు కలవు. ఆ ఆదర్శము పరిపూర్ణమైన సుఖసంతోషాలను కలిగించును. అట్టి ఆదర్శమును వీరు అందుకోవచ్చు, లేదా అందుకొనకపోవచ్చు. ఈఆదర్శము ఒక ప్రత్యేక మైనదికాదు. అది వేరుగా ఉండదు. అది కూడా మనము సాధించగలిగేదే, మనము అనుభవించగలిగేదే. అయితే అట్టి ఆదర్శం సాధనలో ఉన్న వివరాలను, కావలసిన పవిత్రత, ఐక్యత, శ్రద్ధలతో కూడిన ప్రయత్నమును ముందుగా మనము గ్రహించవలెను. కాబట్టి మన లక్ష్యసాధనకు అనువుగా మనల్ని మనము తీర్చిదిద్దుకొనవలెను.

దైనందిన జీవితంలో మానవుడు ఉత్తమ ఆశయాలతో తనను తాను తెలుసుకోవాలన్న తపన ఉన్నప్పటికీ, ఆచరణలో మాత్రము ఇంద్రియ సుఖాలకే పరిమితమవుతున్నాడు. అనగా ఆశయ సాధన ఒకటయితే, మానవుడు ఆచరించేది మరి యొకటి. ఈ నేపథ్యంలో మానవుడు ఇంద్రియ నిగ్రహమును అలవరచు కొనవలెను. మానవుడు తన ఇచ్ఛాశక్తి ఏదయితే ఉందో, అందుకు అనుగుణముగా మారవలెను. అనగా త్రికరణశుద్ధి అవసరమై ఉన్నది, అనగా మనసులోని భావన, మాటలోని సూచన, కర్మలోని ఆచరణ ఒకటిగా ఉండాలి.

త్రికరణశుద్ధితో కూడని జీవితమునే కోరదగునా? అవసరములేదు. అయితే సిద్ధాంతాలతో కూడి ఉండవలెను. చేసే పనులకు కారణాలు గుర్తు పెట్టుకొని ఉండవలెను. ముత్యపు చిప్పలోని ముత్యమువలె ఉండాలని ఎవరూ కోరుకోరు. ఒక కర్మచేసి ఏమి ఫలితము వచ్చునో పరిశీలించి, దానిని బట్టి మిగతా కర్మలు నిర్ధారణ చేసుకోవచ్చు అని అనుకోవడం తగదు. ఇటువంటి పరిమితులకు మానవుడు కట్టుబడకూడదు. మనము అనుకున్నవి జరగవు. కాబట్టి ముందుగానే అనుకుని కార్యాలు చేపట్టడం నైతికముగా సరికాదు. మనము ఆచరించే కర్మలతో మనము విశాల భావాలను పెంచుకోవాలి. నివృత్తితో మానవుడు అనేకత్వమునందు ఏకత్వమును దర్శిస్తాడు. భౌతిక జగత్తులో మానవుడు ఏకత్వమునందు అనేకత్వమును దర్శిస్తూ ఉంటాడు. మానవుడు ఈ రెండింటిని పరిగణలోకి తీసుకుంటూ సమదృష్టిని పెంచు కోవాలి. కాబట్టి సాక్షాత్కారమనగా తనను తాను తెలుసుకోవడం. అలా తనను తాను తెలుసుకుని అందరిలో ఉన్న తనను గుర్తించుకోవడం, సాక్షాత్కరింప చేసుకోవడం జరగాలి.

భౌతికమైన దృష్టి పరిమితమైనది. భౌతికమైన వస్తువులు కూడా పరిమితమునే అందించును. పరిమితమైన వస్తువుతో పరిమితమునే కనుగొనగలము. సంపూర్ణమైన జ్ఞానమును పొందనంతవరకు అది పరిమితముగానే భావించవలెను. బాహ్యదృష్టి కలిగినంత వరకు అది పరిమితమైనదిగా భావింపవలెను. ఎప్పుడైతే అంతర్దృష్టితో తననుతాను తెలుసుకుంటాడో అప్పుడు ఈ పరిమితులకు కట్టుబడక అపరమిత స్థితికి చేరుకుంటాడు.

ఎట్టి పరిమితులకు లోబడనిది ఆత్మసాక్షాత్కారము. అపరిమితము అనగా నేమి? పరిమితము మరియు అపరిమితముల కలయిక. బాహ్యదృష్టితో పరిమితమైన వాటిని గ్రహించవచ్చును. బాహ్యముగా

విభజించి గుర్తించవీలగును. కానీ అపరిమితమును విభజించక పోయినా గుర్తించవీలగును. ఈ కలయికలో పాజిటివ్, నెగెటివ్ అంశాలు ఇమిడి ఉంటున్నవి. మంచిచెడులతో కూడినది జీవిత ప్రయాణము. అనగా పాజిటివ్, నెగటివ్ కలయికగా ఉంటున్నది. ఈ మంచి–చెడుల కలయికతో మానవుడు నిరంతరము ఒక్కొక్క మెట్టు ఉన్నత స్థితికి ఎదుగుతున్నాడు. అనగా పరిమితమైన స్థితినుండి అపరిమితమైన స్థితికి చేరుకుంటున్నాడు.

నీగురించి నీవు ఏమనుకుంటున్నావు? నిన్ను నీవు అంతర్దృష్టితో చూసుకుంటూ నీవు అనంతానివి, అనగా పరిమితులు లేని తత్వానివి. నిన్ను నీవు ఇట్టి స్థితిలోనే గ్రహించు. బాహ్యావస్తువులు పరిమితమైనవి. బాహ్యదృష్టితో గ్రహించినదంతా పరిమితమే. పరిమితమైన వస్తువులను పోల్చవీలగును. పరిమితమైన వాటితో అనంతమైన తత్వమును పోల్చడానికి సాధ్యంకాదు. నీ యొక్క తత్వము అనంతమైనది. నీ మనస్సు కూడా అనంతమైనదే. ఒక సరళగీతకు తుది, మొదలు ఉంటుంది. కాని ఒక చక్రమునకు తుది మొదలు కనపడదు. ఒకవేళ ప్రయత్నిస్తే తుది, మొదలు ఒకదానిలో ఒకటి కలిసిపోయి అనంతముగా గోచరించును. అనగా మన కోర్కెలకు తృప్తి అనునది ఉండును. మానవుడు తన ప్రయాణమును పాజిటివ్, నెగిటివ్‌లతో సాగిస్తున్నాడు. అనగా ద్వంద్వముతో సాగిస్తున్నాడు. ఇది అనంతముగా సాగునదే. ద్వంద్వాలకు అతీతముగా మారినపుడు ప్రశాంతతో నిన్ను నీవు తెలుసుకుంటావు. ఈ ప్రశాంతత అనంతమైనది.

బ్రాడ్లీ తన అభిప్రాయములో కొంత బేధమును వ్యక్తము చేసెను. అది ఏమనగా, నైతికత అనునది మన ఉద్ధరణకే. ఈ నైతికత మన పరిమితులన చేధించుచున్నది. మనము సమర్థతతో పనులు చేయలేక పోతున్నాము. ఆ పూర్ణమైన వస్తువు మనము ఎన్నటికీ కాము. నైతిక జీవితమునను సరించినంత కాలము మన పరిమితులు మనకు స్పష్టముగానే

వ్యక్తమగును. నేను, నీవు, నాదీ, నీది, వీడు, వాడు ఇలా అన్ని పరిమితులకు లోబడి జరుగుచున్నవి. మనము ఒకరికి ఒకరము అన్నట్టుగా ఒకటి కాలేక పోతున్నాము. వేరువేరుగా ఉన్నాము. మనము మన పరిమితులను, హద్దులను గీచుకుని ఉన్నాము. బాహ్యదృష్టిలో ఎవరికి వారే అన్నట్టుగా వ్యక్తమగు చున్నది. సమిష్టిని నాలో చేర్చుకోవడం అసాధ్యముగా ఉన్నది. నన్ను నేనుగా అంతర్దృష్టితో అనంతముగా భావించినప్పటికీ, బాహ్యదృష్టిలో అందరూ అనంతమైన తత్వముగా ప్రకటించు కోవడం బాగానే ఉన్నది, కానీ వాస్తవానికి నా ప్రవర్తన పరిమితులతోనే సాగుతున్నది.

నిజమే మనము పరిమిత తత్వముతో కూడినవారమే. నిజానికి మనము పరిమిత మరియు అనంతమైన తత్వములతో కూడిన వారము. ప్రతి ఒక్కరు తమను తాము తెలుసుకోవాలనుకుంటారు. అలా తెలుసు కోవాలనుకుంటే ముందుగా వైరాగ్యంతో అన్ని బంధనల నుండి విముక్తి పొందవలెను. ఈ విధముగా మానవుడు క్రమేపీ తన ఉన్నతిని సాధిస్తున్నాడు. మానవుడు తనలో ఉన్న మరొకరిని తెలుసుకునేంతవరకూ ఈ అన్వేషణ కొనసాగుతూనే ఉంటుంది.

మానవుడు తనను తాను తెలుసుకునే ప్రయత్నములో తనను తాను పెంచుకోనవసరం లేదు. తనను తానుగానే తెలుసుకొనవలెను. భౌతికమైన బంధనలకు స్వస్తిచెప్పి అంతర్దృష్టితో అందరిలో ఉన్న తనను చూచుకుంటూ, తనను అందరిలో చూడవలెను.

మానవులంతా ఒక్కటే. ఏ విధముగా ఒక్కటి అనే వివరణ లేకుండా బేధాలు సమసిపోవు. ఇక్కడ ఒకప్రశ్న. మానవునికి విశాలహృదయము ఉన్నది. యావద్విశ్వమును ఈ హృదయము ఇముడ్చుకోగలడు. అట్టి హృదయంలో ఈ విశాలత్వమును పెంచడానికి భౌతికమైన సంబంధాలను

ఎట్లు గ్రహించవలెను? వ్యష్టి సమిష్టిలో చేరినప్పుడే, సమిష్టిలో భాగ మవుతుంది. వ్యక్తి వ్యష్టిగా ఉన్నంతకాలం సమిష్టిలో భాగం కాదు. ఇక్కడ మరోప్రశ్న వ్యష్టిగానే ఉంటూ, వికాసముతో సమిష్టిలో భాగము ఎట్లు పొందగలరు? జవాబు: వ్యష్టి సమిష్టిలో భాగం వహించవలసినదే. వ్యష్టిగా పరిమితులకు, స్వేచ్ఛ స్వాతంత్ర్యాలకు లోబడి ఉంటాడు. ఒకసారి సమిష్టిలో చేరితే, ఏదో అతికినట్లు ఉండరాదు, సమిష్టిలో భాగమై పోవలెను. ప్రతి ఒక్కరు ఈ విషయాలను గ్రహించవలెను.

మానవుడు సమిష్టిలో భాగమైనప్పుడు, ఆ సమిష్టి నియమాలకు అలవాటు పడవలెను. సమిష్టితో కలసినప్పటికీ మానవుడు ఒక్క జీవనమును మాత్రమే సాగిస్తాడు. అలాగని ఒక్కడే జీవించలేడు. సమిష్టిలోని సభ్యులందరు జీవించియున్నవారే. వారు సమిష్టిలో భాగమే తప్ప వేరుకాదు. ఈ సమిష్టి స్వరూపము ఒక్కటే. అది ఒక్కటి కాబట్టే వివరింపబడెను.

బ్రాడ్లీ మహాశయుని మాటల్లో ఇక్కడ ఇంకా ప్రశ్నలకు అవకాశ ముంటున్నది. సమిష్టిలో నేను భాగమైతే నాకు ఏమిటి? నేను సమిష్టిలో ఒక సభ్యుడినే తప్ప, నేను అన్ని సభ్యులుగా మారనుకదా. సమిష్టి గురించి చక్కగా వివరించేకొద్దీ, సమిష్టియొక్క సమగ్రస్వరూపము అవగత మవుతుంది. సమిష్టి గురించి 'ఎక్కువ' వివరణ గ్రహించిననాడు, తనను తాను 'తక్కువ'గా మానవుడు భావించుకుంటాడు. కాబట్టి నాలోని ఎక్కువ సమిష్టిలో చేరిపోతున్నది. సమిష్టి గురించి అవగాహన కలిగేకొద్దీ, మానవుడు తనకు, సమిష్టికిగల బేధాలను గ్రహిస్తాడు. మానవుడు స్వార్థముతో, అహంకారముతో, సంకుచిత భావాలతో అనేకమైన పరిమితులకు లోబడినవాడని గ్రహించవలెను.

ఈ అంశములోని ఒక ముఖ్యమైన విషయము అందరూ గ్రహించ వలసినదిగా మనని నైతికముగా సమిష్టిలోని సభ్యులందరూ అప్రమత్తతతోనే

వ్యవహరించుచుందురు. సమిష్టి నాకు, మరియు ఇతర సభ్యులకు మధ్య నున్న సంబంధము కేవలము భౌతికమైన సంబంధంకాదు. నేను, సమిష్టిలో ఒక సభ్యుడినని నాకు తెలుసు. అనగా సభ్యుడిగా నా బాధ్యతలు నాకు తెలుసు సమిష్టిలో అందరితోపాటు ఈ నియమాలు నాకు కూడా వర్తించును. సమిష్టియొక్క ఇచ్ఛాశక్తిలో నా ఇచ్ఛాశక్తి కూడా భాగమైపోతున్నది. సమిష్టియొక్క ఇచ్ఛాశక్తి మరియు సభ్యుల యొక్క ఇచ్ఛాశక్తి ఒకటిగా ఉంటున్నది.

అదే విధముగా నేను నా ఇచ్ఛాశక్తిని సమిష్టిలో ప్రవేశపెడతాను. సమిష్టిలో ప్రవేశపెట్టగానే అది సమిష్టి ఇచ్ఛాశక్తిగా మారిపోతుంది. నా ఇచ్ఛాశక్తి అని చెప్పుకోవడానికి ఉండదు. ఈ ఏకత్వము సమిష్టిలోనే ఉన్నదని భావించనక్కరలేదు. విడిగా, నాలోకూడా ఈ ఏకత్వము ఇమిడి ఉన్నది. ఈ ఏకత్వము నాకోసమై ఉన్నది. సమిష్టితో కాని నా జీవితము, జ్ఞానము, భక్తి అంతా శూన్యమే. సమిష్టిలో భాగముగా నేను వ్యవహరించి నంతకాలము నాకు సంతోషము. ఆనందము దక్కుతున్నది. సమిష్టి రాణించినంత కాలము నా ఆనందానికి కొదువలేదు. సమిష్టి కుంటుబడితే నాకు దుఃఖము కలుగును. సమిష్టి ప్రేమను నేను పొందలేని రోజున నేను జీవించలేను.

ఎవరి జీవితాలు వారివి ఇది సత్యమే. అయితే, నైతిక జీవితానికి అలవాటు పడ్డాక, ఇక్కడ నీ, నా భావనలు, తారతమ్యాలు ఉండకూడదు. సమిష్టిలో చేరాక నైతికముగా నాకు ప్రత్యేకమైన గుర్తింపు ఉండదు. నా ఇచ్ఛాశక్తి కూడా సమిష్టి ఇచ్ఛాశక్తిలో చేరి ఉంటున్నది.

కాబట్టి సాక్షాత్కారమనగా ఏమిటి? ముందు నిన్ను నీవు సమిష్టి స్వరూపములో భాగముగా గుర్తించు. సమిష్టిలో నీవుకూడా ఒక భాగమే

అని అప్రమత్తతతో నీజీవన విధానాన్ని కొనసాగించు. నీవే సమిష్టి స్వరూపుడవని భావించు. ఎప్పుడైతే ఈ సమిష్టి స్వరూపము అనంతమైనదని గ్రహిస్తావో, నీ ఇచ్ఛాశక్తి ఈ అనంతమైన సమిష్టి ఇచ్ఛాశక్తిలో భాగమని తెలుస్తుందో, అందరిలో ఉన్న ఏకత్వమును గ్రహించినప్పుడు సాధనలో ఉన్నత శిఖరాలకు చేరినవాడవై ఆత్మసాక్షాత్కారము పొందినవాడవని అర్థమగును.

నైతిక సిద్ధాంతములన్నీ స్పష్టముగా గానీ ఊహాజనితముగా గానీ మంచినే అందించును. ఏ పనైనా మంచిగా ముగించడమే లక్ష్యముగా భావిస్తాము. ఆ మంచికోసం ప్రయత్నము చేయాలని ఉంటుంది. కష్టపడిన వారికి మాత్రమే ఫలితము అందుబాటులో ఉంటుంది. తాను చేసిన ప్రయత్నానికి తగిన ఫలితమే అందుతుంది. అందుకు భిన్నముగా జరగదు. నైతికతతో ఏ కార్యమునైనను ఆచరించవలసినదే. ఆచరణలోనే ఆ కార్యము యొక్క సాఫల్యత ఇమిడి ఉంది.

ఏ కార్యమైనా మంచిగా తలపెట్టి చేయడంలోనే ఆ ఇచ్ఛాశక్తి యొక్క ఆదర్శము వ్యక్తమవుతుంది. మంచిని సాధించాలన్న లక్ష్యము, మంచిగా కార్యము సఫలత గావించవలనన్న తపనలు రెండు అవసరమై ఉన్నది. నాకు సంబంధించినంతవరకు నా ఆదర్శము నాకు ముఖ్యము. ఈ ఆదర్శమే లక్ష్యము, నా బాట. మంచి ఆదర్శము తప్ప అన్యమేది నాది కాదు.

మంచి ఆదర్శము కొరకు జీవించు వ్యక్తి అన్నీ మంచిపనులకే పరిమిత మవుతాడు. అతను చెడుపనులు తలంపడు, చేయడు. ఇది ఏమిటి, అంటే దానికి వేరే వివరణ ఏమీఉండదు. అందరిలోనూ ఉన్నతమైన వ్యక్తిత్వం గలవానిగా గుర్తించబడతాడు.

మనలోని ఇచ్ఛాశక్తే మన మంచి ఆదర్శమును వ్యక్తము చేయును. సమిష్టి ఇచ్ఛాశక్తిని, స్వయం ప్రపత్తి కల్గిన ఇచ్ఛాశక్తిని, సహజముగా వ్యక్తమగు ఇచ్ఛాశక్తిని మనము ఆదర్శమైన ఇచ్ఛాశక్తిగా పరిగణిస్తాము.

నైతికముగా మన అంతిమ లక్ష్యము ఉత్తమమైనదిగానూ, అనంత మైనదిగాను ఉండవలెను. బేషరతుగా ఇది సాగవలెను. ఇది నాకే కాక అందరికీ, బేషరతుగా ఆచరించవలసినదిగా ఉండవలెను. ఈ నైతికత అనునది సిద్ధాంతపరముగా ప్రత్యేకమైనది. ఈ సిద్ధాంతాలకు అందరూ సమానమే. ఆ విధముగా ఇవి అందరి ఆమోదమును గ్రహించినవి. రెండవది, ఈ సిద్ధాంతాలు ఏ షరతులకు లోబడనివి. వీటి మనగడకు అవి ఎవరిపైనా ఆధారపడిఉండవు. తనలక్ష్యమే తనకు సమస్తమై ఉంటున్నది. తనను శాసించువారు ఎవరూ లేరు కాబట్టి ఈ నైతికత అన్నది స్వచ్ఛమైన ఇచ్ఛాశక్తి గలది. మూడవది, ఈ నైతికత అందరి ఆమోదమును పొందినది, తనకు తానే గమ్యమైనది మరియు స్వయం ప్రపత్తి గలది. యావత్ మానవాళి ఆమోదమును పొందిన కారణమున ఇది ఒక శాసనముగాను, ఆ శాసనమే తన ఇచ్ఛాశక్తిగానూ గుర్తింపబడుతున్నది. ఈ కారణముచే అందరికీ ఆమోదమైనదానితో ఇచ్ఛాశక్తిని కలిగియుండడములో మనకు బలము చేకూరును. నాల్గవది, కోరికలు లేని ఇచ్ఛాశక్తిని అభివృద్ధి పరచుకొనవలెను. విశ్వము యొక్క ఇచ్ఛాశక్తిలో కోరికలు కానరావు. నిరాకారముగా వ్యవహరించు విశ్వము యొక్క ఇచ్ఛాశక్తి యందు ఆకారమును గ్రహించి, అట్టి ఆకార నిరూపణార్థమై మన ఇచ్ఛాశక్తిని కూడగట్టవలెను.

మన జీవిత పరమార్థము, అందరి జీవిత పరమార్థము ఒక్కటే అయివున్నది. ఈ కారణముచే ఇది అందరికీ ఆమోదమైన ఒక శాసనంగా, ఒప్పుగా స్వీకరించడమైనది. ఈ జీవిత పరమార్థము అన్నిటి కంటె ఉత్తమ

మైనది. ఈ విషయాన్ని ప్రతి ఒక్కరూ గ్రహించి, సాధన చేసిన యడల ఆత్మసాక్షాత్కారమును పొందెదము. ఈ జీవిత పరమార్థము ఆశించి చేసిన ప్రయత్నములో తనను తాను తెలుసుకోవడంలోనే జీవిత పరమార్థము అవగతమగును.

ముందుగా తెలిపినట్లుగా ఈ జీవిత పరమార్థము స్పష్టమైనది, విశ్వజనీన మైనది, సత్యమైనది మరియు స్థిరమైనది. మానవుని ఆదర్శవంతునిగా తీర్చిదిద్దడానికే ఈ నైతికత. ఇది ప్రాణముండగా సాధించవలసినది. ఆత్మ ఉన్నంత వరకే ఈ శరీరము నిలబడును. ఆత్మలేకుండా ఈ శరీరము దేనికీ ఉపయోగపడదు. కాబట్టి సాక్షాత్కార సాధనలో నైతికతతోనే మొదలుపెట్టి, నైతికతతోనే ముగించవలెను.

అందరూ ఆత్మస్వరూపులే. అందరిలోనూ ఉన్నది ఒకే ఆత్మ. అందరిలోనూ ఉన్న ఏకత్వమును గ్రహించుటే సాక్షాత్కారము. ఈ సాక్షాత్కారము ఎవరికివారు సాధించవలెను. అందరూ ఆత్మస్వరూపులే అయినప్పటికీ అందరూ ఈ సాక్షాత్కారమును సాధించలేరు. ఇట్టి సాక్షాత్కారము అంత సులభంగా లభ్యమయ్యేది కాదు. అన్ని వేళలా మన వ్యక్తిత్వమును నిలబెట్టుకురావాలి, కాపాడుకోవాలి. సాక్షాత్కారమనునది సర్వోత్కృష్టమైనది. దానిని సాధించడానికి మానవుడు నిరంతరము కృషి సలుపవలెను. ఆ లక్ష్యమే తనను నడిపించును. తన జీవిత పరమార్థ సాధనమే తన కర్తవ్యము. తన కర్తవ్య నిర్వహణలో అంతులేని ఆనందము ఇమిడి ఉన్నది.

## 20. సంబంధ బాంధవ్యాలు - కర్తవ్యాలు

మానవులకు మానవులకు మధ్య సంబంధబాంధవ్యాల కారణముగా కర్తవ్యాలు రూపుదిద్దుకుంటున్నవి. మనిషికి మనిషికి మధ్యనున్న సంబంధాన్ని మానవుడు నిలబెట్టుకొనవలెను. ప్రతి ఒక్కరు కూడా తమతమ కర్తవ్యాలను ఆచరించుటకు ప్రయత్నము చేయవలెను తప్ప, ఇతరులు తమ తమ కర్తవ్యకర్మలు సరిగా ఆచరిస్తున్నారా అని పరిశీలించరాదు. ప్రతి ఒక్కరు సహజంగానే తమ కర్తవ్య కర్మలను ఆచరిస్తారు. ఈనాడు మానవులు ఉద్దేశ్యపూర్వకంగా ఈ సంబంధ బాంధవ్యాలను పాడు చేసుకుంటున్నారు. కుటుంబ సభ్యులుగా, సంఘం లోని పౌరులుగా, పక్కింటి వారుగా ఇలా అనేక విధాలుగా మన సంబంధ బాంధవ్యాలను గుర్తించి, అందుకు తగినరీతిలో కర్తవ్యాలను ఆచరించవలెను.

మానవులకు భగవంతుని పట్ల సరియైన అవగాహన ఉండవలెను. భగవంతుడు ఉన్నాడన్న నమ్మకము ప్రధానమైనది. భగవంతుడు అందరి యెడల తమ అనుగ్రహాన్ని కురిపించునన్న సత్యాన్ని గ్రహించవలెను. భగవంతుడు మానవులకు ఎల్లవేళలా మంచినే అనుగ్రహించునని భావించవలెను. మానవులంతా ఇట్టి భావనలతో భగవంతునిపై భక్తిని పెంచుకొనవలెను. భగవంతుడి ఆదేశాను సారము మానవుడు నడుచు కోవాలి అన్న భావము సహజంగా ఉండాలి. భగవంతుని జ్ఞానము అనంతమైనది. అట్టి జ్ఞానాన్ని ఆచరించుటలోనే తన మంచి దాగి ఉన్నదని గ్రహించవలెను. భగవంతునిపై అచంచలమైన విశ్వాసము కలిగినపుడు, మానవుడు తన కేమి కష్టనష్టాలు కలిగినా భగవంతుని తిరస్కరించడు, దూషించడు, అశ్రద్ధచేయడు. మానవుడు తన మంచి చెడులను భగవంతుని చేతిలోనే పెడతాడు.

ప్రతిమానవుడు తనకు కష్టము, నష్టము కలిగించు వస్తువులు, కారణములకు దూరముగా జరుగుతాడు. మరియు తనకు ఇష్టము, సంతోషము, లాభము కలిగించు వస్తువులకు, కారణాలకు దగ్గరవుతాడు. ఈ నేపథ్యంలో తనకు హాని జరుగునన్న మనిషి నుండి గానీ, వస్తువు నుండి గానీ సంతోషాన్ని ఎలా కోరగలడు. అంతేకాదు ఆ చెడును సంతోషంగా స్వీకరించనూ లేడు.

శ్రద్ధ ఎక్కడ ఉంటుందో, భక్తి అక్కడే ఉంటుంది. ఈ నేపథ్యంలో కోరికలనేవి ఉండాలా, వద్దా అనేది మన భక్తిపై ఆధారపడి ఉన్నది. మనము భక్తితో త్యాగానికి పూనుకుంటాము. ఈ త్యాగము ఎలా ఉండ కూడదు? పిసినారి తనంతో, నిర్లక్ష్యము గాను, అత్తెసరు త్యాగముతో, ఆడంబరముగానూ తన స్థాయికి మించి ఉండరాదు.

ప్రతి ఒక్కరు తనకు నచ్చిన భగవంతుని రూపమును కొలవడం జరుగుతుంది. ఏకాంతమున ఉన్ననూ, అందరిలో ఉన్ననూ తన ఇష్ట దైవాన్ని కొలచుట పరిపాటి. ఏకాంతంగా ఉన్నప్పుడు కొన్ని మాటలతో, లేదా నిశ్శబ్దముతో మనము మన ఇష్టదైవాన్ని ప్రార్థిస్తాము. సమయ సందర్భాలను బట్టి ఎప్పుడైనా భగవంతునికి  మనము మనోగతము వివరిస్తాము.

భగవంతునికి భక్తిలో, భక్తుడు బయటకి నవ్వడం ఉండదు. సాధ్యమైనంత వరకు భగవంతునిపైన ఆన కూడా వేయడం జరగదు. ఒకవేళ భగవంతునిపై ఆన వేయవలసి వస్తే వీలయినంతవరకు దానిని తప్పించుకునే ప్రయత్నమే చేస్తాడు. పవిత్రత లేనిచోట తను మనలేడు. తన శరీరముపై అంత శ్రద్ధ చూపడు. తన శరీరము నిలబడటానికి కావలసిన ఆహారము, బట్టలు, గృహము, మొదలగు వాటిపై ఆధారపడతాడు.

భక్తిలో మరికొన్ని మెళుకువలు పేరు, ప్రతిష్టలను, ఆడంబరము కోసం తన భక్తిని ప్రకటించుకోరాదు. సాంప్రదాయ బద్ధముగా లైంగిక జీవనానికి సమ్మతము ఉంటుంది.

ఎవరైనా నీ దగ్గరికి వచ్చి, ఫలానావ్యక్తి నీ గురించి ఈ విధంగా చెడు మాట్లాడటం జరిగింది అని అన్నప్పుడు, నీవు మౌనంగా ఊరుకుండి పోతావు. అలా కాక, ఆ వచ్చిన వ్యక్తితో, తన గురించి చెడుగా మాట్లాడిన వ్యక్తికి తన చెడు గురించి చాలా తక్కువగానే వ్యక్తము చేసినాడని చెప్పగలగాలి.

ఇతరులను పొగిడే సందర్భాలకు వీలయినంతవరకు దూరంగానే ఉండటం జరుగుతుంది. అయితే అప్పుడప్పుడు హాజరు కావలసిన పరిస్థితులు వచ్చినపుడు శాంతమైన, నెమ్మదైన ఆకర్షిత మాటలతో పొగడవలెను. మాటలు హృదయము నుండి రావలెను. అనగా మనకు ఇష్టము లేని పొగడ్తలు మానవలెను.

అధికారములో ఉన్న ఒక వ్యక్తిని మీరు కలవాలనుకుంటున్నారు. ఇంటికి వెడతారు. ఇంటిలో అతను ఉండడు. గేటు దగ్గరినుండే వెనక్కి రావలసి వచ్చును. లేదా గుమ్మం తలుపులు తీయరు. గుమ్మం నుండే వెనుకకు తిరిగి రావలసి వచ్చును. లేదా ఇంటివద్ద సరిగా పలకరించ ఎవరూ ఉండకపోవచ్చు. జరిగిన తీరుకు బాధపడటం మన మూర్ఖత్వము బయటపడుతుంది. జరిగినది మరచిపోయి, మళ్లీ ఒకసారి అతనిని కలవడానికి ప్రయత్నించాలి.

నలుగురితో ఉన్నప్పుడు తన చర్యల గురించి కానీ తన కష్టాలను విన్నవించుకుంటే సరిపోతుంది. సాధారణముగా ఒకరి కష్టనష్టాల గురించి విని తెలుసుకోవాలన్న శ్రద్ధ ఎవరికీ ఉండదు. నలుగురిలో

ఉన్నప్పుడు, నలుగురినీ నవ్వించడానికి ప్రయత్నించరాదు. ఈ ప్రయత్నములో అసభ్యకరమైన మాటలు దొర్లుతాయి. అసభ్యకరమైన మాటలు, అలవాట్ల వల్ల మన గౌరవము పోతుంది. నలుగురిలో ఉన్నప్పుడు అసందర్భపు మాటలను అదుపుచేయలేని పక్షంలో, అట్టి మాటలకు సమాధానము చెప్పకుండానూ, అసంతృప్తిని ప్రకటిస్తూనూ విరమింప చేయవలెను.

ఒక సమావేశములో నిన్ను పొగడటం, లేదా సంతోష పెట్టడమనే కార్యక్రమము జరుగుతున్నది. అట్టి కార్యాలకు నీవు పొంగిపోకూడదు. ఆలస్యమైనప్పటికీ, నిదానముగా వాటిని స్వీకరించు. పొగడ్తల కార్యక్రమము జరిగేటప్పుడు ఎలా అనిపించింది? పొగడ్తల కార్యక్రమం పూర్తయ్యాక ఎలా అనిపించింది? పశ్చాత్తాప భావము కానీ నిందకు గురి అయినట్లుగా గానీ అనిపించినదా ఇటువంటి పొగడ్తల కార్యక్రమానికి గైర్హాజరై, తనను తాను నియంత్రించు కొనవచ్చును. అలాకాక ఇటువంటి కార్యక్రమాలకు వెళ్ళినా మననియంత్రణలో ఉండవలెను. ఇంద్రియాలను అదుపులో ఉంచవలెను.

ఎవరైనా ఏ పనైనా చేయదలచుకుంటే నిర్భయముగా చేయవలెను. చాటుమాటుగా చేయరాదు. చాటుమాటుగా చేసినా అది ఎవరికంట నయినా పడవచ్చు. అయితే ఆ చేసే పని ఎవరికీ నచ్చనపుడు, అటువంటి పనులు చేపట్టక వదిలివేయవలెను. అలాకాక నీకు ఒప్పు అనిపించిన పనులను, ఇతరులు తప్పుపట్టినా భయపడకుండా పూర్తి చేయవలెను.

ప్రతి ఒక్కరు కొన్ని పద్ధతులకు కట్టుబడి ఉండవలెను. అలా పద్ధతులకు కట్టుబడి ఉంటే అదివారికి బలము. అయితే కొంతమంది పద్ధతులకు అతీతముగా వ్యవహరింతురు. పద్ధతులను నిర్లక్ష్యము చేయడం వలన వారు అనుకున్నది సాధించలేరు.

మనము నడచేటప్పుడు ఆచితూచి నడుస్తాము. దారిలో ఏ మేకు ఉందో, ఏ ముల్లు ఉందో అది కాలులో గుచ్చుకుని బాధపెట్టవచ్చుకదా! ఇదే రీతిలో మన నడవడికలో కూడా సాటిమనిషిని మనము ఎన్నడూ తృణీకరించరాదు. ఇలా ఎవరినీ తృణీకరించకుండా నడుచు కున్ననాడు మనము చేపట్టిన పనులు తేలికగానూ స్థిరంగానూ జరుగుతాయి.

ప్రతి వ్యక్తి తన శరీర అవసరాలను గుర్తించి వర్తించాలి. మన శరీర అవసరాలకు కూడా ఒక హద్దు పద్దు ఉంటుంది. ఎప్పుడయితే, ఎవరైతే ఈ హద్దు పద్దు దాటుతారో, వారు జారి క్రిందపడతారు. మనము కాళ్ళకు చెప్పులు తొడుగుకుంటాము. కాళ్ళకు వేసుకునే చెప్పులు సైజు కరెక్టుగా ఉండవలెను. చెప్పులు బిగుతుగా ఉన్నా, వదులుగా ఉన్నా నడవడం కష్టమవుతుంది కదా!

మనము శరీరముపై ఏ విధముగా దృష్టిపెట్టాలి? శరీరపోషణ ?
నిమిత్తం మనము ఆచరించే పనులు సామాన్యమైన పనులు. అవి మనం తీసుకునే జలము, ఆహారము మరియు మనం చేసే శరీర వ్యాయామము. అయితే ఇట్టి సామాన్యమైన పనులకు మానవులు పరిమితమవ్వరాదు. వారు శరీరం మనస్సు మరియు ఆత్మల కోసం నిరంతరం కృషి సలుపవలెను.

ఎప్పుడైనా ఒకవ్యక్తి మరోవ్యక్తిపై చెడుగా ప్రవర్తించినపుడు గానీ, లేదా చెడుమాటలు చెప్పినపుడు, అది తన బాధ్యతగా భావిస్తాడు. అంతేకాదు అది తన దృష్టిలో సబబుగా భావించి అట్లుచేస్తాడు. ఇతరుల దృష్టిలో అతను ఆలోచించడు. ఈ నేపథ్యములో తనదే తప్పని గ్రహించిననాడు, తాను మోసపోయానని చాలా బాధపడతాడు. ఇది సరి అయిన కలయిక కాదని ఇతను భావిస్తాడు. తప్పు చేయకుండా నిందింపబడిన వ్యక్తి నిందలకు కూడా శాంతమునే వహిస్తాడు.

న్యాయం అన్యాయం అను రెండు హేండిల్స్‌తో ప్రతి వస్తువు ఉంటుంది. న్యాయమైన హేండిల్‌తో ఆ వస్తువు యొక్క బాధ్యతను మనము మోస్తాము. అన్యాయపు హేండిల్‌తో దానిని భారాన్ని స్వీకరించము. ఇప్పుడు ఒక సోదరుడు కానీ, స్నేహితుడు కానీ తప్పు చేశాడు. తప్పుచేసిన వీరిని అన్యాయపు కోణంనుండి మూయజాలము, కానీ పెంచిన మమకారంతో ఇతనివైపు ఉన్న న్యాయమును పరికిస్తాము.

ఒకరు నేను ధనవంతుడను, నీకంటె చాలా అధికంగా ఆస్తులు నాకు కలవు అంటాడు. వేరొకరు, నేను గొప్ప వక్తను నీకంటే ఎంతో గొప్పగా నేను మాట్లాడగలను అంటాడు. అయితే ఈ ఇద్దరు ఆస్తులూ కాదు, ఉపన్యాసాలు కాదు.

మన జ్ఞానమును ఎవరికి బడితే వారికి వినిపించ కూడదు. గొర్రెకూడా తాను మేసిన గడ్డిని ఉమ్మి తాను ఎంత గడ్డిని మేసినదీ తన పాలేరుకి చూపించదు కదా! గొర్రె తాను తిన్న గడ్డిని, జీర్ణించుకుని పాలను, ఊలును ఇస్తుంది. ఇదే విధంగా ప్రతి ఒక్కరు తాము ఏమిటో అన్నది మాటలతో కాక చేతలతోనే వ్యక్తం చేయుట మంచిది.

అవగాహన లేని వ్యక్తి యొక్క స్థితి, వ్యక్తిత్వం దృష్ట్యా అతను పరిస్థితినుండి లాభం గానీ నష్టమును గానీ స్వీకరించడానికి సిద్ధముగా ఉండును. అలాగాక అన్ని విషయాలపై అవగాహన ఉన్న తత్వవేత్త ప్రతి సన్నివేశమునుండి మంచినిగానీ చెడునుగానీ స్వీకరించడానికి సిద్ధముగా ఉంటాడు. ఎవరయితే జ్ఞానమును సంపాదించే బాటలో నడుస్తున్నారో, వారు ఎవరినీ తూలనాడరు, ఎవరినీ పొగడరు. ఎవరినీ కాదనరు అంతేకాదు తన గురించి కూడా ఇతరులతో ఏమి వ్యక్తం చేయరు. అంతేకాదు తన ప్రయత్నాలలో ఆటంకములు ఏర్పడితే, తనను

తాను నిందించుకుంటాడు. ఎవరైనా తనను పొగిడితే, పొగడే వ్యక్తిని ఇష్టపడడు. ఎవరైనా తనను విమర్శిస్తే, వారిని అడ్డగించడు. తాను కోరికలు లేని స్థితికి చేరుకొనేందుకు ప్రయత్నిస్తున్నాడు. ప్రకృతికి విరుద్ధమైన ప్రక్రియలయందు తన అయిష్టమును పెంచుకుంటాడు. తన చుట్టూ జరిగే పరిస్థితులను తన సహజశైలితో సంబంధ బాంధవ్యాలు గరుపుతాడు. ఈ నేపథ్యములో తనను ఎవరైనా పిచ్చివాడని, అమాయకుడని నిందించినా అతను పట్టించుకోడు. ఒక్క ముక్కలో చెప్పాలంటే, పొదలో దాక్కున్న వేటాడబడే జంతువులా తనను తాను ఊహించుకుంటాడు.

నియమబద్ధమైన జీవితానికి ప్రతి ఒక్కరు అలవాటుపడాలి. ఈ నియమాలను ఎన్నడూ ఉల్లంఘించరాదు. ఎవరికైతే ఏది మంచి అనిపిస్తుందో, వారు ఎన్నటికీ ఆ మంచిని వదలకూడదు. ప్రతి ఒక్కరు నిరంతరము అభివృద్ధి బాటలో పయనించవలెను. తమ అభివృద్ధి బాటలో వివేక విచక్షణలకే తలొగ్గవలెను.

నైతిక విలువలు అనుసరించే వారు 3 స్థితులను గమనించవలెను. ఉదా: మొదట తాము అసత్యము పలుకరాదు. రెండు, సత్యమును పలుకుటకు అలవాటు పడవలెను. ఎల్లవేళలా సత్యము పలుకవలెను. కాబట్టి మూడు, ఫలితముల దృష్ట్యా సత్యం పలుకుట యొక్క గొప్పదనమును గ్రహించవలెను. ఇక్కడ చిన్న విశ్లేషణ. ఫలితమును ఆశించువారికి ఆచరణ మరియు విషయము గురించి అనగా 2 మరియు 1 గురించి తెలిసి ఉండాలి. అదే విధంగా ఆచరించేవారు, విషయాన్ని ఎన్నడూ మరువరాదు. అనగా 2వ స్థితి యందు ఉన్నవారు విషయాన్ని, అనగా 1ని మరువరాదు. నిజానికి 1,2,3 లలో మనమెన్నడూ 1ని మరువరాదు. అనగా ఆడినమాటను మరువరాదు.

అయితే మన దృష్టి ఎంతవరకూ 3 మీద, అనగా ఫలితము మీదికి పోతున్నది. ఫలితము మీద శ్రద్ధ పోవడం వల్ల మనము ఆడినమాట తప్పుతున్నాము. కానీ ఆచరణ అన్నది మన చేతిలోనే ఉంది. 1ని మరువవద్దు, 2ని ఆచరించండి, 3ని పొందండి.

## 21. కోరికలు - మనోభావాలు

ప్రతిమానవుడికి కోరికలు ఉంటాయి. ఈ కోరికలు రెండు రకాలు. ఒకటి సహజమైనవి, రెండు అసహజమైన కోరికలు. ఈ అవసరమైన కోర్కెలు వివిధరకాలుగా ఉంటున్నవి. అవి మనకు సుఖశాంతుల నొసగెడు కోరికలు. మన జీవితము ఎంతో విలువైనది. ఇట్టి జీవితమును సద్వినియోగం చేసుకోవాలంటే మన కోరికల విషయంలో మనకు సరియైన అవగాహన అవసరం. మన శరీర ఆరోగ్యం బాగుంటే మనం ఏ పనైనా చేయగలం, ఆధ్యాత్మిక పురోగతిని సాధించగలం, ఆనందాన్ని పొందగలం. ఈ కారణాల చేతనే మనకు కష్టాలన్నా, బాధలన్నా భయపడుతాము. ఇవి మనము సాధించిననాడు ప్రశాంతిని అనుభవిస్తాము.

మనము సుఖమును, ఆహ్లాదమును, ఆనందమును కోరుకుంటాము. ఇవి లేనప్పుడు బాధను అనుభవించడం జరుగుతుంది. బాధను అనుభవించని సమయాలలో మనకు సుఖము, ఆహ్లాదము అవసరము ఉండదు. ఈ కారణముచే సుఖమే మానవ జీవితానికి మొదలు, చివర అయి ఉంటున్నది. ఇందు మూలముగా సుఖము మన నైజము అని అర్థమవుతున్నది. సుఖము దృష్ట్యా మనము కొన్ని పనులు చేపడతాము, మానుకుంటున్నాము. మనము మళ్ళీ మళ్ళీ సుఖము కోసము ఎదురుచూస్తూ, వాటిని మంచిపద్ధతులలో సాధించడానికి ప్రయత్నిస్తూ ఉంటాము. మనము ఎంతటి సుఖాన్ని కోరుతున్నామూ అంటే, మనలో ఉన్న బాధను పోగొట్టుకునేంత అని చెప్పవచ్చును. మనము సుఖాన్ని అనుభవించినంతకాలము శారీరకముగానూ, మానసికము గానూ బాధకు గురికాము.

సుఖమే మన సర్వస్వంగా భావించినప్పటికీ, మనము కనబడిన ప్రతి సుఖాన్ని కోరుకోరాదు. ఒక్కొక్కసారి సుఖాల కోసం తాపత్రయపడి

కష్టాలను ఎదుర్కొనవలసి వస్తుంది. అంతేకాదు కష్టము యొక్క విలువను కూడా మనము గ్రహించాలి. కష్టం లేకుండా సుఖం విలువ తెలియదంటారు మన పెద్దలు. కాబట్టి సుఖాన్నే కాక కష్టాలను కూడా కోరుకునేవారు ఉంటారు. ఉదా: కుంతీదేవి శ్రీకృష్ణున్ని ప్రార్థిస్తుంది యుద్ధ విరమణ తర్వాత. కష్టాలలోనే దేవుణ్ణి స్మరిస్తాము. సుఖాలలో మరిచిపోతాము. ఇప్పుడు కష్టాలు అనుభవించి, తరువాత రోజులలో సుఖపడవచ్చని వారి అభిప్రాయం. సుఖాలన్నీ మన మంచికోసం కాదు. అదే విధముగా కష్టాలన్నీ మన చెడుకోసం అని భావించరాదు. మన కష్టాలు మన చెడు కోసమే అని భావించి, వాటిని తప్పించుకునే ప్రయత్నం చేయరాదు. ఈ కష్టసుఖాలలో ఉన్న లాభనష్టాలను బేరీజు వేసుకుని సరియైన నిర్ణయాలు తీసుకోవలెను. కష్టమైనా, సుఖమైనా ధ్యేయం మంచిదై యుండవలెను.

సుఖము ఎన్నటికీ చెడుకాదు. కానీ ఆ సుఖమును పొందడానికి మనం చేసే ప్రయత్నాలే మనకు ఎన్నో కష్టాలను కొనితెచ్చును. మనము ఆశించే సుఖము కంటే ఈ బాధ ఎన్నోరెట్లు ఎక్కువగా ఉంటుంది.

కోరికలపై స్వేచ్ఛ కలిగియుండడం వల్ల మనకు మంచి జరుగుతుంది. మనము అన్ని వేళలా అన్ని సుఖాలను కోరుకోము. సుఖాలన్నీ అందుబాటులో లేనప్పుడు, అందుబాటులో ఉన్న కొన్ని సుఖాలే ముద్దు. ఈ సుఖాలను మనము సహజంగా ఆశించవలెనే తప్ప ......... ఆశించరాదు. ఆకలి రుచి ఎరుగదు అన్న సామెతను అనుసరించి నడుచుకొనవలెను. ఆకలిగొన్న కడుపుకు పంచభక్ష్య పరమాన్నాలతో పనిలేదు, సామాన్యమైన ఆహారము కూడా సరిపోవును. ఆకలితో బాధపడేవాడికి ఒక గుప్పెడు పచ్చడి మెతుకులే మహదానందాన్ని అందిస్తుంది.

మనము ఆరోగ్యకరమైన జీవితాన్ని గడుపవలెనన్న సామాన్యమైన జీవితానికి మాత్రమే అలవాటుపడాలి తప్ప, ఆడంబరమైన జీవితాన్ని కాదు. ఆరోగ్యకరమైన జీవితమును కోరుకునేవాడు తగిన కృషికి సిద్ధపడతాడు. కష్టమునకు అలవాటుపడినవాడు, సుఖాల కొరకు ఆకర్షింపబడడు, సుఖము లేదని దుఃఖపడడు.

మనము అనుభవించే కోరికలు మనకు తృప్తిని అందించ లేనపుడు, లేదా కష్టమును కలిగించనపుడు మనకు ఆ కోరికలపై వ్యామోహము తగ్గిపోతుంది. అటువంటి కోరికలపై కేవలం వ్యామోహమే ఉంటుంది. ఆ వ్యామోహము కూడా సులభముగా తొలగిపోతుంది. ఎక్కువ సంతృప్తిని ఇవ్వని కోరికలు కొన్ని సులభముగా అందుబాటులో ఉండక పోవచ్చు, లేదా కష్టపడితేగానీ అందని పరిస్థితిగా ఉంటుంది. అటువంటి కోరికలపై కూడా వ్యామోహము తొందరగానే తొలగిపోతుంది.

జీవితంలో అనుభవమును సంపాదించినవాడు కోర్కెలపై పరిమితులు విధించుకుంటాడు. కోర్కెల లేమి కారణాలతో కష్టముల పాలుకాడు. తన కోర్కెలను అదుపులో ఉంచుకుంటాడు. అంతేకాదు తన కోరికల నిమిత్తం ఇతరులతో పోటీపడడు.

జీవితంలో సుఖపడడమే ధ్యేయముగా చాలామంది భావిస్తూ, దుష్ప్రవర్తనల తోను, లైంగికముగాను సుఖమును ఆశిస్తూ ఉంటారు. ఇట్టి సుఖాలు శారీరక సుఖముతో అందించవచ్చును. కానీ మానసిక అశాంతికి కారణమగును. కాబట్టి, వివేక విచక్షణలతో సామాన్యమైన జీవితానికి అలవాటుపడి శారీరక, మానసిక ఆనందాలను మానవుడు కోరుకోవలెను. ఈ నేపథ్యములో మంచిని స్వీకరించి, చెడును వదలవలెను.

మన దేహంలో రెండు రకాలు కదలికలు చలనములు, గమనములు ఉంటున్నవి. ఒకటి, అవసరమైన కదలికలు, రెండు సహజమైన లేదా బుద్ధి పూర్వకమైన చలనములు. రక్త ప్రసరణ, శ్వాస, నాడి, ఆకలి, మలమూత్ర విసర్జన మొదలగునవి దేహము వచ్చింది మొదలు తుది వరకూ, నిరంతరాయంగా కొనసాగునవే. ముఖ్యమైన ఆధారమైన చలనములు మాట్లాడటం, నడవటం, చేతులతో పనులు చేయడం అనే చలనములు బుద్ధిపూర్వకంగా సాగుచున్నవి. ఈ చలనములు బుద్ధిపై ఆధారపడి ఉన్నవి. కాబట్టి ఊహ, ఆలోచన అనేది ఈ చలనాలకు అంకురమై ఉంటున్నవి. చిన్నగా మొదలై మాట్లాడుట, నడచుట, మరియు ఇతర పనులకు అలవాటు పడుట జరుగుచుండును. ఈ కదలికలన్నీ ప్రయత్నపూర్వకంగా జరిగేవి.

Emotion = E - motion = Energy in motion

మన మనో వికారాలు రాగద్వేషాలతో కూడుకున్నవి. ఈ కదలికలు శక్తిని వినియోగించుకొనును.

మనము ఏదో ఒకటి సాధించాలని చేసే ప్రయత్నమునే కోరిక లేదా తపన అంటాము. కోరిక కలిగి ఉండటం, అసహ్యించుకోవడం అనే రెండు పరస్పర విరుద్ధమైన క్రియలు. కోరిక కలిగినపుడు ఆ వస్తువు వైపు ప్రయాణము చేస్తాము. అసహ్యము కలిగినపుడు ఆ వస్తువుకు దూరముగా జరిగిపోతాము.

కోరుకున్న వస్తువులపై 'ప్రేమ', అసహ్యించుకునే వస్తువులపై 'ద్వేషం' జనిస్తుంది. కోరిక, ప్రేమ అనునది ఒక్కటే, అయితే కోరికలో వస్తువు కనపడదు, కానీ ప్రేమలో వస్తువు కనబడుతుంది. అదే రీతిలో అసహ్యించుకునేటప్పుడు వస్తువు భావము ఉంటుంది, అయితే ద్వేషించేటప్పుడు వస్తువు ఉన్న భావము కలుగుతుంది.

మనుష్యులకు కోరికలు కలగడం, అసహ్యం కలగడం సహజమే. కొందరికి తిండి మీద వ్యామోహము, మలమూత్ర విసర్జనపై అసహ్యాము కలుగుతుంది. కొన్ని అనుభవాల రీత్యా కొన్నిటిపై వ్యామోహములు కలుగుతవి. మనకు చెడు అనుభవాలు ఎదురైన సందర్భాలలో సాధారణంగా అసహ్యం పెంచుకుంటాము. కొన్ని సందర్భాలలో మనకు చెడు అనుభవాలు కలుగకపోయినప్పటికీ అసహ్యాము పెంచుకుంటాము.

కోరికలు లేని అసహ్యించుకోని వస్తువులను మనము తృణీ కరిస్తాము. తిరస్కార భావనతో గానీ మొండితనముతో గానీ మనము కొన్ని వస్తువులకు దూరముగా జరిగి మరికొన్ని వస్తువులకు అనుభవం కోసం దగ్గరవ్వడం జరుగుతుంది.

మానవుని శరీరము ఎల్లప్పుడు మారుతూ ఉంటుంది. ఈ కారణముచే అతనిలో ఎప్పుడూ అవే కోరికలు, అవే అసహ్యాములు అనునవి ఉండవు. సర్వసాధారణముగా అందరికీ ఒకే వస్తువుపై కోరిక కలుగుట అనునది చాలా అరుదుగా జరుగును.

వస్తువు ఏదైనప్పటికీ ఆ వస్తువుపై ఇష్టాయిష్టాలు వ్యక్తిగతమైనవి. ఇష్టమైన వస్తువులను మంచిగాభావించి స్వీకరిస్తాము. అయిష్టమైన వస్తువుల పట్ల తిరస్కారము, పట్టించుకోకపోవడం, చెడు భావన కలిగి ఉండడం జరుగుతుంది. అంతేకానీ వస్తువులనుండి అందరూ ఏకీ భవించే మంచిగాని, చెడుగానీ ఉంటుందని ఎన్నడూ భావించరాదు.

భౌతికమైన వస్తువును చూస్తున్నప్పుడు మనలో కలిగే చలనములను గమనించండి. మనకళ్ళు చూస్తాయి. ఆ చూపులో రంగులు, వెలుతురు ఉండి ఉంటాయి. చెవులతో వింటాము శబ్దమును. నాసికతో వాసనలు పీలుస్తాము. ఈ విధముగా కళ్ళు, ముక్కు మరియు ఇతర ఇంద్రియాలు

మనస్సు ద్వారా పనిచేసి చలనములు రూపములో ప్రభావితం చేస్తున్నాయి. ఈ చలనములు మనలో కోరిక రేపవచ్చు చాలా అసహ్యమును రేకెత్తించవచ్చు. ఈ ఇంద్రియ చలనమే మనకు సంతోషమును గానీ దుఃఖమును కానీ అందిస్తుంది.

కోరికతో ముడిపడియున్న ఈ మార్పులు మనలో సుఖమును, సంతోషమును అందిస్తూ, వాటిని బలపరచు మార్పులకు సహకరించును.

కాబట్టి సుఖము, సంతోషము అనునది మన ఇంద్రియాలకు మంచిగా భావించినదిగా ఉంటున్నది. కష్టము అనునది మన ఇంద్రియాలకు అసౌకర్యముగా భావించబడుతున్నది. ఈ కారణంచే కోరికలను ఇష్టంగా, ప్రేమగా, సంతోషంగా స్వీకరిస్తున్నాము. అసహ్యించుకునే వాటిని అయిష్టంగా, ద్వేషముతో దూరంగా వెడుతున్నాము.

ఒక వస్తువును చూడగానే మనకు సంతోషము కలుగుతుంది. అనగా మన ఇంద్రియాలన్నీ ఆ వస్తువుపట్ల ఆకర్షితమవుతాయి. పంచేంద్రియాలలోనూ స్పందనలు కలుగుతాయి. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదులతో మనసులో స్పందనలు అనుభవిస్తాం. ఈ ఇంద్రియ కలాపాలను మనస్సు ఇష్టపడవచ్చు, ఇష్టపడక పోవచ్చు. మనస్సుకు సుఖంగా, హాయిగా ఉంటే దానిని సంతోషమంటారు. మనస్సుకు అసౌకర్యంగా ఉంటే దానినే బాధని అంటాము. మన మనస్సున ఇతరమైన ఇంద్రియ పరిణామాలు చోటుచేసుకున్న దానిని కష్టమంటాము.

ఇష్టము, కోరిక, ప్రేమ, అసహ్యం, ద్వేషం, సంతోషం, కష్టం, బాధ మొదలైనవన్నీ మనోభావాలు. వీటి స్వరూపస్వభావాలు వేరువేరుగా ఉంటున్నాయి. ఇంత వైవిధ్యంగల మనోభావాలలో మానవుడు ఏమి కోరుకుంటున్నాడు. ఎలా కోరుకుంటున్నాడు. మొదట తన కోరికను

వ్యక్తం చేయును. రెండు, అందుకు తగిన వస్తువును ఎంచుకొనును. మూడు, సానుకూలమైన లేదా సామరస్య వాతావరణము. నాలుగు, అనుభవమునకు ప్రయత్నం.

థామస్ హెూబ్స్ ఈమనోభావాలకు అద్భుతమైన రూపకల్పనిచ్చెను. కోరికను సాధించే దిశగా జరిగే ప్రయత్నాన్ని ఆశ అని అంటాము. కోరికను సాధించలేమన్న భావము కలిగినపుడు దానిని నిరాశ అంటాము. అసహ్యించుకునే వస్తువు నుండి ఆపదను ఆస్వాదించడమును భయము అంటాము. అదే ఎదిరించి తప్పించుకోవచ్చనే భావనను ధైర్యమంటాము. ఉన్న ఫలమున ధైర్యము ప్రదర్శిస్తే దానిని కోపము అంటాము. నిరంతరాయంగా ఆశతో జీవించడమును ఆత్మవిశ్వాసమంటారు. నిరంతరము అపనమ్మకాలతో జీవించడాన్ని ఆత్మన్యూనతా భావ మంటారు. కోపంతో సాటి మనిషికి హాని తలపెట్టుటను ఆగ్రహము అందురు. సాటి మనిషికి చేయు మంచిని త్యాగము, దానము, సాయము అంటారు. మనిషి యొక్క సహజ స్వభావము, మంచి స్వభావము. సంపదలపై అధికమైన కోర్కెలు కలిగియుండుటను అత్యాశ లేదా పేరాశ అంటాము. కర్తవ్య నిర్వహణలో అధికారం కోసం ఆధిపత్య పోరును అధికార దాహం అంటాము. ఎందుకు ఎలాగ ఏమిటి అనే విషయాలను తెలుసుకోవాలనే తపన జిజ్ఞాశ అంటారు. ఈ జిజ్ఞాశ మానవునకు మాత్రమే పరిమితము. అగమ్యగోచరమైన శక్తియొక్క ప్రభావమును, మనము వినే పురాణగాథల సారమునకు మన మనస్సున ఏర్పడే భావములే మతమంటాము. అనుమతించనివి మూఢనమ్మకాలు. మన లోని శక్తిని మనము గ్రహించడమే అసలైన మతము.

దుర్మార్గమును చెడు ప్రవర్తనగాను, ఇతరులకు హాని కలిగించు కర్మలుగాను వర్ణిస్తాము. మొదట, దైవప్రీతిలేని కారణమున ఈ

దుర్మార్గమునకు అలవాటు పడతారు. రెండు సాటి మనిషికి భౌతికముగా గానీ, మానసికముగా గానీ హాని కలిగించడానికి దుర్మార్గమునకు పూనుకోవడం జరుగుతుంది. మూడు, అజ్ఞానం వల్ల కూడా దుర్మార్గపు కార్యక్రమాలు తలపెట్టడం జరుగుతుంది.

మనలో చాలామంది అజ్ఞానముతోనే జీవిస్తున్నారు. ఆత్మజ్ఞానం సాధించడం చాలా కష్టమని భావించి మాయలోనే జీవించడానికి మానవుడు ఇష్టపడుతున్నాడు. ఈ మాయవల్ల, అజ్ఞానమువల్ల కలిగే పరిణామాలు చాలాతీవ్రముగా ఉండును. ఈ అజ్ఞానము వలన మానవుడు అసహజముగా ప్రవర్తించును. తన ప్రవర్తనతో అనేక కష్టనష్టాలకు గురి అవుతాడు. తాను కష్టాలకు గురి కావడమే కాక తన చుట్టూ ఉన్న వారిని కూడా అనేక కష్టనష్టాలకు గురిచేస్తాడు. అజ్ఞాన దోషములు ఎన్నని చెప్పగలం? మనలను మంచి సంస్కారాల నుండి దూరము చేస్తుంది. మనలో వినయ విధేయతలు లోపిస్తాయి. అజ్ఞానము వలన తప్పొప్పుల నిర్ణయాలు సరిగా చేయలేరు. అంతేకాదు భగవంతుని యందు భక్తి, శ్రద్ధలు కూడా లోపిస్తాయి.

భయము, కంగారు, ఆవేదనలు మానవుని స్వార్థపులక్షణాలు. భయము పోవాలంటే మార్గమేమిటి? ఎంత స్వప్రయత్నముతోనైనా భయమును పోగొట్టు కొనలేము. భయము పోవాలంటే, మనలోని అహంకారాన్ని నాశనము చేసుకుని, స్వార్థ చింతనలు తొలగించుకుని నలుగురి శ్రేయస్సుకు పాటుపడిన రోజున ఈ భయము దానంతట అదేపోతుంది. ఏదైనా ఒక కార్యములో మనస్సు నిమగ్నమైనప్పుడు కూడా మనలోని భయాలు తొలగిపోవును. అయితే ప్రేమతో చేసే కార్యక్రమాల యందు మరియు భగవంతుని కార్యకలాపముల యందు పాల్గొనినప్పుడు మనలోని సమస్త భయాలు తొలగిపోవును. మనము

పనులు చేపట్టేటప్పుడు అత్యల్పమైన కారణాలకు ప్రభావం కాకూడదు. అత్యల్పమైన కారణాలకు లోబడినపుడు మనము భయాందోళనలకు గురి అవుతాము. అలా కాక మనము చేపట్టే కార్యము భగవంతునిపై భారమువేసి, సాటిమనిషి మేలు కోరి చేపట్టినప్పుడు ఈ భయాందోళన లకు తావే ఉండదు. ఈ విషయములో మనము ఒకటి గ్రహించాలి, అది ఏమనగా భగవంతుని కార్యక్రమాల్లో అసలు సమస్య అనేదే ఉండదు. ఈ దైవకార్యక్రమాలలో ఓటములు ఎదురు కావచ్చు, అనుకున్న రీతిలో పనులు పూర్తికాకపోవచ్చు, కానీ వాటిని మనము సద్భావముతో అదే ప్రాప్తి అని సంతోషముతో స్వీకరిస్తాము. భగవంతుని యెడల అచంచలమైన భక్తిశ్రద్ధలు కలిగినపుడు, మన అనుభవాలు అందరి దృష్టిలో చిరస్మరణీయాలుగా మిగిలి పోతాయి. మానవ జీవితము శూన్యమని గ్రహించిన రోజున, భగవంతుని యందు వినయ విధేయతలు, భక్తి శ్రద్ధలు బలపడును.

## 22. ఫలములు - సాధనలు

మనము ఆశించే ఫలమును బట్టి సాధనాలను ఎంచుకుంటాము. ఫలాలను బట్టి తలపులు ఉంటాయి. కొన్ని సందర్భాలలో ఫలాలు, సాధనాలు, తలపులు ఒకే రీతిన వ్యక్తమగును.

ఇక్కడ రెండు అభిప్రాయాలు వ్యక్తమగుచున్నవి. మొదటిది, ఇక్కడ ప్రత్యేకముగా ఏర్పాటుచేసిన లక్ష్యమునే ఆసరాగా చేసుకుని అన్ని సాధనాలను ఆ లక్ష్యము వైపుగా పనిచేయుట. ఇక్కడ మరో విశేష మేమనగా అగమ్యగోచరంగా, లక్ష్యమునకు వేరుగా ఏ ఇతరములు చేపట్టక నియంత్రించుట జరుగును. అందువలన ప్రక్కతోవ పట్టుట జరుగదు. ఇక రెండవ పద్ధతి గమ్యమును చేరుటలోగాని లక్ష్యము సాధించుటలోగానీ ఎంత హేయమైన, నీచమైన సాధనాలను అనుసరించి నప్పటికీ, పరవాలేదులే అన్న భావముతో ముందుకు సాగుపద్ధతి. విలువలకు తిలోదికాలిచ్చి, ఆచరణలోపాలను పట్టించుకొనక, అప్ప చెప్పిన పని చేశామా లేదా అన్న భావనతో లక్ష్యములు సాధించుట. ఇట్టి ప్రయత్నము మిథ్య, భ్రమలతో కూడినది. లక్ష్యసాధనలో చేపట్టిన సాధనామార్గాలను అందరి దృష్టి నుండి తప్పించలేవు. కాబట్టి లక్ష్యసాధనలో మంచి మార్గాలను అవలంబించవలెను.

మనందరికీ తెలుసు. ఫలితమునకు తగ్గట్టుగానే కారణాలు ఉంటాయి అని కార్యము పూర్తికాకుండా ఫలితాన్ని ఆశించరాదు. ఆ ఫలితము అనుకున్నట్లుగా అందినది అని చెప్పుటకు వీలులేదు. కార్యము చివరిదాకా, అదే పనిలో నిమగ్నమై పనిమీద శ్రద్ధ చూపవలెను. ఈనాడు అసలు పనినిమాని, ఇతరమైన అనేక పనులను చేస్తున్నాము. అనగా మనము చేయు పనులు కొంచెం వెనకా, ముందూ అన్నట్టుగా సరిపెట్టుకుంటున్నాము. నిజానికి మనము మన లక్ష్యము ఉన్నతమైనదిగా ఉన్నప్పుడు మనము దానిని సాధించుటలో ఎంతో శ్రమ, కృషి

అవసరము. అట్టి శ్రమ, కృషి అందరివల్ల సాధ్యము కాదు. ఈ నేపథ్యములో మన అంతిమ లక్ష్యమునకు మధ్యలో మరికొన్ని లక్ష్యములను నిర్దేశించుకోవాలి. ఒక్కొక్క మెట్టు ఎక్కుతూ పై మెట్టుకు చేరుకోవాలి అన్న పద్ధతిలో మనము ఒక్కొక్క లక్ష్యమును సాధించు కుంటూ మన అంతిమ లక్ష్యమును చేరుకోవాలి.

లక్ష్యముల గురించి, లక్ష్యసాధనలోని విలువల గురించి సామాన్య మైన అభిప్రాయాలు వ్యక్తమగుచూనే ఉండును. కానీ అవి తప్పులు సరిదిద్దడానికి ఉపయోగపడవు. అవి సామాన్య అభిప్రాయాల వలె మిగిలిపోతాయి. ప్రతి సందర్భంలోనూ ఈ విధంగా సామాన్యమైన అభిప్రాయాలు వెలువడుట ఆనవాయితీగా సాగుచున్నది. కోరికలు మరియు స్వప్రయోజనాలు ఒక సన్నివేశము నుండి మరియొక సన్నివేశానికి బదలాయింపుగా వస్తాయి. ఇవి మళ్ళీ మళ్ళీ వ్యక్తమై, సంఘటితమై బలోపేత మవుతాయి. సామాన్యమైన లక్ష్యాలు నెరవేరును. ఈ సామాన్యమైన ఆలోచనలు కూడా మేధావుల విశ్లేషణలకు గురి అవుచూ, విషయ పరిశీలన జరుగును. ఈ సన్నివేశాలు పరీక్షింపబడును. ఆచరించిన పద్ధతులు విశ్లేషింపబడును. ఈ పరిశీలనలు పరీక్షలు కారణముచే కొన్ని ఆచరణలకు నియమాలతో కూడిన పద్ధతులు రూపొందింపబడినవి. ఈ నేపథ్యంలో ఒక పనిముందుకు సాగే కొలది, విశ్లేషణలతో సాగుతూ సరియైనదిగా ఈ ప్రయత్నము కొనసాగుచున్నదో లేదో తెలుసుకొనవచ్చును. ఇక్కడ పద్ధతులే ముఖ్యము. ఎవరు ఆచరించారు అన్నదికాదు, ఎలా ఆచరించారు అన్నది ముఖ్యము.

చేపట్టిన కోరికలను ఏవిధముగా ఆచరణలో పెట్టినది, ఆ ఆచరణలను ఎప్పటికప్పుడు విశ్లేషిస్తూ ముందుకు సాగడం జరుగుతున్నది. అనగా ఒకపని మొదలుపెట్టినప్పటి నుండి పనిపూర్తయ్యే లోపల వ్యక్తమయ్యే అవసరాలు, లోటుపాటులు, పరిస్థితులు మరియు

అభిప్రాయ భేదాలు అన్నీ ముందుగా చర్చించబడి, ఆయా సమయాలలో విశ్లేషింపబడుతాయి. ఈ నేపథ్యములో, మనుషుల మధ్య తల ఎత్తే ఉద్రేకాలను కూడా పరిశీలించడమౌతున్నది. కోరిక ననుసరించియే కార్యము సాఫల్యమునకు ప్రయత్నము జరుగును. లక్ష్యసాధనలో లక్ష్యము పరిస్థితి ఏమిటి? ముగింపు ఎలా ఉంటుంది? మొదలగు అనేక అవకాశాలకు సావకాశము లేకపోలేదు. అందుకే వాస్తవ పరిస్థితులను తలపించే సన్నివేశాలను సృష్టించి, వాస్తవమునకు దగ్గరగా ఆచరిస్తూ, గమ్యమే లక్ష్యముగా, గమ్యముపై శ్రద్ధా భక్తులతో ప్రయత్నమును కొనసాగే రీతిలో అప్రమత్తతతో వ్యవహరించి చేపట్టిన పనులు పూర్తిచేయవచ్చును.

ఉదాహరణకు, ఒక వైద్యుడున్నాడంటే రోగిని రోగమునకు సంబంధించిన అనేక వివరాలను రోగనిర్ధారణపై తెలుసుకోవడం జరుగుతుంది. రోగియొక్క రోగమును పూర్తిగా తగ్గించాలన్నదే వైద్యుని యొక్క లక్ష్యము. అది తాను ఎంత వరకు నెరవేర్చగలడు? తాను చేపట్టే వైద్యవిధానంలో రోగికి పూర్ణ స్వస్థత కూర్చాలని ఆశిస్తాడు. అయితే రోగికి ఎంతవరకు నయమవుతుంది, రోగి తనమందులకు ఎంత వరకు స్పందిస్తాడు అన్నది తనకు ముందుగా అవగాహన ఉండదు. ఇట్టి పరిస్థితులలో రోగిని కాక రోగమును దృష్టిలో పెట్టుకుని మందులు వాడుటకు వైద్యుడు సిద్ధపడతాడు. ఇలా చేయుట వలన ఆ రోగి ఆరోగ్యము తప్పక మెరుగుపడును. తాను రోగనిర్ధారణ కోసం చేసిన ప్రయత్నాన్ని బట్టి ఆ వైద్యునికి రోగి పరిస్థితికూడా అర్థమై, అనతి ఆరోగ్యమును తిరిగి పొందుటలో సహాయపడును.

లక్ష్యమును సాధించుటలో ఇప్పటికీ ద్వంద్వవైఖరులు వ్యక్తమగు చున్నవి. ఆచరించే పద్ధతులననుసరించి అవి మంచిగాని చెడు విధానమును గానీ అవలంబించినట్లుగా వ్యక్తమగుచున్నది. ఈ నేపథ్యములో అనుసరించే ప్రవర్తనా తీరుకూడా విభేదములతో కూడి ఉంటున్నది. వారు అనుసరించే పద్ధతులు సరిగా వుండవచ్చు. ఉండక

పోవచ్చును. తప్పుగా గానీ ఒప్పుగాగానీ భాసించవచ్చు. ఇట్టి విశ్లేషణలతో ప్రతి విషయమును పరికించుట జరుగుతున్నది.

ఒక సంస్థకు ఒక ఉన్నతమైన లక్ష్యసాధన ఉంటుంది. ఈ లక్ష్య సాధనలో అనేకమైన కార్యక్రమాలు ఒకదానికొకటి అనుసంధానంతో, ఐకమత్యంతో నిర్వహించవలసి ఉంటుంది. సంస్థలో పనిచేసేవారి దృష్టి అంతా ముఖ్యంగా సంస్థ యొక్క ఉత్తమ లక్ష్యసాధనే అయి ఉంటుంది. ఆ లక్ష్యమే వారిలో ఐకమత్యమును నింపుతుంది, ప్రేరణనిస్తుంది. చేపట్టిన కార్యక్రమము లక్ష్యము సాధించాక ముగింపుపలకడం ఉండదు. మరియొక ఉత్తమ లక్ష్యమును ఎన్నుకోవడం, మళ్ళీ ఆ లక్ష్యసాధనకు కృషి చేయడం జరుగుతుంది. ఈ విధంగా లక్ష్యాలు, సాధనలు కొనసాగుతూనే ఉంటాయి.

కార్యము అనగానే పనిముట్లు ఉండాలి. ఉదాహరణకు ఊపిరి పీల్చు కోవడానికి గాలి ఉండాలి, అమ్మకానికి, కొనుగోలుకి వస్తువులు ఉండాలి, ఒకసమస్యను విశ్లేషించడానికి విచారణ అవసరం ఉంటుంది. శూన్యముతో ఏ మానవుడు పని చేయలేడు. ప్రపంచము, పరికరాలు ఉండి వాటితో పనిచేసినపుడు ఫలితాలు అందుతాయి. గాలి, నీరు, కలప మొదలగునవి మానవుడు ఉపయోగించి నపుడే ఉపయోగపడును. లేకపోతే అవి ఉపయోగపడవు.

ఒక వ్యవస్థలో పనిచేస్తున్నప్పుడు, ఎన్నో వస్తువులు పరికరాలతో కార్య కలాపాలు సాగుచుండును. అనేకమైన కార్యకలాపాల సమాహారమే ఆ వ్యవస్థయొక్క మనుగడను తెలియజేస్తుంది. ప్రతి కార్యము నిర్వహణ పూర్తికాగానే విశ్లేషించడం జరుగుతున్నది. దీనివల్ల ఆ వ్యవస్థయొక్క విలువ ఎంతవరకు మార్పు వచ్చినది తెలుస్తున్నది. ఈ విశ్లేషణలతో ఎప్పటికప్పుడు కొత్త కోరికలతో, నూతన పోకడలతో వ్యవస్థ యొక్క అభివృద్ధికి కృషి జరుగుచున్నది.

ఒక పథకము ప్రకారము పనులు చేపట్టి పూర్తిచేసి లక్ష్యములు సిద్ధించు కోవడం జరుగుతున్నది. మంచి ఉద్దేశ్యముతో పనులు చేపట్టవలెను. అప్పుడు పనులు ఆశించిన రీతిలో పూర్తగును. అనగా సత్ఫలితాలను ఇచ్చును. కాబట్టి కార్యము నెరవేర్చువానికి ఫలమును దృష్టిలో పెట్టుకుని పనిచేయవలెను. స్పష్టమైన పనులకు వ్యవస్థలో చోటు కల్పించడమవుతున్నది. ఈ కారణముచే తేలికగా అనుకున్న పనులు నెరవేరును. మంటవల్ల వేడి జనించును. చల్లదనం వల్ల చలి పెరుగును. అదే విధముగా వైవిధ్యమున్న పనులను క్రమబద్ధముగా నిర్వహించి పూర్తిచేయడం జరుగుతున్నది.

కొన్ని సందర్భాలలో చేపట్టిన కార్యాలు పూర్తగును. ఉదాహరణకు ఒక ఇంటి నిర్మాణమును మొదలుపెట్టి, పూర్తి చేయడం జరుగుతుంది. అలాగే ఒక రోగికి స్వస్థత కలిగించడములో వైద్యుడు కృతకృత్యుడవుతాడు. అయితే కొన్ని సందర్భాలలో చేపట్టిన కార్యమునకు ముగింపు దొరకదు. ఉదాహరణకు విషయమును అర్థము చేసుకోవడంలో గానీ లేదా మన తలంపులలో సమగ్రత లోపించవచ్చును. అనుకున్న కార్యము పూర్తయితే, పూర్తయిన వస్తువు మీద దృష్టి పెట్టడం జరుగుతుంది. అనుకున్న కార్యము పూర్తి కానప్పుడు ఆ కార్యము ఎందుకు పూర్తికాలేదో అని విశ్లేషించడం జరుగుతుంది. కాబట్టి ప్రతి ఒక్కరు ఒకపని చేపట్టినప్పుడు తమ పని తీరును, మరియు తయారవుతున్న వస్తువు యొక్క రూపురేఖల మీద లగ్నము చేయవలసి ఉంటుంది.

పనులు పూర్తి చేయు విధానాలలో కొందరు ప్రకృతి సాయము పొందెదరు. మరికొందరు తమ తెలివితేటలను ఉపయోగించు కొనెదరు. ఎవరూ ఏ విధానాన్ని అనుసరించినప్పటికీ పనిని పూర్తి చేయుటే వారి లక్ష్యముగా భావించెదరు.

# 23. కారణం - మనస్సాక్షి

## అ. కారణప్రభావం

మనస్సాక్షి అనగా ధర్మాధర్మ విచారణశక్తి, అంతఃకరణము, అంతరాత్మ, సదా సద్వివేకము. తత్వజ్ఞానము అనునది ఆలోచనలతోనూ, ఆచరణతోనూ కూడినది. నైతిక అనునది ఆచరణతో కూడిన జ్ఞానము. ఈ తత్వము మన మనోభావాలపైన మరియు మనము ఆచరించు కర్మలపై ప్రభావము చూపును. ఇది బద్ధకస్తులు తీరికగా చేసిన నిర్ణయాలకు అతీతమైనది. మానవుడిని అతని కర్తవ్యకర్మలు శాసిస్తాయి. కర్తవ్య నిర్వహణలో లోపములకు భయపడుతూ, కర్తవ్య నిర్వహణలో నలుగురితో తనబాధ్యతలు పంచుకోవడానికి ముందంజతో ఉంటాడు.

నైతికత మనుషులు మనోభావాలపైన మరియు కర్మలపైన ప్రభావము చూపుతుంది. ఈ కారణముచే తత్వవేత్తలు శలవిచ్చే దేమిటంటే, మానవులు చేపట్టే కొన్ని కార్యాలకు కారణములు అంతు బట్టవు అని. నైతికత మనలో మనోభావాలు రేకెత్తించుట వలన మనము కొన్ని కర్మలు చేయవచ్చును. మరికొన్న కర్మలు చేయక ఊరుకొనవచ్చును. ఇట్టి సందర్భాలలో కారణము అంత బలమైనదిగా వ్యక్తముకాదు. ఇట్టి నేపథ్యములో నైతిక సిద్ధాంతాలు మనకు అసలైన కారణాలుగా అనిపించవు. కారణము లేకుండా ఎవరు ఏ కార్యము చేపట్టరన్నది యదార్థము. అయితే నైతికత మనుష్యుల మనోభావాలపైన, కర్మలపైన ప్రభావము చూపుతున్నంత కాలము అట్టి నైతికతపై ఆధారపడరాదు.

కారణముతో సత్యము గానీ అసత్యముగానీ విధితమవుతుంది. సత్యముగానీ అసత్యముగానీ ఒక ఒప్పందము వంటిది. మనలోని ఆలోచనలకు, మాటలలోని సూచనలకు, క్రియలోని ఆచరణకు మధ్య

సంబంధము ఉండాలి. ఇట్టి సంబంధముతో నిజ జీవితంలోని అనేక సంఘటనలలోని భావాలను, సారమును గ్రహించుట జరుగుతుంది. అనగా ఇట్టి సంఘటనలకు కారణాలు గోచరమగును. ఇట్టి కారణాలను ఒప్పుకోవడం సత్యమవుతుంది, ఒప్పుకోకపోవడం అసత్యమవుతుంది.

మన మనోభావాలు, ఇచ్ఛాశక్తి మరియు కర్మలు ఎట్టి ఒడం బడికలను అనుసరించవు. అవి స్వచ్ఛమైనవి, నిజమైనవి, పరిపూర్ణమైనవి. అవి ఇతరుల మనోభావాలను, ఇచ్ఛాశక్తిని మరియు కర్మలను అనుసరించవు. ఈ నేపథ్యములో అవి కారణమునకు అనుసరించుననుటకు వీలులేదు. అందుకే నైతిక తారతమ్యాలకు కారణము దొరకవు.

కారణము చురుకైనది కాదు, కానీ అంతరాత్మ చాలా చురుకైనది. కారణము గానీ శాస్త్రముగానీ ఒకటే. అవి జరిగిన సంఘటనలను విశ్లేషించి, ఆ సంఘటన లకు గల సంబంధబాంధవ్యాలను తెలియజేయును. ఇవే సంబంధ బాంధవ్యాలతో అనేక పాత్రలు ఇమిడినప్పుడు, ఆయా పాత్రల వివరాలకు కారణాలు కనిపెట్టలేదు.

పరిశీలనలో తేలిన విషయము ఏమనగా కారణము మన ప్రవర్తనపై రెండు ధముల ప్రభావము చూపును. ఒకటి, అనుభవముతో ఉన్న ఒక వస్తువును చూపించి దానిని బట్టి మనలో మనోభావాలను రేకెత్తించుట. రెండవది, ఫలితాలకు కారణాలకు మధ్యనున్న సంబంధ మును గుర్తించి మనలో మనోభావాలు రేకెత్తించుట. కారణము, ఫలితము మన అనుభవములోనివే. ఇట్టి అనుభవాలతో కూడిన నిర్ణయాలు కూడా అప్పుడప్పుడు తప్పని ఋజువుతుంది. అప్పుడు మనకు సరియైన కారణాలు దొరకవు.

మొత్తంమీద, మంచిచెడుల వ్యత్యాసాలకు కారణము సరియైన సమాధానము రాబట్టలేకపోవుచున్నాము. ఈ కారణముచే, కారణమును

ఆధారముగా చూపి కార్యాలను పురమాయించ లేకపోతున్నాము. ఈ మంచి చెడుల వ్యత్యాసము వలన కారణము బలహీనముగా వ్యక్తమగు చున్నది. కారణముతో పాటు వివేకవిచక్షణల వలన మనలో మనోభావాలు వ్యక్తమగుచున్నవి. ఈ మనోభావాలు కార్యమునకు కారణమగుచున్నది. అయితే ఇట్టి సందర్భాలలో ఈ వివేక విచక్షణలు దేనిని ఆధారము చేసుకుని మంచినా, చెడునా అన్నది సరిగా వ్యక్తము కావటం లేదు. అలాగని ఇతర నిర్ణయాల నాధారము చేసుకుని మనము వివేకముతో పరికించినట్లయితే మంచిని ఆధారముగా చేసుకున్న నిర్ణయాలకు బలము చేకూరును.

నైతికత అన్నది వస్తువు కారణం కాదన్నది అర్థమవుతున్నది. మంచి చెడులు అనునవి వాస్తవానికి సంబంధించిన విషయాలు కావు, కారణము విశ్లేషించడానికి. ప్రతికార్యమునందు, కొన్ని మనోభావాలు, లక్ష్యాలు, ఇచ్ఛాశక్తులు మరియు ఆలోచనలు కూడి ఉంటాయి. ఒకవిధంగా మనకు వాస్తవమే కనుపించదు. ఒక వస్తువును ఎంతకాలము చూచిననూ, ఆ వస్తువునందు దోషము మనకు కనబడదు. అయితే ఆచరణకు పూనుకొన్నప్పుడే, ఆచరణలో లోపాలు బయటపడుతున్నవి. ఈ కారణముచే ఆ కార్యముపై మనకు బేదాభిప్రాయాలు కలుగుచున్నవి. ఇది వాస్తవము. ఇది మనలోని భావన. దీనికి కారణము మనమే. అనగా ఈ బేదాభిప్రాయానికి వస్తువు కారణము కాదు, మనమే.

మనము ఒక కార్యముగానీ పాత్రగానీ చెడుగా భావించినపుడు, అది మనలోని భావన మాత్రమే. మంచికానీ చెడుగానీ శబ్దముతోను, రంగులతోను, వేడి, చలువలతోను పోల్చవచ్చును. అవి వాటి యొక్క ధర్మాలు. కానీ మన మనస్సు వాటిని ఎలా గ్రహిస్తుంది అన్నది ముఖ్యము. మన మనస్సుకు సుఖమనిపించవచ్చు, లేక బాధనిపించవచ్చు, లేదా

అసౌకర్యముగా భావించవచ్చు. ఆ వస్తువుల యొక్క స్వభావము మన ప్రవర్తనపై ప్రభావము చూపుతున్నది.

మంచిచెడులను కనిపెట్టవచ్చును కారణముల చేతనో, లేక ఆలోచనల యొక్క పోలికతోనో లేక కొన్ని ముద్రల చేతనో సాధ్యమగును. నైతికతను మనమనస్సు మంచిచెడుల భావములుగా గ్రహిస్తున్నది. కాబట్టి నైతికత అనునది మనలో మెదిలే కొన్ని మంచిచెడుల యొక్క భావాలే. అయితే ఈ భావాలను వివరింపవీలుకాదు.

ఈ భావాలు ప్రతిక్షణము మనకు అనుభవమునకు వచ్చును. ఈ భావాలు మనలో ఒకసారి సంతోషమును, మరొకసారి బాధను వివిధ మోతాదులలో కలిగించును. కర్మగానీ పాత్రగానీ మంచి లేదా చెడుగా భావింపబడటానికి కారణము మనము ఆ వస్తువునుండి ఏమి గ్రహించామో అన్నదానిని బట్టి, గ్రహించినదానిని బట్టి, మంచి చెడులుగా మన అభిప్రాయమును కారణముతో వివరిస్తున్నాము. ఒక వస్తువు గురించి ధ్యానించినపుడు మనకు తృప్తి కలిగిన యెడల ఆ వస్తువుపై మంచి అభిప్రాయాన్ని వ్యక్తము చేయడం జరుగుతుంది. మన భావమే పొగడ్తలకు, విమర్శలకు కారణమవుతున్నది. అంతకుమించి వివరముల లోకి వెళ్ళలేకపోతున్నాము. మన తృప్తికి గల కారణాలను కూడా విశ్లేషించలేకపోతున్నాము.

మనకు ఇష్టము కలిగించినంత మాత్రాన ఆ పాత్రను మంచిగా చిత్రించలేము. ఒక క్రమపద్ధతిలో మనము ఒక వస్తువు నుండి సంతృప్తిని పొందినపుడు, ఆ కారణముచే, ఆ వస్తువును మంచిగా భావించడం జరుగుతుంది. మనము అనేక విషయాలలో ఈ విధమైన నిర్ణయాలు తీసుకుంటాము. ఉదాహరణకు రుచి, స్పర్శ, వాసన వాటి విషయంలో మనకు కలిగిన అనుభవాన్ని మనం వ్యక్తము చేస్తాము.

నైతికముగా మంచిచెడులనేవి మన భావాలమీద ఆధారపడి యున్నవే తప్పితే కారణాలపై కాదు. ఆయా వస్తువులు లేదా పాత్రలు మన సమీపాన ఉన్నప్పుడు వాటిపై కలిగే భావాలు మన సంతోషమునకు గానీ దుఃఖమునకు గానీ కారణమగుచున్నది.

మానవుడు ఆచరించు కర్మలు ఎక్కువగా ప్రభావము చూపడమే కాక మానవుని కర్తవ్యకర్మలను తెలుపుతుంది. కొన్ని సందర్భాలలో మనలో కలిగే స్పందనలు ఆమోదమును తెలియజేయును. బుద్ధి, వివేకము, చతురత, సామరస్య ధోరణి మొదలగు లక్షణాలు వెంటనే అందరినీ ఆకర్షించును. అంతేకాదు సానుభూతి కూడా కురిపించును. ఈ లక్షణాలు గలవారు సాటివారిని తమ ప్రేమతోను, ఉన్నతి తోనూ ప్రభావితము చేస్తారు. మానవుడు తన సహజమైన లక్షణాలతో సాటి వారిని సంతృప్తిచేయును. ఈ లక్షణాలను సరిగా వివరించలేము. కానీ లక్షణాలతో సిద్ధాంతాలను రూపొందించి అందరికీ అందుబాటులోనికి తెచ్చెను.

**ఆ. మనస్సాక్షి:**

మన మనస్సాక్షి మన త్రికరణములైన మనోవాక్ కర్మల యొక్క నైతికమును గ్రహించును. తద్వారా మనకు ఎంతో సంతోషము లేదా దుఃఖమును అందించును. మన త్రికరణాలు సమర్థవంతమైన యెడల సంతోషము, చెడు మార్గాన పయనించి నపుడు దుఃఖము కలుగును.

మన నైతికత మన మనస్సాక్షికి తెలుసు. మన మనస్సాక్షే మన అంతర్వాణి. మన అంతర్వాణి మనకు రాజాజ్ఞతో సమానం. మనస్సాక్షి మన మనస్సుకు అర్థమవుతుంది. మన మనస్సాక్షి నిర్ణయానికి మానవులు నైతికముగా బద్ధులవుతారు. మనస్సాక్షి నిర్ణయమే తుది నిర్ణయము.

కారణము మరియు మనస్సాక్షి లిరువురు మనము భావించుకునే మంచి చెడులకు మధ్యవర్తిత్వము వహిస్తున్నారు.

మన సాంఘిక మరియు మతపరమైన సంస్కారాలన్నీ కూడా నైతిక విలువలకే ప్రాధాన్యత నిచ్చెను. సంస్కారము వలననే ఒక వస్తువుకు విలువ పెరుగును. మన సంస్కృతిని ఆచరించిన మనము సంస్కరింప బడతాము. మానవ జీవిత పరమార్థము బోధపడుతుంది. మనస్సాక్షిని అనుసరించినవాడు నైతికముగా అభివృద్ధి చెందును. మన మనస్సాక్షిని అనుసరించినవారు ఎన్నడూ చెడిపోరు. ఈ కారణముచే మన మనస్సాక్షి మనకు ఎంతో బలమును, ధైర్యమును అందిస్తుంది.

మనస్సాక్షి ఎప్పుడూ సజీవంగా ఉంటుంది. చిటికలో మన నైతిక చర్యను విశ్లేషించి, నైతికముగా మనల్ని నలుగురిలో ముందుకు ప్రోత్సహిస్తుంది. మన మనస్సాక్షిని మనం నిరంతరము అనుభవిస్తూ ఉంటాము. మనస్సాక్షి ప్రేరణతో మానవుడు తెలివితో వర్తించును. మనస్సాక్షి మనలో ఎంతోచొరవ, ధైర్యములను రేకెత్తించును. మనస్సాక్షిని నమ్ముకున్నవాడు నలుగురితోను సహజముగా కలువగలడు. చొరవతో తన ఉద్దేశ్యమును బయటపెట్టును. నలుగురితోను తన సత్ప్రవర్తన ఋజువుకు ఇతరులతో సవాల్‌కు సిద్ధపడును. ఆరోగ్యకరమైన మనస్సాక్షి ఎప్పుడు పరిమితముగా వ్యవహరించదు. అది ఎప్పుడూ అనంతముగానే ఆలోచిస్తుంది. మనస్సాక్షితో నలుగురిలో తమ భావాలను, అనుభవాలను ప్రకటించి, అందరికీ మేలు చేయుదురు. మనస్సాక్షి కారణమున నలుగురితో కలసి కార్యాలు చేయడానికి ఇష్టపడతాము. మనస్సాక్షి ప్రేరణతో నలుగురిలో మన ఆనందమును పంచుకుంటాము.

# 24. సద్గుణం

మంచికి విలువ ఎక్కువ. మంచి వల్ల విలువ పెరుగుతుంది. మంచితో సర్వోత్తమమైన స్థితిని అందుకొనవచ్చును. మనుష్యుల మంచితనములలో హెచ్చుతగ్గులు కనబడును. అందుకనే చాలామంచి వారిని మనము పొగడాలనిపిస్తుంది. అందరూ సమానమైన మంచి తనము గలవారైతే ఎవరూ ఎవరినీ పొగడపనిలేదు.

మంచివారి యొక్క లక్షణము వివేక విచక్షణలతో నిరంతరము జీవిస్తారు. ఈ వివేక విచక్షణల కారణముగానే వీరిలో అనేక మంచి లక్షణాలు అభివృద్ధిచెందును. వివేక విచక్షణలు లేకుండా మనము ఆనందముగా గానీ, ఆదర్శముగా లేదా న్యాయముగా జీవించలేము. మరో విధంగా చెప్పాలంటే ఆనందముగా జీవించేవారు వివేకవిచక్షణ లతో, ఆదర్శముతో మరియు న్యాయబద్ధమైన జీవితమును గడుపుతారు.

సద్గుణముల వల్ల సహజముగా ఆనందకరమైన జీవితాన్ని అనుభవించవచ్చు. సద్గుణాలను ఆనందమును వేరు చేయలేము. ధన్యమైన, ఆనందకరమైన జీవితానికి సమస్యలు కానరావు. అంతేకాదు, ఇతరులకు వీరు ఎన్నటికీ సమస్యలు కల్పించరు. కోపమున్న వ్యక్తం చేసి కాని లేదా ఆశ చూపించి కానీ వీరు ప్రలోభపడరు. బలహీనులు ఇట్టి ప్రలోభాలకు గురి అగుదురు.

సద్గుణాలకు, నైతికతకు ఒక స్వచ్ఛమైన వ్యత్యాసము కానవచ్చును. సద్గుణాలు సమీకరణలతో సాగేది, నైతికత స్వతంత్రమైనది. సద్గుణాలు కలవారు తమతమ బాధ్యతలను చక్కగా నిర్వహిస్తారు. అలాకాక, మనకు తెలిసిన సుపరిచితులను పరిశీలించినట్లయితే వారి బాధ్యతల నిర్వహణ కంటె వారిలోని సద్గుణాలకే మనము ప్రభావితమవుతాము.

అనుభవముతో ఉన్న అన్ని స్థితులలోనూ, మంచిని మాత్రమే మనము పొగడుట జరుగుతుంది. ఈ మంచితనము రెండు రకాలు. ఒకటి తెలివితేటలతో కూడినది, రెండవది మంచితనముతో కూడినది. తత్వజ్ఞానము, అవగాహన మరియు అనుభవజ్ఞానాలు తెలివితో కూడిన సద్గుణాలు. ఔదార్యము, సహాయపడుట, త్యాగము మొదలగున్నవి సద్గుణాలు. విద్యవల్ల తెలివితో కూడిన సద్గుణాలు పెరుగును. అనుభవ జ్ఞానానికి ఆచరణ, ఆచరణకు సమయము అవసరము. అందరు సద్గుణాలను అలవాటుగా మార్చుకొనవలెను.

మొదట మనము అభ్యాసము ద్వారా సద్గుణాలకు అలవాటు పడవలెను. మనము న్యాయమైన, ధైర్యమైన, సామాన్యమైన పనులకు అలవాటుపడితే ఇతరులచే మన పనులద్వారా గుర్తింపబడతాము. భౌతికమైన సుఖాలకు దూరముగా జరుగునపుడు మనము మితముగా వ్యవహరించుటకు అలవాటు పడతాము. అదే విధముగా ధైర్యము. మనము భయపడు విషయాలను లక్ష్యపెట్టని రోజున, మనలో ఆ విషయాల పట్ల భయము పోయి ధైర్యము చేకూరును. మనము ధైర్యము తెచ్చుకొన్నాక, ఏకాంతముగా నైనా ఎదుర్కొనడానికి సిద్ధమవుతాము. ఈ నేపథ్యములోనే మన అలవాట్లు గురించి శ్రద్ధ చూపవలెను. చిన్నప్పటి నుండి, యువకులుగా పెరిగే వయస్సులో మనము మంచి అలవాట్లకు అలవాటుపడాలి.

మనము చేసే పనులవల్ల మనకు సుఖముగానీ కష్టముగానీ కలుగవచ్చు. ఎవరైతే భౌతికమైన వాంఛలకు, శారీరక సుఖాల కొరకు తాపత్రయపడుదురో వారు సమస్థితిని అనుభవిస్తారు. అలాగాక శారీరక సుఖాలు కోరేవారు, అవి అందనపుడు చాలా బాధను వ్యక్తము చేస్తారు. ఎవరైతే తమకు కష్టమైనవాటిని కూడా భయపడకుండా, సమస్థితిలో

గ్రహిస్తారో, వారే ధైర్యవంతులు. అలాగాక ఎవరైతే తమకు కష్టము కలిగించే వాటికి భయపడి, బాధకు గురి అవుతారో, వారు పిరికివారుగా గుర్తింపబడతారు.

సమస్థితి ఒక సద్గుణము. వీరు ద్వంద్వాలను సమముగా స్వీకరింతురు. మనము సుఖము కొరకు చెడుపనులు చేస్తుంటాము, అలాగే కష్టమునకు భయపడి మంచిపనులకు దూరముగా జరిగి పోతాము. కాబట్టి సుఖముకోసం తాపత్రయ పడక, కష్టము వలన భయపడక వ్యవహరించుటే నిజమైన విద్య.

సద్గుణముల యందు ఆచరణ మరియు మనోభావాలు వ్యక్తమగును. ప్రతి కర్మవల్ల సుఖముగానీ కష్టముగానీ ఎదురగును. మనము ఆచరించే కర్మలకు, మనము అనుభవించే కష్టసుఖాలను దృష్టిలో పెట్టుకుని హెచ్చుతగ్గులు నిర్ణయించు కుంటాము. ఈ కారణముచే కష్టసుఖాలకు ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వబడినది. సద్గుణాలను పద్ధతిగా వినియోగించు కోవడం మంచి అనిపించు కొనును. అలాకాక సద్గుణాలను అలక్ష్యము చేయుటే చెడు అనిపించుకొనును.

మనము ఆచరించు పనులు న్యాయబద్ధముగానూ, మితముగానూ ఉండ వలెననుకోవడంలో కొన్ని ప్రశ్నలు ఉదయిస్తాయి. మనము ఆచరించే కర్మలు కొన్ని ప్రత్యేక రీతులలో ఆచరించవలెను. ఈ కారణముచే మనము చేసిన కార్యము న్యాయముగానూ లేదా సరిగా చేసామా అని మనము గుర్తించలేము. కర్తయొక్క స్వరూప స్వభావాలు ఇందు ఇమిడి ఉన్నాయి. మొట్టమొదట కర్తకు జ్ఞానము కలిగి ఉండ వలెను. రెండు చేపట్టిన కార్యాలు పద్ధతి ప్రకారమే నిర్వహించవలెను. మూడు, తాను ఆచరించే కార్యము స్థిరమైన చిత్తముతో నడుపవలెను. అనగా పనిమధ్యలో ఆపకూడదు, పనిపూర్తి చేయవలెను. ఈ నేపథ్యములో

చేపట్టే కార్యాలు న్యాయబద్ధము గాను, సరిగా పూర్తిచేయుట యనునది ప్రతి ఒక్కరికీ ఎంతో అవసరమై ఉన్నది. జ్ఞానము ఎంత ఉన్నను, పని సరియైన విధమున పూర్తి చేయుట ముఖ్యమని గ్రహించవలెను.

పనులను న్యాయబద్ధంగాను, పద్ధతిగానూ పూర్తిచేయాలని అనుకుంటాము. పరిస్థితులను కూడా విశ్లేషించుకోవాలి. న్యాయబద్ధముగా ఆలోచించి పనిని పూర్తిచేసేవారు ఉంటారు. పద్ధతులననుసరించి పనులను సరియైన విధంగా పూర్తి చేసేవారు ఉంటారు. అసలు పనులు చేపట్ట కుండా మంచితనము మనకు అబ్బదు.

అసలు మంచి అంటే ఏమిటి? మన ఆత్మలో మూడు విషయాలు ఉంటాయి. అవి మనోభావాలు, బుద్ధి మరియు శీలము. మనలోని మనోభావాలు కోపము ఆకలి, భయము, తనపై నమ్మకము, ఈర్ష్య, సంతోషము, స్నేహభావము, ద్వేషము, ఆత్రుత, దయ, అనుకరుణ మరియు సుఖము, దుఃఖము కలుగు అనుభవాలు. మంచి ఉద్దేశ్యముతో ఈ మనోభావాలను అనుభవించడం బుద్ధి అనిపించు కుంటుంది. ఉ దా: కోపము, బాధ, దయ మొదలగు భావాలను అనుభవించుట. మనము మంచికి నిలబడతామా లేక చెడుకు నిలబడతామా అన్నది శీలము యొక్క స్థితిపై ఉంటుంది. ఉదా : కోపము వచ్చినప్పుడు ఉద్రేకమునకు లోనైనచో చెడుగా ప్రవర్తింతుము. మనలో మంచి భావనలు కలిగినపుడు మనము ఉద్రేక మునకు లోనుకాక మంచిగా ప్రవర్తింతుము. ఇదే రీతిలో మన మనోభావాలు మన ప్రవర్తనపై ప్రభావము చూపును.

మన మనోభావాలకు మంచి, చెడు అనునది ఉండదు. మన భావాలను బట్టి మనము మంచి వారమా లేక చెడ్డ వారమా అన్నది నిర్ణయము కాదు. మనము చేసే మంచి లేదా చెడుపనులను బట్టే మనము గుర్తింపబడతాము. మన మనోభావాలు మనలోనే ఉంటాయి. అవి

వ్యక్తము కావు. కానీ ఆచరణను బట్టి మన మంచి చెడులు వ్యక్తమవుతాయి.

మనకు కోపము గానీ భయముకానీ వేసినపుడు ప్రత్యామ్నాయము కనపడదు. కానీ మంచి గుణాలకు ప్రత్యామ్నాయము ఉంటుంది. పైగా, మనము మనో భావాలతో కరిగి పోయామంటుంటాము. అయితే మంచి చెడులకు మానవుడు స్పందిస్తాడు తప్పితే కరిగిపోడు. మనలోని బుద్ధి సమంజసంగానే వ్యక్తమవుతుంది. కానీ ప్రకృతి మనల్ని మంచి లేదా చెడు అన్నరీతిలో తీర్చిదిద్దదు.

సద్గుణాలు మనోభావాలు, బుద్ధికానప్పుడు శీలమై ఉండాలి. సద్గుణము గానీ నైపుణ్యముగానీ ఒక వస్తువునుండి మంచిని మాత్రమే రాబట్టును. ఆ మంచితో ఆ పనిని చక్కగా పూర్తికావించును. ఉదా: మనకు కళ్ళున్నాయి. మన కళ్ళను జాగ్రత్తగా చూసుకుంటాము. మన కళ్ళు బాగా చూడాలని, చూపు బాగుంటే మనము బాగా చూడగలుగు తామని. ఇదే రీతిలో మనిషిలోని శీలము చాలా ప్రధానమైనది. మనిషిలోని శీలము బాగుంటే, మంచి పనులకు అలవాటు పడతాడు.

మన శీలమును బట్టి మన నైజము వ్యక్తమవుతున్నది. మనము ఒకపనిని చేపట్టాము. ఆ పనిలో మంచి చెడుల పాళ్ళు ఏమాత్రం ఉంటున్నవి. మంచికి కట్టుబడినవాడు, పూర్తిగా మంచిగానే పనిని పూర్తిచేస్తాడు. అలా కానినాడు పనిని మంచి చెడులతో పూర్తిచేసి ముగిస్తాడు.

కర్మలనాచరించే సమయంలో మన మనోభావాలను నియంత్రణలో ఉంచాలి. మనము కోపము, ఆకలి, భయమ, మనపై మనకున్న నమ్మకము, దయ, బాధ, సంతోషాలను అతిగా కానీ, అసలు లేకుండగా

కానీ వ్యక్తం చేయరాదు. రెండింటికీ మధ్యస్తంగా ఉండాలి. మనము సందర్భమును పురస్కరించి వ్యవహారము చేయాలి. మనము వస్తువులను బట్టి ప్రవర్తించాలి. మనము మనుషులను బట్టి వ్యవహరించాలి. మంచి ఉద్దేశ్యముతో జీవించాలి. సద్గుణాలలో అన్ని మనోభావాలు సమపాళ్ళలో వ్యక్తము చేయవలెను.

ఇదేరీతి మనము చేపట్టే కర్మలలో కూడా వ్యక్తమవుతూ ఉంటుంది. సద్గుణములలో వ్యక్తమయ్యే మనోభావాలు మరియు ఆచరణ అతిగా ఉండరాదు అసలు లేకుండాను ఉండరాదు. అతిగా ఉన్నా అసలు లేకున్నా అట్టి కర్మలు సఫలముకావు. రెండిటికి మధ్యస్తము వహించినపుడు కర్మలు సఫలము చెందును. కార్య సాఫల్యము కలిగిన పొగడ్త అందును, కార్య సాఫల్యము మరియు పొగడ్త అనునవి సద్గుణము యొక్క లక్షణాలు. కాబట్టి నియంత్రణ అనునది సద్గుణముల యొక్క లక్షణము.

మన వైఫల్యాలకు అనేక కారణాలుంటాయి, కానీ సఫలము కావడానికి ఒకే మార్గము ఉంటుంది. అతివృష్టి, అనావృష్టి చెడు యొక్క లక్షణాలు. ఈ రెండిటికీ మధ్య మార్గమును అవలంభించుట సద్గుణము యొక్క లక్షణము. అరిస్టాటిల్ మహాశయుడు సద్గుణాలను గురించి ఇట్లు తెలిపెను. అనుభవ జ్ఞానముతో అతిగానూ, అసలు లేకుండాను ఉండకుండా మధ్య మార్గమే శ్రేయో మార్గముగా భావించి పనులు చేపట్టుట వివేకవంతుల లక్షణముగా తెలియజేసెను.

ప్రతి కార్యము మనోభావమునకు మధ్యస్తముగా పనిచేయుటకు అవకాశము ఉండకపోవచ్చును. కొన్ని కార్యాలు పూర్తిగా చెడ్డవి. ఉదా: సిగ్గు లేనితనము, అసూయ, ద్వేషము, పగ మొదలయినవి చెడు మనోభావాలు. లంచగొండితనం, దొంగతనం, హత్య మొదలయినవి చెడుపనులు. వీటిని ఎన్నటికీ మంచి పనులుగా భావించలేము. ఇటువంటి

చెడు మనోభావాలు, కార్యము లందు మధ్యస్తముగా అనునది అసలు వర్తించదు. ఈ చెడు లక్షణాలు ఏ కొద్దిగా వ్యక్తమయినా, అది చెడు ప్రవర్తనగానే భావించవలెను.

ఇప్పటిదాకా తెలుసుకున్న విషయాలు సామాన్యముగా అందరికీ వర్తించును. అయితే కొన్ని వ్యక్తిగత సంఘటనలను తీసుకున్నప్పుడు, మనము చర్చించుకున్న విషయాలు చాలా ప్రస్ఫుటముగా వ్యక్తమగును.

కొన్ని వ్యక్తిగత సంఘటనలు అందరూ భయమును వ్యక్తము చేసే పరిస్థితులలో కొందరు చాలా ధైర్యముగా వ్యవహరింతురు. తనపై తనకు గల నమ్మకముమంచిదే కానీ తాను చేసే పనులపై తనకు అతిగా నమ్మకమున్న, ఆ అతివల్ల పని పాడగును. ఎవరయితే అధికముగా భయపడుతారో వారు భయస్థులుగా గుర్తింపబడతారు. కష్టసుఖాలను సమముగా స్వీకరించాలి. ఇలా అందరూ ఉండలేరు కొందరు సుఖము కోసం అధికంగా తాపత్రయపడతారు. మరికొందరు ఈ సుఖముల విషయములో ఏమీ పట్టించుకోరు.

ధనము ఇచ్చిపుచ్చుకోవడంలో ఔదార్యమును చూపించాలి. ధనమును వృధాపరచరాదు. అవసరమున్న చోట అసలు ఖర్చు పెట్టకుండా పిసినారితనము పనికిరాదు. మనిషిని అతని గౌరవ మర్యాదలను పురస్కరించుకుని గౌరవించవలెను. అతిగా పొగడరాదు. అతిగా పొగడుట ధూర్తలక్షణము. కోపముగలవారు మంచి స్వభావముతో వ్యవహరించుట సబబు. 'సత్యం బ్రూయాత్, ప్రియం బ్రూయాత్ సత్యమప్రియం న బ్రూయాత్' – **బాబా**. అందరూ అన్నివేళలా సత్యమునే అనుసరించవలెను. సత్యమును ఉన్నది ఉన్నట్టుగా చెప్పవలెను. అతిగానూ చెప్పరాదు, సత్యమునుదాచరాదు. నలుగురిలో ఉన్నప్పుడు చమత్కారము ఆరోగ్యకరముగా ఉంటుంది. ఈ చమత్కారము అతిగా

ఉంటే హాస్యాస్పదంగా మారుతుంది. అసలు చమత్కారము లేకపోతే అనాగరికత, మోటుతనముగా ఉంటుంది. మనము నలుగురిలో మసలేటప్పుడు స్నేహపూరిత వాతావరణము కోరుకుంటాము. ఈ స్నేహములో పొగడ్తలు ఎక్కువగా ఉంటే అది ధూర్తుల లక్షణము. అలా కాక ప్రతి చిన్నవిషయానికి చిన్నబుచ్చుకోవడము వల్ల ఇబ్బందికర వాతావరణము ఏర్పడి విరోధాలకు నెలవవును.

కొన్ని మనోభావాలలో కూడా మధ్యస్తము ఆరోగ్యకరముగా ఉంటుంది. సిగ్గులేని తనము చెడుకార్యము అయితే నమ్రతగల వ్యక్తిని అభినందించాలి. మనము అతిగా సిగ్గుపడేవారిని చూస్తుంటాము. అసలు సిగ్గులేని వారిని కూడా చూస్తుంటాము. ప్రతి ఒక్కరితో కోపం లేకుండా మర్యాదపూర్వకంగా వ్యవహరించాలి సాటివారిపై పగ ద్వేషాలను ఎన్నటికి వ్యక్తము చేయరాదు. సాధారణముగా మన ఇరుగు పొరుగువారిని, స్నేహితులను చూసి మనలో ఈర్ష్యా ద్వేషాలు కలుగుతాయి. ఈర్ష్య అసూయలు కలవారు సాటిమనిషి బాగుపడుట చూడలేరు. అంతేకాదు సాటిమనిషి బాధలో ఉంటే చూచి ఆనందిస్తారు.

కోపము అధికముగా ఉన్న వ్యక్తిని కోపిష్టి అంటాము. కోపము లేని వ్యక్తిని శాంతస్వభావుడని అంటాము.

మన మనోభావాలు మరియు కార్యాలు అతిగానూ, అసలు లేకుండానూ ఉంటే, అవి చెడు కార్యాలుగా రూపుదిద్దు కుంటాయని తెలుసుకున్నాము. మధ్యేమార్గము శ్రేయస్కరమని చెప్పుకున్నాము. అయితే, అన్ని సందర్భాలలోనూ మధ్యేమార్గమును అంత సులభముగా రాబట్టలేము. మనము రోజూ ఎన్నో పనులు చేస్తుంటాము. ధనము ఇచ్చిపుచ్చు కోవడాలు చేస్తుంటాము. దానధర్మాలు చేస్తుంటాము. సరియైన వ్యక్తికి దానమిచ్చామా? సరియైన సమయంలో మంచి

పనిచేసామా? ఆకలిగా ఉన్నప్పుడే అన్నం పెట్టాలి. ఆ పెట్టేది రుచిగా ఉన్నప్పుడే వడ్డించాలి, పాసి పోయాక పెట్టరాదు. మంచి ఉద్దేశ్యముతో దానధర్మాలు చేయాలి. పేరు ప్రతిష్టల కోసం చేయరాదు. ఇలా ఒక మంచి పని చేయాలంటే ఎన్నో విషయాలు ఆలోచించి చేయాలి. కాబట్టి అన్నీ సక్రమముగా అన్నివేళలా జరగవు. ఇటువంటి పరిస్థితులలో మధ్యస్తము కార్యములయినా సంతోషమే, కారణము మెల్లిగా లోపాలను సవరించుకునే అవకాశం ఉంటుంది.

సద్గుణాల యందు మనోభావాలు, పనులు ఇమిడి ఉంటున్నవి. వివేకముతో కూడిన కార్యాలకు పొగడ్తలు, విమర్శలు ఎదురుకావచ్చు. తన ప్రమేయము లేకుండా జరిగిపోయే పనులకు క్షమాపణలు, జాలి ఇతరుల నుండి అందును. అనగా మన ప్రమేయము లేకుండా జరిగే పనులు అజ్ఞానము వల్లగానీ ఇతరుల బలవంతముపై గానీ జరుగు చున్నవి. తప్పనిసరి పరిస్థితులలో జరిగే కార్యాలు కర్త ప్రమేయము లేకుండా, కేవలం పరిస్థితుల ప్రభావమువల్ల మాత్రమే జరుగుతాయి.

సద్గుణాలకు అవకాశాలు మెండు. మనుష్యుల గుణాలను విశ్లేషించ డానికి వారు చేపట్టే కార్యాలను బట్టి జరుగును. గుణవంతులు వివేకము తోడి వ్యవహరింతురు. ఉదాహరణకు శిశువులు మరియు చిన్న చిన్న జంతువులు బుద్ధిని పంచుకుంటాయి. అయితే వాటికి ఉన్న అవకాశముల గురించి తెలియదు. వత్తిడికిలోనై చేపట్టిన పనులు వివేకముతో కూడినప్పటికీ అవి బలవంతముగా చేపట్టినవి, ఇతర సావకాశాలు లేనట్టిది. వివేకము ఉన్నచోట అవకాశాలు మెండుగా ఉంటాయి. ఉన్న అవకాశాలలో మెరుగైన అవకాశాన్ని ఎన్నిక చేసుకొనుట వివేకవంతుల లక్షణము.

సద్గుణము అనగా మధ్యస్తముగా మన మనోభావాలను, కార్యాలను నిర్వహించి మన శీలమును అభివృద్ధి చేసుకొనుట. మన సద్గుణాలు మనము చేపట్టే కార్యాలను అనుసరించి అభివృద్ధి యగును. మన సద్గుణాలు మన అధీనములో ఉంటున్నవి. వివేకముతో నియమాలను అనుసరించి పద్ధతిగా పనులు పూర్తి చేయుట జరుగును.

మనము వివేకముతో వర్తించినప్పటికీ మనము అనుకున్నట్టుగా పనులు పూర్తి చేయలేకపోవచ్చును. ఒక్కొక్కసారి పరిపూర్ణమైన జ్ఞానముతో మొదలుపెట్టి, మొదటి నుండి చివరికంటూ పూర్తి చేయగలుగుతాము. ఒకొక్కసారి పనిని చక్కగా మొదలుపెడతాము, కానీ మధ్యలో అనారోగ్య పరిస్థితుల వల్ల పనులు సవ్యముగా ముందుకు సాగవు. అనగా వివేకముతో వ్యవహరించినప్పటికీ, మన స్వాధీనములో ఉన్నప్పటికీ పనులన్నీ ఒక్క రీతిలో పూర్తికావు.

ఆత్మపరముగా రెండు మంచి లక్షణాలు కలవు. అవి శీలము మరియు తెలివితేటలు. ఆత్మపరముగా రెండు విషయాలను గ్రహించును. ఒకటి వివేకము తోటి, రెండు అవివేకముతోటి. వివేకముతో గ్రహించేవి మళ్ళీ రెండు రకాలు. ఒకటి నిత్యమైనవి, స్థిరమైనవి, రెండు అస్థిరమైనవి.

మనము నిత్యము ఎన్నో వస్తువులతో పనులు జరుపుకుంటాము. మన ఆత్మకు వస్తువునకు ఉన్న సంబంధము వస్తువు వుస్తువునకు మారుతుంది. అనగా వస్తువునకు ఆత్మకు మధ్య రెండు రకాల సంబంధ బాంధవ్యాలు నెలకొల్ప బడుతున్నవి. అవి శాస్త్రీయము మరియు కొలబద్ధము. శాస్త్రవిషయమున చర్చించుట జరుగును. అయితే స్థిరమైన వస్తువులయందు చర్చకు తావులేదు. ఇంక కేవలం వివేకముతో విలువ కట్టవలసి ఉంటుంది. ఈ రెండు స్థితులు కూడా సద్గుణము యొక్క లక్షణాలే.

పనిపూర్తి చేసిన విధానమును బట్టి పనిని విశ్లేషించుట జరుగును. మనము చేపట్టి చేసే కార్యమును, మరియు ఆ కార్యము యొక్క స్వభావమును, మూడు విషయములు నియంత్రించును. అవి ఇంద్రియ నిగ్రహము, కోరిక మరియు కారణాలు.

వీటిలో ఇంద్రియ నిగ్రహము ఎట్టి కార్యమును ఆశించదు. జంతువులలో ఈ విషయమును గ్రహించవచ్చును. జంతువులు తమ చుట్టూ ఉన్నవాటిని తమ ఇంద్రియాలతో పరికించును, కానీ వెంటనే తిరిగి ఎట్టి చర్యకు పూనుకొనవు. సమర్థత, అసమర్థతల మధ్య మన ఆలోచనా సరళి సాగును. ప్రయత్నించడం, తప్పించు కోవడమనేది మన కోరికల విషయంలో జరుగును. కాబట్టి సమర్థతతో కూడిన ఆలోచనలు, ప్రయత్నముతో కూడిన ఆచరణ మనకు చాలా ముఖ్యము. ఇందు సత్యము, తెలివితేటలు ఇమిడి ఉన్నవి. మంచికోరికలను సత్యనిరతితో తెలివితేటలతో చేపట్టి పూర్తి చేయవలెను. అసత్యభావనతో కార్యాలు చెడుగా పూర్తగును.

ఒక కార్యము చేపట్టి చక్కగా పూర్తి చేయడానికి కోరిక మరియు కారణాలు ఉండాలి. కోరిక ఎన్నికపై ఆధారపడును. మన ఎన్నికకు కారణాలు ఉంటాయి. మన వివేకము మన ఆధ్యాత్మిక స్థితిపై ఆధారపడి ఉంటుంది. మంచి కార్యము చేపట్టవలెనన్నా చెడు కార్యము చేపట్ట వలెనన్నా మన వివేకముతోపాటు మన శీలముపై ఆధారపడి యున్నది. అవివేకము కార్యమును సాధించదు. అయితే పనిని పూర్తి చేయాలన్న సంకల్పముతో కూడిన వివేకమే ఆచరణ యోగ్యమైనది క్రియాశీలక వివేకము కూడా చాలా ఉత్తమమైనది. ఉదా: ఒక మంచి కార్యము చక్కగా పూర్తి అగును. మన కోరిక కూడా ఇదే. ఒక పనిని చేపట్టడానికి కోరికల్లో ఎన్నిక అవసరం. ఆ కోరికను బలపరచు తర్కము అవసరము. అప్పుడు మానవుడు కార్యము చేపట్టును.

గతంలో ఒకసారి జరిగిపోయిన పనిని మళ్ళీమనము ఎంచుకోము. జరిగిపోయిన పనిగురించి ఎవరూ చర్చించరు. గతంలో జరిగిన పనిని ఎవరూ కాదనలేరు. ఒకసారి జరిగిన పనిని తిరిగి ఆ పనిని తప్పించడం ఎవరి తరమూ కాదు.

కర్మ వివేకముతో కూడి సత్యమైన బాటలో అనుసరించవలెను. సద్గుణము యొక్క 5 లక్షణములను మన ఆత్మ సత్యము ద్వారా పొందుచున్నది. అవి కళ, శాస్త్రీయ విజ్ఞానము, అనుభవ జ్ఞానము, తాత్విక జ్ఞానము మరియు ఆంతరంగిక జ్ఞానము. తీర్పు మరియు ఉద్దే శ్యములను ఇందు చేర్చలేదు. కారణము ఈ రెండింటికీ కళంకము ఆపాదింపబడవచ్చును.

కళ అనునది కర్తచేతిలోని నైపుణ్యము. ఒక శిల్పి రాయిలో విగ్రహమును చూస్తాడు. ఆ విగ్రహమును తీర్చిదిద్దుతాడు. కళ అనునది వస్తువులో లేదు. కళ అనునది కర్తయొక్క నైపుణ్యము. అనేక వస్తువుల నుండి కళాకారులు అనేక వస్తువులను సృష్టిస్తారు. నటన కూడా ఒక కళే. ఇక్కడ మనము నటన గురించి ప్రస్థావించుట లేదు.

శాస్త్రీయ విజ్ఞానము అనునది చాలా అవసరమై ఉన్నది. శాస్త్రీయ విజ్ఞానము మనకు తెలిసినది కొంచెము, తెలియనిది చాలా ఉంటున్నది. శాస్త్రీయ విజ్ఞానము మారునది కాదు. అందుబాటులో ఉన్న శాస్త్ర విజ్ఞానము మనకు నిరంతరము అవగతమే, అవసరమే. త్రికరణశు ద్ధితో ఆచరించిన నైపుణ్యము, నైపుణ్యము వలన సమత్వము, సమత్వముతో కూడిన జ్ఞానము విశ్వమానవాళికి ఆమోద యోగ్యమగును. అట్టి జ్ఞానము శాశ్వతము, అవసరము. ఇట్టి శాస్త్ర విజ్ఞానమును వివేకవంతులు అనుసరించెదరు.

అనుభవ జ్ఞానమన్నది మానవుని ప్రత్యేకస్థాయిలో నిలబెట్టును. కళవేరు, శాస్త్రీయ జ్ఞానము వేరు. అనుభవ జ్ఞానమన్నది తనవరకు మాత్రమే పరిమితము అన్నట్టుగా ఉంటుంది. ఈ అనుభవ జ్ఞానము వలన తనకు మేలు జరగడమేకాక, నలుగురిమేలుకు ఉపయోగపడడం జరుగుతుంది. ఇదే విధంగా తనకు జరిగే చెడును గ్రహించడమేకాక, ఆ చెడును నలుగురికీ తెలియజేసి వారు నష్టపోకూడదన్న భావము వ్యక్తమవుతుంది. మంచి అన్నది వీరి అంతిమ లక్ష్యము. దానిని అందరూ సాధించాలి.

అనుభవజ్ఞానమన్నది ఎంతో ఉత్తమమైన సద్గుణము. అది ఒక కళ కాదు. అనుభవ జ్ఞానము అభ్యాసము వలన సాధ్యము. ఆచరణ యొక్క వివరములు ఇతని ఎరుకలో ఉండును. అనుభవ జ్ఞానము కలవారికి అనుభవము మరియు జ్ఞానము రెండూ ఉంటాయి.

తత్వజ్ఞానము అనునది మంచిని సూచించును. కానీ మనలోని తత్వము మననుండి మంచిని రాబట్టవలెను. అదే సద్గుణము.

ఇంతవరకూ చర్చించుకున్న నాలుగు జ్ఞానములు ప్రతి ఒక్కరూ సిద్దాంత పరముగా గ్రహించినప్పటికీ, అన్నిటినీ కట్టి ఉంచేది ఆత్మతో అనుసంధానమైన సత్యము. అదే ఆంతరంగిక జ్ఞానము. మనకు ఒక విషయము అర్థమయ్యింది. వస్తువులో కళ, శాస్త్ర విజ్ఞానము, అనుభవ జ్ఞానము మరియు తాత్విక జ్ఞానములు గోచరము కావు. ఈ నాలుగు కర్తలో ఆచరణ ద్వారా పొందడం జరుగుతుంది. ఆంతరంగిక జ్ఞానంతో ఒకవస్తువును చూసినపుడు మొదటి నాలుగు సిద్ధాంతములు అనుభవము నకు వచ్చును. ఈ ఐదు జ్ఞానాల కలయికనే జ్ఞానమందురు.

జంతుస్థాయిలో సుఖముగా ఉండడానికి సద్గుణాలు ఆవశ్యకత ఉన్నది. సద్గుణాల నాచరించుట వలన మనబుద్ధి అభివృద్ధి చెందును.

మనము దైనందినజీవితంలో అనేక కర్తవ్యకర్మలను ఆచరిస్తూ ఉంటాము. ఆ కర్తవ్యకర్మలను న్యాయబద్ధముగానూ, ధైర్యముగానూ మరియు సద్గుణాల కలయికతో నెరవేర్చవలెను. ఈ కర్తవ్యకర్మల నిర్వహణలో మన మనోభావాలను పవిత్రంగా ఉంచుకుంటూ, సేవాతత్పరతను వ్యక్తం చేస్తూ సమర్పణా భావంతో పనులు పూర్తిచేయాలి. మానవులాచరించ వలసిన కర్మలు ఈ రీతిగా సాగవలెను. మన మనోభావాల యొక్క ప్రభావము మన శీలముపై చూపును. అనుభవజ్ఞానము శీలము యొక్క సద్గుణములననుసరించును. ఈ కారణముచే అనుభవ జ్ఞానములో ఇమిడియున్న సద్గుణాలు నైతికతకు సరిపోతాయి. అలాగే నైతికత ద్వారా తెలుసుకున్నవి అనుభవజ్ఞానముతో గ్రహించిన సద్గుణాలకు పొంతన సరిపోతుంది.

మన మనోభావాలకు సద్గుణాలకు మధ్య సంబంధము కలదు. మనము ఆచరించే సమిష్టి కార్యకలాపాలలో ఇవి కూడా ఒకభాగమే. మనము ఆచరించే కార్యకలాపాలన్నీ మానవత్వముతో కూడినవే. మానవత్వముతో ఆచరించే కార్యకలాపాలకు ఎంతో ఆనందమును అనుభవిస్తాము.

ఇక్కడ ఒక చర్చనీయాంశము ఉంటుంది. మనము పనులు చేపట్టి పూర్తి చేయడానికి మన ఇచ్ఛాశక్తి కారణమా లేక మన ఆచరణ కారణమా? ఇక్కడ గ్రహించవలసినది, ఒక కార్యమును ఆచరించడానికి ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి రెండూ అవసరమే. ఈ రెండూ సవ్యముగా ఉంటేనే ఏ కార్యమైనా సవ్యముగా పూర్తి అగును. క్రియాశీల అంశాలు అనేకం ఉంటాయి. మానవత్వములో భాగంగా ఈ సద్గుణాలన్నీ అభ్యాసముతో సాధించవలెను. ఇట్టి మానవతా విలువలు తెలుసుకుని, వాటిని ఆచరించిన సంఘంలో అందరికీ ఆదర్శవంతుడగును.

మానవుడు తన శరీరాన్ని కాపాడుకోవాలి. అంతేకాదు భౌతికమైన ప్రపంచమున జీవిస్తున్నాడు. మరి మానవుడు ఈ భౌతికమైన జగత్తు నందు సుఖపడకూడదా? సుఖపడాలి ఎంతవరకు. నిజానికి మన శరీర పోషణ కొరకు శ్రద్ధ తీసుకోవాలి. మనజీవితంను సాగించడానికి ఒక వ్యాపకము ఉండాలి. అంటే మన భౌతిక కోరికలు చాలా పరిమితముగా ఉంచుకోవాలి. పరిమితమైన భౌతిక అవసరములతో మానవుడు అంతులేని ఆనందమును పొందవచ్చు. మానవుడు నైతిక మార్గమునకు బద్ధుడై ఉండాలి. ప్రతి చిన్న కార్యము సద్గుణముతో ఆచరించాలి. సద్గుణాలతో ఆచరించిన జీవితము, ఎంత సామాన్యమైనదైనప్పటికీ అంతులేని ఆనందమును అందించును.

మరియొక చర్చనీయాంశము. ఈ మంచిచెడు పనులు మానవునకు సహజమా లేక అసజహమా? ఈ సమస్యకు సమాధానము రాబట్ట వలెనన్న మనము ప్రకృతిని ఏ రీతిగా అర్థము చేసుకున్నామో తెలుసుకోవాలి. ఈ ప్రకృతి అద్భుతాలకు విరుద్ధము అని గ్రహించిననాడు మంచి, చెడులు రెండూ సహజమే అని అర్థమవుతున్నది. ఏ విధముగా అద్భుతాలు అసహజమో, అదే రీతిలో మహానుభావుల అతి మంచితనం, మరియు దుర్మార్గుల అతి కిరాతకపనులు కూడా అసహజమే. ఈ నేపథ్యములోనే మనము ఈ మంచి చెడులను ఏది సహజమో ఏది అసహజమో గ్రహించవలెను.

ఏ లక్షణమైనా మనకుగానీ సాటివారికి గానీ సుఖాన్ని, సంతోషాన్ని అందిస్తుందో దానిపై మనకు ప్రేమ మరియు గౌరవము కలుగుతుంది ఇదే విధముగా ఏ లక్షణము వల్లనైనా మనకు గానీ మన సాటివారికి గానీ దుఃఖము, ఇబ్బందులకు గురిచేసిన వాటిపై ఏహ్యాభావన మరియు ద్వేషము కలుగుతుంది. మంచిగానీ, చెడుగానీ మన మనస్సులో

సమముగా స్పందించును. కాబట్టి ఏది మంచి? ఏది చెడు? అని నిర్ణయించడంలో మన స్పందనలను దృష్టిలో పెట్టుకోవాలి మంచి అనగానే సంతోషిస్తాము, ఆనందిస్తాము, గర్విస్తాము. చెడు అనగానే బాధపడతాము, అసహ్యపడతాము.

మంచి చెడులనేవి ఆయా గుణాలయొక్క స్వభావాలను వ్యక్తం చేసేవి. అవి మనస్సుయొక్క అనుభవంపై ఆధారపడి యున్నది. ఈ సిద్ధాంతాలన్నీ మానవ స్వభావంలో ఇమిడిపోయి శీలముగా రూపు దిద్దుకున్నది. కర్మలనేవి ఏ సిద్ధాంతమును అనుసరించి సంభవించలేదు. కాబట్టి కర్మల ప్రభావము ప్రేమ ద్వేషము, గర్వించడం, అసహ్యించు కోవడం అనే విషయాలతో ముడిపడదు. అంతేకాదు నైతికత ప్రమేయం కూడా కానరాదు.

ఈ నేపథ్యంలో మనము ఏ యొక్క కార్యముగానీ కార్యముల యొక్క నైతిక విశ్లేషణతో మనకు సంబంధము లేదు. చేతిలోని పని ఒక్కటే. అది ఎవరు ఏ విధముగా ఆచరిస్తున్నారో అన్నదే ముఖ్యము. ఈ ఆచరణ మన స్వభావము పైననే ప్రభావము చూపుచున్నది. మనకు తెలుసు మాటలలో వ్యక్తము చేయలేని ఎన్నో విషయాలను కార్యముతో వ్యక్తమగును. ఈ కార్యాల ఆచరణలలో, కర్తయొక్క నైజమును బట్టి, ప్రేమగానీ ద్వేషము గానీ ప్రకటితమవుతున్నది.

కాబట్టి కర్మాచరణలో మన మనస్సు పనితీరుపై ఆధారపడి ఉంటున్నది. పనినుండి ఆనందాన్ని రాబట్టవలెనన్న మన మనస్సు నుండి అట్టి సంకేతాలను రాబట్టవలెను. అట్లు రాబట్టలేనపుడు అయిష్టమైన పనులుగా, పనిమీద శ్రద్ధలేక, చెడుగా పూర్తగును.

ఏ పనైనా సవ్యంగా పూర్తిచేయాలని ప్రతి ఒక్కరు అనుకుంటారు. పనిచేసేవారే కాదు, ఆ పనిని గురించి తెలిసినవారు కూడా. ఆ

కార్యనిర్వహణను గమనిస్తూ, ఆ కార్యము సవ్యముగా జరిగినదీ లేనిదీ గ్రహించగలరు. ఇక్కడే మన మాటలకు ఎంతో ప్రాధాన్యత ఇవ్వబడినది.

నైతిక ప్రమేయము లేకుండా మొదలైన మానవుని కార్య కలాపాలకు కాలముతో విశ్లేషణకు గురి అయ్యేను. కొన్ని కార్యాలు కొందరి ఆమోదమును, కొందరి తిరస్కారమును పొందుచున్నవి. అలాగే మరి కొన్ని కార్యాలు అధిక సంఖ్యలో తిరస్కారము, అల్పసంఖ్యలో ఆమోదము పొందుచున్నవి. అధిక సంఖ్యలో ఆమోదమును పొందిన కార్యాల 'సంపూర్ణమైన' కార్యాలుగా గుర్తింపబడినవి. అదే విధముగా అందరి తిరస్కారమును గురియైన కార్యాలు 'అసంపూర్ణ' కార్యక్రమాలుగా గుర్తింపబడినవి.

సంపూర్ణమైన పదము వాడినంతనే నైతికతను, సత్యమును జోడించు కొనినదిగా భావించవలెను. ప్రతి వస్తువు తన ధర్మానికి కట్టుబడి యుండును. కాలముతో ఆ వస్తు ధర్మము మారదు. సంపూర్ణమైన పరిజ్ఞానముతో అనేక వస్తువుల యొక్క ధర్మాలు మానవుడు గ్రహించినాడు.

రెకార్డైర్ మహాశయుడు మానవత్వమును గూర్చి ఇట్లు తెలిపెను. వినమ్రతతో మానవుడు తన సద్గుణములను, తనలోని శక్తి సామర్థ్యము లను దాచుకొనవలసిన, అణచుకోవలసిన పనిలేదు. మనల్ని మనము చెడ్డవారిగానూ, ఎందుకు పనికిరాము అన్న హీన భావముతో కించపరచు కోరాదు. అట్లుకాక తనలోని లోపాలను గుర్తించి వాటిని సరిదిద్దుకుని ఉత్తీర్ణులగుటకు ప్రయత్నించవలెను. అలాగని అతిగా ప్రవర్తించరాదు. భగవంతుడు మానవునకు అద్భుతమైన వనరులను కల్పించెను. అయినప్పటికీ మానవుడు పరిమితముగానే జీవిస్తున్నాడు అదే అంతుబట్టడంలేదు.

నివృత్తి మార్గానికి మానవుడు అలవాటుపడవలెను. నివృత్తిమార్గానికి అలవాటు పడినవాడు అనేకత్వములో ఏకత్వమును గ్రహిస్తాడు. ఇదే మానవజన్మకు పరమావధి. అట్టి పరమావధిని సాధించవలెనన్న మానవుడు సద్గుణాలనే ఆశ్రయించవలెను. మన సద్గుణాలు ఎంతవరకు పరిపక్వత చెందినవో దానిని బట్టి మనము భగవంతుని జ్ఞానమును సాధనచేస్తాము.

వ్యష్టిసాధన, సమిష్టి సాధన అనే రెండు పద్ధతులు ఉన్నాయి. వ్యష్టి సాధనకంటే సమిష్టి సాధన ఎంతో ఉన్నతమైనది. ఈ విషయాన్ని అందరూ గ్రహించవలెను. సమిష్టి సాధనలో ప్రేమ మరియు భగంతుని జ్ఞానము ఇమిడి ఉన్నది. వ్యష్టి సాధనవల్ల వ్యక్తిగతముగా అభివృద్ధి సాధించినప్పటికీ అహంకారము పెరుగును. అహంకారము పెరుగుట వలన మనం భగవంతునికి దూరమై పోతాము. ఎప్పుడయితే భగవంతునికి దూరమవుతామో మనలో కాఠిన్యము, డాంబీకము, గర్వము, త్యాగములేకపోవుట, దయా దాక్షిణ్యాలు నశించుట జరుగును. ఈ లక్షణాలన్నీ చెడు లక్షణాలే.

భగవంతుని అనుగ్రహం అనంతమైనది. భగవంతుని అనగ్రహం వల్ల అంతా మంచే జరుగును, చెడు జరగదు. నిజమైన భగవంతుని అనుగ్రహాన్ని గుర్తించుట సాధారణముగా కష్టసాధ్యమే. కానీ కాలముతో బాటు జరిగే పరిణామాలకు భగవంతుని అనుగ్రహం చూపరులకు అవగతమవుతుంది. భగవంతునికి సంపూర్ణ శరణాగతి అన్నది క్రమేపీ సాధ్యపడుతుంది. మొదటి తన ఇచ్ఛాశక్తి క్రమేపీ తగ్గుముఖం పడుతుంది, మరియు నిరంతరము భగవంతుని ధ్యాసలో గడపడం వల్ల శరణాగతి సాధ్యపడుతుంది.

కొందరు తాము ఎల్లప్పుడూ తమ చుట్టూ ఉన్న నలుగురికోసమే జీవించామని, తమ కోసం తాము ఏ విధముగాను కృషి చేయలేదని భావిస్తూ ఉంటారు. ఈ విధంగా ప్రకటించుకోవడం దురహంకారమే అవుతుంది, స్వార్థమే అవుతుంది. ఏమి చేసినా 'నా' అన్న స్వార్థం కోసమే. వీళ్ళు చేసే పనులకు భగవంతుడితో పాటు తోటి మానవులు కూడా తృప్తి పడాలనుకుంటారు, కానీ నిజానికి భగంతుడితో వ్యవహారమంటే తనకు తాను తృప్తి పడడం లాంటిది.

అహింస వంటి సద్గుణాలపై ఎన్నోనీతి కథలు మనకు తెలుసు. అసత్యమాడుట వలన కూడా సాటి మనిషికి హాని తలపెట్టిన వారమవుతాము. అదే విధముగా దొంగతనము కూడా ఇతరులకు హాని కలిగించడమే. మన అవసరానికి న్యాయంగా, ధర్మంగా సంపాదించాలి. మన అవసరానికి మించి సంపాదిస్తే, అది కూడా సాటిమనిషికి హాని తలపెట్టినట్లు గానే భావించబడుతుంది. ఒకరు అధికముగా సంపాదించడ మంటే మరొకరిని పేదవారిగా మార్చి, ఆకలి కడుపులతో ఉంచడం లాంటిదే. మనము అవసరానికి మించిన కోరికలను పెంచుకుంటే, ఇతరుల కోరికలకు గండికొట్టినట్లే. అహింసాపద్ధతి దృష్ట్యా, తన అవసరానికి మించి అధికముగా ఆరాటపడితే, అది హింసగా భావించ బడుతుంది.

దయాగుణంతో ఇచ్చేవారు, పుచ్చుకునేవారు కనిపిస్తారు. కానీ కారుణ్యముతో ఇచ్చేవారు, పుచ్చుకునేవారు కనబడరు. అనగా ఇచ్చేవాడు భగవంతుడే, పుచ్చుకునేవాడూ భగవంతుడే. కారుణ్యమున్న చోట నేను ఇస్తున్నాను అన్న భావన ఉండదు. గౌతమబుద్ధుడు కారుణ్యమును బోధించెను. గౌతమబుద్ధుడు సర్వమానవ సౌభ్రాతృత్వమును పెంపొందింప సర్వాన్ని త్యాగము చేసెను. కారుణ్యము వలన నిర్వాణము

సాధ్యమగును. నిర్వాణమువలన ద్వంద్వాతీత స్థితిని అనుభవించవచ్చు. హద్దులులేని స్థితి అంతులేని ఆనందప్రాప్తి కలుగును.

బంధనాలకు, వైరాగ్యానికి 'మధ్యేమార్గముగా' గౌతమ బుద్ధుడు ఒక విధానమును సూచించెను. ఇది ఇహపరాలతో కూడినది. ఇది ఇహముల మరియు పరముల యొక్క లబ్ధిని చేకూర్చును. అయితే భౌతిక సుఖాలతో కూడిన జీవితము కంటే, బంధనల కతీతంగా, వైరాగ్య భావంతో, కారుణ్యము తోను, ప్రేమమయ జీవితాన్ని గడుపుట ఎంతో శ్రేయోదాయకము.

ధ్యానము ద్వారా దుఃఖము, బాధలేని స్థితిని పొందవచ్చని బుద్ధుడు బోధించడం జరిగింది. బౌద్ధమతము భౌతిక ప్రపంచమునుండి సంపూర్ణ స్వేచ్ఛను కోరుకోమంటుంది. నిర్వాణము కేవలం ఇక్కడే సాధించడానికి అంగీకరింపదు, అనగా అందరూ కలిసికట్టుగా నిర్వాణము సాధించాలని బౌద్ధమతము బోధించు చున్నది. జీవుడు యావత్ విశ్వంలో ఒక భాగము. మహాయాన బౌద్ధమతము ననుసరించి, ఆత్మ సాక్షాత్కారము కొరకు ప్రతిజ్ఞ చేసిన సాధకుడు, సమస్త సృష్టిలోని జీవరాసులన్నీ నిర్వాణము సాధించిన రోజునే తాను నిర్వాణమును పొందెదనని శపథము చేస్తాడు.

# 25. న్యాయం

ప్లాటో న్యాయం యొక్క స్వభామును, ఆవిర్భావమును ఈ క్రింది మాటలలో తెలియజేసెను.

"ప్రజల అభిప్రాయం ప్రకారము ఒక చెడు పనిచేయడమందే సబబుగా ఉంటున్నది. అలాకాక, ఒక పని చేయడం వల్ల తనకు కలిగే లాభం కన్నా ఇతరులకే కలిగే అపకారమే అధికముగా ఉంటే, ఆ పనిని చేపట్టకూడదు. ఈ నేపథ్యంలో ఒక పని చేపట్టినప్పుడు కొందరు లాభపడవచ్చు లేదా నష్టపోవచ్చు, మరికొందరు అధికారములేక అటు లాభమును పొందలేక పోవచ్చును. కానీ నష్టమునకు గురి కావలసి వచ్చును. ఇటువంటి సందర్భాలలో ఇరువర్గాల వారు ఒక ఒడంబడిక ప్రకారము ఎవరు తప్పు చేయకూడదు, ఎవరూ నష్టపోకూడదు అని నిర్ణయించుకుంటారు. ఈ విధంగా న్యాయానికి సంబంధించి ఒడం బడికలు చేసుకుంటుంటారు. వారు తీసుకున్న నిర్ణయాల ప్రకారము ఏది న్యాయమో, ఏదికాదో తేల్చుకుంటారు. న్యాయమంటే ఈ రీతిగా ఉంటున్నది. అనగా న్యాయము ఇరుజట్ల మధ్య కుదుర్చుకున్న రాజీ ఒప్పందముగా ఉంటున్నది. న్యాయము అనగా చెడును అరికట్టు సాధనముగా కనిపిస్తున్నది".

ప్రకృతిరీత్యా న్యాయమనగా ఇరువురి మధ్య ఒకరికొకరు నష్టము కలిగించుకోకుండానూ, నష్టపడే సమయములో సాయపడేందుకు కుదుర్చుకున్న ఇరుపక్షాల లాభసాటి ఒడంబడిక. ఎక్కడయితే ఈ ఒడంబడిక అమలులో లేదో అక్కడ ఏది న్యాయమో, ఏది అన్యాయమో తేల్చుడం కష్టం. న్యాయము ఇట్టిది అని ముందుగా వ్యక్తముకాదు. అయితే మనుష్యుల మధ్య ఒప్పందము ప్రకారము ఒకరికొకరు హాని కలిగించు కోరాదు, నష్టపరచుకోరాదు అన్న సూత్రానికి బద్ధులగుదురు.

అన్యాయమునకు చెడును ఆపాదించలేము. కానీ అన్యాయమునకు శిక్షపడునని, ఆ శిక్షనుండి ఎవరూ తప్పించుకోలేరన్న భయము ఏర్పడుతుంది. న్యాయము అందరికీ సమానముగా వర్తించును. అది నిర్మలమైనది. అయితే దేశకాల సందర్భాలను బట్టి ఒక్కొక్కసారి పరిస్థితి తారుమారు అవుతుంది. అనగా ఈనాడు న్యాయంగా తోచినది, తరువాత రోజులలో అన్యాయంగా గోచరించవచ్చు, పరిస్థితులను బట్టి.

న్యాయమును ఒప్పుగా భావించినందున న్యాయబద్ధమైన జీవితమునకు అలవాటు పడుదురు. మనుషులు తప్పులు చేయడానికి సిద్ధపడరు.

న్యాయవవస్థ వ్యక్తిలోనూ, సమాజంలోనూ వ్యక్తమగును. వ్యక్తి న్యాయం కంటే సమాజ న్యాయము గొప్పది, కాబట్టి సమాజ న్యాయం కోసం పాటుపడుట శ్రేయోదాయకము. ఒక వ్యక్తి ఎన్నటికీ పరిపూర్ణుడు కాడు. ఇతరులపై అన్ని విషయాలలో ఆధారపడతాడు, సహాయమును పొందుతాడు. ఈ విధముగా ఒకరికి ఒకరు అన్నట్లుగా అందరూ కలిసి జీవించడమే సమాజము. తన దగ్గర ఉన్నది సాటివారి కివ్వడం, తన దగ్గరలేనిది సాటివారి నుండి పొందడం ద్వారా సమాజము వల్ల అందరూ లబ్ధిని పొందుతున్నారు.

ఏ ఇద్దరు వ్యక్తులు ఒకే రీతిలో పుట్టరు. వారి వృత్తులరీత్యా వారిలో అనేక తేడాలు వ్యక్తమగును. అనేకమైన వస్తువులు తయారవుతాయి. తన వృత్తిరీత్యా, తన నైపుణ్యము రీత్యా ఆ వస్తువు తయారీలో తన నైపుణ్యము బయటపడును.

ప్లేటో యొక్క అభిప్రాయము ననుసరించి 'సమాజమునకు నాలుగు మంచిలక్షణాలు కలవు. అందులో నాల్గవ లక్షణము మరియు అత్యంత

ముఖ్యమైనది ఈ న్యాయవ్యవస్థ. మన సమాజంలో ప్రతి ఒక్కరు తమ పనులు తాము చేసుకోవాలి. ఎవరి స్వభావరీత్యా వారు తమ తమ పనులు చేసుకున్నప్పుడు సమాజము అభివృద్ధియగును.

న్యాయమనగా ఎవరు పనులు వారు చేసుకోవడం, ఇతర పనులలో జోక్యం చేసుకోకపోవడం. సంరక్షకుడిగా, వ్యాపారవేత్తగా, కళాకారుడుగా, ఇతర సహాయ ఉపక్రియలకు నియమితులైనవారు. ఎవరికివారు తమ తమ కర్తవ్యాలను నెరవేర్చుట న్యాయబద్ధమగును. అప్పుడు సమాజం న్యాయ సమాజంగా గుర్తింపబడుతుంది. ఇట్టి న్యాయసమాజములో అన్ని తరగతి ప్రజలు ఒకరినొకరు సంబంధబాంధవ్యాలు గరపుట వలన, ఇట్టి సమాజంలో వీరికి హాని జరుగుటకు అవకాశము తక్కువగా ఉండును.

ఏ విధముగా అయితే సమాజన్యాయము ఉంటున్నదో, అదే విధముగా వ్యక్తి న్యాయము కూడా ఉంటున్నది. ఒక వ్యక్తి తన కర్తవ్య కర్మలను సక్రమంగా నిర్వర్తించవలెను. అతను సక్రమంగా ఎప్పుడు తన కర్తవ్యకర్మలను నిర్వహించ గలడు? రెండు అంశాలు గుర్తుపెట్టుకోవాలి. ఒకటి కారణము. రెండు ఆచరణ. తన కర్తవ్యములోని బాధ్యతలు నిర్వహించుటే ప్రధాన కారణము. ఆ బాధ్యత నెరవేర్చుటలో తాను చూపవలసిన ఆచరణ శారీరక, మానసికముగా ఈ రెండు అంశాలకు ప్రతి ఒక్కరు సిద్ధపడాలి. ఆ విధముగా అందరు శిక్షణ పొందాలి. మనలో కోరికలను అణచిపెట్టి ఉంచాలి. శారీరక సుఖముపై నియంత్రణ కలిగి ఉండాలి. అప్పుడే శరీరము సహకరిస్తుంది. ప్రతివ్యక్తి తన శాయశక్తులా తన కర్తవ్యకర్మల ఆచరణ విషయములో కృషిచేయాలి. అప్పుడు తాను శాసించగలడు. అట్లు కానిచో తాను శాసింపబడడు.

నిజానికి, న్యాయమనునది భౌతికముగా వ్యక్తము చేసేది కాదు, అది ఆంతరంగికమైనది. అనగా ఒక వ్యక్తియొక్క సమగ్ర స్వరూపమే

న్యాయము. ఒక న్యాయమైన వ్యక్తి తన పనులుతాను చేసుకుంటాడు, ఇతరుల జోక్యమునకు అవకాశమివ్వడు. న్యాయానికి కట్టుబడిన వ్యక్తి క్రమశిక్షణతో తన గృహమును తాను చక్కబెట్టుకొనును. త్రికరణ శుద్ధిగా అనగా మనసా, వాచా, కర్మణా తన పనులు చక్కగా నిర్వహించుకుంటాడు.

ఒకవ్యక్తి న్యాయబద్ధమైన జీవితానికి అలవాటు పడినాడని గుర్తించిన రోజున అతనిలో ఎన్నో సద్గుణాలు వ్యక్తమవుతాయి. అతను తనపనులు తాను చేసుకుంటూ, ఇతరులకు సాయపడతాడు. ఇతను జ్ఞానవంతుడు, నలుగురికీ తగినరీతిలో సలహాల నందించి సాయపడతాడు. ఇందుకు విరుద్ధముగా అజ్ఞానముతో, బాధ్యతా రహితంగా వ్యవహరించినట్లయితే అట్టి కార్యాల వల్ల సమస్యలు తలెత్తును. తాను సమాజానికి ఘోరమైన తప్పిదాలతో తీవ్రమైన అన్యాయం చేసినవాడగును.

న్యాయపరమైన వాటికి రెండు సిద్ధాంతాలు వర్తించును. మొదట, న్యాయానికి బద్ధులైనవారు స్వేచ్ఛతో వ్యవహరించవలెను. రెండు, అసమానతలు ఏమైనా ఉన్నప్పటికీ, వాటివల్ల అందరికీ లాభం కలిగేలా, అందరికీ అందుబాటులో ఉండే లాగున నిర్దేశింపబడవలెను. ఈ సూత్రము మరియు నలుగురికీ చేసిన సేవలకు ప్రతిఫలము, న్యాయము అందరికీ వర్తించును. అనగా దేశాలకు, రాష్ట్రాలకు, వ్యాపార సంస్థలకు, మత సాంప్రదాయాలకు, మరియు అనేక సంక్షేమ సంస్థలకు వర్తించును.

ఈ న్యాయము ఎవరికి వర్తించును? ఇబ్బందికర సన్నివేశాలలో ఇరువర్గాల మధ్య సయోధ్యకు వివేకవంతులు చేసుకునే ప్రక్రియ ఈ న్యాయము. నైతిక పరమైన సూత్రాలకు లోబడి, ఒకరి మేలు కొరకు ఒకరు ఏర్పాటు చేసుకున్న ఒడంబడిక ఈ న్యాయమైన ప్రక్రియ.

భౌతికంగా న్యాయమును వ్యక్తము చేయుటకంటె, మన ప్రవర్తనలలో, ఆలోచనలలో, మన వ్యవహారాలలో, సద్భావనలను, సహకారములను

అందిస్తూ న్యాయమును ఆచరించవలెను. మనలో పవిత్రత ఉండవలెను. మనలో న్యాయము ఉండవలెను. అప్పుడప్పుడు ఇరువర్గాల మధ్య పోటీ ఏర్పడినప్పటికీ ఇరువురూ బాగుపడతారు.

జాన్ రాల్స్ అభిప్రాయాన్ననుసరించి, స్వేచ్ఛతో వ్యవహరించే వ్యక్తులు, ఒకరిమీద ఒకరు పెత్తనం చెలాయించకుండా, కలయికతో ఒక కార్యక్రమాన్ని నిర్వహించుకొనుచూ, క్రమశిక్షణను పాటిస్తూ, అందు ఇమిడియున్న న్యాయ సూత్రాలను అనుసరిస్తూ ఒకరికొకరు కష్ట సుఖాలను, లాభనష్టాలను పంచుకొనుటను ఒక మంచి కార్యము లేదా సక్రమమైన కార్యముగా వివరించెను.

ఏది న్యాయమైనది? ఏది క్రమమైనది? ఆచరణలో ఉన్న ఒక కార్యము వల్లగానీ, వ్యవస్థ వల్ల గానీ ఎవరూ ఇబ్బంది పడనంతవరకూ, అది న్యాయమైనది గానే భావించవలెను. ఒక వర్గమువారు లబ్ధిపొంది, మరొక వర్గమువారు నష్టము పొందిన అది న్యాయమనిపించుకోదు. అందరూ న్యాయమునే ఆశిస్తారు. తనకు న్యాయముగా భావించనదానిని ఇతరులు కూడా అదే విధముగా భావించవలెనని ఆశిస్తారు. కొన్ని సూత్రాల ఆధారముపై చేసుకొనిన ఒప్పందాలయితే, ఆ సూత్రాల ననుసరించి ఏకీభావము కుదురును. రెండు వర్గాల మధ్య సామరస్యత లతో, సంతృప్తితో చేసుకున్న ఒడంబడికను తు, చ, తప్పక ఆచరించి నట్లయిన అది న్యాయమైన వ్యవహారంగా భావించవచ్చు.

ఒకరినొకరు ఏకాభిప్రాయంగా ప్రతిపాదించుకున్న ఒడంబడికను, ఎట్టి ఒత్తిడులకు లోనుకాకుండా ఆచరించటమే న్యాయమునకు బద్ధులైనట్లు. ఒక ఒడంబడిక ఈ విధమైన అంగీకారంతో ఆచరణ యోగ్యమైనప్పుడు, అందరికోసం, అందరికీ అనువైన సామాజిక న్యాయమును

ఆచరించుట ఎందుకు వీలుపడదు. మనము అంగీకరించే సూత్రాలు అందరికీ ఆచరణయోగ్యముగా ఉండాలి. అట్టి న్యాయ వ్యవస్థ బలపడును.

ఇద్దరి మధ్యన కుదిరిన ఒప్పందము ప్రకారము నడుచుకుంటూ ఆ తీర్మానాలకు కట్టుబడి ఉండవలెను. ఈ నేపథ్యములో ఎవరికి వారు కర్తవ్యబద్ధులై తమకు సంక్రమించిన నియమాలను, హక్కులను పాటిస్తూ లబ్ధిపొందవచ్చును. ఒక ఒడంబడిక దృష్ట్యా హక్కులను, కర్తవ్యకర్మలను ఆచరించి లబ్ధిపొందడమును ఇరువర్గాల మధ్య సామరస్య పూర్వకముగా సాగిన న్యాయ ప్రక్రియ అనవచ్చు.

ఇరువర్గాల మధ్యన జరిగిన ఒడంబడికను అమలు చేసేటప్పుడు ఆ ఒడంబడిక యందు భక్తిప్రపత్తులు మరియు అనుగ్రహ భావము ఉండాలి. ఇక్కడ ఆచరించవలసిన సూత్రాలు వివరముగా తెలుపబడినవి. ఒక్కొక్కసారి న్యాయ బద్ధులై కొన్నిటిని త్యాగభావంతో వ్యవహరించవలసి ఉంటుంది. ఒడంబడికకు కట్టుబడినవారు ఇరువర్గాలకు శ్రేయోదాయకముగా ఆలోచించాలి, ఆచరించాలి. ఈ విధమైన ప్రవర్తనకు నైతికత ఎంతగానో తోడ్పడును. ఇక్కడ నైతికత, మంచితనము, అంతరాత్మ ప్రబోధము అనే విషయాల జోలికి వెళ్ళకుండా, నీవు ఏ విధంగా ఇతరుల నుండి న్యాయమును ఆశిస్తావో, అదేవిధంగా నీవు కూడా ఇతరుల పట్ల బాధ్యత వహించి వర్తించినట్లయిన అది హర్షనీయము.

న్యాయము ఎక్కడ ఉంటే అక్కడ అభివృద్ధిసాగును. న్యాయము ఎక్కడ ఉంటే అక్కడ అందరూ లబ్ధినిపొందెదరు. న్యాయము ఎక్కడ ఉంటే అక్కడ సమాజశ్రేయస్సు జరుగును. న్యాయము ఎక్కడ ఉంటే అక్కడ నైపుణ్యము వ్యక్తమగును.

న్యాయ సూత్రాలు ఆచరణయోగ్యమైనపుడు వాటిని ఉల్లంఘించే అవసరము అంతగా ఉండదు. ఈ న్యాయ సూత్రాలు అందరికీ ఆమోద

యోగ్యమై, అందరిచేత ఆచరింపచేయు దిశలో అధికార యంత్రాంగము చర్యలు తీసుకొనవలెను. మానవ నైజమును పురస్కరించుకుని ఈ సూత్రాలను తయారు చేయవలెను. అప్పుడే ప్రజలను దృష్టిలో పెట్టుకుని న్యాయానికి బాటలు వేయడం జరుగుతుంది.

న్యాయబద్ధమైన జీవితానికి అందరూ సుముఖంగా ఉంటారు. ఈ కారణంచే సంఘజీవనములో, తమకు సంబంధమున్నంతవరకు అన్ని వర్గాలవారికి న్యాయబద్ధమైన జీవితం అవసరము. సంఘంలో ఎన్నో వర్గాలు ఉంటాయి. వర్గమునకు వర్గమునకు నైతిక బేధాలు ఉంటుంటాయి. కానీ సామాజిక న్యాయమును అందరూ కోరుకుంటుంటారు.

సంఘజీవనమునకు న్యాయవ్యవస్థ తలమానికము. ప్రజల శ్రేయస్సుకే ఈ న్యాయవ్యవస్థ ఉన్నది. న్యాయ వ్యవస్థ వల్ల కలిగే లబ్ధిని పురస్కరించు కొనియే సంఘములో ప్రతిచర్య న్యాయపరముగా చేయుటకు ముందంజ వేయుచున్నది. ఈ విధమైన చర్యలవల్ల సంఘంలో అన్ని వర్గాలవారు సుఖసంతోషములతో జీవనము గడుపుతారని నమ్మకము. ఈ న్యాయ వ్యవస్థలోని సూత్రాల ఆచరణ ప్రజలయొక్క స్థితిగతులపై ఆధారపడి ఉంటున్నది. ప్రభుత్వ యంత్రాంగం తన పరిశీలనా దృషితో అందరినీ నియంత్రించగలుగుతున్నదా లేదా అన్న అంశము కూడా ఇక్కడ గమనించాలి. ప్రజలు ప్రభుత్వమునకు సహకరించాలి. ప్రజలు ఒకరి కొకరు సాయపడాలి. ఇలా మానవతా విలువలను దృష్టిలో పెట్టుకుని, సంఘంలో నీతి నియమాలను తాము ఆచరిస్తూ, ఇతరులు కూడా ఆచరించేటట్లు సహకరించడం సమాజశ్రేయస్సుకు తోడ్పాటు నందించాలి. మానవత్వంతోనూ, మితముగానూ వ్యవహరించుటలో న్యాయ వ్యవస్థ మనకు ఎంతో సహాయకారిగా ఉండును.

ప్రకృతి మనకు పొదుపుగా ఎన్నో వనరులను అందించుచున్నది. మానవుడు తన కళతోను, కష్టముతో, శ్రమతో మరింత ఎక్కువ

మోతాదులో వీటిని గ్రహించుచున్నాడు. ఈ నేపథ్యములోనే మన సంఘజీవనంలో ఆస్తుల ప్రస్తావన కలుగుతున్నది. మనకు సంక్రమించిన ఆస్తులను మనం న్యాయబద్ధముగా అనుభవించాలి. మన ఆస్తులను న్యాయబద్ధముగా పంచుటలోనూ, అనుభవించుట లోనూ మనందరికీ నైతిక బాధ్యత కలదు.

మానవుడు సంఘనీతిని పాటించాలి. సంఘనీతిని పాటించిన రోజున అంతా సవ్యంగా సాగుతుంది. అన్ని నీతిశాస్త్రాల యొక్క పరమావధి సంఘ శ్రేయస్సే. సంఘశ్రేయస్సు దృష్ట్యా, సంఘంలో మగవారికంటూ ప్రత్యేక అధికారాలను కేటాయించారు. ఇదే విధంగా సంఘంలో స్త్రీలకు కూడా కొన్ని ప్రత్యేక అధికారాలు కేటాయించడం జరిగింది. ఇదే నేపథ్యములో మానవుని నైజమురీత్యా, మన ఆస్తుల పంపకం విషయంలో కొన్ని నియమాలు పాటించడం జరిగింది. స్వార్థ చింతన లేకుండా, పక్షపాత రహితముగా కుదిర్చిన ఈ సూత్రాలవల్ల మానవుడు ఎంతో లబ్దిని పొందుచున్నాడు.

మానవుని ఆస్తి ఏమిటి? మానవుని ఆస్తి ఏదయితే న్యాయ బద్ధముగా సంక్రమించిందో, అదే మానవుని ఆస్తి. దానిని తాను మాత్రమే వినియోగించు కోవాలి. ప్రతి ఒక్కరూ కూడా మన సంప్రదాయాలను అనుసరించి, చట్టము, శాసనాల ననుసరించి మరియు ప్రాధాన్యతా పూర్వకంగానూ ఆస్తుల విషయాలను తెలుసుకొనుట మంచిది. ఈ ఆస్తుల విషయంలో సాధారణముగా మార్పులకు అవకాశము ఉండదు. మానవ శ్రేయస్సు దృష్ట్యానే ఈ ఆస్తుల గురించి తెలుసుకోవాలి. ఈ దిశగా న్యాయసూత్రాలు రూపొందవలెను.

సామాన్యంగా ఆస్తులకు సంబంధించిన అంశాలన్నీ నాగరిక సమాజంకు లోబడి ఉండును. అనగా సంఘజీవనానికి భంగము

కలుగకుండా, సాంఘిక న్యాయానికి కొద్ది మార్పులతో ఈ ఆస్తి తగాదాలు పరిష్కరించడం జరుగుతుంది. ఇక్కడ అనుసరించే నియమాలన్నీ చట్టం ద్వారా, శాసనం ద్వారా రూపొందించిన నియమానుసారమే జరుగుతుంది. అయితే వివిధ ప్రాంతాలకు, వివిధ వాతావరణాలకు, వివిధ పద్ధతులకు, వివిధ మతాలకు సందర్భానుసారముగా అనగా జనాభా, వ్యాపార, మరియు ఇతర పరిస్థితుల రీత్యా ప్రభుత్వము సూచించిన సూత్రాలు రాజ్యాంగ బద్ధముగా చోటుచేసుకున్నవి.

న్యాయానికి పర్యాయపదము శాసనము. కానీ కొన్ని సందర్భాలలో న్యాయము శాసనముకంటే ఉత్తమంగానూ, భిన్నంగానూ ఉండును. సాధారణంగా న్యాయము శాసనానికి, శాసనము ద్వారా న్యాయానికి అనుసంధానమై ఉంటుంది. ఈ నేపథ్యంలో మనం ఒక విషయము గ్రహించాలి. ఈ శాసనము అనునది క్రింది కోర్టులకో పైకోర్టులకో కొంత తారతమ్యము ఉంటుంది. ఈ కారణముచే క్రింది కోర్టులలో శాసనము ననుసరించి వెలువడిన న్యాయమును మనము కాదని పైకోర్టులకు న్యాయం కోసం ఆశ్రయిస్తాము.

డెల్ హౌషియా మహాశయుడు ఇట్లు సూచించెను. న్యాయమన్నది రెండు విధాలుగా గ్రహించవచ్చని, అవి శాసన బద్ధము గానూ, నైతిక బద్ధముగానూ అని వివరించెను. నైతిక విలువలకు ఎంతో ప్రాధాన్యత ఇవ్వబడెను. సద్గుణాలు మరియు నైతిక జీవనానికి న్యాయశాస్త్రము విశ్వజనీయముగా ఆమోదమును తెలుపుచున్నది. న్యాయపరంగా ఈ సద్గుణాలు మరియు నైతిక విలువల పోషణ మానవుని యొక్క హక్కులు మరియు బాధ్యతలుగా గుర్తించడమైనది. శాసనంతో కూడిన న్యాయం రెండు విధాలుగా విభజింపబడెను. ఒకటి పంచిపెట్టు విధానం, రెండు ప్రతిఫలమునిచ్చు విధానం. ప్రతిఫలమునిచ్చు విధానంలో మరి రెండు

రకాలుగా విభజింపబడెను. ఒకటి హెచ్చుశిక్షను తక్కువ శిక్షగా మార్చు పద్ధతి. రెండు, నిర్బంధముతో శిక్షించుపద్ధతి. పంచి పెట్టు విధానం రెండు విధాలుగా విభజింపబడెను. ఒకటి, ముందు తెలిసిన పద్ధతి, రెండు ఆరోపించు న్యాయము.

ఈ న్యాయశాస్త్రాలు, చట్టాలు, రాజ్యాంగాలు, న్యాయపరమైన పద్ధతులు అన్నీ కూడా స్పష్టముగా వివరింపబడలేదు. పాత్రత, కుట్ర మొదలగు పదాలకు న్యాయశాస్త్రమున సరియైన నిర్వచన మీయలేదు. కారణము ముందుగా ఆపదలు, పరిస్థితులకు అనువుగా ఎట్లు వివరింప వలెనో వివరింప బడలేదు.

ఈ విధంగా లిఖితపూర్వకముగానూ, లిఖిత పూర్వకముగా లేని శాసనముల కారణంగా సమాజములో నేటికీ అనేక విమర్శలకు అవకాశము కలుగుచున్నది. న్యాయశాస్త్రము ప్రతిశాసనమును అనుసరించి, వివరించి తీర్పు చెప్పుచున్నది. అయితే ఈ వివరణలు సామాన్య మానవుని నైతికవిలువలకు చేరువులో ఉంటున్నది. కాబట్టి న్యాయ స్థానము, న్యాయశాస్త్రము, న్యాయ సూత్రాలు ఎన్నటికీ సమస్యలను తొలగించలేవు. అనగా ఒక్కొక్కసారి న్యాయస్థానమున సమాధానాలు లేని పరిస్థితులు ఎదురవుతూ ఉంటాయి.

## 26. విలువలు

మానవుడు సుఖంగా జీవించాలనుకుంటాడు. సుఖాల కోసం తాపత్రయపడతాడు. సుఖంగా జీవించడమే తన కర్తవ్యమనుకుంటాడు. సుఖాల కోసమే బ్రతుకుతాడు. ఈ సుఖమయ జీవితమందే తన విలువను గ్రహించడానికి ప్రయత్నిస్తున్నాడు. ఈ సుఖాలకు ఒక హద్దు పద్దు లేకుండా ఉంటున్నది. ఒకసారి ఆలోచిస్తే ఈ సుఖాలు తనకు మంచి కంటె చెడునే ఎక్కువగా కలిగిస్తుందని గ్రహించడం జరుగుతుంది. వివేక విచక్షణలతో ఈ సుఖాలను సమీక్షించినపుడు అసలైన విలవలు బయటపడుతున్నవి.

మనకు నచ్చిన, మెచ్చిన అనుభవాలను విశ్లేషించినపుడు ఆ అనుభవాల నుండి కొన్ని విలువలు బయటపడును. ఈ అనుభవము మనకు మిగిల్చిన ఆనందము, ఆ విలువలకు సంబంధించిన అంశాలను తెలుపును. ఇటువంటి ఆచరణ పూర్వకమైన వివరాలనుండి విలువల అవసరము బయట పడుతుంది. మన కర్మాచరణమును విశ్లేషించి నట్లయితే, కర్మలో ఇమిడి వున్న వస్తువు నుండి క్షేమకరమైన మరియు వివేకవంతమైన విలువలు బయటపడతవి.

ఈ సిద్ధాంతమును వివరించవలెనన్న రెండు స్థితుల మధ్య తేడాను గ్రహించవలెను. ఉదా: కోరిక, కోరదగినది. అనుభవించినది, అనుభవించదగ్గది. జరిగిన దానిని తెలుసుకోవడం వల్ల వాస్తవము బయటపడుతుంది.

ఒక వస్తువు మనకు సుఖమునిస్తుంది. ఎంతటి సుఖమును మనము ఆ వస్తువు నుండి రాబట్టవచ్చును? ఈ విషయము మనకు తేలదు. మనము సుఖము కోరుతున్నాము. మనము అనుభవించే

సుఖము మనకు మంచిని కలిగించుచున్నదా లేక కీడును కలిగించు చున్నదా? ఈ అనుభవములో విలువలు దాగి ఉన్నవా? మనము ఈ అనుభవమును మర్చిపోవచ్చా? గుర్తుపెట్టుకోవచ్చా?

కాబట్టి మనం ఆశించే సుఖమును పొందవలెనన్న పరిస్థితులను విశ్లేషించు కోవాలి, కొన్ని పరిమితులను గీచుకోవాలి. అప్పుడే మనము పొందదగిన సుఖానికి స్వాగతం పలుకవచ్చు. ఇక్కడ మనం ఆశించిన సుఖాన్ని బయటికి వ్యక్తము చేయాలి. అప్పుడే భవిష్యత్తులో ఆశించే ఫలితము మనకు కళ్ళకు కనపడుతుంది. అప్పుడే మన ఆలోచనలకు వాస్తవ రూపమును ఇవ్వగలము. ఈ కార్యములో లేదా అనుభవంలో తీర్పు, సమ్మతి మరియు అంచనాలు ఇమిడి ఉన్నాయి. ఇట్టి కార్యమునకు విలువ సంక్రమించును.

ఒక ఆలోచన, ఒక కార్యాచరణ ప్రక్రియను రూపొందిస్తుంది. ఈ ప్రక్రియకు శాస్త్రసాంకేతికముగా సమర్థత లభిస్తుంది. ఈ కారణము చేతనే ప్రతిచర్యను శాస్త్రసాంకేతిక రీతిలో విశ్లేషించడం అవసరం.

మనకు వస్తువులపై వెంటనే అభిరుచి ఏర్పడుతుంది. ఆ అభిరుచి మనలో నిరంతరం వ్యక్తమవుతుంది. ఈ అభిరుచి కారణం విలువలు. ఎట్టి విలువలు తెలివితేటలు కావచ్చు, నైతిక విలువలు కావచ్చు. మనకు అభిరుచి ఉన్న అంశాలపై మనం ఎక్కువగా ఆలోచిస్తాము. ఆచరణతో కూడిన అనుభవం వల్ల మనకు అభిరుచి ఏర్పడుతుంది. మనకు అభిరుచి కల అంశాల అనుభవముతో పాటు, వివేక విచక్షణలతో కోరికలను, ఇష్టాలను అవగాహన చేసుకొనవలెను.

ఒక వ్యక్తి తన కిష్టమైన కోరికలను, తాను ఆశించే సుఖాలను వ్యక్తము చేస్తాడు. ఇట్టి నిర్ణయాలు అలవాటు చొప్పున, స్వార్థంతోనూ,

అనుకోకుండానూ, స్పందించి తీసుకున్న నిర్ణయాలు. అలాకాక అభ్యాసముతో, తెలివితేటలతో, ఉత్తమమైన ఆదర్శాలను అందించు వాటిని, నైతిక పురోభివృద్ధికి దోహద పడువాటిపై మక్కువ పెంచుకోవాలి.

ఆంతరంగిక సమాధానాలు మనకు సరిపడా జవాబులను అందించ లేకపోవచ్చు కానీ, వాటి సమిష్టి అనుభవము మనకు దారిచూపుతుంది.

ఒక వ్యక్తికి ఒక వస్తువంటే చాలా ఇష్టం. అది ఆతని ఇష్టం. ఇందులో విభేదించాల్సిన అంశము ఏమీలేదు. అయితే భవిష్యత్తులో జరిగే పరిణామాల రీత్యా ఆతని కోరికపై చర్య ఆధారపడి ఉంటుంది. ప్రస్తుతమున్న పరిస్థితులలో ఎవరు ఏమి కోరుకున్నా, ఆ కోరికలయొక్క భౌతిక విలువను మాత్రమే గ్రహించగలం.

మనకు అనుభవాలు నేర్పు పాఠాలు ఎన్నో. మనం మన కోరికలతో, సుఖాలతో అనేక రీతులలో ప్రవర్తిస్తున్నాము. ఇందు కొన్ని ప్రవర్తనలను మనము ఖండించి తీరుతాము. ఆత్మ విమర్శతో మనం అనుభవించిన సుఖాలు విలువలతో కూడిన కర్మద్వారా సాధించినదా అని విచారించ వలెను. ఈ విశ్లేషణ వాస్తవాన్ని ఋజువు చేస్తుంది. వస్తువును సద్వినియోగము చేసుకున్నప్పుడు, ఆ వస్తువు యొక్క విలువను మనము గుర్తించి, ఆ వస్తువును మనము ఎప్పుడూ కోరుకుంటాము.

వంశపారంపర్యముగా మనం కొన్ని విలువలను గుర్తించి గౌరవిస్తాము. కొన్ని అనుభవాలు మనకు యాదృచ్ఛికముగా, అనుకోకుండా ఎదురవుతాయి. అట్టి అనుభవాలను మనము విశ్లేషించ లేము. ఒకవేళ విశ్లేషించినా పూర్తి సమాచారము అందదు. తాత్కాలికమైన మరియు శాశ్వతప్రతిపదిన మనకు అనుభవాలు ఎదురవుతూ ఉంటాయి. మన నైజము, ప్రవర్తనల రీత్యా మనము ఈ తాత్కాలికమైనవాటికి లేదా శాశ్వతమైన ఆనందాలను కోరుకుంటాము.

జాన్ డ్యూవే స్పష్టముగా ఇట్లు తెలిపెను, “విలువలకు సంబంధించిన నిర్ణయాల సమీక్షకు పరిస్థితులు, అనుభవాలు అవసరము. మనము ఆశించిన ఫలితాలను ఏ పరిస్థితులు మనకు అందించునో మనము గ్రహించాలి. అనగా నియంత్రణతోనే అనుకున్న ఫలితాలను సాధించవచ్చు. మనము ఎట్టి అనుభూతిని పొందినప్పటికీ అది మన వ్యక్తిగత ప్రవర్తన పైననే ఆధారపడును. దానికి సాంఘిక కారణాలు కూడా కొంతవరకు తోడవుతాయి”.

మనము కోరుకున్నదానిని సాధించే క్రమంలో మనం ఎంతవరకు ముందుకు వెళ్ళదలచుకున్నాము? ఒకసారి పరిస్థితులను అంచనా వేసుకుంటే, మన కోరిక ఏమిటి? మనకోర్కె ఎంతవరకు  కోరదగినది? మనం ఏమి సాధించాలను కుంటున్నాము. ఈ రెండిటికీ మధ్య వ్యత్యాసం ఎంత? ఈ రెండిటికీ మధ్య సంబంధము ఏమిటి? ఈ వివరాలను మనము ఈ దశలో విచారించి నపుడు, మనమాచరించే కర్మపై అవగాహన కలుగుతుంది. ఆలోచనతో మనకు సరియైన నిర్ణయం తీసుకుంటాము.

మనం అంతర్దృష్టితో మన ప్రవర్తనను నియంత్రించి, ఆ ప్రవర్తన ద్వారా లభించే సుఖమును, అనుభవమును ఒకసారి విశ్లేషించుకోవాలి. అట్టి విశ్లేషణకు అర్థం, పరమార్థం ఉంటుంది. అట్టి అనుభవము మనకు చేదు అనుభూతులను మిగల్చవు. భౌతిక దృష్టితో మనము మన ప్రవర్తనతో ఆ సుఖమును అనుభవిస్తూ ఉంటాము. ఆ సుఖము కోసం మరింతగా తపిస్తాము. అంతర్దృష్టితో ఒక వస్తువును సరియైన రీతిలో అనుభవించి ఆనందిస్తాము. అదే వస్తువును బాహ్యదృష్టితో అనుభవించి బాధకు  గురి అవుతాము.

ఇక్కడ విలువను దేనికి ఆపాదించాలి? సంతోషపడిన దానికా లేక బాధపడిన దానికా? సంతోషపడిన దానికే విలువను ఆపాదించడం

జరుగుతుంది. వస్తువు యొక్క విలువ నలుగురికీ ఎప్పుడు తెలుస్తుంది? ఆ వస్తువువల్ల కలిగిన లబ్ధిని అనుభవించిన వారికి ఆ వస్తువు యొక్క విలువ తెలుస్తుంది. సంతృప్తికి సరియైన విలువ కట్టలేము. కానీ మనం అనుభవించే సంతృప్తిని విలువగా మార్చుకోవాలి. నిజానికి విలువ అన్నది అన్ని వస్తువులకు ఎప్పుడూ ఉండేదే, అయితే ఆ వస్తువును వాడకం విషయంలో లోపాలు కారణముగా ఈ విలువను గ్రహించలేక పోతున్నాము. నిజానికి మానవుడికి వస్తువుల విలువలపట్ల కొంత అవగాహన ఉన్నప్పటికీ, వాటిని ఉపయోగించే ప్రక్రియనందు లోపాలుంటున్నవి.

ఒకమనిషి యొక్క విలువ అతని అధికారముపై ఆధారపడి యున్నది. ఒక మనిషి యొక్క విలువ తనకుతాను నిర్ణయించుకోలేడు. అది సాటి మనిషి నిర్ణయించవలసి ఉంటుంది. తనకు తాను, నిర్ణయించు కునేటట్లయితే, తన విలువను ఎంతో అధికముగా వెల్లబుచ్చుతాడు. కానీ నిజానికి మనిషి విలువ అతని సహచరులే నిర్ణయిస్తారు.

ఇక్కడ ఒక మనిషికి విలువ కట్టడం అన్నది ఆ వ్యక్తి యొక్క గౌరవ మర్యాదలను బట్టి మనము ఆరాధించే వ్యక్తికి ఎక్కువ విలువ కడతాము. అలాగే పరాభవించే వ్యక్తికి తక్కువ విలువ కడతాము. విలువ యొక్క హెచ్చుతగ్గులు ఆ వ్యక్తియొక్క వ్యక్తిత్వముపై ఆధారపడియున్నది.

ప్రజల మధ్య మెలిగే వ్యక్తియొక్క విలువ సంఘంలో అతని హోదాను బట్టి నిర్ణయించడం జరుగుతుంది. శాసించే అధికారులు, ప్రభుత్వ ఉద్యోగులు ఈ వ్యక్తియొక్క విలువను గ్రహిస్తారు.

ఒక మనిషిని మనము ఎప్పుడు ఆదరిస్తాము, గౌరవిస్తాము? మన అవసరాలను సమకూర్చుకునేందుకు, మన సమస్యల పరిష్కారాలకు

మనము సాటిమనిషి హోదాను బట్టి సంప్రదిస్తాము. ఆ వ్యక్తి తన హోదాతో మన అవసరాలను తీరుస్తాడని, మన సమస్యలను పరిష్కరిస్తాడని మన భావన. ఆ వ్యక్తి మనము ఆశించిన రీతిలో సాయపడినప్పుడు మనము ఆ వ్యక్తిని పొగడటం జరుగుతుంది. ఇతరుల నుండి సాయం ఆశించనంతవరకూ, ఒక వ్యక్తి ఏమనిషినీ పొగడడు. ఈ నేపథ్యములో సహాయము కోరలేదని, పొందలేదని ఒక వ్యక్తి పట్ల నిర్లక్ష్య వైఖరిని ప్రదర్శించుట ఆ వ్యక్తిని అవమానపరచినట్లే అవుతుంది.

ఒక వ్యక్తియొక్క విలువ వేరు సమర్థతవేరు. సమర్థత అన్నది అతను రాణించే రంగముపై ఆధారపడి ఉంది. ఈ సమర్థత అన్నది అతని అభిరుచిని బట్టి ఉంటుంది.

పద్ధతులు అనగానే క్రమశిక్షణతో కూడిన సత్ప్రవర్తన. ప్రతి ఒక్కరు తన ప్రవర్తనతో చిన్న చిన్న మంచి అలవాట్లతో తనచుట్టూ ఉన్న నలుగురి మెప్పును పొందవచ్చు. ఉన్నత ఆశయాలు కలవారు తమ ప్రవర్తనతో అందరి సుఖము, శాంతి, ఐశ్వర్యము కోరుకుంటారు. మనం మన జీవితమును సుఖముగా ఉండా లనుకుంటాము. ఈ నేపథ్యములో మానవుడు సుఖముకోసం వస్తువుల వెంటపడతాడు. మానవుడు ఏ వస్తువును ఒకసారి అనుభవించి తృప్తిపడడు. అందుకనే సుఖంకోసం మానవుడు వస్తువులను సేకరించి, వాటిని వినియోగించి సుఖాన్ని అనుభవిస్తున్నాడు.

మనలోని నైతికత తిరగబడినపుడు, మనలోని చెడు లక్షణాలు సమసి, విలువలను గుర్తించుట మొదలుపెడతాము. మనలో కార్య శూర్యులైనవారు కొన్ని సందర్భాలలో పరిస్థితులు అనుకూలించక కార్యోన్ముఖులవుతారు. అట్టివారు ఆలోచనలతో తమలోని పగను చల్లార్చుకుంటారు. నైతికతకు పట్టం కట్టిన వ్యక్తులు తమ వ్యక్తిత్వంతో ప్రయత్నపూర్వకంగా విజయాన్ని సాధిస్తారు.

బానిసత్వము అనునది అణచివేయబడినవారు, అసమర్థులుగా భావించిన వైఖరి కలవారు. వారు ప్రతిదానికి లేదు అనే సమాధానం చెబుతారు. ఈ లేదు అనే సమాధానంతోనే వారు ఎంతో ఆలోచిస్తారు. వారు భౌతిక దృష్టికే అలవాటు పడతారు. వారిలో అంతర్దృష్టి లోపిస్తుంది, అనగా అంతరంగమందు పగతో రగులు తుంటారు. తనమీద తనకే వ్యతిరేక ధోరణిని వ్యక్తము చేస్తాడు. వీరిచేత ఏ పనైనా మొదలు పెట్టించాలంటే బాహ్యముగా వీరిని ఉత్తేజ పరచాలి. ఈ విధముగా ఇతరుల ఒత్తిళ్ళకు మాత్రమే వీరు స్పందిస్తారు.

బానిసత్వానికి విరుద్ధంగా ప్రభువుల నైజము ఉంటుంది. వీరు చాలా ఉత్సాహంగా ఉంటారు. క్షణంలో నిర్ణయాలు చేస్తారు. వీరు తమ ప్రత్యర్థులతో అనుగ్రహభావంతోనూ, సంతోషకరంగానూ వ్యవహరింతురు.

అసమర్థులు మరియు అణచి వేయబడినవారు తమ సంతోషాన్ని అనాసక్తిగా ప్రకటింతురు. వారు అనారోగ్యంతో బాధపడుతున్నట్లు, దేనిమీద ఉత్సాహం లేనట్లు ప్రవర్తింతురు. పగబట్టినవారు సత్యాన్ని ప్రకటించరు. వీరిలో నీతి నిజాయితీలు లోపించును. వీరి నైజము మోసపూరితము. వీరి మనస్సు దొడ్డిదారులు, ప్రక్కదారులు, రహస్య ప్రదేశాలను వెదుకుతాయి. బయటికి తన భావాలను అసలు ఏ విధంగానూ వ్యక్తము చేయడు. నిశాచర జీవిలా ఒంటరి జీవితాన్ని కోరుకుంటాడు. నిశ్శబ్దమును కోరుకుంటాడు. ఎంత కాలమైనా నిరీక్షిస్తాడు. ఇతనికి జ్ఞాపకశక్తి ఎక్కువే. తనను తాను కించపరచు కుంటాడు. తనను తాను తక్కువ అంచనా వేసుకుంటాడు. ఇటువంటి వ్యక్తులు చివరికి ప్రభువుల కంటె తెలివిగలవారిగా బుజువు చేసుకుంటారు. పదునైన చమత్కారము బ్రతకడానికి చాలా అవసరం.

మహానుభావుల యందు మానసిక ఒత్తిళ్ళు కానరావు. వారు స్పృహలో లేకపోయినా సహజంగానే స్పందిస్తారు. కానీ సామాన్య

మానవులు ఒత్తిళ్ళకు తీవ్రంగా స్పందిస్తారు. ప్రేమ, కోపము, ఆరాధన, కృతజ్ఞత, పగ మొదలైన విషయాలలో ఉద్రేకమును ప్రదర్శింతురు. మహానుభావులలో నిరసన అనునది అతని స్వభావంలో చేరిపోతుంది. చాలాసార్లు ఈ నిరసన బయటపడదు. కానీ బలహీనులు అసమర్ధులు. నిరసనను తప్పక వ్యక్తం చేస్తారు.

సాధుసత్పురుషులు తమ శత్రువులను, తమ నష్టాలను, తమ చేతకాని తనాన్ని పట్టించుకోరు. వారు అన్నిటినీ సర్దుకుపోయే గుణం కలిగి ఉంటారు. వారికి అక్కరలేని విషయాలు తొందరగా మరచిపోయే శక్తికూడా ఉంటుంది. వీరు తమ శత్రువును కూడా గౌరవిస్తారు. శత్రువు తమలోనే ఉంటుంది, అది బయట ఎక్కడో  ఉండదు అనే భావనను వీరు వ్యక్తం చేస్తారు. పగతో వ్యవహరించే తీరే వేరు. వారు తమచుట్టూ శత్రువులను తయారుచేసుకుంటారు. తన శత్రవును దుర్మార్గుడుగా చిత్రించుకుంటారు. తన గురించి తాను చాలా ఉత్తముడిగా భావిస్తాడు. మహానుభావులు ముందుగా ప్రతివస్తువులోనూ మంచినే గ్రహించడానికి ప్రయత్నిస్తారు. ఆ తరువాతే వారికి చెడు బయట పడుతుంది.

జ్ఞానముతో అనేకవిషయాలను పొందుతాము. అందు ఉత్తమమైనది స్నేహము. ఈ జ్ఞానమే మనకు ఎంతో ఆత్మశక్తిని కలిగిస్తుంది. కష్టాలు కలకాలం ఉండవు. మానవుడు తన తప్పిదాల వలన మధురమైన స్నేహమును ఎక్కువ కాలము కాపాడుకోలేకపోతున్నాడు.

ఆరోగ్యకరమైన నైతికత మన జీవితాన్ని చక్కగా తీర్చిదిద్దును. మనము అనుకున్న ఆశయాలను సాధించడానికి మన నైతిక జీవనం మనకు ఎంతగానో సహకరిస్తుంది. జీవితంలో మనకు ఎదురయ్యే ప్రతిఘటనలను, మొహమాటాల నుండి సులువుగా బయటపడతాము. అనైతికత వలన జీవితంలో ఎదురయ్యే పరిస్థితులను ఎదుర్కొనుశక్తిలేక ఎన్నో కోల్పోతుంటాము.

విలువలు గురించి మాట్లాడేటప్పుడు మనము ఉత్తేజితుల మవుతాము. జీవితము నుండి మనం అనేక గుణపాఠాలను నేర్చుకుంటాము, అనగా అనేక విలువలను సంక్రమించుకుంటాము. విలువలతో కూడిన జీవితము ఎంతో ధన్యమైనది.

మానవుడు నైతికంగా దిగజారరాదు. నైతికంగా పతనమైన వాడిపట్ల సానుభూతి ఏల? నిజానికి తన పతనానికి తానే కారకుడు కదా! అలా కాక పరిస్థితులు ఏమైనప్పటికీ, నైతికంగా నిలబడి పరిస్థితులను ఎదుర్కొనినవాడు, అందరి హృదయాలలో స్థానం సంపాదించుకుంటాడు. వీరు ఎన్నటికీ దిగజారరు. ప్రయత్నంతోనే ముందుకు దూసుకుపోతారు.

ప్రేమ అన్ని శాసనాలను అధిగమిస్తుంది. ప్రేమతోనే ఎంతటి సమస్యనైనా జయించవచ్చు. ఎదుర్కొనవచ్చు. ప్రేమతో నెరపే ఆచరణకు ఎన్నో విలువలు ఆపాదింపబడతాయి. ప్రేమతో నిర్వహించిన కార్యాలన్నీ న్యాయబద్ధమైనవి. ప్రేమతో అన్ని పరిమితులను దాటవచ్చు. ప్రేమతో సమత్వము, సమానత్వమును సాధించి మానవ మనుగడకు కృషి చేద్దాము.

## 27. మనిషికి మంచి

అన్నిటికంటె ముఖ్యమైన ప్రశ్న. మంచికి నిర్వచనం ఏమిటి? నైతికంగా మంచి అనగా చెడుగానిది. ఒక తప్పు ఎన్నో తప్పులకు దారి తీస్తుంది. ఈ నేపథ్యంలో మనం మంచిని గురించి అవగాహన అవసరం అనగా చెడును అరికట్టేదే మంచి అని అర్థమవుతుంది.

శాస్త్ర విజ్ఞానముననుసరించి, నైతికమనగా మన ఆలోచనలకు సరియైన కారణాలను అందిస్తూ ఏది ఉన్నతమైనదో నిర్ణయించడం. మనము మంచిని సరిగా అవాహన చేసుకోకుండా సరియైన కారణాలను సూచించలేము. నైతిక జ్ఞానముతో సరియైన కారణాలను కనుగొనుటయే గాక సరియైన ఫలితాలను కూడా పొందడం జరుగుతుంది.

తాత్వికరీతిలో చెప్పవలెనన్న మంచి అన్నది సంయోగముతో కూడినది, చెడు అనునది విభజనతో కూడినది. మంచి అన్నది సరళ మైనది. సరళమైనదానిని అందరూ గుర్తించగలరు. ఉదా: పసుపురంగు ఉంది. పసుపురంగును గుర్తించని వారు ఉంటారా? ఉండరనే చెప్పాలి. అదే విధంగా మంచి అంటే ఈ లోకములో తెలియనివారు ఉండరనే చెప్పాలి. మంచి అనగా ఆలోచించి తెలుసుకోవలసినది. ఒకరికి అర్థం కానిది రెండవవానికి కూడా అర్థంకాదు. ఉదా: ఒక పులి ఉంది. పులి ఎలా ఉంటుందో వర్ణించి చెబుతారు. ఒక క్లిష్టమైన వస్తువును భాగాలుగా చేసి దానిని వివరించడానికి ప్రయత్నిస్తుంటాము. ఆ విడి భాగాలు సరళమైనవి. వాటిని మరింత సరళముగా విభజించలేము. అదే విధంగా మంచిగానీ, పసుపు రంగు గానీ సరళమైన రీతిలో అందరికీ అర్థ మవుతుంది.

ఒక వస్తువు దాని యొక్క ధర్మంతో గుర్తింపబడుతుంది. ఆ ధర్మం మంచిదని మనము నిర్ణయించినపుడు, అందుకు మరియొక రీతిన

మనము ఆ వస్తువును గ్రహించలేము. ఒక క్లిష్టమైన వస్తువు ఉందంటె, దానిని సరళరీతిని విభజించి వివరించ ప్రయత్నిస్తాం. కానీ మంచి అన్నది సరళంగానే ఉంటుంది. దానిని మరింత సరళంగా విభజింప సాధ్యము కాదు. ఆ సరళమైన దానిని నిరూపించ సాధ్యమగును. మంచి అనునది నిరూపింపసాధ్యపడేది.

ఇది మిధ్యా ప్రపంచము. మంచిని మంచిగా వర్ణిస్తూనే, మరియొక రీతిన వర్ణించడం జరుగుతున్నది. నైతికంగా కూడా మంచి యొక్క ఇతర లక్షణములను వివరిస్తుంది. మంచికి ఇతర లక్షణాలను అంటగట్టడం అనునది మూర్ఖత్వం మరియు భ్రమతో కూడినది.

మనం ముఖ్యముగా తెలుసుకోవలసినది ఏమిటి అంటే మంచి మాత్రమే. ఈ రోజున అందరూ మంచిని గురించి ఆలోచిస్తారు. మంచిని గూర్చి తెలుసుకుంటారు. మంచిపై తమ అభిప్రాయాలను వెల్లడిస్తారు. ఈ విధముగా మంచిని స్పష్టముగా గ్రహించడానికి దోహదపడుతున్నారు.

ఒకవ్యక్తి 'నేను సంతోషంగా ఉన్నాను' అంటాడు. అనగా అతనికి ఒక మనస్సు ఉంది. ఆ మనస్సు, ఆ నిమిషంలో సంతోషాన్ని అనుభవించినట్లు అర్థమవుతున్నది. ఎంతటి సంతోషము? ఎక్కువ లేదా కొంచెం. ఏ విధమైన సంతోషం? ఒక రకమైన సంతోషం. ఆ వ్యక్తి అనుభవించిన సంతోషాన్ని వర్ణించలేము, కానీ ఆ వ్యక్తి యొక్క సంతోషానికి కారణాలైన వాటిని మనం గుర్తించ గలుగుతున్నాము. అనగా ఒకదానికి మరోదానికి ఉన్న సంబంధాన్ని మనము గుర్తించ గలుగుతున్నాము. ఉదా: మనస్సు ఉంది. మనస్సులో కోరిక ఉంది. సంతోషమును వివరింపలేము కానీ సంతోషమును ఎలా రాబట్టగలమో వివరింపవచ్చును.

ప్రతి కళ, విచారణ, కార్యం మరియు ప్రయత్నాలు అన్నీ మంచి కోసమే ప్రయత్నిస్తాయి. ఈ కారణం చేత మంచి అనునది అన్ని రంగాల వారు ఆశించేదే.

మానవులు లక్ష్యాలు ఏర్పాటు చేసుకుంటారు. తమ లక్ష్య సాధనలో వారు తమ తమ ప్రయత్నాలు చేస్తుంటారు. ఈ ప్రయత్నములలో కొద్దిపాటి మార్పులు ఉండవచ్చు. లక్ష్యాలు, పనితీరుతోపాటు ఇక్కడ ముఖ్యముగా గమనించవలసిన మూడో అంశము ఫలితము. ఆశించిన దానికంటే ఉన్నతముగా ఫలితము ఉండ వచ్చు. అనగా పనితీరును బట్టి ఫలితాలు వేరువేరుగా ప్రకటితమవుతాయి.

మనం ఒక లక్ష్యసాధనకు కొన్ని పనులు చేపడతాము. ఈ లక్ష్య సాధనలోనే ఉంటూ, ఇతర కార్యకలాపాల పట్ల శ్రద్ధ చూపము. లక్ష్యసాధన పట్ల చేసేకృషి చాలా ఉత్తమమైనది. ఒక ఉన్నత లక్ష్య సాధనలో ఒకరు ప్రయ్నతించినా, అందరూ కలిసి చేసినా, అందరి సంయుక్తకృషితో పనిపూర్తయినదని చెప్పుకోవడము ఆ ఫలితము యొక్క విలువను పెంచుతుంది.

మనకు అందుబాటులో ఉన్న జ్ఞానము మరియు చేసే ప్రతి ప్రయత్నము యొక్క లక్ష్యము మంచినిసాధించడానికే. రాజనీతి ఎప్పుడూ అన్నిటికంటే ఉత్తమ లక్ష్యాలను ఎంచుకుని కార్యాచరణ ద్వారా సాధించాలని సూచిస్తుంది. “సర్వేజనాః సుఖినో భవంతు. లోకాస్సమస్తా సుఖినోభవంతు” నానుడి ననుసరంచి అందరి యోగక్షేమాలు కోరుట జరుగుతుంది. అయితే సంతోషము ఎలా సాధించవచ్చు? అనే అంశము మీద బేదాభిప్రాయాలు ఉంటాయి. కొందరి దృష్టిలో సంతోషమనగా సుఖము, సంపదలు మరియు గౌరవమర్యాదలు కలిగి ఉండడమని భావిస్తారు. వీరిలో కూడా మరిన్ని భిన్నాభిప్రాయాలు వ్యక్తమగుచున్నవి.

అన్నీ ఉన్నా ఆరోగ్యం కూడా ఉండాలంటారు కొందరు. ఆరోగ్యమే మహాభాగ్యం. అన్నీ ఉండి ఆరోగ్యం లేకపోతే వాడికి సంతోషం ఎక్కడి నుండి వస్తుంది అంటారు మరికొందరు. ఇవేమీ లేకపోయినా జీవనాధారం ఉండి సంతోషంగా ఎందరుండటంలేదు అని అంటారు ఇంకొందరు.

మన సంఘంలో జీవిస్తున్నవారిని పరిశీలించినప్పుడు సంతోషము అనడానికి సుఖంతో అనుబంధం ఏర్పరచుకున్నారు. ఈ కారణంచేతనే సౌఖ్యమైన జీవితము లోనే సంతోషం ఉందని అందరూ భావిస్తున్నారు.

మూడు విధాలైన జీవన విధానాలకు జనులు అలవాటు పడుతున్నారు. సౌఖ్యమైన జీవితమును, వివేకముతో కూడిన జీవితము, ధ్యానముతో కూడిన జీవితము. దురదృష్టవశాత్తు, చాలామంది బానిస భావముతో సౌఖ్యమైన జీవితాన్నే కోరుకుంటున్నారు.

ఉన్నతభావాలతో చురుకుగా వర్తించు వ్యక్తులు ఆదర్శవంతమైన జీవితము లోనే సంతోషమును వ్యక్తం చేస్తారు. అదే వారి లక్ష్యము. ఆదర్శవంతమైన జీవితంలోనే మంచితనము ముడిపడి ఉందని వీరి భావన. పైగా వీరు సంఘంలోని ఉన్నత వ్యక్తిత్వంతో అనగా అనుభవ జ్ఞానంగల వారిచేత సత్కరింపబడాలని కోరుకుంటారు. వీరిలోని మంచిని చూసి, సంఘంలోని మంచివారి అభిమానం కోసం వీరు ఆశిస్తారు. వీరికి మంచితనమే లక్ష్యము. వీరికి తమగౌరవ మర్యాదల కంటే మంచితనమే ముఖ్యం. ఇది కూడా పరిపూర్ణం కాదు. ఈనాటి పరిస్థితుల్లో మంచివారనిపించుకున్నవారు అధిక నిద్రకు అలవాటుపడుతున్నారు. దీర్ఘకాలం ఏ కార్యకలాపాల యందు పాల్గొనుటలేదు. పైగా ఎన్నో కష్టనష్టాలకు గురి యగుచున్నారు. ఈనాడు డబ్బు సంపాదన తప్పని సరిగా తయారయినది. అక్రమ ధనసంపాదన మంచిదికాదు. ధన

సంపాదనకు కారణాలు అనేకం. ఈనాడు ప్రతి ఒక్కరికీ తనమీద తనకు ప్రేమ మెండు. తన స్వార్థం తను చూసుకుంటున్నాడు. నిజానికి ఇది ఎవరి లక్ష్యముకాదు.

మంచి అనే పదము అనేక విధాలుగా ఉపయోగించవచ్చు. పదార్థ విషయములో, గుణాల విషయములో, సంబంధ విషయములో ఇలా అనేక రీతులలో మంచిని సూచించుట జరుగును. పదార్థము విషయములో భగవంతుని మరియు కారణమును, సద్గుణాలలోని మంచి లక్షణాలు, ప్రవర్తన యందు మధ్యస్థంగా వ్యవహరించుట అనగా అతిగాను, అసలు లేకుండగానూ కాకుండా సంబంధ బాంధవ్యాల యందు ఉపయోగకరంగా, కాలానికి సంబంధించి అవకాశం చిక్కినవేళ, స్థలమునకు సంబంధించి అనువైన స్థలములో, ఇలా మంచిని అనేక రీతులలో వివరించవచ్చు, అనుభవించవచ్చు. ఇట్టి మంచివన్ని ఒక సమయంలో లభించాలని లేదు. అన్ని ఒకే పదార్థంలో ఉంటే ఇలా ప్రస్తావించ పనిలేదు కదా.

మంచి అనేది రెండు రకాలుగ వ్యక్తమవుచున్నది. ఒకటి, తమలో ఉన్న మంచిని వ్యక్తము చేయుట రెండు, ఏ కారణముచేత ఆ మంచి తనము ఉపయోగ పడుతుందో తమలో ఉన్న ఏ లక్షణాలను బట్టి మంచి అని వ్యక్తము చేయవచ్చు? మనలోని తెలివితేటలు, మన చూపు, మన గౌరవము, మనసుఖాలు మొదలైన అంశాలను మన మంచిగా అభివర్ణించవచ్చు. అయితే ఇప్పుడు ఉదహరించిన మంచి అందరిలో ఒకే విధముగా ఉండుట లేదు. అనగా తెల్లదనమును మంచుతోనో లేదా తెల్లని కాగితంతో పోల్చవచ్చును. కానీ ఈ మర్యాదలు, తెలివితేటలు, జ్ఞానము, సుఖసంతోషాలను ఇతరులతో పోల్చవీలుగాదు.

మనము ఆశించే మంచి మనకు ఒకేరీతిలో అందుటలేదు. వివిధ రీతులలో కర్మలు ఆచరింపబడుతున్నాయి. కళలతో కూడి, శాస్త్రపరము గానూ విభిన్నరీతులలో ఈ మంచిని అందుకుంటున్నాము. ఏ పని ఏరీతిలో చేసినా మంచిని ఆశించే చేయడం జరుగుతుంది. అనగా వైద్యపరంగా ఆరోగ్యమును ఆశిస్తాము. ఒక పథకము ప్రకారము విజయాన్ని ఆశిస్తాము. ఇంటిప్లానును బట్టి ఒక బిల్డింగును నిర్మిస్తాము.

ప్రతికార్యము, ప్రయత్నము మంచిని ఆశించే చేపడతాము. అందరి విషయాలలోనూ ఈ నైజము ఇంతే. ఈ మంచిని సాధించడానికి ఎవరికి వారే ప్రయత్నము చేసుకోవచ్చు లేదా అందరూ కలసిగట్టుగా శ్రమించి ఆ మంచిని సాధించవచ్చు.

మంచికి వ్యతిరేకపదము చెడు. చెడుతో పోల్చినపుడు మంచికి విలువ పెరుగుతుంది. చెడుతో పోల్చి మంచికి విలువను పెంచడం మానవ నైజముగా ఉంటున్నది.

మనము, ఈ జీవితములో మంచికి చెడుకు గల కారణాలను వీలయినంత వరకు తెలుసుకోవాలి. అలా తెలుసుకున్నరోజున చెడును తగ్గించుకుని, సమస్యలను దూరము చేసుకోవచ్చు. ఈ కారణముచే మనము జీవితములో సంతోషమునకు మార్గముల అన్వేషించి, అట్టి స్థితిని సాధించి, కష్టములకు దూరముగా సంతోషముతో గడుపవచ్చు. అప్పుడు మనము చెడుకు గానీ తప్పులకు గానీ ప్రభావితము కాము.

మనము ప్రతిరోజు ఎన్నో స్థితులలో సత్యమును గ్రహిస్తుంటాము. అది గోచరమైనది – అగోచరమైనది. స్వర్గము – నరకము మొదలయినవి. ఒకదాని కంటె మరొకటి ఎంతో భిన్నమైనది, ఉన్నతమైనది, ఉత్తమమైనది. ఈ స్థితులన్నీ మానవుడికి అందుబాటులోనే ఉంటున్నవి. అట్టి వివిధ స్థితులలోనే మానవుడు జీవనము సాగిస్తున్నాడు.

ఒక వ్యక్తి ఒక గమ్యమును, మార్గమును ఎన్నుకుంటాడు. ఎందుకు? ఆ మార్గము తనకు అనువైనది కాబట్టి. ఇదే విధముగా ప్రతి ఒక్కరూ తమకు అనువైన రీతులలో తమ లక్ష్యాలను సాధిస్తారు. గమ్యమును చేరాక వారికి విశ్రాంతి దొరుకుతుంది, కోరిక తీరుతుంది, ఆశించిన మంచి ఫలితము దక్కుతుంది. గమ్యము చేరడమంటె తలపెట్టిన కార్యమునకు ముగింపు పలకడమే. కాబట్టి ప్రతిపని, ప్రతి చలనము మంచిని సాధించుటకే. ఈ నేపథ్యములో మంచి అనగా ఒక కార్యానికి ముగింపు పలకడమే.

లక్ష్యము దిశగా ప్రయత్నములో కార్యము తగినరీతిలో ఆచరించవలెను. మంచి ఫలితాలను ఆశించినపుడు, కార్యమును కూడా మంచిగానే పూర్తి చేయవలెను. కాబట్టి లక్ష్యముతోపాటు కార్యము కూడా మంచిగా చేసినపుడు ఫలము కూడా మంచిగానే ఉండును.

కొందరు తెలివితేటలతోనూ, మరికొందరు సహజముగానూ కార్యాలు చేపడుదురు. తెలివితేటలతో మొదలుపెట్టినవారు ముందుగానే లక్ష్యమును దృష్టిలో పెట్టుకుని అందుకు తగిన కృషి సలుపుదురు. కొందరు సహజముగా కార్యాలు చేపట్టినపుడు, వారికి లక్ష్యముపై సరి అయిన అవగాహన లేకపోయినప్పటికీ, సహజముగానే చిత్తశుద్ధితో అంకితభావముతో లక్ష్యముపై గురితో కృషిచేయుదురు, సాధింతురు. కాబట్టి తలపెట్టిన కార్యము మంచిదై యుండి, ఆచరణ మంచి దైనప్పుడు, ఫలితాలు కూడా మంచిగానే ఉండును.

ఒక మంచి కార్యము మొదలుపెడతాము. ఆచరణలో మధ్య మధ్య చెడు ఆలోచనలు మనలో ప్రవేశిస్తాయి. ఈ చెడు ఆలోచనలకు ప్రభావితులమైనప్పుడు చెడు మార్గమున ఆచరణ ఉంటుంది. అనగా ఉద్దేశపూర్వకమగానే చెడు ఆచరణ వల్ల చెడు ఫలితములను పొందవలసి

ఉంటుంది. అందరూ మంచినే కోరినప్పటికీ, వారు చెడు మార్గము పట్టినందుకుగాను, చెడు కోరకపోయినప్పటికీ వారికి చెడు ఫలితాలే ఎదురగును.

మన ఆచరణలో లోపాలు ఉన్నప్పుడు, మన ఫలితములో చూపించును. ఉదా: ఒక మనిషి కాలు ఎముక వంకరగా ఉంటే, అతని నడకలో అవిటి తనము వ్యక్తమగును. ఎవరైనా ఒకరు కర్మనాచరించే టపుడు, తనలోని లోపాలను సవరించుకుని, ఆచరణకు దిగుతాడు. లోపాలులేని పనికి, ఫలితము అట్లే ఉండును. ఆపనిలో లోపాలు వ్యక్తముకావు. ఒక్కొక్కసారి లోపాలు బయటపడతాయి. అనగా ఆచరణలో బయటపడని లోపాలు ఫలితంలో బయటపడతాయి. ఆ ఫలితాలలోని లోపాలు ఉద్దేశ్య పూర్వకముగా వచ్చినవి కాదు. అయినప్పటికీ లోపాలు లోపాలే.

ఒక తెలివిగల వ్యక్తి ఒక కార్యము చేపట్టినప్పుడు లోపాలు లేకుండానే పూర్తిచేయాలనుకుంటాడు. ఉద్దేశ్యపూర్వకముగా ఏ వ్యక్తి లోపాలతో కార్యములు చేయడు.

పై వివరణను బట్టి చెడు కూడా మంచియొక్క పనియే. చెడుకు కారణము చెడే గనకయితే, ఆ చెడు పనిచేయరు. కాబట్టి చెడుకు కారణం మంచియే అంతేకాదు, ఏది లేదో అది దేనికీ కారణం కాదు. కాబట్టి ప్రతి కారణము వాస్తవమున ఉన్నది. కానీ చెడు వాస్తవమున లేదు. కాబట్టి చెడు దేనికీ కారణముకాదు. ఈ నేపథ్యములో చెడుకు కారణము మంచి అనే అర్థమవుతున్నది.

మంచి లక్ష్యాలతో మొదలుపెట్టిన పనులు మంచిఫలాలనే ఇచ్చును. అదే విధముగా చెడు లక్ష్యములతో మొదలుపెట్టిన పనులు చెడు

ఫలితాలనే ఇచ్చును. ఇక్కడ మనము ఒక్క విషయం గుర్తుపెట్టుకోవాలి. ప్రతి ఒక్కరు మంచి లక్ష్యాలతోనే పనులను చేపడుతున్నారు. అనగా ప్రతి ఒక్కరు మంచి ఫలాలనే ఆశిస్తున్నారు. కాబట్టి చెడు లక్ష్యాలతో పనులు చేపట్టినప్పుడే చెడు ఫలాలు అందును. చెడు లక్ష్యాలతో పనులు చేపట్టినప్పుడు ప్రమాదవశమున మంచి ఫలితాలు అందవచ్చును. అనుకోని ప్రమాద కారణముకూడా ఈ కార్యములోనే ఇమిడి ఉంటున్నది. మంచికి కారణము మంచే, చెడు ఎన్నటికీ కాదు.

అంతేకాకుండా, ప్రతి కారణము ఒక పదార్థము, రూపము, కర్త లేదా లక్ష్యమై ఉంటున్నది. చెడు పదార్థము కాదు, కారణము కార్యము నందు, శక్తినందు అవి మంచిని వ్యక్తం చేయుచున్నది. అదే విధముగా చెడు కర్తకాదు, కారణము చెడుకు రూపములేదు. చెడు లక్ష్యము కాదు, కారణము చెడు లక్ష్యాలతో ఎవరూ ఎన్నడూ పని మొదలుపెట్టరు. కాబట్టి చెడు దేనికీ కారణము కాదు. ఒకవేళ ఏదైనా చెడుకు కారణమైతే, అది మంచివల్లనే జరుగుతున్నది.

నైతిక విషయమున నైతికచెడుకు కారణము లోపాలే. ఒక నైతిక తప్పిదము సహజముగా జరిగినదే తప్ప, కావాలని జరగడం కాదు. నైతిక లోపము కార్యాచరణలో బయటపడుతున్నది. నైతిక చెడు అన్నది పదార్థమునకు గానీ, రూపమునకు గానీ, కారణమునకు గానీ సంబంధము లేకుండా ఉంటున్నది. కానీ కర్త మాత్రం కారణమయి కనిపిస్తున్నాడు.

నైతిక కర్మలలో నాలుగు సిద్ధాంతాలు వరుస క్రమంలో పనిచేయు చున్నవి. క్రియాశీలక శక్తి శరీరమును పనిచేయమని శాసించుచున్నది. క్రియాశీలక శక్తి ఇచ్ఛాశక్తిని అనుసరించును. విచక్షణా శక్తి ఇచ్ఛాశక్తిని ప్రేరేపించుచున్నది. విచక్షణాశక్తి మంచి చెడుల నిర్ణయము చేయుచున్నది.

విచక్షణా శక్తి దేనిచేతనైతే ఆకర్షింపబడిందో, అది విచక్షణాశక్తిని ప్రేరేపించును. కాబట్టి ఒక నైతిక ప్రక్రియలో మొదటిది, విషయమును తెలుసుకొనుట. రెండవది ఆ తెలుసుకున్న విషయము యొక్క మంచి చెడుల నిర్ణయము. మూడవది ఈ మంచిచెడుల నిర్ణయము తరువాత ఇచ్ఛాశక్తి యొక్క ప్రేరణ. నాల్గవది క్రియాశీలక శక్తితో శరీరమును శాసించి కార్యము లోనికి దింపుట. కారణము ననుసరించి క్రియను పూర్తిచేయుట.

కార్య నిర్వాహణశక్తిలోనే మంచిచెడుల వ్యత్యాసము గుర్తించడ మయినది. ఇచ్ఛాశక్తి మంచికి కట్టుబడితే, ఆ కార్యము మంచిగానే పూర్తగును. అలాకాక ఇచ్ఛాశక్తి చెడువల్ల ఆకర్షింపబడితే ఆ కార్యము చెడుగానే జరుగును. కొన్ని సందర్భాలలో అనుకోకుండా లోపాలు జరగవచ్చు. ఉదా: అవిటితనము వల్ల, అనగా అంగవైకల్యం వల్ల, ఆచరణలో లోపాలు జరగవచ్చు. ఇటువంటి నిర్వాహణ శక్తిలోని లోపాలను నైతికలోపాలుగా పరిగణింపరాదు. కాబట్టి నైతికముగా లోపాలు ఉన్నదానికి మూలకారణము మన ఇచ్ఛాశక్తియే.

మనము ఏ కారణముచేత కార్యాలు చేపడతాము? అనుకున్న లక్ష్యాలుగానీ లక్ష్యములుగానీ సాధించడానికి ప్రతిలక్ష్యము మన ఇచ్ఛా శక్తితో ముడిపడి ఉంటుంది. ఇక్కడ మనము ఆశించే లక్ష్యము మనకు స్థిరముగా అవగాహనలో ఉంటున్నది. ఈ విధముగా స్థిరమైన లక్ష్యము దిశగా మన కోరిక పరుగులు తీసినపుడు, ఆ కార్యము సఫలమగును. అనుకున్న పనిని పూర్తిచేయాలి. అనుకున్న పని జరుగుతున్న సమయంలో, మన ఇచ్ఛాశక్తి ఇతరవాటిపై ఆకర్షితమైనపుడు, జరుగుతున్న పనిపై శ్రద్ధతగ్గి, లోపాలతో పని జరుగును. ఈ విధముగా ఇచ్ఛాశక్తి ఇతర ఆకర్షణలకు ఆకర్షింప బడటం నైతికలోపమే.

విచక్షణా శక్తిలో లోపాలు ఉన్నప్పుడు, ఇచ్ఛాశక్తిలోనూ లోపాలుంటున్నవి. ఇచ్ఛాశక్తిలో లోపాలు వల్ల క్రియాశీలత శక్తిలో నైతిక లోపాలు బయటపడుతున్నవి. ఈ లోపాలు వివేకముతో తీసుకున్న నిర్ణయాలే. ఇట్టి లోపాలతో కూడిన పనులకు ఇచ్ఛాశక్తి ప్రేరణ పొందవచ్చు, పొందకపోవచ్చు. లక్ష్యము స్పష్టంగా లేదు. అనుకున్న లక్ష్యము సాధిస్తే సంతోషమే. అలాకాక లోపాలతో పని జరుగుతున్న యెడల దానికి కారణము ప్రమాదవశాత్తునుంచె.

ప్రకృతిలో సహజముగా సంతోషమనునది ఆచరణతోనే సాధ్యమగును. ఆచరణ లేకుండా సంతోషము అందదు. అనుకున్న పనులు సక్రమంగా సాగినపుడు, అనుకున్న సుఖ సంతోషాలు కూడా సంపూర్ణముగా ఉండవు. అంతేకాదు ఆచరణలో కూడా ఒకదానిననుసరించి మరియొకటి అనుకున్నట్లు సాగదు.

ఆహారము మరియు శృంగారము మానవుని అంతిమలక్ష్యాలు కావు. ఈ రెండు కూడా ఒకదానికొకటిగా అంతిమ లక్ష్యాలు కావు. కాబట్టి సంతోషమనునది ఈ సౌఖ్యాలందు లేదు. ఆశయాలతో కూడిన జీవితమునకు ఈ రెండు సౌఖ్యాలు ఆటంకాలుగా పరిగణింపబడును. కేవలం ఇంద్రియ సుఖమును ఆశించినవాడు ఈ సౌఖ్యాలు కోరవచ్చును. ఆశయాల దృష్ట్యా, అనగా మానవజన్మ ఎంతో విలువైనది. అట్టి విలువైన మానవజన్మకు ఇట్టి శరీర సౌఖ్యాలకు పరిమితమైన, సంతోషము దక్కదు.

మానవుడు ఎంతో ఉన్నతమైనవాడు. ఎంతో ఉన్నత వ్యక్తిత్వం కలవాడు. ఎంతో ఉన్నత వ్యక్తిత్వముగల మానవుడు అతి సామాన్యమైన పనులకు అలవాటు పడడం, అతనికి సహజమైనదికాదు. ఉన్నతమైన ఆశయము కొరకే మానవ జీవితమును ఉపయోగించాలి. ఉన్నత ఆశయసాధన కృషిలో తనే ఎంతో ఉన్నత స్థితికి ఎదగవలెను. ఇంద్రియ

సుఖములనేవి చాలా అత్యల్పమైనవి. అత్యల్పమైన సౌఖ్యాలలో మానవునకు సుఖసంతోషాలు ఎలా దొరుకుతాయి?

మానవుడికి భౌతిక జగత్తులోని అత్యధిక అధికారం, అతనికి మంచి అనిపించుకోదు అట్టి అధికారం పొందుటలో, అదృష్టం కలసిరావాలి. ఈ అధికారం శాశ్వతమైనదీ కాదు. అది మానవుని ఇచ్ఛప్రకారం దక్కేదికాదు. ఇది చాలా సందర్భాలలో చెడువారినే వరిస్తున్నది. ఈ లక్షణాలు, మంచికి పొత్తు కావు. అంతేకాదు ఆ ఉన్నతమైన అధికారం కోసం మానవుడు తాను కూడా అంతటి ఉత్తముడనే అనుకుంటున్నాడు. అధికారం ఉందనో, లేదనో మనము అతనిని మంచివాడనో, చెడ్డవాడనో నిర్ణయించము. ఎప్పుడూ మంచి పనులే చేస్తున్నాడని ఆ వ్యక్తిని మంచివానిగా భావించనక్కరలేదు. కాబట్టి అధికారములో ఉన్నాడని అతనిని చాలా మంచివాడని భావించనవసరం లేదు.

ఆరోగ్యముగా ఉన్నారని, అందముగా ఉన్నారని, బలముగా ఉన్నారని వీరిని మంచివారని తలచకూడదు. చెడువారిలోకూడా ఇట్టి లక్షణాలే ఉంటాయి. ఈ లక్షణాలు శాశ్వతముకాదు. ఈ లక్షణాలు మన ఇచ్ఛకు లోబడిలేవు. శరీరము ముఖ్యమా, ఆత్మ ముఖ్యమా అని ప్రశ్నించుకొన్నప్పుడు ఆత్మే ముఖ్యమని సమాధానం వస్తుంది. మనలో ఆత్మ ఉన్నంతవరకే, మన శరీరములోని ఈ మూడు లక్షణములకు శోభ ఉంటున్నది. కాబట్టి దేహ సౌందర్యము కంటె ఆత్మ సౌందర్యము ముఖ్యము. కాబట్టి ఆరోగ్యము, బలము, సౌందర్యము అనునవి మనిషిలోని మంచితనానికి గుర్తులుకావు. నిజానికి మానవుడి కంటె జంతువులలో ఈ మూడు లక్షణాలు చాలా అధికముగా కానవచ్చును. ఒకవేళ ఈ మూడు లక్షణాలే మానవుడి మంచికి చిహ్నాలైతే, జంతువులు ఎంతో సంతోషించాలి. కానీ జంతువులలో ఈ సంతోషమును మనము

చూడటం లేదుకదా. కాబట్టి దేహసౌందర్యము మానవుని మంచికి చిహ్నాలుకావు.

అలాగని, మానవుని సుఖసంతోషాలకు అతని నైతికస్థితే కారణమని భావించకూడదు. నైతిక కార్యక్రమాలన్నిటికీ లక్ష్యాలు వేరుగా ఉ ంటున్నాయి. ఉదాహరణకు, న్యాయముగా జీవించడం వల్ల శాంతి వర్ధిల్లుతుంది. ఈ విధమైన లక్ష్యాలు సాధించడానికి మానవుడు సుముఖముగా ఉండడు. ఒకమానవుడు నైతికముగా జీవించినంత మాత్రాన సంఘములో శాంతి లభించదు కదా.

మానవుని నైతిక స్థితిని పరిశీలించినట్లయితే, అతని మనో భావాలు అతని చుట్టూ ఉన్న వస్తుసముదాయాలను అనుసరించి ఉంటుంది. కానీ అతని అంతిమ లక్ష్యమునకు, ఈ మనోభావాలకు పొంతన కుదురుటలేదు. ఇతని లక్ష్యం ఉన్నత మైనదే, కానీ మనస్సు అందుకు సహకరించుటలేదు, అనగా మనస్సు మరోదిశగా పరుగెడుతున్నది. కాబట్టి కేవలం నైతికతే మానవునికి సంతోషాన్ని అందివ్వ జాలకున్నది.

మంచిచెడులనేవి మన మనోభావాలపైనే ఆధారపడుతున్నవి. వస్తువులన్నీ సహజధర్మాలతో వ్యక్తమగుచున్నవి. కానీ ఈ వస్తువులయొక్క ధర్మాలకు మానవులు అనేకరకాలుగా స్పందిస్తున్నారు. ఒక వస్తువు యొక్క ధర్మము ఒకరికి మంచిగా అనిపించవచ్చు. ఒకరికి చెడుగా అనిపించవచ్చు. ఒకరికి ఏమీ అనిపించక పోవచ్చు. ఉదాహరణకు: కొంతమందికి సంగీతమంటే చాలా ఇష్టం. కొంతమందికి సంగీతమంటే బాధగా ఇబ్బంది పడతారు. చెవిటివారిపై ఈ సంగీతము ఎట్టి ప్రభావము చూపదు.

పైన ఉదహరించిన రీతిననుసరించి మానవుడు నేర్చు కోవలసింది చాలా ఉంటుంది. ఇక్కడ సంగీతానికి ఇష్టపడి దగ్గరయినవారున్నారు. సంగీతమంటే అయిష్టంతో గిట్టనివారు ఉన్నారు. వస్తువు యొక్క ధర్మముపై మనము మక్కువ పెంచుకోవాలి. అప్పుడు మనము ఆ వస్తువుకు దగ్గరవుతాము. వస్తుధర్మముపై మక్కువలేనపుడు ఆ వస్తువుకు దూరమవుతాము. ఆవస్తు ధర్మము పట్ల మనము ఇష్టము ప్రకటించినపుడు, మన ప్రవర్తన ఆ వస్తువుపట్ల సంపూర్ణంగా ఉంటుంది, ఇట్లు కానియెడల అసంపూర్ణంగా ఉంటుంది.

సాధారణంగా మానవుడు తన లక్ష్యము దిశగా ఆలోచిస్తూ, ప్రయత్నము చేస్తూ ఉంటాడు. అనగా అతని లక్ష్యసాధనకు సంబంధించి అతని మనస్సు చురుకుగా పనిచేస్తూ ఉంటుంది. అటువంటి పనులను శ్రద్ధాసక్తులతో చేస్తాడు. కానీ దైనందిన కార్యక్రమాలలో మానవుడు అనేక విషయాల పట్ల శ్రద్ధ వహించడంలేదు. శ్రద్ధలేని కార్యాలను నిస్సత్తువతో చేస్తుంటాడు. శ్రద్ధతో చేసే కార్యాలలో మనశక్తి సామర్థ్యాలు బయటపడతాయి. ఆసక్తి లేని కార్యాలయందు మన అజ్ఞానము, చేతకానితనము బయటపడుతుంది. శ్రద్ధతో చేసే పనులవల్ల మానవుడికి మంచి జరుగుతుంది. ఆసక్తిలేని పనులవల్ల మానవునికి మంచి లేదా చెడు జరగవచ్చు.

మానవుడు తన బుద్ధిని సద్వినియోగము చేసుకున్నప్పుడే ఎక్కువ లబ్ధిని పొందగలడు. ఈ ఒక్క విషయముపైనే మానవుడికి ఉత్తమమైన, ఉన్నతమైన స్థితిలో సంతోషము, ఆనందాలను పొందగలడు. ఇట్టి ఆనందముతో అతని మనస్సు ప్రశాంతముగా ఉంటుంది. తన తెలివి తేటలను ఎల్లవేళలా మంచి మార్గంలో పయనింపచేయడానికి మానవునికి భగవంతుని విజ్ఞానము అత్యవసరమై ఉన్నది. భగవంతునిపై కోరికను పెంచుకున్న, ఆ ఒక్కకోరిక మిగతా కోరికలను అదుపులో ఉంచును.

జీవితము వివేకముతో కూడినది. వివేక విచక్షణలు మానవుని మంచి మార్గమున నియంత్రించును. మంచి మార్గమునకు అలవాటు పడిన వ్యక్తి జీవితమును ఆనందిస్తాడు. ఇట్టి ఆనందకరమైన జీవితానికి కలిగే ఆటంకములనే చెడుగా మనము వర్ణిస్తాము.

మనిషి తన మంచికి దోహదపడే అన్ని కార్యాలనూ చేయడానికి సుముఖత కలిగి ఉంటాడు. ఈ నేపథ్యములో మానవునికి బయటినుండి చెడు జరగడానికి అవకాశం ఉంది. వివేకముతో మంచిచెడుల నిర్ణయముతో మానవుడు తన జీవితమును ఆనందమయంగా చేసుకొనవలెను.

మానవుడికి అనేక కోరికలు ఉంటాయి. వాటిలో కొన్నిటిని ముఖ్యమైన కోరికలుగా నిర్ణయించుకుంటాడు. అయితే అన్నిటి కంటె ముఖ్యమైన కోరిక ఏమిటి? తనకు అన్నిటికంటె ముఖ్యమైన కోరిక, తనకు ఎక్కువ మంచి చేసే కోరికయై ఉంటుంది. ఆ విధముగా మానవుడు ముఖ్యమైన కోరికలను పరిమితము చేసుకున్నప్పుడు, ఆ ఒక్క కోరిక కోసమే ప్రయత్నిస్తాడు. ఒకటికంటె ఎక్కువగా ముఖ్యమైన కోరికలు ఉన్నప్పుడు, వాటికోసం ప్రయత్నిస్తాడు. తనకు చాలా ముఖ్యమైన కోరికను నిర్ణయించుకున్నాక, ఆ కోరిక సాధించడానికి మిగతా కోరికలను ప్రక్కన పెడతాడు.

మన లక్ష్యము సంతోషము. సంతోషమును మించిన మరో కోరిక ఉండదు. మనము మనలో ఎన్నో మంచి లక్షణాలను కోరుకుంటాము. మనము సౌఖ్యమును, సంపదలను, గౌరవ మర్యాదలను కోరుకుంటాము. దేనికోసం? సంతోషం కోసం. అనగా ఈ కోరికలను సాధించడం వల్ల సంతోషమును పొందవచ్చు. ఇంతేకానీ సంతోషమును పొంది, ఆ

సంతోషము నుండి గౌరవ మర్యాదలు, సంపదలు సాధించడమనేది జరగదు.

సంతృప్తి అనేది అన్నిటికంటె మంచిగుణం. సంతృప్తి అనగా తనొక్కడే ఏ కొరతా లేకుండా గడపడం అనికాదు. తనతోబాటు, తన కుటుంబసభ్యులు, స్నేహితులు, సంఘములో తనచుట్టూ ఉన్న నలుగురూ సుఖసంతోషాలతోఉంటేనే ఈ సంతృప్తికి లోనవుతారు. సంతృప్తి ఎప్పుడు కలుగుతుంది? తనకు అన్నీ ఉన్నాయి. తనకు తన దృష్టిలో లేమి అన్నది లేదు. అన్ని కోరికలలోకి సంతోషమే ఉత్తమమైన కోరిక. సంతోషాన్ని ఏ ఇతర కోర్కెలతోనూ పోల్చ దగినది కాదు. సంతోషమే మానవునకు సంతృప్తిని కలిగించేది. మానవుని గమ్యము, లక్ష్యము సంతోషమే.

సంతోషమును మానవుడు ఏ విధముగా సంపాదించగలడని, తరచూ అందరూ ఆలోచించే ప్రశ్న. జ్ఞానం వల్ల, అలవాట్ల వల్ల, ఒక ప్రత్యేకమైన శిక్షణ వల్ల భగవంతుని అనుగ్రహం వల్ల ఈ సంతోషము సంక్రమించునా? ఈసంతోషమనే బహుమతిని భగవంతుని ప్రసాదము గనకయితే మానవులందరూ ఈ సంతోషాన్ని అనుభవిస్తూ ఉండేవారు. అలాకాక విద్యవల్ల, శిక్షణవల్ల, మంచి గుణాలవల్ల లభ్యమయ్యేదే ఈ సంతోషము అనుకుంటే, అలాకూడా ఎంతో మంది సాధించేవారే. కాబట్టి సంతోషం కలిగినప్పుడు, దానిని అనుభవించడమే ముఖ్యము. అనగా సంతోషాన్ని పొందడమనేది అంత తేలికగా జరిగే ప్రక్రియకాదు.

ఒక మనిషి సంతోషము అతని స్వభావమును బట్టి ఉంటుంది. అతని స్వభావము అనగా అతని శరీరము, మనస్సు, ఆత్మలపై ఆధారపడి ఉంటున్నది. ఆత్మకు సంబంధించిన కార్యమైనప్పుడు, ఆ కార్యము సాధనకై ఆ జీవితమంతా వినియోగించడమవుతున్నది. అదే ఆ జీవిత పరమార్థమవుతున్నది.

శరీరానికి, మనస్సుకు సంబంధించిన విషయాలలో భౌతిక సంబంధమైన విషయాల ద్వారా అనగా స్నేహితులు, సంపదలు, అధికారము మొదలగునవి ప్రభావము చూపుచున్నది. మంచి జన్మ కలిగియుండటం, మంచి పిల్లలను కనడం, అందముగా ఉండటం, సంఘములో పరపతి కలిగి ఉండటం మొదలయినవన్నీ సంతోషము యొక్క పర్యాయ పదములవలె ఉన్నాయి. నిజానికి ఈ లక్షణాలు సంతోషమునకు కారణమగుచున్నవి. ఈ కారణముచేతనే సంపదలవల్ల సంతోషము దక్కునని కొందరు, సద్గుణముల వల్లనే సంతోషము ప్రాప్తించునని మరికొందరు అభిప్రాయపడుతారు.

వివేకవంతులు స్వభావరీత్యా మంచితనముతో సంతోషమును సహజంగానే అనుభవించుచుందురు. కోరిక అనేది సహజంగా అందరి లోనూ ఉంటుంది. అయితే ఏ కోరిక? అందరిలో అన్ని రకాల కోరికలు వ్యక్తమవుతాయి. దానికి కారణము ఈ కోరికలు వివేకముననుసరించి ఉండుటలేదు. ఈ మార్పులకు కారణము, అందరిలో ఒకే రకమైన జ్ఞానము ఉండుటలేదు. జ్ఞానము లేనివారికి సహజమైన కోరికలే కలుగుతున్నాయి. ఇంద్రియ జ్ఞానము కలవారు ఇంద్రియ సుఖాలను కోరుకుంటున్నారు. వివేకవంతులు తమ ఇచ్ఛాశక్తితో తమ కోర్కెల సాధనకై కృషి చేయుచున్నారు.

ఇంతకు ముందు తెలుసుకున్నట్లుగానే మన ఇచ్ఛాశక్తి మన వివేక విచక్షణల ననుసరించును. మన వివేక విచక్షణలు మనయొక్క విజ్ఞానాన్ని అనుసరించుచున్నది. కాబట్టి సంతోషానికి సంబంధించిన అంశము మన విజ్ఞానానికి సంబంధించినదిగా గుర్తించవలెనే తప్ప, మన ఇచ్ఛాశక్తి బట్టికాదు అని గ్రహించ వలెను. శారీరక సుఖముల వల్ల మానవుడు ఎన్నటికీ సంతోషమును పొందలేడు.

ఆత్మకు సంబంధించినది అనగానే సద్గుణాలతో కూడినది. మానవ స్వభావము ఏమిటి? సంతోషముగా ఉండటమే మానవ నైజము. సద్గుణాలు అనగానే, అది శరీరమునకు సంబంధించిన అంశముకాదు. అది ఆత్మకు సంబంధించిన అంశము. కాబట్టి సంతోషము ఆత్మకు సంబంధించినది.

ఉన్నతమైన లక్ష్యము దిశగా మనము సాధనచేస్తాము. ఆ ఉన్నత మైన లక్ష్యమే మనలను శాసిస్తుంది. ఆ ఉన్నతమైన లక్ష్యమే భగవంతుడు.

అనగా, సంతోషమునకు కారణము తెలుసుకోవాలన్న సత్యమును గ్రహించవలెను. సత్యశోధనతో మానవుడు తన జ్ఞానమును చైతన్యముతో అనుభవిస్తాడు. కాబట్టి లక్ష్యము దిశగా పయనించవలెనన్న ముందు సత్యమును గ్రహించాలి. సత్యమును గ్రహించవలెనన్న మానవుడు స్వయం కృషితో సాధించ గలడు. నిజానికి మానవుడి యొక్క అన్ని కార్యకలాపాలు ఈ లక్ష్యము దిశగానే సాగవలెను. మానవుని సర్వకర్మలు, అన్ని సద్గుణాలు ఈసత్యమునే వెల్లడించును. కాబట్టి ఇందుమూలముగా గ్రహించినదేమనగా మానవుని సంతోషమునకు కారణము జ్ఞానము మరియు సత్యము తెలుసుకొనుట. ఈ ఆధ్యాత్మిక విషయాలు శాశ్వతమైనవి మరియు భగవంతుని విషయాలై ఉన్నవి.

## 28. మన అందుబాటులోని శక్తులు

నైతికతకు పునాది వివేకమే. ఈ వివేకముతో మనము న్యాయము గానూ, ఆదర్శముగానూ, సంతోషముగానూ జీవించవచ్చు. ధ్యానముతో మనము మన అందుబాటులో ఉన్న వనరులను గుర్తించాలి.

ఈ వనరులను మనము పరిశీలించినపుడు కొన్ని వనరులు మన అందుబాటులో ఉన్నట్లు, మరికొన్ని మన అందుబాటులో లేనట్లు గుర్తిస్తాము. మన అందుబాటులో ఉన్నవి మనకర్మలు, ఆలోచనలు, కోరికలు, అయిష్టాలు మరియు ఇచ్ఛాశక్తి. మన అందుబాటులో లేనివి మన శరీరము, ఆస్తులు, గౌరవమర్యాదలు. మన పని స్థలాలు మన అధీనములో ఉన్నవి. సహజంగా, స్వేచ్ఛతో ఏ విధమైన అదుపు, నియంత్రణ లేకుండా మన అదుపులో ఉంటాయి. మన అధీనంలో లేనివి సహజంగా బలహీనంగానూ, నియంత్రణలోను మరియు ఇతరుల అధీనంలో ఉండును. ఇప్పుడెవరైనా తన అధీనంలో ఉన్నవే తనవని, ఇతరుల అధీనంలో ఉన్నవి పరులవని భావించినట్లయితే, ఏ మనిషి సాటి మనిషిని నిర్భందించడు, ఎవరినీ తప్పు పట్టడు. ఇతరులు ఎవరూ అతనకి హాని చేయరు కారణము శత్రువులు లేకపోవడమే.

ఎవరైనా గొప్పపనులను చేపట్టినప్పుడు, ఆ గొప్ప పనులను చిన్న చిన్న ప్రయత్నాలతోసాధించలేడు. ఒకేసారి అన్నిపనులను సాధించెయ్యా లనే ఉద్దేశ్యము మంచిదికాదు. అతను ఆశించినవాటిల్లో కొన్నిటిని పూర్తిగా మానుకోవాలి, మరికొన్నిటిని ప్రస్తుతానికి వాయిదా వేసుకోవాలి. ఎవరైనా గొప్పపనులతో పాటు, అధికారమును, సంపదలను సాధించా లనుకుంటే, అతనికి సుఖము, స్వేచ్ఛ కరువవుతాయి. ప్రతి ఒక్కరు కష్టమైనా తాను అనుకున్నవి సాధించగలడా అని తననుతాను శల్యపరీక్ష చేసుకోవాలి. ఈ పరీక్షలో తనకు సంబంధము లేని అంశాలు గోచరిస్తే, అట్టివానిపై తన ఆసక్తిని తగ్గించుకోవాలి.

కోరికలోనే తాను ఆశించే కోరికను సాధిస్తాడనే ఆశ ఉంటుంది. తనకు ఇష్టము లేని పనిని చేపట్టి ఇబ్బంది పడడానికి ఇతను సిద్ధముగా ఉండడు. ఎవరైనా దురదృష్టం వల్ల తాము ఆశించిన ఫలితమును సాధించ లేకపోవచ్చును. తానుచేయకూడదని భావించి, చేపట్టిన పనుల వల్ల అతనికి కష్టముగా ఉంటుంది. అట్లయిన, ఇప్పుడెవరయినా తనకు ఇష్టములేని పనులను మాత్రమే వదిలివేయడం, అది కూడా అతని అధీనంలో ఉండడం, అతను తనకు అయిష్టమైన పనులలో ఎన్నటికీ తలదూర్చడు. కానీ ఎవరైనా చావుని, అనారోగ్యమును ఇష్టంలేదని తప్పించుకోవడానికి వీలవుతుందా? వీలుకాదు, పైగా చాలాకష్టంగా ఉంటుంది. ఈ నేపథ్యములో తన అధీనములో లేని అయిష్టాలన్నిటినీ, తన అధీనములోని ఇష్టాలుగా మార్చుకోగలగాలి. ఇక్కడ కోరికను ప్రస్తుతానికి పూర్తిగా నాశనము చేసుకోవాలి. మన అధీనములో ఉన్న వనరులతో మన కోరికలను సాధించడమనేది జ్ఞానులు చేసే ఉత్తమపని.

ఇన్ని విషయాలలో మన ఆత్మ కొన్నిటిని ఇష్టపడుతుంది. అలా ఇష్టపడిన వస్తువుల యొక్క స్వభావమును మనము గుర్తించి వర్తించాలి. ఉదాహరణకు, ఒకరికి మట్టికుండంటే చాలా ఇష్టం. అది మట్టికుండ కాబట్టి ఎప్పటికయినా పగిలిపోవచ్చు. మట్టికుండ పగిలిపోయిందని బాధపడకూడదు.

ఎవరైనా ఒక కార్యమును చేపట్టినప్పుడు, తాను చేపట్టిన కార్యము పట్ల అప్రమత్తతతో నుండవలెను. ప్రతి ఒక్కరూ తాను చేపట్టినపనిని సంకల్పించిన రీతిలో పూర్తి చేయాలని కోరుకుంటూ, తన ఇచ్ఛాశక్తిని సహజంగానే ఆ చర్యలో ప్రవేశపెట్టాలి.

జరుగుతున్న విషయాలకు మానవులు బాధపడరు, కానీ వారు తెలుసుకున్న విషయాలకు బాధపడతారు. ఉదాహరణకు: చావంటే

పట్టించుకోరు కానీ, ఆ చావు గురించి తెలుసుకున్న విషయాలకు వారు కలత చెందుతారు. సాధారణంగా మనకు ఈ విధముగా దుఃఖము, బాధ కలిగినపుడు మనము ఇతరులను నిందించము. కానీ మనల్ని మనమే నిందించుకుంటాము, అనగా మన అభిప్రాయాలను, అసంపూర్ణ మైన జ్ఞానము కలిగినవాడే ఇతరులను నిందించును, తన హీన పరిస్థితికి జ్ఞానం సాధించే కొద్దీ తప్పును తనమీదే వేసుకుంటాడు. ఎప్పుడయితే సంపూర్ణ జ్ఞానం సాధిస్తాడో ఇంక అప్పుడు ఇతరులను నిందించడు, తనను తాను నిందించుకోడు.

ఇతరుల యొక్క లబ్ధికి గానీ నైపుణ్యానికి గానీ మనము పొంగి పోరాదు. మనము ప్రకృతిని అనుసరించి నడచుకొనినపుడు, ప్రకృతిలో ఎదురయ్యే మంచి మంచి అనుభవాలకు మనము పొంగిపోవచ్చు. ఆ ఆనందము మనదిగానే భావించుకుంటాము కాబట్టి.

ప్రతి ఒక్కరు తాను ఆశించిన రీతిలో తమ పనులు జరగాలను కుంటారు. ఇది సరికాదు. పనులు ఎలా జరుగుతున్నా స్వీకరించడానికి మనము సిద్ధముగా ఉండాలి. అప్పుడు మనమనస్సు ఒత్తిడులకు గురికాక ప్రశాంతముగా ఉంటుంది.

అనారోగ్యము శరీరానికి ఆటంకము, కానీ మన ఇచ్ఛాశక్తి కాదు. ఇచ్ఛాశక్తి కూడా అనారోగ్య భావనకు గురియైనప్పుడు ఆటంకముగా భావింపబడుతుంది. అవిటితనము శరీరమునకే ఆటంకము తప్పితే, మన ఇచ్ఛాశక్తికి కాదు. ఈ విధముగా ప్రతి ఒక్కరు ఆలోచించి, ఆటంకాలకు తమకు ఆపాదించక పనులు చేసుకొనిన ఉత్తమము.

మన జీవితంలో మనకు ఎన్నో సంఘటనలు ఎదురవుతూ ఉంటాయి. అటువంటి సందర్భాలలో వాటిని గురించి విచారించి, ఆ సంఘటనలను

మనము స్వీకరించడానికి సిద్ధపడాలి. ఒక అందమైన యువతిని గానీ యువకుడిని గానీ చూసినపుడు మనలో ఇంద్రియ నిగ్రహము పెంచు కోవాలి. మనము బాధను అనుభవించే సమయాలలో ప్రయత్నముతో ఆ బాధను తట్టుకోవాలి. మనల్ని ఎవరైనా నిందించినపుడు, మనము ఓర్పు వహించాలి. ఈ విధమైన జీవితమునకు అలవాటు పడినపుడు, జీవితములో ఎదురయ్యే సంఘటనలు మనల్ని పెద్దగా బాధపెట్టవు, ప్రభావితం చేయవు.

ఓ వస్తువును పోగొట్టుకున్నాను అని అనవద్దు. నేను తిరిగి సంపాదించాను అని అనండి. ఒకరి వస్తువులు మరొకరు హస్తగతం చేసుకోవడం దుర్మార్గులపని. నీకు ఇచ్చిన భగవంతుడే తిరిగి తీసేసు కున్నాడని భావించుకోండి. ఎవరైనా తమ చేతిలో ఉన్నంత వరకే అది తమ వస్తువుగా భావించవలెను. ఆ వస్తువు తమ హస్తమున లేనపుడు, ఇంక ఆ వస్తువు గురించి చింతించకూడదు.

ఎవరైనా నలుగురిలో ఉన్నప్పుడు, తనను తాను గొప్పగా భావించు కుంటె, అది ఆత్మవంచనే అవుతుంది. ప్రకృతి ననుసరించి భౌతిక అవసరాలు తీర్చుకోవాలనుకోవడం ఎంతమంది ఇష్టాపూర్వకంగా స్వీకరిస్తారు. మనము ఒక వస్తువు పట్ల శ్రద్ధ చూపితే, రెండో వస్తువుపట్ల నిర్లక్ష్యము వహించవలసి ఉంటుంది.

ఎవరైనా తన భార్యాపిల్లలు, స్నేహితులతో కలకాలం జీవించి ఉండాలను కోవడం కేవలం మూర్ఖత్వమే అవుతుంది. తన అధీనములో లేని వ్యక్తులు, వస్తువులు తన పరిధిలో ఎంతకాలం ఉంచగలుగుతారు. తన పరిధిలో తన కోరికలు తీర్చుకోవడం సబబే. ఒకవ్యక్తి స్వేచ్ఛగా ఉండాలని అనుకుంటే గనక, అతను ఏదీ కావాలని అనడు, వద్దనీ అనడు. ఆతనికి ఎదురైన వ్యక్తులపై ఇది ఆధారపడి ఉంది.

జీవితమును ఒక పార్టీగా భావించాలి. ఆ పార్టీలో మనము ఎంతో మందిని కలుస్తాము. ఎంతో మందితో కరచాలనం చేస్తాము. ఎంతోమంది మనల్ని పట్టించుకోకుండా సాగిపోతుంటారు. పార్టీ అంతా అయిపోయాక మళ్ళీ మనము ఏకాకిగా మిగిలిపోతాము. జీవితము కూడా అంతే. పెళ్ళయ్యాక భార్య వస్తుంది. ఆ తరువాత పిల్లలు వస్తారు. ఎవరూ శాశ్వతముగా ఉండరు. పిల్లలు పెద్దవారై వేరే ప్రదేశాలకు వెళ్ళిపోవచ్చు. ఈ విధముగా వైరాగ్యభావముతో జీవించడం అన్నది సబబుగా ఉంటుంది.

ఒక ఇంట్లో ఒకవ్యక్తి మరణించినా, లేదా ఒక సంపద తరిగినా, ఆ ఇంట్లో బాధపడతారు. నిజానికి చనిపోయిన వారి గురించి, తరిగి పోయిన ఆస్తిగురించి బాధపడవలసిన పనిలేదు. కానీ నిజానికి వారిలో ఉన్న అజ్ఞానం వల్ల వారికి బాధ కలుగుతున్నది. చనిపోయిన వారింటికి వెళ్ళి మాటలతో పరామర్శచేస్తే సరిపోదు, వారిలోని ఆంతరంగిక బాధను తగ్గించే ప్రయత్నం చెయ్యాలి.

మన అధీనంలో లేని విషయాలపై పోటీపడకుండా అజేయంగా ఉండడమే ఉత్తమ లక్షణం. మనము ఒక వ్యక్తియొక్క గొప్పతనానికి సన్మానించడం చూస్తుంటాము. అతనిని ఎంతగానో ఊహించుకుంటాము. మనము మంచివారమైతే, ఆ గొప్పవ్యక్తిపై అసూయాద్వేషాలకు తావివ్వము. ఒకవ్యక్తి గొప్ప పదవిలో ఉంటూ, వైరాగ్యంతో స్వేచ్ఛగా ఉండడమనేది జరగదు. ఒకవేళ అది జరిగితే, దానికి కారణం అతని జ్ఞానమే, వైరాగ్యమే. ఈ లోకంలో ఏదీ శాశ్వతం కాదు. తాను అనుభవించే గొప్పపదవీ, అధికారం కూడా శాశ్వతంకాదు అని భావించినవ్యక్తి, తన అధీనంలోలేని విషయాలకై పెద్దగా పట్టించుకోడు.

మనల్ని ఎవరైనా తిట్టవచ్చు, కొట్టవచ్చు, అవమానించవచ్చు, మనలోని భావాలను బట్టి మనము అవమానంగా భావించవచ్చు.

పరాయివ్యక్తి తనను ఇబ్బంది పెట్టినప్పుడు, తనను తాను ఆత్మవిమర్శ చేసుకుంటే, తన ఇబ్బందికి కారణము తన భావాలే అని అర్థమవుతుంది. కాబట్టి ఎదురయ్యే సంఘటనలకు తొందరగా స్పందించరాదు. నిలకడతో తనను తాను సంబాళించుకున్నప్పుడు, తనమీద తనకు నిగ్రహం కలుగుతుంది.

ఎవరైనా ప్రతిరోజు చావును తన కళ్ళముందు ఊహించుకుంటే, అతనికి చెడు భావనలు కలుగవు. మితిమీరిన కోరికలు ఉండవు.

ఎవరైనా ఒక మనిషిని సంతృప్తి పరచడానికి భౌతికమైన విషయాల పట్ల ఆసక్తి కలిగించిన, అతని జీవిత పరమార్థము భంగపడినట్లు భావించవలెను. మనకు ఉన్నంతలో సంతృప్తిని అనుభవించాలి.

"నన్నెవ్వరూ పట్టించుకోకూడదు. నన్నెవ్వరూ గుర్తించకూడదు" ఈ విధమైన ఆలోచనలు కొందరికి కలుగుతుంటాయి. వీరి ఉద్దేశ్యములో పొగడ్తలను వీరు చెడుగా భావిస్తారు. తన అధీనములో ఉన్న వనరులతో ఒక వ్యక్తి ఎంతటి గొప్ప కార్యాలనైనా సాధించగలడు. అతను పొగడ్తలను ఆశించక నిరాడంబరముగా జీవించవచ్చును.

ఒక వ్యక్తి మంచిపనులు చేస్తే మంచివాడనిపించుకుంటాడు. చెడుపనులు చేస్తే చెడ్డవానిగా గుర్తింపబడతాడు. సంఘంలో ఒక మంచి కార్యమునకు నీకు బదులుగా వేరొకరిని ఎంపిక చేసుకున్నప్పుడు ఆ ఎంపికకు నీవు బాధపడతావు. కానీ అది సరికాదు. నీ కంటే యోగ్యుడిని ఎంపిక చేసుకున్నారని నీవు సంతోషించ గలగాలి. అదే విధముగా ఒక చెడు సంఘటనలో, నీ పేరు ప్రస్తావించలేదు. నీవు అందుకు చాలా సంతోషిస్తావు కద. అనగా మనము కష్టపడనిదానికి పేరు ప్రతిష్ఠలు ఆశించడం అత్యాశే అవుతుంది. అది మూర్ఖుల లక్షణం.

మనము ప్రకృతిని అనుసరించి ఎన్నో విషయాలలో ఏకాభిప్రాయమును వ్యక్తం చేస్తుంటాము. మాటలలో కాక చేతలలో ఈ అభిప్రాయాలను చేసి చూపించాలి. ఉదాహరణకు, ఒకరి ఇంట్లో అతని బిడ్డో లేక భార్య చనిపోయింది అనుకోండి. చావు ఎవరికైనా రాక మానదు, కాబట్టి బాధపడవద్దని ఆ ఇంట్లో పరామర్శ చేసి వస్తాము. కానీ మన ఇంట్లోని వ్యక్తులే చనిపోతారు. అప్పుడు మన పరిస్థితి ఏమిటి? చాలా చాలా దుఃఖిస్తాము. కాబట్టి పరామర్శ చేసినప్పుడు అవతలి వారి బాధను గ్రహించి, వారి బాధకు ఉపశమనం కలిగించే ప్రయత్నం చెయ్యాలి.

మనలో చాలామంది దేవుని ఆశ్రయిస్తారు. దేవుని ఆశ్రయించిన వీరి పరిస్థితి వీరికి అర్థముకాదు. వీరు అనుభవమున్న ఆధ్యాత్మిక పరులను విచారించి విషయములను అవగాహన చేసుకోవాలి. మనము ఇంతకు ముందే తెలుసుకున్న విషయము, మన అందుబాటులో లేని విషయాల నుండి మంచికానీ చెడు కానీ ఎదురు కావచ్చని చెప్పుకున్నాము. మన స్వాధీనంలో లేని విషయాలపట్ల మనము కోరికలు, ద్వేషాలు పెంచుకోకూడదని కూడా చెప్పుకున్నాము. ఒకవేళ మనలో కోరికలు, ద్వేషాలు పెంచుకుంటే, మనలో భయాలు కూడా పెరుగుతాయి.

నీ అధీనంలో ఉన్న పనులు నీవు అనుకున్నట్లుగా నెరవేరనప్పుడు, నీవు భగవంతుని ఆశ్రయించుట ఉత్తమం. భగవంతునికి నీ పరిస్థితులు విన్నవించుకో. అనగానే స్వంత విషయాలు నీ అధీనంలో ఉన్నవాటిని భగవంతునికి విన్నవించుకో. అంతేకానీ, నీ స్నేహితుడి విషయమో లేక దేశభద్రత గురించో అయితే నీవు దేవునితో విన్నవించుకోవు కద. స్నేహితుడినే సంప్రదిస్తావు. దేశం విషయంలో నలుగురితో పాటు నీవు నడుస్తావు.

ఇచ్ఛాశక్తికి అవసరానికి మధ్యనున్న సంబంధమూ వివాదాస్పద మైనది. అవసరము అనగానే అది మన అధీనంలో లేనటువంటి విషయము. మన ఇచ్ఛాశక్తికి కూడా అంగీకరించిన పరిస్థితి. మనం మన జీవితాన్ని మంచిగా జీవించాలా కూడదా అన్న విషయం కూడా మన అవసరాన్ని బట్టి జరుగుటలేదు. నిజానికి ఈనాడు, మనకు ఇష్టములేని పనులను, వదిలి వేయాలనుకున్న పనులను, ఎన్నిటినో చేయవలసివస్తున్నది. పనులను అయిష్టంగానే చేపడుతున్నాము. మనము ఇష్టపడితే, మన ఇచ్ఛాశక్తి కార్యోన్ముక్తులను చేస్తుంది. మన ఇచ్ఛాశక్తితో కాక, ఎంపికతో కార్యాలను మొదలు పెట్టవలసి వస్తున్నది.

మనము ఇచ్ఛాశక్తి స్వేచ్ఛగా వ్యవహరించాలనుకుంటాము, కానీ మన అవసరాల నిమిత్తం వ్యవహరించడంలో మనకు స్వేచ్ఛ లేకుండా అవుతున్నది. మన అవసరాల విషయంలో, మన ఇచ్ఛాశక్తి పరుల ఇచ్ఛాశక్తికి లోబడి, ఎంతో ఇబ్బందులకు గురి అవుతున్నది. బాధపడే వ్యక్తి, ఇది సహజమే అని, మానవతా దృక్పథంతో బాసిల్లవలెను. అనగా మనలోని ఇచ్ఛాశక్తి మనము నిర్బంధముగా తృణీకరించపనిలేదు.

## 29. లోకాయుతమనే అనుమతం

మానసికంగాను, శారీరకంగానూ ప్రకృతి మానవులందరినీ సమానము గానే పుట్టించెను. ఒక మనిషి సాటిమనిషి కంటే కొంచెం బలంగా ఉండొచ్చు మరియు కొంత అధిక తెలివితేటలతో ఉండవచ్చు. అంతకుమించి ఎట్టి తేడాలు ఉండవు.

బలము విషయానికి వస్తే, ఒక బలమైన వ్యక్తి ఒక బలహీనమైన వ్యక్తిచే తుపాకీతోగానీ లేదా నలుగురి చేత కలసికట్టుగా గానీ చంపబడ వచ్చును. కాబట్టి శారీరక బలమును కాక మానసిక బలమును మనము పోల్చుకొనవలెను. అప్పుడు అందరూ సమాన తెలివితేటలతో ఉన్నట్లు గానే అగుపించును. "వివేకముతో ఆచరణ ఆచరణతో అనుభవం". ఈ సూత్రం అందరికీ వర్తించును.

మానవుని నైజము ప్రకారము, సాటిమనిషి యొక్క తెలివితేటలకు, జ్ఞానమునకు మానవుడు ఆశ్చర్యపోతాడు. కానీ తనలో కూడా అంతటి తెలివి తేటలున్నాయిని గుర్తించలేడు. మరికొందరుంటారు, వారు సాటివారి కంటే తెలివితేటలలో ఎంతో అధికులమనుకుంటారు. ఏది ఏమైనా తెలివితేటలలో మానవులు ఒకరికొకరు తీసిపోరు. సామాన్యంగా సాటిమనిషి తెలివితేటలతో పోల్చుకుంటే పెద్ద తేడాలు వ్యక్తముకావు.

తెలివితేటలతో పోల్చుకుంటే అందరూ లక్ష్యమును చేరడంలో సమానమైన ఆశలు కలిగి ఉంటారు. కాబట్టి ఇద్దరు వ్యక్తులు ఒకే లక్ష్యమును ఆశించినప్పుడు, అది కేవలం ఒక్కరికే దక్కుతుంది కాబట్టి, వారిద్దరూ శత్రువులయిపోతారు. శత్రువులయిన కారణముచే తమ మనుగడ కోసం సాటి శత్రువును అణచివేయడం గానీ నాశనం చేయడం గానీ జరుగుతుంది.

మానవుని నైజమురీత్యా మానవుడు వైరానికి కారణాలు మూడు. అవి పోటీతత్త్వం, నమ్మకములేక మరియు వైభవము. మొదటగా పోటీతత్త్వ మనేది లాభమునాశించి దాడిచేయడం, రెండవది నమ్మకం లేని కారణాన క్షేమము కొరకు దాడిచేయడం, మూడు ఇతరుల వైభవాన్ని చూసి పేరు ప్రఖ్యాతుల కోసం దాడిచేయడం జరుగుతుంది. ఈ వైరంలో కూడా వివిధ రకాలు. కొందరు హింసామార్గాన్ని ఎన్నుకొని సాటిమనిషిని లొంగదీసుకుంటారు. కొందరు ఎంతటి శత్రువునైనా ఎదిరిస్తారు. వారు శత్రువుకు తొందరగా లొంగిపోరు. మూడో రకం ఒకమాటతో, ఒక చిరునవ్వుతో, ఒక ప్రత్యేకమైన అభిప్రాయంతో, మరే ఇతర ప్రజ్ఞవల్ల గానీ వైరిని లొంగదీసుకుంటారు.

సాధారణంగా ఒక చక్రవర్తికి, అతని శక్తికి భక్తితో కూడిన భయంతో ప్రజలు, సామంతరాజులు మనెడివారు. కానీ ఎప్పుడయితే అట్టి నియంత్రించు శక్తిలేదో, ప్రతి ఒక్కరూ ఎవరికి వారే గొప్పగా భావింతురు. యుద్ధాలు మొదలగును. ఈ యుద్ధాల వలన అపార నష్టము జరుగును. వృద్ధి క్షీణించును, సాంప్రదాయాలు నాశనమగును.

ఇటువంటి పరిస్థితులలో ఏదీ న్యాయముగా సాగదు. తప్పొప్పుల నిర్ణయం జరుగదు. న్యాయాన్యాయ నిర్ణయాలు జరగవు. ఎక్కడయితే సరియైన అధికారము లేదో, అక్కడ న్యాయానికి చోటు ఉండదు. ఎక్కడైతే న్యాయముండదో, అక్కడ అన్యాయం ప్రబలును. ఎక్కడైతే ప్రజలకు న్యాయవ్యవస్థ ఉంటుందో, అక్కడ తప్పొప్పుల నిర్ణయం, న్యాయా న్యాయాల తీర్పులు వెలువడును. సంఘంలో వ్యవస్థ సక్రమంగా సాగును.

మానవుడు శాంతిని కోరుకుంటాడు. కారణము, మానవునకు చావంటే భయం. అంతేకాదు సవ్యమైన జీవితానికి కావలసిన కోరికల సాధనలో అతను విశేషంగా కృషి చేయుచున్నాడు. ఈ నేపథ్యములో

మానవుడు శాంతి జీవనానికి శాంతి సూత్రాలను పాటిస్తున్నాడు. ఈ శాంతి సూత్రాలు ప్రకృతిని అనుసరించి తయారు చేసుకున్నవే.

ప్రకృతిసిద్ధంగా ప్రతిమానవునికి స్వేచ్ఛగా, తనకు అనువైన విధముగా, జీవించడానికి హక్కుగలదు. స్వేచ్ఛ అనగా సాటిమనిషి వల్ల ఏ ఆటంకాలు కలుగకుండా, ప్రతిమానవుడు జీవించవచ్చు.

ప్రకృతి నియమావళి ప్రకారం, మరియు తగిన కారణముతో శాసించే దేమనగా, ఏ మానవుడు తన జీవితాన్ని అంతము చేసుకోరాదు. ప్రతి మానవుడు తన జీవితాన్ని కాపాడుకుంటూ జీవించాలి.

పైన ఉదహరించిన నియమానుసారము ప్రతిమనిషి శాంతిని కోరును. శాంతిని అనుసరించును. ఒకవేళ అతనికి శాంతి చిక్కనప్పుడు, ప్రకృతి నియమానుసారం శాంతికోసం అతను ప్రతిఘటించవచ్చు. రెండవ సూత్రము ననుసరించి, ప్రతిమనిషి స్వేచ్ఛగా జీవించాలని, ఇతరులవల్ల ఏ విధమైన ఆటంకాలు కలుగ కూడదని భావిస్తాడో, అదే విధంగా తనుకూడా ఇతరుల స్వేచ్ఛ విషయాల్లో అంతరాయాలు కలిగించ కూడదు. సాటిమనిషి శాంతి కోసం, క్షేమం కోసం, సహజీవనం కోసం తన స్వేచ్ఛను నియంత్రించి నలుగురితోసాగాలి.

ప్రకృతి నియమానుసారము, ఒకరికొకరు తమ తమ హక్కులను పంచుకోవాలి. ఈ హక్కుల పంపకము ఒప్పందం ప్రకారము. ఇద్దరూ తమ హక్కులను ఒకరినొకరు మార్చుకొనుటలో తేడాలు వ్యక్తమైనప్పుడు, స్నేహంతోగానీ, ప్రతిఫలంతో గానీ, బహుమానంగా గానీ, అనుగ్రహంగా గానీ మార్పుచేసుకొన వచ్చును. అంగీకారం కుదిరిన్పటికీ, అనుమానంతో ఆచరణలో లేనప్పుడు, ఈ ఒప్పందం పనికి రాకుండా పోవును. రెండు వర్గాల మధ్య బలవంతముగా ఈ ఒప్పందాన్ని ఆచరణలో పెట్టవలెనని నిర్ణయించినపుడు ఈ ఒప్పందం నిర్వీర్యముకాదు.

మూడవ సూత్రం ప్రకారం ఒప్పందములేని నోటిమాటలకు పరిమితము కాక, ఆచరణలో ఉండవలెను. ఒకసారి ఒక ఒప్పందాన్ని కుదుర్చుకున్నాక, దానికి కట్టుబడి ఉండాలి. ఆ ఒప్పందాన్ని అనుసరించక పోవడం అన్యాయమే అవుతుంది. ఒప్పందంలో అన్యాయాలకు దారితీసిన ఆ ఒప్పందం సమర్థవంతముగా లేదని భావము.

ఏ విధముగానైతే న్యాయము ముందు కుదుర్చుకున్న ఒప్పందాన్ని అనుసరించి ఉండునో, అదే విధముగా కృతజ్ఞత ముందు కుదుర్చుకున్న అనుగ్రహం లేదా బహుమానమును బట్టి ఉండును. ఈ నేపథ్యములో ప్రకృతి ననుసరించి మరియొక సిద్ధాంతము ప్రకారము, ఒక మనిషి మరోవ్యక్తికి అనుగ్రహ భావముతో ఏదేని బహుమతి ఇచ్చిన, ఏ కారణము చేతను బాధపడకూడదు. అయితే ఆ బహుమతి గ్రహీతకు ఇష్టము లేని పక్షంలో దానిని అతను స్వీకరించక తిరస్కరించును. ఈ తిరస్కారమును కృతఘ్నత అంటారు.

ప్రకృతి యొక్క ఐదవ సూత్రము మర్యాద సూత్రం. ఈ సూత్రాన్ని అనుసరించి ప్రతి ఒక్కరు సామూహిక జీవన స్రవంతిలో భాగమైపోవాలి. ఆరవ సూత్రాన్ననుసరించి, గతములో జరిగిన పొరపాట్లను సరిదిద్దు కొనుటకు అవకాశమును కోరుట. చేసిన తప్పులను క్షమించుట వలన శాంతి ఏర్పడును. అయితే కొంతమంది ఉద్రేకంగానే వ్యవహరింతురు. వీరి ఉద్దేశ్యంలో అట్టి శాంతి వల్ల వీరికి భయాలు ఏర్పడును. ఇట్టి సందర్భాలలో క్షమించుట జరుగదు. శాంతి కొరకు ఆరవ నియమము ప్రకారము ప్రయత్నము చేసినప్పటికీ, శాంతికి వ్యతిరేకముగా జరిగవచ్చును.

ఏడవ ప్రకృతి సూత్రముననుసరించి మానవుడు సామాన్యముగా చెడుకు బదులుగా చెడుతో సమాధానం చెబుతాడు. కానీ ఇక్కడ మానవులు, జరిగిన చెడుకు బదులుగా మంచితో సమాధానం చెప్పాలి

అని భావించుట ఎంతో ఉత్తమం. ఇక్కడ అన్యాయం చేసినవారిని శిక్షించ కుండా, శిక్షణ ఇవ్వడం జరుగుతుంది. ఆరవ సూత్రంలోను, ఏడవ సూత్రంలోనూ, భవిషత్తును దృష్టిలో ఉంచుకుని అన్యాయం చేసినవారిని క్షమించుట గురించి తెలియజేయ బడినది.

ప్రకృతి యొక్క ఎనిమిదవ సూత్రాన్ననుసరించి ఏ వ్యక్తి తన మాటవల్ల కానీ, చేతలవల్ల కానీ, అనుగ్రహము వల్లకానీ, సంజ్ఞల వల్లకానీ సాటి మనిషిపై ద్వేషము కానీ అలక్ష్యము చేయుట కానీ చేయకూడదు. ఈ సూత్రం ప్రకారము సాటిమనిషిని ప్రతీకారభావంతో చూడరాదని వ్యక్తమగుచున్నది.

తొమ్మిదవ ప్రకృతి సూత్రాన్ననుసరించి మానవులంతా సమానమే అని గ్రహించుచున్నారు. భగవంతుని సృష్టిలో మానవులంతా సమానమే అని భావము. ప్రకృతి యొక్క పదవ సూత్రాన్ననుసరించి, శాంతి ఒప్పందములో, ఒక వ్యక్తికి ప్రత్యేకమైన హక్కులను ఏర్పాటు చేసిన యెడల అదే హక్కులు అందరికీ కల్పించవలెను. ఈ శాసనాన్ని ఆచరించువారు సౌమ్యులు, ఉల్లంఘించేవారు మొండివారు. ఒక వ్యక్తి మిగిలిన వ్యక్తులతో వ్యవహారం జరిపేటపుడు, అతను అందరినీ సమానముగా భావిస్తాడు.

11వ సూత్రమునననుసరించి, ఒక్కొక్కసారి ఆస్తిని పంచడం సాధ్యపడనప్పుడు అందరూ సమిష్టిగా అనుభవించడం జరుగుతుంది. హద్దులు వీలుకాని ఇట్టి ఆస్తులను హక్కుదారులు ఎంతమంది ఉంటే అంతమందికి సమానహక్కు కల్పించడమవుతుంది. అట్లుకాని యెడల, ఆ ఆస్తి పంపకము సరిగా జరగలేదని చెప్పవచ్చు. హక్కు గలవారందరికీ సమానంగా పంపకం జరిగినపుడే అందరి ఆమోదము లభిస్తుంది, అందుకు విరుద్ధముగా ఊహించలేము.

ఆస్తి సమానంగా పంచనప్పుడు, లేదా సమిష్టిగా పంపకం జరగనపుడు, అట్టి ఆస్థిని మొట్టమొదట వచ్చిన హక్కుదారునికి గానీ, లేదా మరియొక విధంగా గానీ ఉపయోగపడేటట్లు తీర్పుచెప్పడం జరుగుతుంది.

చీట్లు రెండు రకాలు. ఒకటి స్వచ్ఛందముగా, రెండు సహజంగా. మొదటిది, పోటీదారులంతా స్వచ్ఛందముగా ఏర్పాటుచేసుకున్నది. రెండు, మొదటవచ్చిన వారికి ముందుగా అన్న నిర్ణయము, లేదా జన్మలో జ్యేష్టునికి ముందుగా పరిశీలించు పద్ధతి.

ప్రకృతి సిద్ధాంతాన్ననుసరించి శాంతికోసం ప్రయత్నించే వారంతా క్షేమకరమైన పద్ధతులననుసరించవలెను. శాంతికోసం జరిగే ప్రయత్నాలలో మధ్యవర్తిత్వం తప్పనిసరి. మధ్యవర్తిత్వము క్షేమ దాయకంగా ఉండాలి. రెండు జట్లమధ్య విభేదాలు తలెత్తినప్పుడు, ఇరుజట్లు తమతమ హక్కులకోసం పోరాటము చేస్తారు. ఈ ప్రయత్నంలో ఇరుజట్లు, ఎవరికివారు లబ్ధిపొందాలని ప్రయత్నిస్తారు. ఈ కారణం చేతనే మధ్యవర్తికి ఆశచూపించి, కేసు గెలవడానికి ప్రయత్నాలు కూడా జరుగుతుంటవి. వ్రాతపూర్వకముగా ఇరుజట్లు తమ తరపున ఉన్న హక్కులను న్యాయస్థానానికి తెలియజేస్తారు, మధ్యవర్తిత్వము కోసం.

ఇంతవరకు ప్రస్తావించిన న్యాయసూత్రాలన్నీ, ప్రకృతి శాసనాలుగా, సంఘం క్షేమం కొరకు, సంఘం మనుగడను దృష్టిలో పెట్టుకుని శాంతి స్థాపనకు చేసిన ప్రయత్నాలు. ఈ సూత్రాలన్నీ నైతికత ఆధారముననే ఏర్పడినవి, మంచిచెడుల వివేక విచక్షణలతో కూడియున్నవి.

మంచిచెడులనేవి మన ఇష్టాయిష్టాలుగా చెలామణి అవుతున్నవి. ఒక సంఘానికి మరియొక సంఘానికి మధ్య సాంప్రదాయ బద్ధము

గానూ, సిద్ధాంతాల పరంగానూ ఎన్నో వ్యత్యాసాలు ఉంటున్నవి. మనిషికి మనిషికి ఎన్నో వ్యత్యాసాలు ఉంటున్నవి. అవి రుచిలో, వాసనలో, వినికిడిలో, స్పర్శలో మరియు చూపులో, కారణమునకు కూడా మానవులు భిన్నముగా స్పందించుచున్నారు. అంతేకాదు, ఒకమనిషి వివిధ సందర్భాలలోనూ, అనేక సమయాల్లోనూ విభిన్నంగా ప్రవర్తించు చున్నాడు. ఈనాడు మంచి అన్న వస్తువును కొంతకాలము తరువాత దానిని చెడుగా వర్ణిస్తున్నాడు. ప్రకృతిలో మనినంతవరకు, మానవుడు ఈ మంచిచెడులను తన సొంత వ్యవహారమువలె మార్చుకున్నాడు. ఈ కారణముచే అందరూ ఏకాభిప్రాయంతో శాంతి కోసం చేసే ప్రయత్నాలను మంచిగా నిర్ణయించారు. ఈ నేపథ్యములో న్యాయము, కృతజ్ఞత, సమత్వము, దయ, జాలి, కరుణ, సామాన్య జీవనం మొదలైన అంశాలన్నిటిని సహజంగా మంచి అని నిర్ణయించడమైనది. ఈ లక్షణాలన్నీ సద్గుణాలే. ఇందుకు భిన్నమయినవన్నీ దుర్గుణాలే. ఈ విధముగా మంచి చెడుల శాస్త్రమే నైతికత.

# 30. ఉపయోగితావాదము

ప్రతిమానవుడు కాలముతో బాటు వృద్ధి సాధించాలనుకుంటాడు. ఈ వృద్ధి అనేది అంతరాయం లేకుండా నిరంతరం సాగాలని అందరూ కోరుకుంటారు. ఈ అభివృద్ధినే సంతోషంగా కొందరు తత్వవేత్తలు అభివర్ణించుచున్నారు. ఇదే జీవితమునకు, సంతోషమంటారు. వీరి ఉద్దేశ్యంలో శాశ్వతమైన ప్రశాంతత జీవితంలో మన మనస్సుకు ఎప్పుడూ సాధ్యపడదు అని భావిస్తారు. అందుకే జీవితం ఒక అంతులేని ప్రయాణమని, ఆ ప్రయాణం కోరికలతో నిరంతరం సాగుతూనే ఉంటుందని, భయాలతో నిండి ఉంటుందని, ఇది ఒక అర్థం పర్థం లేని ప్రయాణమని తెలియజేస్తున్నారు. వీరు ప్రతిపాదించిన సూత్రాలనే 'ఉపయోగిత వాదము' అంటారు.

ఉపయోగితావాద సిద్ధాంతము ననుసరించి ప్రకృతి మానవాళికి ఇద్దరు చక్రవర్తులను, శాసనకారులను అందించింది. వారే ఒకరు సుఖం, రెండు దుఃఖం. ఒకవైపు నైతికతను అనుసరించి తప్పొప్పుల నిర్ణయం, మరియు కర్మ సిద్ధాంతాన్న నుసరించి సంభవించే ఈ కష్టసుఖాలు. ఈ సిద్ధాంతాలు మన త్రికరణముల సాక్షిగా మనల్ని శాసిస్తున్నవి. మానవుడు ఈ సిద్ధాంతాలకు బద్ధుడవుతున్నాడు. మానవుడు ఈ సిద్ధాంతాల నుండి పారిపోవాలని ఎంతగట్టిగా ప్రయత్నము చేస్తే, అంత లోతుగా వీటిల్లో కూరుకుపోతున్నాడు. ఈ నేపథ్యములో మానవుడి సుఖశాంతులకు ఈ ఉపయోగితావాదము ఒక పునాదిని ఏర్పాటు చేస్తున్నది.

ఈ విశ్లేషణలో ప్రతికర్మను చేర్చడం జరుగుతుంది. ఏ కర్మమంచిది, ఏ కర్మచెడ్డది? ఏ కర్మవల్ల మానవునకు సంతోషం లభిస్తున్నది? ఏ కర్మవల్ల మానవుడు సంతోషానికి దూరమగుచున్నాడు. సుఖంవల్ల

మానవుడు సంతోషాన్ని అందు కుంటున్నాడా? లేక దుఃఖాన్ని పొందు తున్నాడా? వ్యక్తిగతమైన నిర్ణయాలకు పరిమితము గాక సమిష్టిగా ఈ విశ్లేషణ జరుగుతున్నది.

ప్రతి వస్తువునకు కొన్ని ధర్మాలు ఉంటాయి. ఆ వస్తువుల ధర్మాల ననుసరించి మానవుడు ఆ వస్తువులనుండి ఏమి పొందుతున్నాడు? మంచినా, సుఖమునా, లబ్ధినా, సంతోషమునా? లేక ఆ వస్తువువల్ల మానవుడు తన కష్టమును, బాధను, చెడును, కపటత్వమును నిరోధించ గలుగుతున్నాడా? ఈ ఆలోచనలు కేవలం ఒక వ్యక్తిని దృష్టిలో పెట్టుకుని కాక సామూహికంగా సంఘప్రజలను దృష్టిలో పెట్టుకుని విశ్లేషించిన విషయాలు సంఘం ప్రజలతో కూడిఉంటుంది. అనగా సంఘక్షేమమే ధ్యేయముగా ఈ సిద్ధాంతాలను రూపొందించడమైనది. సంఘ శ్రేయస్సు నందే మానవుల యొక్క సమిష్టి కోరికలు ఇమిడి ఉంటున్నవి.

ఒక వ్యక్తికి ఒక వస్తువుపై మక్కువ ఎప్పుడు కలుగుతుంది? ఆ వస్తువు వల్ల అతని సంతోషము పెరిగినపుడు లేదా అతని దుఃఖము తరిగినపుడు. ఏ కర్మలు ప్రధానమైనవి? సంఘశ్రేయస్సును దృష్టిలో పెట్టుకుని, సంఘానికి మేలును చేసి సంతోషాన్ని అందించు కర్మలు శ్రేష్టమైన కర్మలు. ఈ నేపథ్యములోనే, సంఘానికి మేలుకు బదులు హాని చేయుకర్మలను తగ్గించుకోవాలి.

ఈ సిద్ధాంతాల పట్ల మొగ్గుచూపిన వ్యక్తి, ఈ సిద్ధాంతాన్ననుసరించి కర్మలయొక్క మంచిచెడులు యోగ్యతాయోగ్యముల దృష్ట్యా సమర్థించును. సంతోషమునకై ఆచరించు కర్మలు ఏమి అవునో, ఏమి కావో, ఏకర్మ తప్పో, ఏకర్మ ఒప్పో, సందర్భోచితంగా నిర్ణయించును. ఇక్కడ సందర్భోచితంగానే తప్పొప్పుల నిర్ణయము జరుగును, లేకున్న ఆ పదాలకు అర్థము ఉండదు.

సంతోషమునకు విరోధమైన పదములు విరోధము, పగ, సానుభూతి మొదలైనవి. సానుభూతి సిద్ధాంతం ప్రకారం సహకారం, విరోధ సిద్ధాంతము ప్రకారము పగ, ద్వేషము ప్రకటించుట జరుగుచున్నది. అనగా ఒప్పుకోవడం, ఒప్పుకోక పోవడాలు జరుగుచున్నవి. ఈ సంఘటనలు వ్యక్తిగత మైనపుడు పగ ద్వేషాలు ప్రకటితమవుతున్నవి. తనకు ఇష్టములేని వ్యక్తి, సిద్ధాంతాల ననుసరించుచున్నప్పటికి, ఆ సిద్ధాంత ఆచరణలో లోపాలు తీసుకుని ఆ సిద్ధాంతాలకే దూరమగునట్లు తమ ద్వేషమును ప్రకటించుట జరుగుచున్నది. ఇది వాస్తవమునకు దూరము. వ్యక్తిగతమైన దూషణాతిరస్కారాలతో సిద్ధాంతాలకు దూరమగుట సరియైన పద్ధతి కాదు.

ఎట్టి కర్మలు ఆమోదయోగ్యమో, ఎట్టి కర్మలు యోగ్యము కావో ఆచరించే ప్రతివ్యక్తికి తన భావాలలో తెలుస్తుంది. మనఃపూర్తిగా ఆమోదమును తెలియ జేయడమనేది సరియైన పద్ధతి. కొందరు తమ ఇష్టానుసారము కర్మలపై ఆమోదమును తెలుపజాలరు. అప్పుడు అవి చెడుకర్మలుగా వారికి లెక్క. అంగీకారం, ఆమోదం, అనంగీకారం, ఆమోదం లభించకపోవడం వలన సిద్ధాంతాల తప్పొప్పుల నిర్ణయాలు వ్యక్తమగుచున్నవి. ఈ సిద్ధాంతాలన్నీ కడకు మన సంతోషమునకు దారి తీసేవే అయి ఉంటున్నవి.

సానుభూతి, వ్యతిరేక సిద్ధాంతాలననుసరించి తీసుకున్న నిర్ణయాల వల్ల సాధారణంగా అనేక తప్పులు జరిగిపోవును. ఈ నేపథ్యములో అమాయకులు శిక్షకు గురి అగుదురు. కొన్ని సందర్భాలలో కొంత ప్రతిఫలమునకు బదులు భారీగా ప్రతిఫలము ముట్టజెప్పుట జరుగును. ఇదే రీతిలో దయా, కరుణల విషయంలో కూడా జరుగును.

పదేపదే మనము జ్ఞప్తికి తెచ్చుకునే సిద్ధాంతము ఒకటి ఉన్నది. అదే దైవనిర్ణయము. మానవనైజము ప్రకారము సత్కర్మలు దైవమునకు

ప్రీతిపాత్రములని అర్థమవుతున్నది. అయితే ఇది కూడా సరియైన సిద్ధాంతముగా తోచుటలేదు. దానికి కారణము, అసలు మంచి కార్యము అనుదానికి సరియైన నిర్వచనము మనవద్దలేదు. ఈ నేపథ్యములో భగవంతునికి నచ్చిన మంచి కార్యమేదో మానవునకు అవగాహన లేదు.

ఒక కార్యంలో రెండు విషయాలు ఇమిడి ఉంటున్నవి. మొదట కర్త మదిలో కర్మకు సంబంధించిన ఆలోచనలు. రెండు ఆ కర్మను ప్రోత్సహించి బలపరచు ఆమోదమైన కారణాలు. ఏ కార్యము చేపట్టినా అది మానవుని సంతోషానికి దారితీయుననుట సహజము. ఒక కర్మ విషయములోనే కాదు, చేపట్టే ప్రతికర్మ విషయంలోనూ ఇదే పద్ధతి అనుసరించుట జరుగుచున్నది. కార్యమును చేపట్టినవారికి, ఆ కార్యమును బలపరచే కారణాలు ఎరుకలోనే ఉండును. అయితే సంతోషమును దృష్టిలో పెట్టుకునే కార్యాలు చేపట్టుట జరుగుచున్నది. ఈ సంతోషమును అందించే కర్మలకు ఆచరణలో బయటినుండి ఉత్సాహ, ప్రోత్సాహాలు నిరంతరాయంగా అందుచుండును.

చట్టరీత్యా సంతోషమనునది సంఘంలోని ప్రజలకు సౌఖ్యమును, క్షేమమును చేకూర్చునదిగా భావించడ మవుచున్నది. ఈ నేపథ్యములోనే మానవులు కూడా క్షేమమును, సౌఖ్యాలను దృష్టిలో పెట్టుకుని చట్టరీత్యా మెలుగుచున్నారు. ఈ నేపథ్యములో మానవుని సుఖాలకు, దుఃఖాలకు కారణాలను కనుగొనవలసి యుంటున్నది.

సుఖానికి, దుఃఖానికి నాలుగు వనరులు వ్యక్తమగుచున్నవి. అవి భౌతికము, రాజనీతి, ప్రచారములోనివి మరియు మతపరమైనవి. ఈ సుఖదుఃఖాలకు సంబంధించిన వనరులు చట్టమునకు అనుబంధమై ఉంటున్నవి. ఈ కారణముచే ఈ వ్యవహారాలలో అనుమతులను పొందవలసి ఉంటున్నది.

ప్రస్తుత సామాన్య పరిస్థితులలో మన సుఖదుఃఖాలకు కారణము మన సంఘంలోని కొందరి అధికారులు న్యాయవ్యవస్థపైన ఆధార పడినపుడు అది రాజనీతికి సంబంధించిన కారణమై ఉంటున్నది. మూడు, నియమ నియంత్రణలకు అతీతంగా తనచుట్టూ చేరి ఉన్న మనుష్యుల అనుమతిపై ఆధారపడియున్న అది ప్రచారంలో ఉన్న పద్ధతిగా తెలుస్తున్నది. నాలుగు, గోచరముకాని అనగా అగోచరమైన వ్యవస్థతో కూడిన, అనగా మతపరమైన నియమావళికి అనుబంధమై యుంటున్నది.

భౌతిక, రాజనీతి మరియు ప్రచారంలో ఉన్న నియమాల ననుసరించి సుఖదుఃఖాలు ప్రస్తుత జన్మలోనే సంక్రమించును. మత పరముగా దక్కు సుఖదుఃఖాలు ప్రస్తుత జన్మలోకానీ లేదా మరుజన్మలో కానీ సంక్రమించును.

సౌఖ్యమును అందించుట, కష్టములను పారద్రోలుట అను రెండు అంశాలు చట్టము పరిశీలనలో ఎప్పుడూ ఉండును. ఈ రెండింటి విలువ మానవునికి అవగాహనలోనే ఉండును. మానవుడు నిత్యము ఈ రెండిటికోసమే శ్రమిస్తూ ఉంటాడు. వీటియొక్క శక్తిని కూడా మానవుడు గ్రహించే వర్తిస్తాడు. వీటి విలువను సహితం మానవుడు పరిగణలోకి తీసుకుంటాడు.

మానవులు అనుభవించు సుఖదుఃఖాల యొక్క పరిణామము లేదా తీవ్రతలను తెలుసుకోవడానికి ఈ విషయాలు మనకు సహకరించును. అవి తీవ్రత, సమయము, స్పష్టము, అస్పష్టము, రక్త సంబంధము మరియు కనుపించక వ్యవహరించుట అనునవి.

మనము ఒక కష్టానికి కానీ సుఖానికి కానీ కారణమైన అంశాల యొక్క విలువలను విశ్లేషించే సమయంలో పరిశీలంచవలసిన ఇతర

పరిస్థితులు కొన్ని ఉంటాయి. అవి మొదట, బహు సంతానము కలిగి ఉండుట. ఇందు ఉండు కష్ట సుఖాలు మనకు అవగతమే. దారిద్ర్యముతో ఉన్నవారికి బాధలు, అనుకూల పరిస్థితులలో సౌఖ్యాలు అనుభవించును. రెండవ అంశము పవిత్రతతో కూడినది. కష్టమునో, సుఖమునో దృష్టిలో పెట్టుకుని అందుకు విరుద్ధముగా పనులు చేపట్టుట. కష్టమును దృష్టిలో పెట్టుకుని సుఖపడుట. సుఖములను దృష్టిలో పెట్టుకుని కష్టపడుట. మూడవది పరిణామం అనగా ఎంత అధిక సంఖ్యలో ఈ పరిస్థితికి లోనవుతారు అని తెలుసుకోవడం.

కష్టసుఖాల గురించి తెలుసుకోవడమనేది ముచ్చటైన జ్ఞానం. ఈ కష్ట సుఖాలు సరళముగా గానీ, సంక్లిష్టముగాగానీ ఉండును. సరళమైనవి, మరింత సరళముగా విభజింపబడవు. సంక్లిష్టమైనవి సరళముగా విభజింపబడి పరిష్కృతమగును.

సుఖాలు– సుఖము, కష్టము–కష్టాల గురించి సేకరించే వివరములు సంక్లిష్టముగానూ ముచ్చటగానూ గోచరమగును. వీటిని ప్రేరేపించే కారణాలే మనలో ఉత్సాహాన్ని రేకెత్తించును. ఏ ఒక్క కారణము చేత సుఖాలన్నీ రేకెత్తించబడునో తెలుసుకోవడం, అనగా ఏ కారణముచే సుఖాలన్నీ సమిష్టిగా అందుబాటులో ఉండునో తెలుసుకోవడం.

సరళమైన సుఖాల కొరకు పరుగులు తీయుట మానవనైజము. ప్రతి ఇంద్రియము వలన మానవుడు సౌఖ్యమును అనుభవించుచున్నాడు. అందమైన రంగులు, బొమ్మలు, పచ్చదనము, కొండలు, ప్రకృతి అందాలు మొదలయినవి మన చూపునకు ఆనందమును చేకూర్చును. పక్షుల కిలకిలా రావములు, సెలయేర్ల గలగలలు, మొదలయినవి మన చెవులకు ఇంపుగా ఉండును. పుష్పాల పరిమళాలు, స్వచ్ఛమైన గాలిని పీల్చినప్పుడు మన శరీరములో కలిగిన మరుగైన రక్తస్రావము మొదలైనవి మన నాసికా రంధ్రాలకు హాయిని కలిగించును.

సుఖమును అందించు ఇతర సాధనాలు, సంపదలు, నైపుణ్యము, గౌరవము, అధికారము, స్నేహము, పవిత్రత, ఇతరులకు సాయపడుట, జ్ఞాపకశక్తి, ఊహలలో విహరించడం, నలుగురితో కలసి గడపటం, అదే విధంగా సరళమైన కష్టాలు మన ఇంద్రియాలవల్ల స్వేచ్ఛ వల్ల, శత్రుత్వం వల్ల, విపరీత ధోరణుల వల్ల, అగౌరవముల వల్ల కలుగుచున్నవి.

మానవ స్వభావానికి బాగా హత్తుకొనునవి సౌఖ్యము. మన సద్గుణాల ననుసరించి మనము కొన్ని వస్తువుల పట్ల బాగా ఇష్టపడతాము, మరికొన్ని విషయాలను ద్వేషిస్తాము. జీవితాంతము ఈ బంధము కొనసాగును. మన సంతోషమునకు, మన మంచితనంపై ఈ సౌఖ్యముల ప్రభావము మనపై తప్పక ఉంటుంది. దీనికి కారణము మానవుడు సుఖమును ఆశించడం, కష్టములకు దూరముగా జరగడం.

ప్రతి ఇంద్రియము కొన్ని వస్తువుల పట్ల చాలా ఉత్సాహమును కనపరచును ప్రతి ఇంద్రియము తన చక్కని పనితీరుతో తనకు బాగా ఆకర్షితమైన వస్తువులపట్ల అనుబంధము కలిగి ఉండును. ఇంద్రియాలు ఈ విధముగా స్పందించడము ఆహ్వానించదగినది. ఈ విధమైన అనుబంధము వలన ఉన్నతమైన వస్తువులతో బంధము ఏర్పడుతుంది. ఇట్టి బంధము సంపూర్ణమైనది మరియు ఆనందకరమైనది.

ఇంద్రియ సౌఖ్యము మానసికమైనది. సంపూర్ణమైన సౌఖ్యమే అన్నిటికంటె ఉత్తమమైన సుఖము. ఒక ఇంద్రియము చక్కగా పనిచేస్తున్నది అన్నదానికి నిదర్శనము ఏమిటంటే, ఈ ఇంద్రియము వలన అనేకమైన ఉత్తమ వస్తువులను గ్రహించడమవుతుంది. ఇక్కడ సౌఖ్యముతో కార్యము సంపూర్ణమగును.

ఇక్కడ ఒక విషయము గమనించాలి. ఒక ఇంద్రియము ఒక వస్తువుతో అనుబంధము ఏర్పడగానే సౌఖ్యము అనుభవములోకిరాదు. ఉదాహరణకు, ఒకరోగి వైద్యుడిని కలిసినంతలోనే అతని ఆరోగ్యము చక్కబడదు కదా. మందులు వాడాలి, పథ్యము చేయాలి. అప్పుడే ఆరోగ్యము చేకూరును. ఒక్క మొగ్గ పుష్పముగా వికసించడానికి సమయము పడుతుంది. ఇంద్రియ సుఖము మానసికమైనది ఇంతకు ముందే గుర్తుచేసుకున్నాము. ఈ నేపథ్యములో మన వివేక విచక్షణాలు, అంతర్ముఖంగా ఇంద్రియము, వస్తు సంపర్కవిషయంలో పనిచేయును. ఈ మానవస్థితినందే సౌఖ్యము అనుభవానికి వచ్చును.

మానవుడు సౌఖ్యమును నిరాటంకముగా ఎందుకు అనుభవించలేక పోతున్నాడు? నిజానికి మానవులు అవిశ్రాంతముగా ఏపని చేయజాలరు. సౌఖ్యము అనునది ఆచరణ సమయంలో అందేది కాబట్టి, మానవుడు సౌఖ్యమును ఆ సమయంలోనే అనుభవించును. చూడండి, కొన్ని వస్తువులు కొత్తలో మనల్ని బాగా ఆకర్షించును. కానీ కాలముతో ఈఆకర్షణ తగ్గును. మొదట్లో, ఉదాహరణకు: మనము ఒక వస్తువును మొదటిసారి చూసినపుడు ఎక్కువగా ఆకర్షితమవుతాము. క్రమేపీ ఈ ఆకర్షణతగ్గుతుంది. ఇదే కారణముచే ఆ సుఖముపట్లకూడా ఉత్సాహము నశిస్తుంది.

మానవులంతా సుఖమునే ఎందుకు కోరుకుంటారు? సుఖాలను అనుభవించ డానికే ఈ జీవితము అన్న భావనతో మానవులు సుఖాలు కోరుకుంటారు. జీవితమనేది ఒక దీర్ఘకాలిక ప్రణాళిక. ఈ జీవితమును మానవుడు తన అధీనంలో ఉన్న వనరులలో తన కిష్టమైన కోరికలను సాధించుటకు వినియోగిస్తాడు. ఉదా హరణకు: ఒక సంగీత కళాకారుడు ఉన్నాడంటే, తన కిష్టమైన సంగీతాన్ని వినుటతోపాటు ఆ సంగీతములోని

మెళుకువలను నేర్చుకుంటాడు. తమతమ పనులద్వారా జనులు సుఖసౌఖ్యాలను అనుభవిస్తూనే ఉంటున్నారు. జీవితము ఉన్నంతలో కోరికలను తీర్చుకోవాలని మానవుడు భావిస్తాడు. ఈ నేపథ్యములోనే జీవితము నుండి సుఖాలను వేరుచేయుట సాధ్యము కాదని చెప్పవచ్చును. కర్త లేకుండా కర్మ చేయ వీలుగాదు. కర్మను ఆచరించుసమయములోనే సుఖము అనుభవమునకు వచ్చును.

సుఖాలు అనేవి ఒక రకముగా ఉండవు, అనగా వివిధ స్వభావాలతో ఉండును. వివిధ స్వభావాలతో ఉన్న వస్తువులు విభిన్నరీతులలో లభ్యమగును, పనులు పూర్తిచేయును. ఇంద్రియాలతో కూడిన పనులు మరియు ఆలోచనలు విభిన్నముగా ఉంటున్నవి. ఈ నేపథ్యములో సౌఖ్యాలు కూడా విభిన్నముగానే ఉండును.

స్వభావ రీత్యా సౌఖ్యము అనుభవమునకు వచ్చును. ఈ అనుభవము రీత్యా ఆ సౌఖ్యము మరింతవృద్ధికి దారితీయును. ఉదాహరణకు, సంగీతమంటే ఇష్టపడేవారు ఉంటారు. ఈ సంగీతముపై ఇష్టము పెరుగుతూనే ఉంటుంది. అది తరిగేది కాదు. స్వభావరీత్యా వివిధ అనుభవాలను పొందుతూ, పొందిన అనుభవము ద్వారా మిక్కిలి అభిరుచి పెంచుకుని మనము అభివృద్ధి సాధిస్తాము.

మనము ప్రయత్నముతో కొన్ని కార్యాలను కుదించి, వాటినుండి సౌఖ్యమును అనుభవించుటకు అలవాటుపడుతున్నాము. ఒక సౌఖ్యమును అనుభవించే సమయంలో అనుకోకుండా బయటినుండి మరో సౌఖ్యంతో అంతరాయం కలగడంతో మొదటి సౌఖ్యము నెరవేరుట లేదు. అనగా ఆశించని బయటి సౌఖ్యముల వలన సౌఖ్యముకంటె బాధే కలుగుతున్నది. అట్టి అంతరాయాల వల్ల స్వభావరీత్యా, కార్యాలు దెబ్బతినుచున్నవి.

మనము ఆచరించే కర్మలు మంచిగానూ, చెడుగానూ ఉంటున్నాయి. ఈ కార్యాలు కొన్ని చేపట్టేవిగా ఉంటున్నాయి. మరికొన్ని వదిలిపెట్టేవిగా ఉంటు న్నాయి. మరికొన్ని కార్యాలు మనలను సందిగ్ధంలో ఉంచు తున్నవి. ఇదేరీతి సుఖాల పట్ల కూడా వ్యక్తమగుచున్నది. కొన్ని సుఖాలు మంచివిగాను, మరికొన్ని సుఖాలు నిషిద్ధములుగా ఉంటున్నవి. ఆదర్శవంతమైన జీవితమును ఆశించువారు ఉన్నతమైన వాటిని కోరుకుంటున్నారు, సామాన్యమైన జీవితాన్ని కోరువారు కోరరాని కోరికలను అనుభవిస్తూ అపరాధభావము కలిగి ఉంటున్నారు.

కోరికకన్నా అనుభవములో ఉన్న సుఖమే ముఖ్యమైనది. దానికి కారణము, కోరిక స్వభావము కాలముతో ముడిపెట్టి వేరుచేయడమైనది, కానీ సుఖము అనునది కార్యములో ఇమిడి ఉంటున్నది. కోరిక, సుఖముల మధ్యనున్న తేడాను సామాన్య మానవుడు అంత తేలికగా తెలుసుకోలేకపోతున్నాడు. కార్యాలు వేరైనప్పుడు సుఖాలుకూడా అందుకు తగినట్టుగాను ఉంటున్నాయి. సుఖాలలో కొన్ని సుఖాలు ఉన్నతమైనవి.

ఒక్కొక్క జంతువు తన ధర్మాలననుసరించి, కొన్ని కార్యకలాపాలపై ఎక్కువ మక్కువ చూపును. కుక్క, గుఱ్ఱం, మనిషి ఈ మూడింటినీ పరిశీలించినపుడు మనకు ఈ విషయం బోధపడుతుంది. మళ్ళీ ఒకరకం జంతువులు ఆ సుఖమును వివిధ స్థాయిలలో కోరుకుంటాయి.

మనుష్యులలో ఈ తేడా చాలా ఎక్కువగా ఉంటుంది. చూడండి, ఒక సుఖానికి కొందరు మక్కువ చూపితే, మరికొందరు అదే సుఖము పట్ల విముఖత చూపుతారు. మనము ఈ విశ్లేషణలను మంచివారి దృష్టితో పరికించాలి. అనగా నైతికతతో ఈ సుఖమును విశ్లేషించాలి. నైతికముగా

ఉత్తముడైన వ్యక్తి, తననొక సుఖము హాయిని కలుగచేసినదని తెలిసిన వాడు, ఆ సుఖమును అందరూ ఆమోదించవచ్చు. అలాగాక, చాలా అసౌకర్యమునకు గురిచేసే సౌఖ్యాలు అసలు సుఖాలుగా భావించరాదు.

మనము ఎన్నో కర్మలను ప్రతిరోజూ ఆచరిస్తూ ఉంటాము. ఈ కార్యముల యొక్క అంతిమ పరిణామము మంచిగానీ చెడుగానీ కావచ్చు. కొన్ని కార్యముల వల్ల మనకు హాని కలుగును. అయినప్పటికీ వాటిని ఎందుకు చేపట్టాలి? ఈ ప్రశ్నలో మూడు విషయములు ఇమిడి ఉన్నవి. అవి ఉద్దేశ్యములు, పర్యవసానములు మరియు వీటిమధ్యన గల సంబంధములు. ఈ సంబంధముల వల్ల ఇతర పర్యవసానములకు అవకాశమేర్పడును. ఈ కార్యములు చేపట్టుట, మానుట అనునది వివేకవంతులు, వివేకహీనులు నిర్ణయములను బట్టి జరుగుచుండును.

ఒక కార్యనిర్వహణలో అవగతమయ్యేవి ఉద్దేశ్యములు, పరిస్థితులు, పరిణామాలు మన ఇచ్ఛాశక్తి మరియు విషయ పరిజ్ఞానము. ఈ విషయములన్నీ పరిగణలోకి తీసుకుంటే మనలో కార్యములను మూడు రకములుగా నెరవేరుస్తున్నారు. కొందరు అన్నీ తెలుసుకుని స్పృహతో, మరికొందరు విషయ పరిజ్ఞానములేకను, మరికొందరు విషయ పరిజ్ఞానము లేకపోయినా ఉన్నదన్న బూటక వాగ్దానాలలో కార్యములలో దిగుతారు.

పైన ఉదహరించిన మూడు స్థితులలోని కర్తల పరిస్థితులను ఒకసారి పరకించెదము. మొదట, అన్నీ తెలిసి పనులు చేపట్టిన వ్యక్తికి జరిగిన పనితీరుపై పూర్తి అవగాహన కలిగి ఉండును. రెండు, సంపూర్ణమైన జ్ఞానము కార్యము చేపట్టిన వ్యక్తి, ఆ పనిపట్ల సరి అయిన అవగాహనలేక, సరిఅయిన వివరములు అందించ లేకపోవచ్చును.

మూడు, బూటకప్రచారముతో తెలియక పోయినా తెలుసునని కార్యములోకి దిగినవ్యక్తి యొక్క వివరములు నమ్మదగినవి కాదు.

మనము చేపట్టె కార్యములు ఎన్నో రకములుగా ఉంటుంటాయి. ప్రతికార్యము ఒక ఉద్దేశ్యముతో చేపట్టడం జరుగుతుంది. ఇక్కడ ఒక తేడాను గుర్తిద్దాము. అది స్వభావము. అవి సరియైన స్వభావము మరియు వ్యతిరేక స్వభావాలు. సరియైన స్వభావములవల్ల పనులు చలనములో ఉండును. అనగా పనులు చక్కగా జరుగుచుండును. వ్యతిరేక స్వభావము వల్ల పనులు ఆగిపోవును.

ఈ కార్యములలో మరో ప్రత్యేకత ఉంటున్నది. అది భౌతికము మరియు అంతర్గతము. భౌతికమైనది శారీరకమునకు సంబంధించినది. అంతర్గతమైనది మానసికమైనది. కొట్టడము అనేది భౌతికమైన పని. కొట్టాలని అనుకోవడం మానసికమైనపని, ఉదహరణకు ఒకరు ఉపన్యాస మిస్తున్నారు. అతని చర్యలను గమనించండి. అతను తన మాటలలో కొట్టమని చెప్పవచ్చు, లేదా లిఖిత పూర్వకముగా కొట్టమని చెప్పవచ్చు లేదా పరిజ్ఞానం ద్వారా కొట్టమని చెప్పవచ్చు.

ఒక కార్యము చేపట్టినప్పుడు, కొన్ని పరిణామమలు ఏర్పడును. ఈ పరిణామములో ఆయా వస్తువులకు మాత్రమే సంబంధము కలిగి ఉండును. ఒక వస్తువు వల్ల మరొక వస్తువుకు పరిణామ విషయములో సంబంధములు ఏర్పడతవి.

ఒక కార్యము యొక్క పరిణామములు సంఘటనలుగా చెప్పుకొన వచ్చును. ఒక సంఘటన రూపుదిద్దుకోవడానికి నాలుగు పద్ధతులు కానవస్తున్నవి. మొదటిది నిర్మాణము, రెండవది పొందడం, మూడవది పక్కవారితో సంబంధం, నలుగు సామూహిక ప్రభావము. ఈ నాలుగు

అంశాలు ప్రతి సంఘటనలో ఖచ్చితముగా చోటు చేసుకోవాలని లేదు. ప్రతి సంఘటనకు అనేక పరిస్థితులు కారణమై ఉంటున్నవి. అనేక పరిణామములలో మనము కొన్నింటిని మాత్రమే గుర్తించగలము. ఒక సంఘటనలో ఇమిడి ఉన్న పరిణామాలన్నిటికి గ్రహించ వలెనన్న, అది వివేకవంతులకు మాత్రమే సాధ్యము.

మనము కార్యములు ఉద్దేశ్యపూర్వకముగా చేపడతాము. మన ఉద్దేశ్యములను కార్యముపైన మరియు పరిణామములపైన వ్యక్తం చేస్తాము. ఈ నేపథ్యములో మనము కార్యముపై ఒక ఉద్దేశ్యము కలిగి ఉండిన, అదే ఉద్దేశ్యముతో ఆ కార్యమును నిర్వహిస్తాము. ఒకవేళ మన ఉద్దేశ్యము పరిణామములపై ఉంచిన, అట్టి పరిణామములను దృష్టిలో ఉంచుకుని కార్యము నిర్వహిస్తాము. ఒక్కొక్కసారి కార్యముపై గానీ, పరిణామములపైగానీ ఏ విధమైన ఉద్దేశ్యముల లేకుండా కార్యములు చేపట్టడం జరుగుతుంది.

సాధారణముగా ప్రజలు తమ తమ అభిప్రాయములను వ్యక్తము చేస్తుంటారు. ఈ అభిప్రాయములు మంచిగాను ఉంటాయి. చెడుగానూ ఉంటాయి. పరిస్థితుల ననుసరించి ఈ అభిప్రాయములు మంచి లేదా చెడు అని తెలియును. అయితే ఈ అభిప్రాయముల యొక్క సారము సందేహార్ధముగానూ అస్పష్టముగానూ ఉండును. నిజానికి మంచిచెడు లనేవి కార్యములోనే ఉంటుంది. సుఖము లేదా కష్టమునకు సంబంధించిన విషయములపై మన అభిప్రాయములు వ్యక్తం చేయవచ్చును. సుఖములకు కారణములపై గానీ లేదా కష్ట నివారణలపై గానీ మన అభిప్రాయములు వ్యక్తం చేయవచ్చు. సాధారణముగా ఒక కార్యమును చేపట్టిన కారణమును బట్టి మన అభిప్రాయములు వ్యక్తము చేస్తాము. ఆ కారణములు ఉద్దేశ్యములు లేదా లక్ష్యములుగా మనకు వ్యక్త

మగుచున్నవి. ఒక్కొక్కసారి పరిణామములను దృష్టిలో పెట్టుకుని మంచి లేదా చెడు అభిప్రాయములు వ్యక్తమవుతూ ఉంటాయి. ఒక కార్యము యొక్క లక్ష్యములను దృష్టిలో పెట్టుకునిగానీ, పరిణామములను దృష్టిలో పెట్టుకుని గానీ అభిప్రాయములు వెల్లడి అగును.

ప్రతికార్యము వలన ఆ కార్యములోని దౌర్జన్యమువలన ఖచ్చితముగా అనేక పరిణామములు ఎదురవును. ఏది ఏమైనా అనుకున్న పని జరగాలి అనే లక్ష్యము ఉన్నచోట పనిచేయవలెనన్న అందుకు తగిన వ్యక్తిత్వము గలవారు పనిచేయాలి.

శిక్షకు గురియైన సందర్భములలో నాలుగు అంశములను పరిగణ లోనికి తీసుకోవాలి. మొదటి, జరిగిన కార్యమును సమీక్షించవలెను. రెండు, ఏ పరిస్థితులలో ఈ కార్యము నిర్వహించబడినది. మూడు, ఈ కార్యము ఏ ఉద్దేశ్యముతో మొదలుపెట్టబడినది. నాలుగు, ఈ కార్యము నెరవేర్చిన విధము అనగా తెలిసి చేసినదా, తెలియక చేసినదా లేక తెలియకపోయినా తెలిసినట్లు బూటక ప్రకటనలతో చేసినదా? ఇవికాక మరి రెండు అంశములు కూడా పరిశీలించుట జరుగును. మొదట అసలు ఈ కార్యము చేపట్టడానికి కారణమేమిటని తెలుసుకోవాలి. రెండవది, సామాన్యముగా వ్యక్తము చేయాలనే అభిప్రాయం.

మనము చేపట్టిన కార్యముల యొక్క లక్ష్యములను విచక్షణా రాహిత్యముతో రెండు రకములుగా వ్యక్తము చేస్తాము. మొదటి పద్ధతిలో జరిగిన అనుభవములను దృష్టిలో పెట్టుకుని, తమ లక్ష్యములు వాటిని అనుసరించి యుండును అని చెప్పుట. ఈ పద్ధతిలో ఎట్టి అలంకరణలు ఉండవు. ఇంక రెండవ పద్ధతి ననుసరించి, ఆ లక్ష్యములు తమ మనోభావములను, తమ మనోభీష్టములకు సాయముగా కల్పిత పాత్రలతో తమ లక్ష్యములను విన్నవించెదరు. ఈ ప్రకటనలలో అత్యాశ,

లాభము, సోమరితనము, సాయము మొదలగున్నవి వ్యక్తమగును. ఈ పద్ధతిలో లక్ష్యములను అలంకారములతో వెల్లడింతురు.

నిజ జీవితములోని సంఘటనలు మనలను రెండు రకములుగా చలింప జేయును. మొదటిది అంతరంగమందు, కష్టమును గానీ ఆనందమునుగానీ కలిగించును. వీటికి అనుగుణముగా మనము నడచుకోవలెను. రెండవది, భౌతికమైన కార్యమువల్ల ఏర్పడిన చలనము. ఇవికూడా కష్టసుఖముల ననుసరించియే ఉండును. వీటిని భౌతిక చలనములందురు. చలనము వలన కష్టసుఖముల అనుభూతి. కార్యమును నిర్వర్తించు తీరునుబట్టి ఈ చలనములు కలుగును.

ఈ సిద్ధాంతము ననుసరించి, సుఖమనగానే మంచి అభిప్రాయము వ్యక్తమగును. అంతేకాదు, కష్టములను తట్టుకునే శక్తి కలిగి యుండటము కూడా ఉత్తమమైనదే. బాధను, కష్టమును చెడుగా భావిస్తాము. అనగా ఏ వస్తువులోనూ చెడు అనేది ఎన్నడూ వ్యక్తముకాదు. ఉదాహరణకు, ఒక దుర్మార్గుడు ఉన్నాడు. అతనికి దుష్ట సంకల్పము లన్ననూ, దుష్ట కార్యములన్నను ఇష్టము, ఆనందము. అతను మోసము, అసూయ, ద్వేషము, దౌర్జన్యములకు పూనుకుంటాడు. అతను ఈ పనులను ఇష్టముగా చేస్తాడు. తనకు ఇష్టములేని వారిపట్ల దుర్మార్గముగా ప్రవర్తించినప్పటికీ, వారు బాధపడటం చూసి తాను ఆనందిస్తాడు.

మనము సామాన్యముగా చేసే పనులను వాటి ఉద్దేశ్యములను బట్టి మంచి పనులు లేదా చెడుపనులని చెప్పుకుంటాము. పరిణామములను దృష్టిలో ఉంచుకుని కార్యముల మంచి, చెడుల నిర్ణయమును వ్యక్తము చేస్తాము. మంచి పనులనగానే సుఖమును అందించేవి, మరియు కష్టమును తొలగించేవిగా భావిస్తాము. అదే విధముగా చెడు పనులనగానే కష్టములు కలిగించేవి లేదా సుఖమును నాశనము చేసేదిగా భావిస్తాము.

అసలు విషయమేమిటంటే, ఒకే లక్ష్యము వ్యక్తము చేసినప్పటికీ ఆ పనుల మాత్రం మంచిగా గానీ, చెడుగాగానీ లేదా మంచిచెడుల నిర్ణయము సాధ్యము కానిరీతిలో ముగియుచున్నవి.

పరిణామముల రీత్యా ఒక కార్యము యొక్క లక్ష్యములు మంచి లేదా చెడుగా నిర్ణయమగును. ఒకవేళ ఒక కార్యమును, పరిణామముల నేపథ్యంలో చెడుగా నిర్ణయించినపుడు, కార్యము యొక్క పర్యవసానము లన్నిటిని సమీక్షించిన పిదపే నిర్ణయింపబడుతుంది.

కామము, దౌర్జన్యము, లోభత్వము మొదలైన లక్షణములలో మన మనోభావములు వ్యక్తమైనప్పుడు వాటి పర్యవసానము చెడుగానే సూచించును. అనగా ఈ భావములు చెడును వ్యక్తము చేయును. వీటికి పర్యాయ పదములు ఉన్నవి. ఆ పదములు చెడు భావములను వ్యక్తము చేయవు. ఉదాహరణకు, కామము అనగా చెడు భావము వ్యక్తమగును, కానీ శృంగారము అనగా అట్టి చెడు తలంపురాదు. అదే రీతిలో దౌర్జన్యమునకు బదులుగా అసౌకర్యము, లోభమునకు బదులుగా ధనముతో వ్యవహారముగా చిత్రించవచ్చును. ఈ నేపథ్యములో కామము, దౌర్జన్యము మరియు లోభము అను పదములను వాడుట సరికాదు. వాస్తవమునకు ఆ పదములు సత్యమే, కానీ ఆ పదములను వాడుట పనికిమాలిన పనే అవుతుంది.

మనము ప్రీతి, సమ్మతి, ఇష్టములతో మొదలుపెట్టిన పనులు సంతోషమును అందించును. మన సంతోషమునకు కారణము మనలోని విశాల భావాలతో కూడిన జ్ఞానము మరియు సేవాభావము. పరిస్థితులను బట్టి ఇతర లక్ష్యములు సంతోషమునకు దారితీయును. ప్రీతి, సమ్మతి తరువాత స్నేహమువల్ల మరియు జనాభిప్రాయమును బట్టి అనుసరించుట వలన సంతోషమును పొందెదము.

మనము ఎన్నో కార్యముల చేపడతాము. ఈ కార్యముల యొక్క లక్ష్యము ప్రపంచమునకు ఏదో మంచి జరుగుతుందని కాదు, మనకు మేలు జరగాలనే కోరుకుంటాము. అయితే మనము బాగుపడినా ప్రపంచమునకు మేలు జరిగినట్లే. ఉత్తమ పురుషుల ఆలోచనలను పరిశీలించినట్లయితే, వారు చేపట్టిన కార్యముల వల్ల అనుకున్నవారికి మేలు జరిగినదా లేదా అని. అయితే ఈ నేపథ్యములో వారు చట్టరీత్యా ఎవరికీ హాని తలపెట్టకూడదు. సామాజిక న్యాయము ప్రకారము, అందరిలోనూ పెరిగేది మంచితనమే. సంతోషము అనునది నలుగురి అనుబంధముతో కూడినదై ఉంటున్నది, లేదా ఒక సందర్భమును పురస్కరించుకుని సమావేశమైన వ్యక్తులకు సంబంధించనదిగా ఉంటున్నది.

సంతోషమునకు కారణము మానవుని నైతికత అని తాత్వికులు తెలియ జేస్తారు. ఎవరు ఎక్కువ సత్కర్మలు ఆచరిస్తారో వారు సంతోషమును, ఆనందమును పొందెదరని వారు తెలుపుతున్నారు. సత్కర్మలతో మంచిని పెంచాలి. అందుకు విరుద్ధమైన చెడుపనులకు దూరముగా ఉండాలి. సంతోషమనగానే సుఖమును అనుభవించుట మరియు దుఃఖమును దూరముగా ఉంచడం. దుఃఖ మనగానే బాధలు అనుభవించడం లేదా సుఖమును అనుభవించలేకపోవడం. మానవుడు ఎప్పుడూ కోరుకునేది రెండు. ఒకటి సుఖము, రెండు దుఃఖమునకు దూరముగా ఉండటం. మానవుని కోరికలలో సహజముగా సంతోషము కోసమే తాపత్రయం వ్యక్తమవుతుంది. మానవుడు తన అంతిమ లక్ష్యముగా తనలో నైతిక జీవనమును పెంచుకోవాలి. అట్టి నైతిక జీవనమే మానవునకు సరియైనది.

వినియోగ సిద్ధాంతము ననుసరించి, ఒక ఉత్తముడు తన ఉత్తమ ప్రవర్తనతో, తనే బాగుపడుననుకొనుట ఉండదు. అతని చుట్టూ ఉన్న

వారందరూ సంతోషమును అనుభవింతురు. అతను అందరికీ ఆదర్శముగా ఉండి సంతోషమును కలిగించును. అతని శీలమును అనుసరించి సంఘములోని ప్రజలు కూడా బాగుపడుదురు. సంతోషము వ్యక్తిగతమైనదిగానే కాక సమిష్టితో సామూహికముగా అనుభవించేది. కాబట్టి సంతోషమును అందించే, సంతోషమును పెంచే ఉత్తమ లక్షణములను అందరూ అలవరచు కొనవలెను.

తృప్తిగా జీవించే వారిని చూసి నేర్చుకోవలసిన పాఠములు రెండు. వారు ఎప్పుడూ హుషారుగా ఉంటారు, మరియు వారు ఆధ్యాత్మిక జ్ఞానం కలిగినవారు. ఈ ఆధ్యాత్మిక జ్ఞానం కలిగిన కారణమున వారు నిరాడంబర జీవితమును కోరుకుంటూ తృప్తిగాజీవిస్తారు. వీరు ఉన్నంత లోనే తృప్తిగా జీవించాలనే సిద్ధాంతముతో జీవిస్తారు తప్పితే పెద్దగా సుఖసౌఖ్యముల కోసం తాపత్రయపడరు. అంతేకాదు, వీరు ఎప్పుడు ఉత్సాహముగా ఉంటారని చెప్పుకున్నాము కదా! వీరు తృప్తిగా గడుపుతూ, హుషారుగా గడుపుతూ తమకున్న కొద్దిపాటి కష్టములను మరచిపోతారు. మానవాళి వీరిని చూసి ఎంతో నేర్చుకోవాలి. అనగా కష్టసుఖము లతో కూడిన మిశ్రమ జీవితము మానవాళికి ఎంతో మేలు చేయును.

ఈ వినియోగ సిద్ధాంతమునకై ఒక వ్యతిరేకత వ్యక్తమగుచున్నది. అది ఏమన మానవజీవితమునకు సంతోష కారకాలైన పరిణామాలకు ఇంతవరకూ విశ్లేషణ జరగలేదని. దీనికి కారణము, కార్యమును సమీక్షించుటకు సరిపడు కాలసమయము లేకపోవటయే. మానవుడు అనాదిగా అనుభవముతో, వివేకముతో సంతోషమును కలిగించు ఎన్నో నమ్మకాలను సిద్ధంచేసుకున్నాడు. ఈ నమ్మకాలను నైతిక సిద్ధాంత ములుగా రూపొందించుకుని వాటినినమ్ముతూ వస్తున్నాడు. ఈ నేపథ్యంలో తాత్వికవేత్తలు ఈ సిద్ధాంతములను ఎప్పటికప్పుడు సమీక్షించి, మెరుగైన

మార్పులను సూచిస్తున్నారు. మానవ మేధస్సు పెరిగే కొలదీ, ఈ మార్పులు కాలముతోబాటు అభివృద్ధి బాటను ప్రోత్సహిస్తూ కొనసాగుతూనే ఉంటుంది.

వివేకముగల మానవులు, తమతమ ఆలోచనలతో తమ జీవితములను కొనసాగిస్తూ, వివేక విచక్షణలతో మంచి చెడులను గ్రహిస్తూ, జ్ఞానము, మూర్ఖత్వమునకు సంబంధించిన పలు అంశాలకు సమాధానములు రాబడుతూ ముందుకు సాగుతున్నారు. మానవులు తమ అందుబాటులో ఉన్న దూరదృష్టిని చక్కగా, ఎల్లవేళలా వినియోగించుకుంటున్నారు. నైతిక సిద్ధాంతములను పాటించు భక్తులు, నైతికతను అందుకు అనుగుణమైన లక్షణములను అనుసరిస్తూ నైతికతను తమలో అభివృద్ధి పరచుకుంటున్నారు.

ఏ విధముగా నైతిక సిద్ధాంతములకు అనుమతులు అవసరమో అదే విధముగా ఈ వినియోగ సిద్ధాంతమునకు కూడా అనుమతులు వర్తిస్తాయి. ఈ అనుమతులు భౌతికము మరియు అంతరంగికము. భౌతికముగా మానవుడు స్వార్ధముతో తన తోటి వారినుండి ఫలములను ఆశించుచుండును. ఇతరులకు అసౌకర్యము కలిగంచరాదని భావిస్తాడు. ఇతరులపట్ల దయ, సానుభూతి, ప్రేమలను వ్యక్తము చేయును. భగవంతుని యందు భక్తితో నైతేనేమి, స్వార్ధచింతనతో నయితేనేమి మానవుడు భౌతికముగా తన ప్రవర్తనతో సాటివారిని ఆకర్షింప ప్రయత్నించును. రెండవది అంతరంగమందు, తన కర్తవ్యపాలనకు సంబంధించిన విషయము. తన కర్తవ్యము సమర్ధవంతముగా నిర్వహించిన తృప్తిని, తన కర్తవ్యమును అసమర్ధతో నిర్వహించినపుడు బాధను, అసంతృప్తిని అనుభవిస్తాడు. ఈ ప్రవర్తనలకు నైతికత ఎంతో తోడ్పడును.

అంతరాత్మ ప్రబోధమును అనుసరించినవారు బాగుపడుదురు. దీని సారమేమనగా అంతరాత్మను అనుసరించినవారు పవిత్రతో మెలుగుదురు. తమ కర్తవ్యమును శ్రద్ధా భక్తులతో నిర్వహింతురు. తమ కర్తవ్య నిర్వహణలో అన్యమైన ఆలోచనలకు తావివ్వరు. అట్లు అనాలోచనలకు సిద్ధమైన వారు లాభమునాశించి దయ, ప్రేమ, సానుభూతులను కురిపించుటే కాక భయమును కూడా పొందెదరు. చక్కగా కర్తవ్యమును నిర్వహించువారు, తమమత సిద్ధాంతములను ఆచరణలో చూపింతురు. తమ బాల్యమును గుర్తు చేసుకుందురు. తమ గతమును తలచుకుందురు. తమ ఆత్మగౌరవమును నిలబెట్టుకొందురు. ఇతరులపట్ల వినయవిధేయతలు కలిగి ఉందురు. అప్పుడప్పుడు తాము చేసిన పొరపాట్లకు తమను తాము నిందించుకొందురు. అంతరాత్మను అనుసరించినవారు పవిత్ర భావములతో, పవిత్ర కర్మలతో అలరారు చుందురు.

'పరోపకారార్థం ఇదం శరీరం' అను సూత్రమును అనుసరించి సాటిమనిషికి సాయపడటమే మానవజన్మ యొక్క అంతిమ లక్ష్యము అని అందరూ గుర్తించవలెను. ఈ భావన అందరూ అభివృద్ధి పరచుకోవాలి. ఈ లక్ష్యమునకు సిద్ధమైనవారు అదృష్టవంతులే. ఈ లక్ష్యముతో వారు తమకర్మలనాచరిస్తూ ఆనందమును అనుభవిస్తారు. మానవులంతా తమలా వ్యవహరించడం లేదని వీరు బాధపడరు. ఇట్టి స్థితిని అనుభవించువారు నైతిక ఆచారములను ఆచరించక పోయిననూ పరవాలేదు. అయినప్పటికీ వీరి భౌతిక ప్రవర్తన ఎప్పుడూ నైతికతకు అనుగుణము గానే ఉండును. అంతేకాదు వీరు వాస్తవానికి దగ్గరగా జీవిస్తారు. వీరు తమకు గల అపారమైన అనుభవముతో, సాటివారిపై ప్రభావము చూపుతూ స్ఫూర్తిని కలిగింతురు.

నైతిక జీవనము మానవుని సంతోషమునకు కారణము. మానవుడు సంఘజీవి. సంఘములో తానూ ఒక భాగమే అన్న భావముతోనే జీవితాంతం అతను జీవిస్తాడు. ఈ నేపథ్యములోనే సంతోషము యొక్క శ్రేయస్సు కోరుకుంటాడు. ఐకమత్యంతో పనులు చేయ సంకల్పిస్తాడు. అందరితో కలసి ఆనందమును పంచుకోవాలనుకుంటాడు. సంఘము లోని ప్రజలకు హానిని తలపెట్టు పనులు చేయడు. మానవుడు నైతిక లక్షణములను అభివృద్ధి చేసుకుని సంఘనీతిని పాటిస్తాడు.

స్వార్థచింతన లేనివారు తమ కోసం తాము పాటుపడకుండా తన చుట్టూ ఉన్న నలుగురి కోసం జీవిస్తారు. ఇట్టి మానసిక పరివర్తన మానవునికి చాలా అవసరమై ఉంటున్నది. అవసరములు పెరుగుచున్నవి, పరిస్థితులు మారుచున్నవి. ఐకమత్యముతో కూడిన జీవితము యొక్క ఆవశ్యకత ఎంతైనా ఉంటున్నది. సంఘములోని నలుగురి కోసం జీవించ డానికి అలవాటు పడినవాడు ధన్యుడు.

మనము ఏమి నమ్మాలన్నా ఋజువులు కోరుకుంటాము. చూపుతో వస్తువులను చూసి నమ్ముతాము. వినికిడిశక్తితో శబ్దములను విని నమ్ముతాము. అదే రీతిలో మనకు మేలు చేయు స్థితిని మనము కోరుకుంటాము. సంతోషమును ఎందుకు కోరుకుంటున్నాము? అని ఎవరైనా అడిగితే ఏమి చెబుతాము. సంతోషమును అనుభవించి, దానిని సాధించే నిమిత్తం సంతోషమును కోరడమవుతున్నది. ప్రతివ్యక్తికి అతని సంతోషము అతనికి మంచిగా అనిపించును. సాధారణముగా సంతోష మనునది అందరికీ వర్తించును. సంతోషము అందరికీ వర్తించేది కాబట్టే, సంతోషము కోసం అందరూ కృషిచేయాలి, అనగా నైతికతకు అలవాటు పడాలి.

సంతోషమునకు అనేక కారణములు ఉంటున్నాయి. ప్రతికారణము ప్రత్యేకమైనదే, ముఖ్యమైనదే. ఏ విధముగా సంతోషమునకు అనేక

కారణముల సమిష్టికృషిగా భావిస్తున్నామో, మానవులు అనుభవించే సుఖములు, సౌఖ్యములు కూడా ఈ విధమైన సమిష్టి కృషి ఫలితమే అని గ్రహించవలెను. ఉదాహరణకు సంగీతము ఆరోగ్యము. మంచి ఆరోగ్యమును అనుభవిస్తున్నాము అంటె దానికి కారణములనేకం ఉంటాయి. కాబట్టి ఈ కారణములన్నీ ముఖ్యమే. వీటిని కారణములుగానే కాక లక్ష్యములుగా కూడా గుర్తించాలి.

ఈ వినియోగ సిద్ధాంతమును అనుసరించి సద్గుణము అనునది మొదట్లో లక్ష్యము కాదు, అది అలవాటుతోనే లక్ష్యముగా మారుతున్నది. ఈ సద్గుణములను అందరూ కోరుకుంటారు. నిజానికి ఆచరించలేక పోయినప్పటికీ, ఈ సద్గుణముల పైనగల ప్రేమ, మక్కువల వలన ఈ సద్గుణములను కోరుకుంటారు. సంతోషము నకు ఆచరణ ముఖ్యము. సద్గుణములకు దూరముగా ఉన్నా కష్టములకు దగ్గరవుతాము అన్న భావన వలన, వీరికి సద్గుణములన్న అభిమానము మెండు. ఈ రెండు కారణములవలన మానవులు సద్గుణములపై సదా అవగాహన కలిగి ఉందురు.

సంతోషముయొక్క స్వభావము ఏమిటి? సంతోషమును అందించు జీవితమునకు సత్కర్మలే కారణమని భావిస్తాము. తన అందుబాటులో ఉన్న వనరులతో మానవుడు కృషిచేస్తాడు. ఒక మంచివ్యక్తికి అందుబాటులో ఉన్నవి అతని మంచిగుణములు. సద్గుణములతో కూడిన జీవితము శ్రమతో కూడినది. విలాసములకు ఒప్పుకోనిది, నిష్ఫలమైన పనులతో కాలక్షేపం చేసేబదులు శ్రద్ధాభక్తులతో ఉపయోగకరమైన పనులతో నిమగ్నమై ఉండుట సరియని భావించుదురు. అనగా కష్టపడి పనిచేయుట యందు, మంచిని ఆచరించుటయందు, వృధా కార్యక్రమాల యందు పాల్గొనక పోవడము వలన సంతోషము లభించునని అర్థమగుచున్నది.

మనలోని సద్గుణములననుసరించి మనకు సంతోష ప్రాప్తి కలుగుచున్నందున, మనలో వీలైనన్ని సద్గుణములను అభివృద్ధి చేసుకొనుట ఉత్తమము. అనేకమైన వ్యక్తులు, అనేకమైన ఉత్తమ లక్షణములను వ్యక్తము చేయుదురు. కొందరికి పవిత్రమైన మనస్సు కలిగి ఉండటం ఉత్తమ లక్షణమంటారు. మరికొందరు ఆత్మనుగురించి తెలుసుకోవడం, ఆధ్యాత్మిక చింతనలో గడపడం మొదలైన విషయము లపై శ్రద్ధ ఎక్కువ. ఎవరికీ ఏ విషయములో శ్రద్ధ ఉన్నప్పటికీ, ఈ అంశములన్నీ మానవునకు సంతోషమును అందించును. ఈ విషయములను అందరూ పరిశీలించవలెను.

ఉత్తమమైన లక్షణములు ఆచరించుట వలన మనకు చాలా మంచి జరుగును అనడానికి రెండు కారణములు. మొదటిది, ఈ కార్యములోని కారణములు మరియు వీటిని ఆచరించు కర్త. రెండు, ఇది నిరంతరముగా సాగే సాధన. ఈ సాధనలో అనేక సత్యములు మన అనుభవమునకు వచ్చును.

తాత్వికచింతన మానవునకు ఎంతో హాయిని, ఆనందమును అందించును. ఈ తాత్విక చింతన అనునది నిరంతరము పవిత్రమైన భావములతో, ప్రయత్న పూర్వకముగా సాగే యజ్ఞము. ఇట్టి తాత్విక చింతనతో గడిపేవారిని మనము చూస్తుంటాము. వారు ఎంతో ఆనందముగా కనబడతారు. మనిషి స్వయం సమృద్ధిగా జీవించడానికి ఈ తాత్విక చింతన చాలా ఉపయోగపడుతుంది.

మానవజన్మకు భగవంతుడే కారణమైతే, మానవజీవితమునకూ భగవంతుడే కారణము. ప్రకృతిలో అన్నిటికీ ముఖ్యమైన కారణములు ఉంటాయి. ఆ కారణములవలన అవి ఎక్కువ సుఖమును పొందుతున్నాయి.

కారణముతో జీవించడమే మానవునకు ముఖ్యమైనది, సంతోషకర మైనది. ఎవరైతే నిత్యము ఆనందముకోసం చింతన చేస్తారో, అట్టివారికి చింతనే ఆనందముగా మారిపోతుంది.

ఈ వినియోగ సిద్ధాంతముననుసరించి, మానవ స్వభావము సంతోషమును తప్ప మరియే ఇతర కోరికలను కోరదు. కాబట్టి మానవుడు ఆచరించే కర్మలన్నింటినుండి సంతోషమును కోరుతుంటాడు. మానవుడు సంతోషమునే కోరుకుంటాడు కాబట్టి, నైతికతను కూడా ఇందులోనే ఇముడ్చుకున్నందున, సద్గుణములతో సాగిన మానవజీవితము ఆనందమును అనుభవించును.

నైతికజీవనము హర్షనీయము. మానవుని ఆనందమునకు కారణము భగవంతుడే. అనగా భగవంతునకు, నైతికతకు సంబంధము ఉంటున్నది. ఈ వినియోగ సిద్ధాంతము సద్గుణములను, భగవంతుని జ్ఞానమును నమ్ముచున్నది. భగవంతుని నిర్ణయము ననుసరించి సాగిన నైతిక జీవనము యావత్ మానవాళికి ఎంతో మేలు చేయుచున్నది. ఈ మానవత్వము, ఈ నైతికత భగవంతుని ఇచ్ఛాశక్తినే వెల్లడించుచున్నది, వ్యక్తము చేయుచున్నది.

## 31. మనస్సు, అంతఃకరణాలతో ఏలుబడి

మనస్సు, అంతఃకరణములతో కూడిన నైతిక సిద్ధాంతముకు రెండు అర్థములు వ్యక్తమగుచున్నవి. ఒకటి మనిషి తన వ్యక్తిత్వమును తనే నిర్మించుకొనును. మానవుడు తన మానసిక స్థితిని, అంతఃకరణముల స్థితిని దాటి జ్ఞానమును పొందలేడు. రెండు మానవుడు తన ఉనికిని, అస్తిత్వమును నెరింగియున్నాడు. అనగా మానవుడు తనను తనే కోరుకొనును. ఇదే రీతిలో సాటి మానవులను కూడా ఎంచుకొనును. మనము ఏమి కోరుకుంటామో, దాని విలువ ఏమిటో అన్నది మనమీదే ఆధారపడి ఉంది. ఎందుకంటే మనము చెడును ఎన్నడూ కోరుకోము. మనము ఎప్పుడూ మంచినే కోరుకుంటాము. మనకు మంచి కానిది, ఇతరులకు కూడా మంచిదికాదు.

మానవుడికి విషయములు అస్పష్టముగా ఉన్నప్పుడు, జన్మతః సిద్ధించిన తన సహజమైన స్వభావమునే ఆశ్రయించును. అలా ఆశ్రయించినదేమనస్సు. మనస్సులోని భావములు. భావములను ఆచరణలో పెట్టడం జరుగుతుంది, పిదప ఆ భావములకు ఒక రూపమును ఇవ్వడం జరుగుతుంది.

కర్మద్వారా ఆచరించకుండా వాస్తవము వ్యక్తము కాదు. ప్రతి మనిషి తనకుతానే ఒక నమూనా. తనను తాను నిరూపించుకొనుటకు మొత్తం మీద మానవుడు తను ఆచరించే కార్యముల యొక్క సమిష్టి స్వరూపము, మానవ జీవితము ఒక పెద్ద సంస్థ. ఈ సంస్థ ఎన్నో కార్యక్రమములను నిర్వహిస్తున్నది, మరెన్నో కార్యక్రమములను చేపడుతున్నది. జరుగుతున్న కార్యములన్నిటికీ మానవుడే కర్తగా ఉంటున్నాడు. మానవుడు అభివృద్ధిపథంలో పయనిస్తున్నాడు. మానవుడు తన నైతికతను తనే ఎంచుకుంటున్నాడు. మానవుడు తాను ఉన్న పరిస్థితుల ప్రభావమునుండి

తప్పించుకోలేడు. తాను ఎప్పుడు ఏ పరిస్థితిలో ఉన్నా, స్వేచ్ఛగా తనకు నచ్చిన ఎంపికను ఎప్పుడు కలిగి ఉంటున్నాడు. మానవుడు పరిస్థితులతో పోటీ పడుతున్నాడు.

మానవుని యొక్క నైతికజీవనము అతని యొక్క నీతి నిజాయితీలపై ప్రభావము చూపును. నీతినిజాయితీతో వ్యవహరించేవారు. తప్పు చేసినప్పుడు, ఆ తప్పును ఒప్పుకోవడమే కాక అందుకు తగిన శిక్షకు కూడా సిద్ధముగా ఉంటారు. అలా కాక తప్పుచేసి, క్షమాపణ ముసుగులో శిక్షను తప్పించుకోవడమనేది నీతి అనిపించుకోదు. అవినీతి ఎప్పుడూ సత్యదూరమైనదే. కాబట్టి అవినీతిని స్వేచ్ఛగా ఆశ్రయించరాదు. మానవుని సమగ్ర వ్యక్తిత్వములే అతని నీతి నిజాయితీలు.

మానవుడు అనుభవించే స్వేచ్ఛా స్వాతంత్ర్యములు మానవుని నైతిక న్యాయముతో ఇమిడి ఉంది. మానవుడు స్వేచ్ఛాజీవి. నీతి నిజాయితీలతో కూడిన మానవుడు ఆశించే అంతిమలక్ష్యము స్వేచ్ఛా జీవితము. పరిస్థితులు ఏమైనప్పటికీ మానవుడు స్వేచ్ఛనే కోరును. మానవుడు తాను స్వేచ్ఛను కోరే సమయములో అది తనచుట్టూ ఉన్నవారి స్వేచ్ఛపై ఆధారపడి ఉందని గ్రహిస్తాడు. ఈ స్వేచ్ఛ అనునది మనకు, మన సాటి వారికి మధ్యగల అవినాభావ సంబంధము. ఈ నేపథ్యములో ఎవరయితే తమ స్వేచ్ఛను ఇతరుల స్వేచ్ఛనుండి తప్పించే ప్రయత్నం చేస్తారో, వారిని పిరికివాళ్ళుగా జమకట్టడం జరుగుతుంది. స్వేచ్ఛను నిష్పాక్షికము గానూ, పక్షపాత రహితముగానూ అనుభవించ వలసియున్నది.

మన మానసిక స్థితిపై మనయొక్క అహంకారము యొక్క ప్రభావము చాలా అధికముగా ఉంటున్నది. మన మానసిక స్థితిపై ఈ అహంకారము యొక్క ప్రభావము చాలా శోచనీయముగానూ, హేయము

గానూ ఉంటున్నది. మరి దీనిని సరిచేయుట ఎట్లు? ఈ అహంకారము మనపై ప్రభావము చూపుతున్నంత వరకూ, కారణములను బాహ్య ప్రపంచములో వెతకుట జరుగును. మనము నిత్యము ఎన్నో ప్రయోగములను చేస్తుంటాము. ఈ ప్రయోగముల ద్వారా ఎంతో అనుభవజ్ఞానమును సంపాదిస్తున్నాము. ఈ నేపథ్యములో, మనలోని అహంకార నిర్మూలనకు, మనలోనే మార్పులను సూచించుకోవాలి. బాహ్యముగా వెతుకుచున్న కారణములను మన అంతఃకరణలోనే వెతుక్కుని, తప్పులను సరిచేసుకొనుటకు అలవాటు పడవలెను. ఈ నేపథ్యములోనే మనము అనుభవజ్ఞానముతో కూడిన నైతిక సిద్ధాంతములు, నీతి నియమములు నేర్చుకుని మానవ స్వభావములో మంచి మార్పులకు ప్రయత్నము చేయవలెను.

నిత్యజీవితములో మనము ఎన్నో విషయములపై మనకు సొంత అభిప్రాయములు ఉంటున్నవి. ఈ అభిప్రాయములన్నీ ఊహాత్మకమైనవే. మనము ఎన్నో సిద్ధాంతములను భగవంతుని జ్ఞానమును వింటున్నాము, ?
తెలుసుకుంటున్నాము, ఆచరిస్తున్నాము, మనలో మార్పులను సూచించు కుంటున్నాము. అలా మార్పులను సాధించాలి. అట్లు కానిచో మన అభిప్రాయములు కేవలం ఊహలుగానే మిగిలిపోతాయి. ఆ ఊహలకు విలువ ఉండదు. ఈ అభిప్రాయములను ఊహలుగా ఉంచకుండా, సిద్ధాంతములతో పోల్చుకోవలెను. ఈ సిద్ధాంతములు సత్యమైనవి, స్థిరమైనవి. మన ఊహలు, అభిప్రాయములు ఈ సిద్ధాంతములకు ఏకీభవించాలి. ఈ సిద్ధాంతములననుసరించియున్న సత్యమును, అధికారమును అందుకొనగలము. కాబట్టి అందరూ ఒక విషయమును గ్రహించాలి. మన అభిప్రాయములను, ఊహలను వెంటనే విశ్లేషించ కుండా ఆచరణలో పెట్టకూడదు. మన ఊహలకు, అభిప్రాయములకు గతములో జరిగిన అనుభవములతో విశ్లేషించుకుని ముందుకు సాగాలి.

నైతిక సిద్ధాంతములలో కొంత తారతమ్యములు ఉండవచ్చు, కానీ చాలా సిద్ధాంతములు సర్వ సాధారణముగా ఆమోదము కలిగియుండును. ఈ సిద్ధాంతములు స్థిరమైనవి, ముందుగా గోచరముకానివి. మానవుని జీవితములో ప్రతిక్షణము ఏదో కొత్త విషయములు కనిపెట్టు గుణము కలిగి ఉంటున్నది. మానవుడు స్వేచ్ఛగా జీవిస్తూ అనేకమైన నూతన విషయములను నిరంతరమూ తెలుసుకుంటూనే ఉంటున్నాడు.

# 32. నైతిక పదార్థ గమనవేగ శాస్త్రము

## 1. సామాన్యముగా వినిపించు తర్కము:

సామాన్యముగా వినిపించు తర్కము ఈ రీతిన కొనసాగును. ఒకే పనిని అందరూ చేసిన యెడల, వాటి పరిణామములు దురదృష్ట కరముగానూ కోరదగినదిగాను ఉండును. కాబట్టి అందరూ ఒకే పనిని చేయరాదు. ఈ విషయమునే మరో రీతిన చెప్పుకొనవచ్చును. ఏ పనీ ఎవరూ తలపెట్టక ఊరకుండడం కోరదగినది కాదు. కాబట్టి, అందరూ ఏదో ఒకపని చెయ్యాలి. ఈ తర్కముననుసరించి గ్రహించవలసినది ఏమనగా, ఒకరికి మంచి లేదా చెడుగా తోచినపని, అవే పరిస్థితులలో అటువంటి స్వభావముగల వ్యక్తులకు మంచి లేదా చెడుగానే అనిపించును.

మనమాచరించెపనులకు నైతికతకు అనుబంధము కలిగి ఉంటాయి. అట్టి కార్యముల యొక్క పరిణామములు సమంజసముగా ఉండును. అలాకాక అసమంజస పరిణామములు వ్యక్తమయ్యే చోట, ఆయా కార్యములకు నైతికతకు అనుబంధము లేకుండా ఉన్నదని అర్థమవుతున్నది.

కార్యమును ఆచరించే కర్తయొక్క శీలము, ఆ కార్యము ఆచరించు పరిస్థితులపై ఆధారపడును. ఒక కార్యము యొక్క మంచిచెడులు, ఆ కార్యము యొక్క పరిస్థితులను బట్టి లేదా సందర్భమును నిర్ణయమగును. ఈ నేపథ్యములో మంచిచెడులు నిర్ణయించేవారు ప్రత్యేకముగా ఉంటున్నారు. వీరు వివేక విచక్షణలతో ఆ మంచి చెడులను కారణముతో వివరించ శక్తిగలవారు.

ఈ సాధారణనియమము అనుసరించి ఒకనియమము ఉంటున్నది. 'ఇతరుల నుండి ఏమి ఆశిస్తున్నావో, అదే నీవు ఇతరులకు చేసి చూపించు'.

ఈ సిద్ధాంతమును సామాన్యముగా అర్థం చేసుకుంటే, ఈ సిద్ధాంతముపై అసహ్యము కలుగుతుంది. ఉదాహరణకు: ఒక వ్యక్తి తనపై చెడుగా ప్రవర్తించినపుడు, తను కూడా అలాగే స్పందించాలి అని ఈ నియమము చెప్పుచున్నది. ఈ నేపథ్యములో ఈ నియమమును ఈ విధముగా వ్యక్తము చేయడమైనది, 'న్యాయముననుసరించి ఉచితముగా గాని లేదా అనుచితముగా గాని నేను అవతల వ్యక్తిపట్ల ప్రవర్తించి నపుడు, అదే న్యాయమును అనుసరించి అవతలి వ్యక్తినుండి కూడా అట్టి ప్రవర్తననే ఆశించవలెను.

ఈ సామాన్యమైన సిద్ధాంతముననుసరించి, ఈ సిద్ధాంతములో ఇమిడి ఉన్న నైతిక విలువలను ఇక్కడ ప్రత్యేకముగా అనగా మంచి, చెడు లేదా ఒప్పుగా తెలియజేయబడుతున్నది. ఈ కారణముచే ఈ సిద్ధాంతము అన్ని సిద్ధాంతముల తోనూ ముడిపెట్టబడినది. ఈ సిద్ధాంతము యొక్క ప్రత్యేకత ఏమిటంటే, ఇందు పొందుపరచిన న్యాయమునకు తగిన కారణములు సూచింపబడినవి. ఈ కారణములతో ఈ సిద్ధాంతము యొక్క విశిష్టత తెలియబడుచున్నది. అది, 'ఒకే రకమైన వ్యక్తులకు ఒకే రకమైన పరిస్థితులు' సూత్రమును అనుసరించును. ఈ సూత్రము ననుసరించి న్యాయమునకు తగ్గ కారణములను మాత్రము ఇందు వ్యక్తమగును.

ఈ సామాన్య సిద్ధాంతము యొక్క తర్కమును మనము ఒప్పుకొనిన నేపథ్యములో న్యాయమునకు సరియైన కారణములు సూచించ పడుచున్నవని తెలియచున్నది. అయితే ఇక్కడ భౌతికమైన, మానసికమైన నైతిక విషయముల యందు స్పష్టమైన ప్రత్యేకతలు ఉంటున్నవని చాలామంది అభిప్రాయపడుతున్నారు.

ఈ రెండింటి నేపథ్యములో, నైతిక న్యాయము భౌతిక విషయముల పట్ల ప్రాముఖ్యతను వ్యక్తము చేయలేదు. కానీ మానసిక స్థాయినందు, న్యాయ నిర్ణయము యొక్క వైఖరిని ప్రస్తుతించడం జరుగుతున్నది. భావ సిద్ధాంతముల ననుసరించి, కర్తయొక్క వైఖరిని వ్యక్తము చేయడ మవుతున్నది. ఒక న్యాయమైన తీర్పును సరియైన కారణముల చేత వివరించలేనప్పుడు, అది సరియైన నిర్ణయముగా చెప్పుకోబడదు. అట్టి నిర్ణయములకు విలువ ఉండదు.

ఈ సామాన్య సిద్ధాంతము నైతిక సిద్దాంతములను స్పష్టముగా అమలు చేయబడును. సిడ్గ్‌విక్ అభిప్రాయము ప్రకారము, "ఏ వ్యక్తి అయినా తనకు తానుగా ఒక కార్యమును ఒప్పుగా భావించినప్పుడు, ఆ వ్యక్తి అదేపరిస్థితులలో అదే వ్యక్తులకు అదే న్యాయమును సూచించును. నైతిక నిర్ణయములు నికరమైనవి, స్పష్టమైనవి, మార్పు లేనటువంటివిగా ఉంటూ, అందరికీ ఆమోదయోగ్యములై ఉంటున్నవి" అని సిడ్గ్‌విక్ ఈ విషయమును కూడా తెలుపుతూ ఈ సిద్ధాంతమునకు బలమును చేకూర్చెను.

తీర్పులో నైతిక విషయములను వెల్లడి చేయునపుడు, ఎన్నో అనుమాన ములకు అవకాశమేర్పడును. ఇది సహజమే. అయినప్పటికీ న్యాయమును వ్యక్తము చేసే సమయములో ఈ నైతికవిషయముల ప్రస్తావన సముచితముగానే ఉండును. తీర్పులను విశ్లేషించు సమయములో ఏ రెండింటి తీర్పులలో వ్యక్తమైన నైతిక భావములను ఎవరైనా విశ్లేషించుకోవాలి. ఉన్నతమైన తీర్పులలో ఈ భావముల తారతమ్యములను స్పష్టముగా గ్రహించడమౌతున్నది. ముందుగా నిర్ణయించిన కారణములు విశ్లేషణకు ఉపయోగపడవు. కార్యము ననుసరించే విచారణ, కారణములు బయటపడును.

**2. నిజమని నిర్ధారణ :**

వెల్లడించిన విషయములలోని వాస్తవములను రాబట్టుటకు సూచించిన ప్రమాణములతో నిజనిర్ధారణ జరుగును. ముందుగా విషయమును పూర్తిగా గ్రహించిన పిదప, వెల్లడించిన విషయముల వాస్తవికతను పరిశీలించాలి. ఈ నేపథ్యములో వెల్లడి అయ్యే ప్రతి విషయము ఎంతో భావప్రధానముగా తోచును. వాస్తవ పరిస్థితుల సమీక్ష, మరియు పరిస్థితులకు బలమునిచ్చే విషయములు వెల్లడయితే నిజమును ఒప్పుకుంటూ, అసత్యమును తిరస్కరించుట జరుగును.

నిజనిర్ధారణ రెండు విధములు. మొదటిది ఆచరణపూర్వకముగాను, రెండు సిద్ధాంతపరమున. సాధారణముగా విషయమును తెలుసుకున్న వెంటనే, అవి నిజమనిపించును. ఈ నేపథ్యములో మనము ఋజువు చేయకుండా ఊరుకోవడం జరుగుతుంది. అయితే చాలా అంశములు మనము అనుకుంటే సాకారముగా ఋజువు చేయ వీలగును. అయితే కొన్ని ప్రత్యేకమైన అంశములు సాకారముగా ఋజువు చేయ వీలుకాదు. అటువంటి అంశములను సిద్ధాంతపరముగా ఋజువుకు స్వీకరించడ మవుతుంది.

ఋజువుచేసే సమయములో రెండు అంశములు ఉంటున్నవి. ఒకటి బలమైన ఋజువు, రెండు బలహీనమైన ఋజువు. బలమైన ఋజువు అనగానే, ఆ అంశంలోని సత్యమును ఖచ్చితముగా అనుభవ పూర్వకముగా ఋజువు పరచ వచ్చును. బలహీనమైన ఋజువును ఆచరణ పూర్వకముగా ఋజువు చేయడం సాధ్యం కావచ్చు, కాకపోవచ్చు.

సామాన్యమైన నీతిశాస్త్రములోని విషయములు నాలుగు రకములుగా విభజించవచ్చును. మొదటి రకములో అందరి ముందు

ప్రవేశపెట్టిన అంశములను నైతికముగాను న్యాయ సూత్రానుసారము వివరింపబడుచున్నది. రెండవరకము ఇక్కడ విషయములోని అంశము. మూడు నైతిక విలువలకు ఇక్కడ పెద్ద పీట వేయడమైనది. నాలుగు, వాస్తవమునకు నైతిక అంశములతో సమర్పించిన తీర్పు.

వాస్తవమునకు నైతిక మూలసిద్ధాంతములను విశ్లేషింపజాలము. కారణము, వాటిని పరీక్షించు ప్రమాణములు లేకపోవుటయే. నైతిక చిహ్నాములు వినియోగించినంత మాత్రమున వాస్తవికత పెరగదు.

నైతిక పదముల యొక్క అర్థములు, వాటి ప్రభావములు తెలుసు కోవలసిన అవసరం ఉంది. ఈ నైతిక పదములు భావమును ప్రకటించును, భావములు పుట్టించును. మరియు కార్యములు చేపట్టుటయందు స్పందనలు కలిగించును. ఈ పదములను శాసనములుగా ఉప యోగించడమైనది. నిజానికి ఈ నైతిక పదజాలము భావ ప్రకటనలకే కాక, వివిధ రకములైన స్పందనలు, ఏ ఏ స్థాయిలలో వెల్లడయ్యేనో తెలుసుకొనుటకు ఉపయోగించడమవుతున్నది.

నైతిక న్యాయము యొక్క సత్తువను తెలుసుకోవడమన్నది అసాధ్యము అని గ్రహించవచ్చును. దీనికి కారణము, వీటికి భౌతికమైన సంబంధము లేకపోవుటయే. ఒక వాక్యములో అర్థమే లేనప్పుడు, ఆ వాక్యము మంచిని వ్యక్తం చేసెనో చెడును వ్యక్తం చేసెనో ఎట్లు నిర్ణయించ గలం? నైతిక విలువలను వ్యక్తము చేసే వాక్యములు, ఇతర విషయము లను ప్రకటించవు. అవి కేవలం నైతిక విషయములకు మాత్రమే పరిమిత మగుచున్నవి. ఈ వాక్యములలో నిజము, అబద్ధములు బయటపడవు.

ఈ పదములు లేక వాక్యములు ఋజువు చేయడము వీలుకాదు, కారణము వాటిని ఆలోచించుటకు పెట్టిన సంగతి సవ్యముగా లేక

పోవుటయే. నైతిక న్యాయము యొక్క సార్థకత కర్త యొక్క అభిప్రాయముపై ఆధారపడిలేదు. నైతిక న్యాయము వలన ఏ విధమైన భావప్రకటనలు వెలువడవలెనను నియమము లేదు. నైతిక న్యాయము చట్టపరమైనది కాదు.

భాషా ప్రభావమున మానవాళి గుర్తించినది మోసం, చమత్కారం మరియు అన్నీ తెలియును అన్న పదములు ఈ నైతిక న్యాయము పరిధిలో ఉపయోగ పెట్టినప్పుడు, వాటికి తీరు సానుకూలముగా ఉండ బోదు. అదే రీతిన మోసము కూడా ఒక ప్రక్రియే. మోసము అనునది మనస్సునకు తోచిన దుష్టసంకల్పము. ఈ దుష్ట సంకల్పమునకు అహంకారము కారణమై ఉంటున్నది. గయ్యాళులు చాలా తెలివైనవారు. వ్యాపారస్తులు, వకీలులు మొదలైనవారు తలలు తీసేవారు మరియు కాల్చేసేవారు, మంత్రగాడు అనగానే విపరీతమైన తెలివితేటలు కలవాడని అర్థము, అమెరికా పరిభాషలో అర్థము వివేకవంతుడిలో వివేకము ఉంటుంది. వివేకహీనుడిని అమాయకుడిగా జమకట్ట బడేవాడు. ?

### 3. సాపేక్షతత్త్వ పరిశీలన :

ఒక నైతిక తత్వవేత్తను సామాన్యముగా సాపేక్ష తత్వవేత్తగా భావింపబడును. నైతిక విలువలను విచారించే సమయంలో సాపేక్ష తత్వము గోచరమగును. ఈ సాపేక్షతత్వంలో అహంకారం, స్వార్థం ఇమిడి ఉన్నాయి. ఈ నేపథ్యములో, భావములో ఎంత వ్యత్యాసము ఉన్నప్పటికి సరియైన పదజాలముతోనే వ్యవహరింపబడుచున్నది.

ఒక పేరు ప్రఖ్యాతిగల వ్యక్తికి ఈ సాపేక్ష సిద్ధాంతమును అనునయించరాదు. ఈ సాపేక్ష సిద్ధాంతములో సాధారణముగా అహంకార పూరిత పద ప్రయోగము జరుగును. సాపేక్ష సిద్ధాంతము

కానిది సంపూర్ణమైన లేదా మినహాయింపులేని పరిశీలన అవుతుంది. ఆచరణకు నోచుకోని నైతికత పరిస్థితి ఏమిటి? ఆచరించకుండా నీతివాక్యములు వెళ్ళడించేవారు ఉంటారు. వారి మాటలలో ఏది నిజమో, ఏది అబద్ధమో తెలియదు. ఏది స్థిరమో, ఏది అస్థిరమో తెలియదు. ఈ విశ్లేషణ చేసే వ్యక్తులతో ఈ నైతిక నియమాలు పోల్చరాదు.

నైతిక విషయములు పట్ల జనులకు అనేక అభిప్రాయమలుంటాయి. అయితే సాధారణముగా వాటిపై సదభిప్రాయమే ఉంటుంది. ఆచరించిన రోజునే నైతికల విలువలు అర్థమగును. ఆచరణతోనే నైతికవిలువలు సత్యమో, కాదో తెలుసుకొనవచ్చును.

నైతిక విలువల పట్ల సదభిప్రాయమున్న వ్యక్తి, వాటిని సంపూర్ణము గాను మరియు ఇష్టముగాను విశ్లేషించి, భౌతిక, వివేకముతో మరియు అనుభవజ్ఞానము కలిగి శాస్త్రజ్ఞానము లేకపోవుటయను మూడు విషయ ములను రాబట్టుచున్నాడు. భౌతిక పరముగా నైతిక విలువల పట్ల సదభిప్రాయము కలిగి ఉంటున్నాడు. రెండవది, ఈ నైతిక విలువలను వివేక విచక్షణలతో ఆచరించి, ఆయా నియమముల యొక్క విశ్లేషణతో విలువను గ్రహించి, ఆ విలువలను సాటి విలువలతో పోల్చి వాటిమధ్య సంబంధమును తెలుసుకోవడమవుచున్నది.

మూడవ విషయముగా ఈ నైతిక విలువలపట్ల అనుభవ జ్ఞానము కలిగి ఉన్నప్పటికీ వీరికి శాస్త్రజ్ఞానము లేకపోవుట వలన భావముల యొక్క సాంద్రతను, మానసిక స్థాయికి తగ్గట్టుగా అవగాహన కలుగుట లేదు. ఈ కారణముచే సంపూర్ణమైన విశ్లేషణ అవసరము. నైతిక వివరములు, అనుభవముల పట్ల అనుమానములు వ్యక్తమయిన సందర్భములలో సరియైన పరిష్కారము వలన నైతికత పట్ల నమ్మకము పెంచును.

నైతిక విలువల యొక్క ప్రభావము మనస్సుపై చూపును. నైతిక విలువలపట్ల, సదభిప్రాయము కలిగినవ్యక్తి, చూపునకు న్యాయముగా తోచిన రీతిలో ఈ సంఘటనలను వివరిస్తూ, తనే సాక్షిగా వ్యవహరిస్తాడు.

నైతిక విషయములపట్ల సదభిప్రాయము కలిగిన వ్యక్తి యొక్క లక్షణములు. నైతికము కాని విషయముల పట్ల అతనికి శ్రద్ధ ఉండదు. అతను సమబుద్ధితో వ్యవహరిస్తాడు. సూక్ష్మబుద్ధిగలవాడు, స్థిరమైన చిత్తము గలవాడు. ఇతర విషయముల పట్ల అతను అందరిలాగ ప్రవర్తిస్తాడు. వాస్తవమునకు ఈ నైతిక సూత్రములు సత్యమైనవి. సద్గుణములతో కూడినవి కావుననే అవి మానసిక స్థాయిపై సంబంధము కలిగి ఉంటున్నవి.

**4. చెడు నమ్మకము – నీతి నిజాయితీలు :**

చెడునమ్మకమనగా అబద్ధముతో సమానము. ఒకరికి అబద్ధముగా తోచినది, అందరికీ సామాన్యముగా అబద్ధముగానే తోచును. అబద్ధము లాడుట వ్యతిరేక వైఖరిని తెలియజేయును. ఈ అసత్యజీవనము, భాషణము అంతరాత్మకు భారముగా ఉండును. ఇతను మార్పును కోరుకుంటాడు. నిజానికి అసత్య భాషణము చేసే వ్యక్తికి నిజము ఏమిటి అన్నది స్పష్టముగా తెలుసు. అయినప్పటికీ అతను నిజమును దాచ ప్రయత్నిస్తాడు. మానవుడు తెలియని విషయముల పట్ల అబద్ధము లాడడు, లేదా పొరపాటుపడిన సందర్భములలో కూడా అబద్ధము లాడడు. మనుష్యులమీద నున్న ద్వేషములతో నిజము ఏదో తెలిసి నప్పటికీ, అబద్ధము లాడుచుందురు. వారి మాటలలో వాస్తవము కనపించదు. వారి నమ్మకము ద్వేషముపై ఆధారపడి ఉంటుంది. అంతర్ముఖంగా వాడు పవిత్రుడే, కారణము వాడికి నిజము తెలుసు

కాబట్టి. నిజానికి అబద్ధములాడటం వలన కలిగే పర్యవసానములు కర్త అనుభవించవలసినదే. అబద్ధములాడుట వలన ఇతరులపై వీరు చెడు నమ్మకము కలిగియుండుటే కాక చెడు అభిప్రాయము కూడా కలిగి యుందురు.

ఈ అబద్ధములాడువారు నిజమును చేదుగా వ్యక్తము చేయుదురు, అబద్ధమును తీయని నిజముగా చెప్పుదురు. అపనమ్మకము చెడు స్వభావమునకు నిదర్శనం. ఈ అబద్ధముతో వాస్తవమును కప్పి వేస్తున్నాడు. ఇక్కడ కర్తయే మోసం చేస్తున్నాడు, కర్తయే మోసపోతున్నాడు. కర్తయొక్క తెలివితేటలు మాత్రమే ఇందు ఇమిడి ఉంటున్నవి. కానీ అంతరంగము మాత్రము అబద్ధము కారణముచే ప్రభావమునకు గురి అగును.

చెడు నమ్మకమునకు విరుగుడు నీతి, నిజాయితీలు. నీతి నిజాయితీలు అన్నవి అధికారికముగా ప్రకటించబడును. నీతి నిజాయితీలతో మానవుడు ఏమి సాధిస్తాడు? నీతి నిజాయితీలతో మానవుడు తన అంతరాత్మ ప్రభావముతో తనలోని మానవత్వమును ప్రకటించుకుంటున్నాడు.

**5. శక్తి సామర్థ్యములు :**

'జంతూనాం నరజన్మదుర్లభం' అన్నారు పెద్దలు. మానవజన్మ ఎత్తినందుకు ఈ మానవజన్మను సార్థకం చేసుకోవాలి. మానవజన్మ ఉత్తమమైనది మరియు శక్తివంతమైనది, ఉపయోగపడునది. మానవుని యొక్క శారీరక, మానసిక శక్తులు అసాధారణమైనవి. మానవుని యొక్క రూపము, తెలివితేటలు, కళలు, వాగ్ధాటి, ఔదార్యము, గొప్ప బుద్ధి మొదలగునవన్నియు మానవుని యొక్క శక్తి సామర్థ్యములను తెలియ

జేయును. మానవుని యొక్క సృజనాత్మకశక్తి అమోఘము. మానవుడు తన సృజనాత్మక శక్తితో ఎన్నో కొత్త విషయములను కనుగొంటున్నాడు. సంపదలు పెంచుకుంటున్నాడు, పేరు ప్రఖ్యాతులు సాధిస్తున్నాడు, స్నేహితులను పొందుతున్నాడు, అదృష్టమును వరిస్తున్నాడు. కాలాను గుణంగా అతనిలో శక్తి సామర్థ్యములు పెరుగుచున్నవి.

మానవుని యొక్క గొప్పదనమేమిటంటే, అతని యొక్క శక్తి సామర్థ్యములు ఒకదాని కొకటి తోడై అన్నట్టుగా, ఐక్యతతో అనంతమైన శక్తిగా ప్రకటితమవుతున్నది. ఇటువంటి అనంతమైన శక్తియుతుల నుండి ఒక సంస్థ, ఒక వ్యవస్థ, సంఘము అను సమిష్టి యంత్రాంగము లలో ఐకమత్యమే బలముగా ప్రకటితమగుచున్నది.

సంపదలు ఉండి దయాగుణము తోడయితే అతనికి స్నేహితులతో బాటు పేరు ప్రతిష్టలు కూడా సొంతమవుతాయి. అలాకాక సంపదలు ఉండి ఔదార్యము లేని రోజున ఇతరుల ఈర్ష్యాద్వేషములకు గురి కావలసి వచ్చును.

కీర్తిప్రతిష్టల యొక్క శక్తి చాలాగొప్పది. ప్రతి ఒక్కరు గొప్పశక్తి యొక్క నీడను ఆశించేవారంతా ఈ గూటికి చేరి దీనిని మరింత బలపరుస్తారు. దీని వలన పేరు ప్రఖ్యాతులు మరింత వృద్ధిచెందును. ఈ వ్యక్తిత్వములోని లక్షణముల ఇష్టమును గానీ భయమను గానీ కలిగించవచ్చు. ఏది ఏమైనప్పటికీ ఇతని గొప్పశక్తికి అందరూ తల వంచుతారు. ఈ శక్తిలో ఎందరికో సాయము అందుతుంది.

సామర్థ్యముతో కూడిన గెలుపు ఎంతో ఉత్తమమైనది, శక్తివంత మైనది. ఈ శక్తివల్ల జ్ఞానము, అదృష్టము కలుగును. ఇట్టివారిని జనులు అనుసరింతురు. లేదా భయపడుదురు. దయగల స్వభావం గలవారు తమ ప్రేమతో మరింత శక్తివంతులవుతారు.

తెలివి తేటలు యొక్క శక్తి సామర్థ్యములను గుర్తించి, ప్రభుత్వ యంత్రాంగ ములలో తెలివి తేటలు గలవారికి అవకాశము లివ్వడం సహజముగానే జరిగే ప్రక్రియ. వివేకము గలవారు గొప్ప వాగ్ధాటితో నలుగురినీ మెప్పించేశక్తి గలవారు.

రూపమునకు సాయము గుణము తోడైన, స్త్రీపురుష బేధము లేకుండా గుర్తింపు లభించును. సామాన్య మానవులు శక్తిసామర్థ్యములు తేలికపాటి పనులయందు, ఇంద్రియ సుఖములయందు వినియోగించెదరు. వీరికి చావంటే భయం, అనారోగ్యమంటే భయం ఈ భయములకు కారణము, తనకు తన వారిచే రక్షణ లేదని భయపడటమే. దీనికి విరుద్ధముగా సమర్థులు కష్టములతో పోరాడి గెలుస్తారు.

సామాన్యమైన శక్తిసామర్థ్యములు కలవారు జ్ఞానము కోసము మరియు శాంతిని అందించే కళలయందు కోరికగలవారై యుంటారు. ఈ కోరిక వల్ల వారి తీరిక సమయము సద్వినియోగమగును. ఇట్టి కోరికలు తమకు అదనపు శక్తిగా పనిచేయును.

మనము ఒక వ్యక్తికి శక్తితోనయినా కుయుక్తితోనయినా అధికారము కట్టిపెట్టి శక్తివంతునిగా చేయడమనేది, మనల్ని మనం నాశనం చేసుకున్నట్లగును. వీరిరివురి మధ్య అనుమానములు పెరుగును.

అధికారం కోసం తాపత్రయములో ఒకదాని వెంట మరొకటి అన్నట్లుగా కష్టములు ఎదురవును. మానవుడు తన తెలివితేటలతో ఈ కష్టముల యొక్క స్వభావములను తెలుసుకుని తనకు అధికహాని జరగకుండా చేసుకుంటాడు.

సాంఘిక, నైతిక మరియు ఆధ్యాత్మిక సమస్యలన్నిటిలోకి అధికారం కోసం ఎదురయ్యే సమస్యల పరిష్కారములే చాలా కష్టముగా

అనిపించును. అధికారము కొరకు తాపత్రయ పడటం అనేది శరీరము యొక్క చెడు లక్షణం కాదు. అధిక తిండి వలన మరియు మితిమీరి ఇంద్రియసుఖ భోగమువల్లను శరీరము నీరసించి, పట్టుతప్పును. శరీర పరిస్థితి ఎలా ఉన్నా అధికార వ్యామోహము మాత్రము పెరుగుతూనే ఉండును.

సంఘరీతి ననుసరించి ఒక వ్యక్తి రాజకీయముగాగానీ, ఆర్థికముగా గానీ, మతపరముగా గానీ ఉన్నతస్థితికి చేరుకున్నప్పుడు, అతనికి అవకాశములపైన, వనరులపైన ఎక్కువ అధికారము కలదు. ఈ రంగములలో వృద్ధి అనేది నెమ్మది మీద సాగుతుంది. అయితే కొందరు తమలోని విశిష్టమైన లక్షణములతో చిన్నవయసు లోనే ఉన్నత స్థానములకు ఎదుగుతారు. వయస్సు పెరిగే కొద్దీ, వీరికి అధికారముపై అవకాశములు పెరిగి, మంచి లేదా చెడు మార్గములలో ఆ పదివిని వినియోగించుకొనును.

కొందరిలో ఎన్నో దుర్మార్గపు లక్షణములు ఉంటుంటాయి. ఈ లక్షణములను వీరు ఎన్నటికీ వీడరు. ముసలివారైనపిదప ఈ లక్షణములే వీరిని విడిచిపెట్టును అన్నట్లుగా జరుగుతుంది. అయితే పదవీ కాంక్ష విషయములో విషయము వేరుగా ఉంటున్నది. అనగా పదవీ వ్యామోహము గలవారు. తమలోని దుర్గుణములను వదులుకోరు, లేదా ఈ దుర్గుణములు కూడా వీరినే అంటిపెట్టుకుని వదలకుండా ఉంటవి. వయస్సు పెరిగేకొద్దీ వీరిలో పదవీ కాంక్ష అధికమై అధికమొత్తంలో తమ కోరికలను తీర్చుకుని గుర్తింపు పొందుతారు. మనము తరచు రాజకీయముగా ఎన్నో కార్యక్రమాలు వింటూ ఉంటాము. చూస్తూ ఉంటాము. ఆ కార్యక్రమముల వల్ల ప్రజలకు లాభము కలిగేది ఏమీ ఉండదు. కేవలం తమ అధికారమును ముసలి వయస్సులోనూ దుర్వినియోగం చేస్తూనే ఉంటారు.

రాజకీయములో అధికారము కోసం ఎన్నో వాగ్దానములతో ప్రమాణ పత్రములు విడుదల చేస్తుంటారు. ఇంతవరకూ ఈ వాగ్దానముల ఆచరణ కోసం ఎట్టి చర్యలు ఎవరూ చేపట్టిన దాఖలాలు లేవు. అధికారము ఎంతవరకూ పెరుగుతూనే ఉంటున్నందున, ఈ అధికారమును అదుపు చేయవలెనన్న మరియొక అధికారముతో చేతులు కలిపినప్పుడే అది సాధ్యపడును. జాతీయ సమైక్యత అనునది కేవలం అధికారంలో ఉన్న పెద్దల మద్దతుగా అర్ధమవుతున్నది.

ఈ కారణముచే స్వేచ్ఛను కోరే ప్రజలకు అధికార నియంత్రణ చాలా ముఖ్యము. స్వచ్ఛమైన పాలనకుసమతుల్యం మరియు క్రమశిక్షణతో కూడిన నైపుణ్యము చాలా అసవరమై ఉంటున్నది. ఈ నేపథ్యములో, అధికార నియంత్రణ కొరకు చేపట్టిన చర్యలలో ముఖ్యమైనది అధికారుల కాలపరిమితి. అందుకే ప్రజాప్రభుత్వములు తమ పాలకులకు కాలపరిమితిని నిర్ణయించినవి. కొన్నిచోట్ల రెండవసారి ఎన్నికద్వారా అవకాశం ఉండవచ్చు, ఉండకపోవచ్చు. ఒకవేళ ఎన్నిక ద్వారా అవకాశం ఉంటే, రెండవసారి ఎన్నికకు అవకాశం ఏర్పడవచ్చు. దీనికి పరిస్థితులు మరియు ప్రజల సమ్మతిపై ఆధారపడి ఉంటుంది.

**6. పొగడ్త, అజ్ఞానము :**

పొగడ్తల నాశించువారు, తమను పొగడినవారి పొగడ్తల ననుసరించి కార్యములు చేపట్టెదరు. అంతేకాదు మనము కొందరు వ్యక్తులను మరియు వారి పొగడ్తలను కూడా అలక్ష్యము చేస్తుంటాము. కొందరు మనుషులు చనిపోయాక పొగడుట జరుగుచుండును. ఈ పొగడ్తలు ఊరికేపోవు. సాధారణముగా పొగిడించుకోవడం అందరికీ లాభదాయకం, పైగా వారసత్వములా ఈపొగడ్తలు సాగుతూనే ఉంటాయి.

వారు జీవించి యుండనప్పటికీ, ఈ పొగడ్తల ఉపయోగము వారు గ్రహించెదరు. ఏదైతే ఇంద్రియములకు సుఖమును ఇచ్చునో, అదే విధముగా ఊహలు కూడా సౌఖ్యమునిచ్చును.

శాస్త్ర జ్ఞానము లేనప్పుడు ఒక వ్యక్తి మరొక వ్యక్తిని సంప్రదించ వలసిన అవసరము ఉంటుంది. ఎవరైతే తమ నిర్ణయములు, కారణము లపై ఆధారపడరో, వారు తమకంటె తెలివికలవారి అభిప్రాయములకు గౌరవమిచ్చి, ఆచరించి తాము మోసపోరాదు.

అజ్ఞానం వల్ల మాటల విలువను గ్రహించలేక, లేదా విషయము అర్థము చేసుకోని కారణము చేత మానవులు నమ్మకముతో పనులు చేపడతారు. ఆపని జరుగుతున్న సమయములో వారి నమ్మకము నిజమని తేలవచ్చు లేదా తప్పని తేలవచ్చు, మాటల గారడీ బయటపడవచ్చు. మానవులు ఒక విషయమును సూచించడానికి తమ మనోభిష్టము ననుసరించి వివిధ పదములను వాడటం జరుగుతున్నది. ఉదాహరణకు, ఒక వ్యక్తి అవతల వ్యక్తియొక్క అభిప్రాయమును అంగీకరిస్తూ, అది అతని వ్యక్తిగత అభిప్రాయమంటాడు. ఒకవేళ అవతలి వ్యక్తి యొక్క అభిప్రాయము నచ్చకపోతే, ద్వంద్వవైఖరిని వ్యక్తం చేయుట జరుగును. ద్వంద్వవైఖరికి, వ్యక్తిగత అభిప్రాయమునకు ఇక్కడ తేడా ఏమి ఉన్నది?

సహజముగా కొందరు తమ అజ్ఞానం వల్ల ఇతరులను తేలికగా నమ్ముతాడు. నమ్మశక్యము కాని విషయములను కూడా నమ్ముతాడు. కారణము వాటిని ఆలోచించు జ్ఞానము తమవద్ద లేక. కల్లాకపటం లేకపోయినప్పటికీ, మానవులు తమ అజ్ఞానముతో అబద్ధములను నమ్ముతూ, అబద్ధములను ఆడుతూ, అబద్ధములను పుట్టిస్తుంటారు.

భవిష్యత్తు గురించి తాపత్రయపడేవాడు, వాస్తవములోని పరిస్థితులను చక్కదిద్దుకుని, భవిష్యత్తును బంగారుబాటగా మలుచుటకు ప్రయత్నిస్తాడు.

సహజముగా జరిగే విషయముల పరిజ్ఞానము లేనివారు, అజ్ఞానం వల్ల కొన్ని అతీత శక్తులను నమ్మి భయమునకు లోనవుతారు. వీరికి మంచి జరిగితే, దానికి కారణము వారు ఊహించినశక్తులే అనుకుని వాటికి కృతజ్ఞతలు తెలియజేస్తారు. తమకు నచ్చిన వస్తువులను తమ దేవతలుగా భావించుకుంటారు. ఈ విధమైన భయముతో కూడిన ఆలోచనలే మతముగా రూపుదిద్దుకున్నది.

**7. బాధ్యత – క్షమాపణ :**

ఆచరణ అనునది, ఒక క్రమమైన పద్ధతితో, మానవుని యొక్క నైతికతను బహిరంగపరచును. దానికి కారణము మనిషియొక్క స్వభావమును అతని నైతికత శాశించుచున్నది. తు చ తప్పక ఆచరించు రీతిన ఈ నైతిక నియమములను మానవులు ఆచరించుటకు అలవాటుపడుదురు. 'నేను ఏమి చేయాలి' ? అనే ప్రన్న మానవుడిని తప్పించుకోలేదు.

ప్రవర్తనలోని సమస్యలను వెంటనే పరిష్కరించుకోవాలి. మరియొక సమస్య వచ్చాక మొదటి సమస్యను పరిష్కరించుకోవచ్చని తలచరాదు. కారణము, మొదటి సమస్య పరిష్కారమయిన పిదపనే రెండవ సమస్యకు పరిష్కారం సాధ్యమగును కాబట్టి, సమస్యలను పరిష్కరించకుండా వదిలేస్తే, సమస్యలు జటిలమై అర్థముగాక చాలా సమస్యలకు అవకాశమేర్పడుతుంది.

ఆచార సిద్ధాంతములపై స్థిరమైన నమ్మకంతో, ఆచరణలో ఎక్కువ సమయము పట్టినప్పటికీ ఈ సిద్ధాంతములను అనుసరించుట వలన మనిషిలో సహజజ్ఞానము అలవడును. ఇట్టి స్థితిలో ఈ నైతిక సిద్ధాంతములను సంపూర్ణముగా స్వీకరించుట జరుగును. అప్పుడు మనము వీటిని ఆజ్ఞాపనగా గాక వాస్తవములుగా స్వీకరించుట జరుగును. ఇట్టి సిద్ధాంతములపై ఎన్నటికీ సందేహములకు తావు ఉండదు. ఇట్టి తీరు మనలో బాధ్యతలను కలిగించును.

మనము చిన్నప్పటినుండి కొన్ని సిద్ధాంతములను ఆచరిస్తూ పెరిగినపుడు, ఆ సిద్ధాంతములను తిరస్కరించాలన్న ఆలోచనను మనము అసహ్యాపడేలా చేస్తుంది. ఒకవేళ నిజముగా ఆచరించని రోజున పశ్చాత్తాపమునకు గురి అవుతాము. అలాకాక ఎప్పటిలాగా ఆచరిస్తే, మన మనస్సు ఎంతో తేలికగా ఉంటుంది. ఈ విధమైన ఆలోచనలు మనలో బాధ్యతలను కలిగించును. ఆ బాధ్యత పరిస్థితులను బట్టి, అక్కడ చేరియున్నటు వంటి వ్యక్తులను బట్టి దాని తీవ్రత ఉంటుంది.

నైతిక విలువలు శాసనాలవలె మనకు ఉంటాయి. మనము ఆ నైతిక విలువలకు అగీకరించినా, స్వీకరించినా, ఆ విలువలకు బద్ధులై ఉంటాము. అనగా మన కర్మలను ఈ నైతిక విలువలు శాశించును.

ఒకరు తప్పు చేసారు. తప్పులను అనేకరకములుగా చేస్తుంటారు. ఆ తప్పుచేశాక, ఆ తప్పును సమర్థించేవారు అతని బంధువారంలోనివారు అతనికి అండగా నిలబడి, ఆ కష్టము నుండి అతనిని గట్టెక్కించే ప్రయత్నం చేస్తాడు.

ఒక తప్పును సమర్థించే సమయములో, అతను బాధ్యత వహించినపుడు, అతను ఎట్టి పరిస్థితులలోనూ తప్పు ఒప్పుకోడు.

అలాకాక, తప్పును సమర్థించే సమయములో తప్పును ఒప్పుకున్నప్పుడు, అతను ఆ తప్పునుండి బయటపడ వేయడానికి పూర్తి బాధ్యత వహించడు. లేదా అసలే బాధ్యత వహించడు. ఇటువంటి సందర్భములలో 'క్షమాపణకు అవకాశమేర్పడుతుంది. ఈ క్షమాపణల కార్యక్రమము ఒక విధముగా మంచిదే. తప్పొప్పుల సమీక్ష జాగ్రత్తగా జరిపి, స్వభావములో మార్పుకోసం ప్రయత్నం జరుగుతుంది. సాధారణముగా క్షమాపణల ప్రహసనములు కూడా సహజముగా జరగవు. ఎన్నో అవకతవకలతో జరుగును. అందుకే ఈ క్షమాపణ తంతులు సఫలము కావు.

# 33. నీతిశాస్త్ర తత్వము

పశ్చిమ నైతిక శాస్త్రమును గత రెండువేల సంవత్సరములలో, అనగా సాఫిస్ట్స్ కాలం నుండి 20వ శతాబ్దము చివరివరకు చేసిన పరిశీలనలో మూడు విషయములు వెలుగుచూపినవి. మొదటిది ఈ నైతిక విలువలను సత్యముగా ఒప్పుకొనక ప్రతిఘటించిన సంఘటనలు. ఈ నైతికవిలువలు రచించినవారే తమకు తోచిన రీతిలో ఈ నియమములను రచించి ఉండవచ్చుని భావించిన తీరు. రెండు ఈ నైతిక విలువలు కేవలం ఏ ఒక్కటో ఉద్దేశించి తీర్మానించినవి కాదని, వివేకముతో ఎవరైనా వీటిని ఆచరించవచ్చుని, వివరణలతో కూర్చిన సందర్భములు పొందుపరచిన వైనము. మూడు ఏది మంచి, ఏది చెడు, ఏది తప్పు, ఏది ఒప్పు అనే విషయముల గూర్చి అనేకమార్లు తర్జన భర్జనలు జరిపిన తీరు. గత వందసంవత్సరములలో ఈ పాత సిద్ధాంత ములకు అనేకమైన నూతనమైన మార్పులను సూచించెను. కారణము ఆచరణలో ఎదురయ్యే సమస్యలను పరిష్కరించే నేపథ్యంలో అనేక సంబంధమున్న విషయములలో మార్పులు సూచించబడెను. వీటిని మూడు విధములుగా తెలియజేయబడెను. అవినీతి శాస్త్రతత్వము, సహజమైన నీతిశాస్త్రము మరియు ఆచరణ యోగ్యమైన నీతిశాస్త్రము.

నైతిక శాస్త్రము యొక్క తత్వవిచారణ నిర్వహించుట ఎందుకు? మనకు శాస్త్రముపైన గలిగిన అనుమానములు తీరుటకు మరియు శాస్త్రముపై అవగాహన పెరుగుటకు. ఈ నైతిక సిద్ధాంతములలో ఉప యోగించిన భాషను మరియు భావార్థమును ఇక్కడ పరీక్షించెను. ఏ నైతిక సిద్ధాంతములు ఎవరు ఆచరించాలి అనే ప్రశ్న ఎన్నడూ ఉదయించ లేదు. నైతికతను దృష్టిలో పెట్టుకునే ఈ నైతిక సిద్ధాంతముల ఆచరణను స్వీకరించవలెను. ఉదాహరణకు, 'మంచి జీవితము అంటే ఏమిటి?',

'మానవుడి కర్తవ్యము ఏమిటి?' మొదలైన విషయములను తెలుసుకోవాలనుకున్నవారు, ఈ సిద్ధాంతములను, సూత్రములను అనుసరించినపుడు వారికి సమాధానములు దొరకును. ఇదే విధముగా నైతిక జీవితము యొక్క ఆవశ్యకతను తెలుసుకోవడం సముచితముగా ఉంటుంది. ఈ విధముగా మనము చేయవలసిన పనులు, అనుసరించవలసిన రీతులు, అందు ఇమిడి ఉన్న నైతిక సూత్రములు, సిద్ధాంతములు, వాటి ప్రమాణములను తెలుసుకొనుట మన మందరము చేయవలసిన మొట్ట మొదటిపని.

ఈ నైతిక శాస్త్రము మనల్ని ఉత్తములుగా తీర్చిదిద్దదు. ఈ నైతిక శాస్త్రము మనము ఉత్తములుగా తయారవడానికి దోహదపడుతుంది. ఈ నైతిక విలువలకు ఎందుకు కట్టుబడి ఉండాలి? ఎలాకట్టుబడి ఉండాలి? ఆచరణలో ఎదురయ్యే ఎన్నో సాధక బాధకాలకు ఏ రీతిలో ఈ నైతిక సిద్ధాంతములు మనకు సాయపడి అండగా నిలబడుతున్నాయి? ఇటువంటి ప్రశ్నలకు ఆచరణతో సమాధానములు రాబట్టి, ఈ విలువలను మరింత పటిష్టముగా ఆచరిస్తూ, వీటి విలువలను నలుగురికీ తెలియజేయడం కూడా జరుగుతున్నది.

నైతిక విలువలు మానవులకు మానవత్వపు విలువల గురించి అవగాహన పెంచును. ఈ నైతిక తత్త్వవిచారణతో చరిత్రను పరిశీలించి, అప్పటి ప్రజలయొక్క నైతిక జీవనవిధానములను పరిశీలించుట కూడా జరుగుతున్నది.

ఈ నీతిశాస్త్ర తత్త్వము ఈ సిద్ధాంతములను గూర్చి, నిర్ణయములను గురించి సోదాహరణముగా వివరించుట జరగదు. పైన ప్రశ్నలకు సమాధానములుగా ఈ సిద్ధాంతములు, నిర్ణయములు వివరించబడతాయి. అనగా ఇక్కడ విషయమును ముందుగా గ్రహించి,

అటుపిమ్మట ఆ అంశమునకు సంబంధించిన ప్రశ్నలు తయారుచేసి విషయమును అందించుట జరుగును.

ఉదాహరణకు: ఎవరైనా మంచి కార్యక్రమములు చేపట్టిన మంచి సుఖమును ఆచరించిన వారంతా పొందవచ్చును అని ఉన్నది. ప్రశ్న, 'ఎక్కువమంది గొప్ప సుఖములు ఎలా పొందగలరు?' ప్రశ్నను సరిగా అర్థము చేసుకుంటే తప్పు సమాధానం ఉండదు.

ఈ ప్రశ్న వివరణ రూపములో ఈ నైతిక తత్వవిచారణ ఎంతని వివరించగలము? ఈ నైతిక సిద్ధాంతములను ఆచరించుట వలన సుఖము అందునని తెలుసుకుంటాము. నిజానికి ఒక్క సుఖము మాత్రమే లభించునా? ఇంకా అనేకమైన విషయములు కూడా ఇందు ఇమిడి ఉంటాయి కదా. అనగా ఇందులో తెలియజేయబడని, ప్రస్తావించబడని ఇతర అంశములకు మరియొక వివరణ అవసరమవుతున్నది. ఇట్టి వివరణలు నైతిక విషయములకు సంబంధించి ఉంటే పరవాలేదు. అలాకాక నైతికతకు సంబంధములేని విషయములు వివరించిన సందర్భములలో ఈ నైతిక వివరణలు విఫలమవుతున్నవి.

ఈనాడు సహజ జ్ఞానము కలవారు ఈ నైతిక సిద్ధాంతములు వ్యక్తము చేయుసత్యములను వెంటనే గ్రహించి స్వీకరిస్తున్నారు. ఈ నైతిక సూత్రమును నిష్పాక్షికముగానూ, ప్రశాంత చిత్తముతోనూ, నిర్మల మనస్సుతోనూ, స్పష్టమైన అవగాహనతోనూ, శాంతితోనూ పరిశీలించి నట్లయితే, ఈ సూత్రములో లోపములు బయటపడవు. అంతేకాదు అనుభవజ్ఞుల ఆచరణ జ్ఞానమును కూడా వీరు సేకరించి ఉందురు. ఈ విధముగా విశ్లేషించకుండా, కేవలం తమ ఊహలతో ఈ సిద్దాంతములకు సై అంటే వీరు విఫలమగుదురు.

ఈనాటి సహజ జ్ఞానం కలవారు ఈ నైతిక సిద్ధాంతముల పట్ల తమ ఆలోచనా దృక్పథము వేరుగా కనబడుచున్నది. కొందరికి స్నేహములో ఉన్న మాధుర్యమంటే ఇష్టము. మరికొందరికి ప్రకృతి యొక్క అందచందాలంటే చాలా ఇష్టము. ఇంకొందరికి ఆచరించవలసిన కర్తవ్య కర్మలను ఒక పద్ధతి ననుసరించి చేయవలెనను స్వభావము కలవారుగా ఉంటారు. ఈ విధముగా విభిన్నభావములతో వ్యవహరించే వారికి ఈ నైతిక సూత్రములు నిర్ణయములలో లోటుపాట్లు వ్యక్తమగును.

సహజ జ్ఞానమనునది కాలముతోపాటు వివేక విచక్షణల కారణముగా కాలదోషము పట్టెను. ఈ వివేక విచక్షణ ప్రక్రియ అనుసరించి నిజమును రెండు రకములుగా వ్యక్తము చేయబడెను. ఒకటి, వివేకముతో కూడిన నిజము, రెండు వాస్తవ నిరూపణ. నిజానికి ఈ నైతిక సిద్ధాంతములు ఈ రెండు కోవలలోనూ చేరవు. కారణము, నిజమును ఈ సూత్రములలో కేవలము వివరణముగా, లక్షణముగా మాత్రమే తెలియజేసెను. ఈ సూత్రములను వాస్తవములుగా స్వీకరించవలెనన్న వివరములు ఉండవు. ఈ కారణములచే నైతిక న్యాయములో నిజములు గోచరము కావు అనే నానుడి వాడుకలో ఉంది.

ఒకే వాక్యమును నానారకములుగా అర్థము చేసుకోవడం మనము గమనిస్తూ ఉంటాము. నైతిక న్యాయము మన భావనలపై స్పందన కలిగించును, ఇక్కడ ఒకచోట చెడు జరిగినదని తెలుపగానే, మనము జరిగిన ఆ చెడుకు స్పందిస్తాము, ఖండిస్తాము. అంతేకాదు మన అభిప్రాయములను ఇతరులకు తెలియజేస్తూ, పంచుకుంటూ వారినుండి కూడా సమ్మతిని కోరుకుంటాము. ఈ కారణముచేతనే సహజముగా మనలో చాలామంది మన సొంత అభిప్రాయములను ఇతరులకు తెలియజేసి వారి అంగీకారమును కూడా కోరుకోవడం జరుగుతుంది.

అయితే మంచి చెడుల నిర్ణయము సరిగా తెలుసుకోకుండా, వ్యక్తిగత అభిప్రాయములను తెలియజేయడం సరికాదని వీరిమీద ఒక విమర్శ ఉంది.

మన ఉనికిని తెలియజేయు రీతిలో ఇక్కడ మన మానసిక స్థితియందు మార్పులు సూచింపబడెను. అనగా అట్టి వాస్తవిక పరిస్థితులలో నీవు నిజముగా, అనగా నిర్బంధ పరిస్థితులలో నీవు ఏ విధముగా స్పందించావు, ఏ విధముగా నీవు ఆ చెడును గ్రహించావు అన్నది ఇక్కడి విషయము. నీవు 'యదార్థమును' సమర్థించినంతవరకు నీవు ఎట్టి విమర్శలకు గురికావు.

నైతిక న్యాయమును గ్రహించుటకు మరియొక విధానము కూడా కనిపెట్టబడెను. ఈ విధానము ననుసరించి నైతికన్యాయము మొదట్లో దేనినీ వివరించి తెలియజేయదు. అంతేకాదు ఇక్కడ మన అభిప్రాయ సేకరణ కూడా జరగదు. అయితే ఇక్కడ ఎలా జరుగుచున్నది? 'నైతిక న్యాయము ఆజ్ఞాపించుచున్నది. కార్యము వివరించుచున్నది'. ఇక్కడ కర్తను ఉద్దేశించి ఆజ్ఞాపించడమైనది. ఎవరూ ఇక్కడ ఎవరికీ ఏదిమంచో, ఏది చెడో చెప్పడం ఉండదు. ఇక్కడే నైతిక స్వేచ్ఛ లభిస్తున్నది. ఇక్కడ నైతిక స్వేచ్ఛ మరియు మన వివేక విచక్షణలతో నైతికన్యాయము పట్ల మన అభిప్రాయమును నిర్ణయించుకుంటాము.

నైతిక న్యాయము అందరి సమ్మతిని బడయవలెనన్న వివేకముతో కూడిన కారణములు చూపించాలి. ఇటువంటి సన్నివేశములను వివేక విచక్షణలతో పరికించడం జరుగుతుంది. కానీ మానసికముగా స్పందించాల్సిన అవసరము ఉండదు. ఇక్కడ ఎవరైనా మంచి, ఒప్పుగా భావించినట్లయితే అందరి సమ్మతికి కట్టుబడినట్లే. అందరి సమ్మతి అన్నది ప్రత్యేకమైన శక్తివంతమైన వివేకముతో కూడిన ప్రక్రియ. ఇట్టి

ప్రక్రియతో కొన్ని నైతిక న్యాయమును విశ్లేషించుట జరిగెను. అంతేకాదు ఏమైనా తేడాలుంటే, వాటినికూడా విశ్లేషించ సాధ్యపడును.

ఇక్కడ నైతిక విలువలయొక్క ఆవశ్యకతను కూడా విశ్లేషించబడెను. ఈ విలువలంటే ఎంతమందికి శ్రద్ధ? ఈ విలువలను ఎంతమంది కోరుకుంటున్నారు? అన్నిటికంటే గొప్ప విలువ ఏమిటి? అన్నిటికంటె ఉత్తమ విలువ కలిగినది మన సమగ్రమైన అవసరములను సామరస్య పూర్వకముగా సహకరించును. నైతిక సిద్ధాంతముల యొక్క ఉపయోగము ఏమిటి? ఈ నైతిక సిద్ధాంతములు మన కోరికలను తీర్చును, మనకు క్షేమమును సమకూర్చును మరియు మన అభివృద్ధికి దోహదపడును. నైతిక సిద్ధాంతములు సమాజ శ్రేయస్సుకు తోడ్పడేందుకు సూచించి నట్లుగా గుర్తించడమైనది.

ఎప్పుడైతే ఒక నైతికన్యాయము జనసామాన్యమునకు ప్రతిపాదించ బడుతుందో, ఆ ప్రతిపాదనకు ముందుగానే ఆ నైతిక సూత్రముల యొక్క ఆశయములు, వాటివల్ల కలిగే ప్రయోజనములు, ఇబ్బందులు మొదలగున్నవి అన్నిటిని పరిశీలించవలెను. ఈ నేపథ్యంలో వీటిని ప్రతిపాదించేవారు తమ వ్యక్తిగత ప్రయోజనములను మరచిపోవాలి. ఈ విధముగా నిష్పాక్షితముగా చేసిన ప్రతిపాదన వల్ల అందరికీ న్యాయమును కూర్చి అందరి మన్ననలను పొందుట జరుగును.

నైతిక న్యాయము భౌతిక విషయములను, వ్యక్తిగత అనుభవ ములతో కూడిన వాస్తవములను ఇముడ్చుకోక పోయినప్పటికి, నిజమా? అబద్ధమా? అని శంకించే వ్యక్తులు ఉంటారు. ఇట్టి పరిస్థితిని నైతిక నిజమని గ్రహించటం జరుగును. వాస్తవము నుండి భౌతికమును వేరు చేసినపుడు ఈ నైతిక న్యాయము సత్యమని లేదా అబద్ధమని గ్రహింతురు.

మనము నైతిక కార్యములను ఆచరించు సమయములో, మనము నైతిక విలువలను ఆచరణలో చూపవలెను. 'నీవు నైతికతను ఎందుకు ఆచరించాలి?' అనే ప్రశ్నకు నీ ఆచరణలోనే సమాధానము దొరుకుతుంది. సహజజ్ఞానం కలవారు, ఈ ప్రశ్నకు ఎన్నో వివరములిస్తారు. వీరి దృష్టిలో నైతికత అన్నది అతరంగమందు వెలువడు కారణములకు సమాధాన ములని వీరి భావన. భావావేశములకు లోనయ్యేవారు ఏది నిర్ణయించినా నైతికమే అని భావిస్తారు. వీరి నిర్ణయములు అందరికీ ఆమోదయోగ్యము కాదు. దీనికి కారణము నైతిక కోరికలు మనలో నైతికతను అనుకున్న రీతిలో పెంచకపోవడమే.

స్వార్థస్వప్రయోజనములకు మరియు నైతికతకు మధ్యనున్న సంబంధమును విశ్లేషించుట చాలా కష్టము. మనము ఎన్నోసార్లు చూసాము. స్వార్థముతో సుఖమును ఆశించినవారు సుఖమును పొందలేకపోయారు. అయితే కొందరి జీవితములను గమనించినట్లయితే, వారు ఎంతో ఆదర్శముతో తమ జీవితములను వెళ్ళబుచ్చుతారు. అటువంటివారు సంతృప్తిగా, సంతోషముగా జీవిస్తారు. మన కోరికల ననుసరించి కారణములు ఉంటాయి. ఈ రెండింటిని అనుసరించి మన వివేక విచక్షణములను ఉపయోగించాలి.

రాల్స్ ప్రతిపాదించిన నైతికశాస్త్ర తత్త్వమును అనుసరించి, 'బలమైన నైతిక సిద్ధాంతము నైతిక న్యాయమును ప్రతిబింబించును'. రాల్స్ దృష్టిలో ప్రతిబింబించు నైతిక న్యాయము ఒక పరీక్షావేదికగా వ్యక్తమగుచున్నది. అన్ని సిద్ధాంతములను పరీక్షింప వీలులేని కారణమున రాల్స్ ప్రతిపాదన బలహీనపడెను.

బ్రాండ్ట్ మరొక విషయమును ప్రతిపాదించెను. మంచి అనే ప్రతి అంశము వివేకముతో చక్కగా వివరించబడగలదు. అతని సూచన మేరకు

మానసిక చికిత్స ద్వారా అపనమ్మకములు, భవిష్యత్ గురించి కోరికలు, ఇతర కారణములతో కలిగిన ఇష్టములు మరియు ద్వేషములు, చిన్ననాటి కష్టములు మొదలైన వాటన్నిటికీ వివేకముతో సరిచేయబడునని తెలిపెను.

అతని అభిప్రాయము ప్రకారము ఏదిమంచో, ఏది చెడో తెలుసు కోవడం అందరికీ చాలా అవసరము. ఏదయితే చెడుగా నిర్ణయించ బడుతుందో, దానిని నైతిక సిద్ధాంతములు అనుమతించవు. మరియు సంఘములోని వివేకవంతులు కూడా తిరస్కరించెదరు. ఇక్కడ ఇతను ఒక ప్రశ్నవేసెను. వివేకముతో ఎప్పుడు మంచిపనులు చేయుట సాధ్య మగునా? సాయము చేయువ్యక్తి వివేకముతో ఎల్లవేళలా మంచి పనులకు అలవాటు పడవచ్చని అతని అభిప్రాయమును తెలిపెను. అదే విధముగా వీరు అవినీతి పట్ల అసహ్యమును ప్రకటించెదరు. అయితే వీరిలో మంచి నైతిక విలువలు ఉన్నప్పటికీ, ఒక్కొక్కసారి స్వార్థ స్వప్రయోజనముల విషయములో తమలోని నైతిక విలువలు వెలవెలబోతున్నవి. వివేకముగల వ్యక్తి తాను ఆచరించు కర్మలను ప్రతిసారి సమర్థించుకోగలడు కాని ఒక్కొక్కసారి అతని వద్దకూడా సమాధానము లోపించును.

ఇప్పటివరకు తెలుసుకున్న విషయములను పరిశీలించిన నైతిక న్యాయమునకు రెండువైపులా ఉన్న అంశములను గ్రహించుట జరిగెను. కారణములతో వివరించిన మేరకు ఈ అంశములను సమర్థించి ఒప్పుకొనుట జరుగును. అనగా వివరములు లేనిచోట అసమర్థతకు అనగా విభేదములకు తావు ఉన్నది. ఇక్కడ మరియొక సమస్య ఉన్నది. అది ఏమిటంటే, అసలు నైతిక సిద్ధాంతములలోని న్యాయమును తప్పులేదా ఒప్పులుగా పరీక్షించుట భావ్యము కాదని ఈ ప్రశ్నలకు అనగా నైతికత మరియు స్వార్థ స్వప్రయోజనముల మధ్య తలెత్తే ప్రశ్నలకు యుగములు గడచినా సమాధానములు లభించుటలేదు అని అర్థమగుచున్నది.

## 34. సహజమైన నీతిశాస్త్రము

సహజమైన నీతిశాస్త్రము. మానవాళి ఆచరణకు ప్రమాణములు, నియమములను సూచించుచున్నది. సామాన్యమైన వివరణములతో ఒప్పు అనిపించే పనులను చేపట్టుట ఇక్కడ ఒక ముఖ్యమైన విషయం. ఇక్కడ పరిణామాలను దృష్టిలో ఉంచుకుని ఆ కార్యముయొక్క మంచి చెడుల నిర్ణయము జరుగుతుంది. వీటిని పరిణామ క్రియలుగా గుర్తించ బడుచున్నవి.

పరిణామ క్రియలను శ్రేష్టమైన ఉపయోగితావాదముగానూ చెప్పుకొన వచ్చును. శ్రేష్టమైన ఉపయోగితావాదము ననుసరించి ప్రతి పనిని మంచి లేదా చెడుగా గుర్తించవలెనన్న, ఈ కర్మతో మరోకర్మయొక్క పరిణామములను పోల్చవలెను. ఆ విధముగా రెండు కర్మల పరిణామ ములైన సుఖమును పెంచుటయందు లేదా బాధను తగ్గించుట యందు ఈ వ్యత్యాసమును గమనించుట జరుగును. దీనినే సౌఖ్యము, ఆనందమును బోధించెడు మతముగా చెప్పబడుచున్నది.

ఉపయోగితావాదమును మరింత విస్తరించిన దానిని పరిణామ క్రియావాదముగా చెప్పవచ్చును. ఈ సిద్ధాంతమును రూపొందించినది జి.ఇ.మూర్. ఈ సిద్ధాంతము ప్రకారము, నైతిక పరిణామములకే పెద్దపీట వేయబడుచున్నది తప్ప, సుఖము, కష్టముల గురించి పెద్దగా పట్టించుకో నవసరంలేదు. ఉదాహరణకు: అందముగా ఉండడమనేది మంచిదే. ఈ అందమువల్ల కొంత హాయి అనిపించును. అదే విధముగా స్నేహము లోని తీయదనముతోపాటు అంతరంగమందు మరింత హాయి అనిపిస్తుంది. ఈ పద్ధతిలో పరిణామ విశ్లేషణతోబాటు, అందించు సుఖమును కూడా విశ్లేషించడం జరుగుతుంది.

మరియొక పరిణామ క్రియావాదము పేరు మేలైన ఉపయోగితా వాదము. మనకు మేలును కూర్చేవి అనేకముగా ఉంటుంటాయి. ఈ పద్ధతివల్ల మానవుడు వీటిద్వారా ఎక్కువ తృప్తిని పొందగలడు. వీటిపట్ల మానవులకు కోరిక కలుగుతుంది. అయితే మానవునకు ఏది మేలు చేస్తున్నది. సాధారణముగా మానవులు చిన్న చిన్న సుఖములు మరియు మతిలేని సౌఖ్యములను అనుభవిస్తూ తమ జీవితములను గడిపేస్తుంటారు అనే ఒక అపవాదు ఉంటున్నది. ఈ సిద్ధాంతం ప్రకారం అట్టి వాదమునకు దూరము కావచ్చు. ఈ సిద్ధాంతము ప్రకారము జనులకు మేలును చేకూర్చు విషయములపట్ల అవగాహన పెంచుతారు. ఈ అవగాహనతో ప్రజలే తమకు ఏ కోరికలు కావాలో నిర్ణయించుకుంటారు.

పరిణామ క్రియావాదులను రెండు రకములుగా విభజించవచ్చు, వారు క్రియా ఉపయోగితావాదులు మరియు నియమ ఉపయోగితా వాదులు. ఏది ఈ రెండింటిలో ఉన్నతమైనది? క్రియా ఉపయోగితా వాదముతో ఉన్నతమైన పరిణామములు సంభవించుట, నియమమును అనుసరించి ఉన్నతపరిణామములను అందుకొనుటను నియమ ఉపయోగితా వాదమందురు. ఈ రెండింటి తేడాలు సందర్భోచితముగా ఉండును. ఈ నియమ ఉపయోగితావాదమువల్ల పరిణామములు నైతికమునకు దగ్గరలో ఉండును. నియంత్రణలో ఉండును. మరియు ఈ పరిణామములు వల్ల బాధ తక్కువగా ఉండే లాగున ఉండును. ఎప్పుడైతే నియమముతో పరిణామమును నియంత్రించుట జరుగుచున్నదో, కొన్ని పరిణామములు పరిగణలోకి తీసుకోకుండా వదిలివేయువలసి వస్తున్నది. కొన్ని పరిణామములను పట్టించుకోకపోవడమనేది, అసలు సిద్ధాంతమునకే విరుద్ధముగా ఉంటున్నది. ఈ కారణముచే ఈ సిద్ధాంతమునకు అందరి సమ్మతి లభించుటలేదు.

మనము నిత్యజీవితములో తీసుకునే నైతిక నిర్ణయములు మన సహజ జ్ఞానముతోను నైతిక విలువలతో కూడినవిగా ఉంటున్నవి. ఈ సిత్థతిలో మనకు కలిగే పరిణామములను మనము ఏ విధముగానూ తెలుసుకొనడానికి ప్రయత్నించుటలేదు. ఆ సిద్ధాంతముల ననుసరించి, నేర్చుకుని, స్వీకరించి, ఆచరించి మంచి లేదా చెడులను పొందుతున్నాము. ఈ నైతిక సిద్ధాంతములను, సహజజ్ఞానముతో ఆచరించినపుడు చాలామంచి ఫలితములను పొందవచ్చును. ఈ నైతిక సిద్ధాంతములు స్పష్టముగా, చిన్నగా ఉండి వివేకముతో అందరూ గ్రహించేలా ఉండాలి. సహజ జ్ఞానముతో చేసిన నిర్ణయములకు సామాన్య జ్ఞానముతో చేసిన నిర్ణయములకు మధ్య తేడాలు పెద్దగా ఉండవు.

న్యాయసూత్రములను ఎంపిక చేసుకునే సందర్భములో, ప్రజలకు కలుగు నష్టముల నుండి తమనుతాము రక్షించుకోవడానికి వారికి రెండుమార్గములు సూచింపబడెను. మొదట, తాము అధిక స్వేచ్ఛను కోరుకుంటూ, తమ చుట్టూ ఉన్న వారికి కూడా అట్టి స్వేచ్ఛ లభించాలని కోరుట. రెండవది సూత్రముననుసరించి నడచుట. ఈ సూత్రము ద్వారా సంఘములోని అందరిమేలు కోరుట జరుగుచున్నది. అయితే ఇక్కడ వనరులను సమానముగా పంచుటకు వీలగుట లేదు. సూత్రము ననుసరించి జరిగే పరిపక్వము ప్రకారము వారి వారి నైపుణ్యమును అందే ప్రతిఫలములను దృష్టిలో పెట్టుకున్న ఈ నియమమువల్ల కూడా సరియైన న్యాయము జరుగుటలేదు.

నైతిక విలువల దృష్ట్యా, హక్కులనేవి నైతిక సిద్ధాంతములనుండి లేదా సాంఘిక మరియు న్యాయసంబంధమైన ఆచరణములనుండి గ్రహించవలెను. అయితే ఇక్కడ ఆ విధానం మారినది. హక్కులనేవి నైతిక సిద్ధాంతములనుండి గ్రహించడమైనది. జీవించడానికి స్వేచ్ఛను

అనుభవించడానికి, న్యాయపరముగా సంక్రమించిన ఆస్తిని అనుభవించ డానికి మనము హక్కులు కలిగి ఉంటున్నాము. శాసన ఉల్లంఘన అనునది చట్టబద్ధము కాదు.

ఉపసిద్ధాంతము ననుసరించి, ఇతరుల హక్కులను కాపాడుటలో సహాయపడుట అనునది మన కర్తవ్యముగా ఉంటున్నది. ఈ సహాయము అందించు సమయములో వారి హక్కులకు ఏ విధమైన ఉల్లంఘన జరుగరాదు. నైతిక విలువలు రాజ్యాంగములోని మూలాధారమైన హక్కుని కల్పించుటలో తోడ్పడెను. అందరికీ సమానమైన హక్కు మరియు అందరినీ గౌరవించుట. ఇతరులను గౌరవించుట అనే మాటలో అర్థము ఇతరులకు సాయపడుట అను అర్థముతో వారిని నిర్లక్ష్యముగా వదల కూడదని అర్థము. ఈ సూత్రము ననుసరించి మనము ఎన్నో విషయము లందు, హక్కులను కాపాడు నెపముతోను, ఇతరులను గౌరవించు నెపముతోనూ ఇతరుల కార్యములందు జోక్యము చేసుకొనుటకు వీలగును. కాంత్ ప్రతిపాదించిన మనుషులను గౌరవించుట అనునది నైతికముగా మూలాధారమైన సిద్ధాంతముగా గుర్తించవలెను.

ప్రకృతికి సంబంధించిన నైతిక నియమముల విషయములో అందరూ బాధ్యతతో నియమములను అనుసరించవలసినదే. ఈ ప్రకృతికి సంబంధించిన వనరులు జీవితము, జ్ఞానము, ఆటలు, అనుభవములు, స్నేహము, ఆచరణ యోగ్యమైన కారణములు మరియు మతము. ఈ వనరుల యొక్క విశిష్టతను మనుష్య శాస్త్రమునందు వివరింపబడెను. ప్రతి వనరులు చాలా ముఖ్యమైనవి. ఇందులో ఏ వనరు ఎక్కువ, ఏది తక్కువ అని నిర్ణయించుట కుదరదు. ఈ వనరులు ఎవరెవరికి, ఎంతెంత అన్నది కూడా నిర్ణయించడం సాధ్యముకాదు. ఈ వనరుల వాడుకలో హాని కలుగుటను నిరాకరించును.

నైతిక అహంకార సిద్ధాంతము ప్రకారము ప్రతి ఒక్కరు తమయొక్క కార్యములను స్వంత ప్రయోజనముల దృష్ట్యా పట్టించుకోవలెను. దీనివల్ల స్వప్రయోజనములు మరియు మనలోని నైతికతకు భంగము వాటిల్లదు. మనము మన కార్యకలాపముల వల్ల ఇతరులకు అన్యాయము చేయ నంతవరకు, మన సొంత ప్రయోజనములు వివేకముతో సాధించుటను ప్రోత్సహించవచ్చును. నైతిక అహంకారము మంచిదని తోచిన, నీ నైతికము కూడా నీకు స్పష్టముగానే అర్థమగును. సర్వసామాన్యమైన అహంకారము ననుసరించి, 'ఎవరైనా తన కోసం ఏమైనా సాధించ వచ్చును' అని తెలుపుచున్నది. ఈ సిద్ధాంతమున ఎవరిపేర్లు సూచింప బడలేదు. అందరూ కూడా తమ తమ వ్యక్తిగత ప్రయోజనముల కోసం తప్పకుండా పాటుపడవచ్చని తెలుపుచున్నది. కాబట్టి ఇది కూడా నైతిక సిద్ధాంతమగానే చెప్పుకోవచ్చు.

అయితే ఇక్కడ ఒక విషయము గమనించాలి. ఎవరికివారు తమతమ పరిధిలో తమ మేలుకోసం పాటుపడడం సబబే అని అంగీకరించడం జరిగింది. కానీ ఈ సిద్ధాంతము అన్ని సందర్భము లలోనూ సరికాదు. ప్రాథమిక నియమములను పాటించినప్పుడే అందరికీ సమాన న్యాయము అందునని మనందరికీ విధితమే. ఈ నేపథ్యములో నియంత్రణ, హద్దులు ఏర్పరచుట అనునది ప్రభుత్వము యొక్క బాధ్యత. ఈ బాధ్యతలో ప్రజలు కొన్ని మూలసిద్ధాంతములను ఆచరించే విధంగా వారికి అందవలసిన ప్రజోపయోగ కార్యములు వారికి అందేలాగున ప్రభుత్వం బాధ్యతగా గుర్తించవలెను.

## 35. ఆచరణతో కూడిన నైతికత

సామాన్యమైన నైతికతలోని లోటుపాట్లను సరి చేయడానికి ఆచరణతో కూడిన నైతికతను ప్రతిపాదించెను. గత కొన్ని వేల సంవత్సరములనుండీ అవి సంఘంలో మానసిక తత్వవేత్తలు ఆత్మహత్యలు, చిన్న పిల్లల సమస్యలు, ఆడవారిని అణచివేయుట, శృంగార నియమాలు, ప్రభుత్వ ఉద్యోగుల పనితీరు, మొదలైన సమస్యలపట్ల తమ ఆలోచనలను వెల్లడించారు. సమయము గడిచేకొద్దీ సమానత్వం, మానవ హక్కులు, న్యాయము, యుద్ధము, సంఘ నిరాకరణోద్యమం, సాంఘిక దురాలోచనలు, గర్భస్రావం, మానవజన్మ విలువ, వాతావరణ పరిరక్షణ, అనాయాస మరణము, సమానముగా సంపదల పంపిణి మొదలైన విషయముల పట్ల మానసిక శాస్త్రవేత్తలు తమ ఆలోచనలను కేంద్రీకృతం చేశారు.

మనము తరచూ, 'మానవులంతా ఒక్కటే' అనే నినాదములను వింటూ ఉంటాము. ఇటువంటి వాక్యములు రాజకీయ మరియు సాంఘిక దృష్టితో విలువను ఆపాదించుకున్నవి. రాజ్యములు పోయి ప్రజా ప్రభుత్వములు ఏర్పడినవి. రాజనీతిలో అనేక మార్పులు చోటుచేసుకున్నవి. మానవులంతా ఒక్కటే అన్న భావనను రాజకీయములందు బాగా ఉప యోగించుకుంటున్నారు.

కులమతవర్గ వివక్షతలను రూపుమాపే ప్రయత్నములు జరుగు చున్నవి. ఈ సిద్ధాంతమునకు అనుకూలముగా ప్రస్తుతము వెనుకకు మళ్లించు పద్ధతిలో వివక్షత మొదలైనది. అనగా అమెరికాలోని నల్లజాతి వారికి, భారతదేశములోని షెడ్యూల్డ్ కులాలు, తెగలవారికి గతములో జరిగిన అన్యాయము దృష్టిలో పెట్టుకుని, వారికి ప్రస్తుతము న్యాయము జరిగే దిశగా చర్యలు తీసుకొనబడుతున్నవి. గతములో జరిగిన వివక్షత

వల్ల, ఆ ప్రజలకు చాలా అన్యాయము జరిగి ఇప్పటికీ వెనుకబడి ఉన్నారు. వీరికి 'మాక్సిమన్' సూత్రము ననుసరించి ఇప్పటికైనా న్యాయము జరగాలి.

స్త్రీ పురుష వ్యత్యాసముల పట్ల కూడా శ్రద్ధ వహించడమైనది. ఈ విషయము గురించి ఎంతో చర్చ జరుగుతున్నది. స్త్రీ పురుష సమానత్వ మంటె ఆడ–మగవారి బాధ్యతలను మరిచిపోవడమా? లేక బాధ్యతలు ఏమైనప్పటికీ స్త్రీ పురుషులకు సమానహోదా ఇవ్వాలా? ఆడవాళ్లకు, మగవాళ్ళకు వివిధ స్థాయి హోదాలలో ఉన్నవారికి చర్చలు జరుగుతున్నాయి. స్త్రీ పురుషుల అసమానత్వమును తొలగించే ఉద్దేశ్యముతో ఈ చర్చలు జరుగుతున్నాయి.

స్త్రీలను అణచివేతకు గురిచేసినందుకుగాను ఇప్పుడు స్త్రీకి పూర్తి స్వేచ్ఛా స్వాతంత్ర్యములను కల్పించాలి అన్నది నేటి అభిమతము. స్త్రీకి కూడా పురుషునితో పాటు సమాన హక్కులను కల్పించాలి అని రంగముల లోను, సంఘములలోనూ కోరుతున్నారు. అప్పుడే స్త్రీలు సంఘములో అభివృద్ధి చెందుతారు.

సంఘములో న్యాయము మరియు సమానత్వముల అంశములలో పెద్దగా సమస్యలు కానరావడం లేదు. సంపదల విషయములో సమానత్వ విషయము గురించి ఏ విధమైన ఆలోచనలు చేపట్టడం లేదు. అయితే ఈ విషయములో కూడా ఆలోచనలు మొదలయ్యాయి. బాగా ధనిక వర్గాలవారికి అన్ని వసతులు సమృద్ధిగా ఉంటే, పేద వర్గములవారికి కనీసము మౌలిక సదుపాయములు కూడా అందుటలేదు. ఈ విధమైన అసమానతలకు పరిష్కారము ఏమిటి? సాటి పేదవారు బాధపడుతుంటే ధనవంతులు చూస్తూ ఊరుకుంటారా? వారికి పేదవారిపై నైతిక బాధ్యత లేదా? ఈ చర్చల కారణముగా అనేక దేశములలో, అనేక ధనిక

వర్గములవారు పేద ప్రజల సంక్షేమము కోసం గతములో కంటె నేడు అనేక చర్యలు చేపట్టారు.

పైన చేపట్టిన చర్యలను అమలుచేస్తూ, సత్కార్యముల ద్వారా సంఘములో నలుగురికీ మేలు చేయు నిమిత్తము 'ట్రస్ట్' వ్యవస్థ ఏర్పడినది. ఈనాడు మానవులు సంపాదిస్తున్నారు. వారి సంపాదనకు హద్దులు ఏర్పరచినారు. పరిమితికి మించి ఆస్తులు ఉన్న నేపథ్యములో వారి సంపాదనను సద్వినియోగము చేయుటకై, ఈ ట్రస్టులను ఏర్పాటు చేసుకొనవచ్చును. ట్రస్టు ద్వారా సద్వినియోగము కాబడు నిధులకై ప్రభుత్వము యొక్క అజమాయిషీ ఎంత మాత్రము ఉండదు. ఒకవేళ ప్రభుత్వ అజమాయిషీ ఉంటే, ఈ ట్రస్టు వ్యవహారములలో ఎన్నో వ్యతిరేకతలు ఎదుర్కొనవలసి వచ్చును. ప్రభుత్వము యొక్క అజమాయిషీ లేని కారణమున, ట్రస్టులు స్వచ్ఛందముగా ముందుకు వచ్చి సంఘ శ్రేయస్సుకై అనేక చర్యలు చేపట్టుచున్నవి.

జంతువుల పట్ల సానుభూతితో అనేక చర్యలు చేపట్టడం జరుగుతున్నది. మానవులు అనేక విషయములలో ఇతర జంతువుల కంటె ఉన్నతమైన హోదాను అనుభవించుచున్నాడు. ఈ ఆలోచన వల్ల జంతువుల పట్ల కూడా దయ, కారుణ్యముతో మానవుడు వ్యవహరించ వలసిన అభిప్రాయము సర్వత్రా వ్యక్తమగు చున్నది. ఈ నేపథ్యములో జంతువుల పట్ల క్రూరత్వమును తగ్గించేందుకు అనేక దేశములలో, సంఘములలో కార్యక్రమములు చేపట్టబడెను.

వాతావరణ పరిరక్షణ అన్నది మరియొక అంశము. ఈనాడు వాతావరణ సమస్యలు మానవుని దృష్టికి వచ్చినవి. పాత సమస్యలకు తోడు కొత్త సమస్యలు గురించి చర్చలు జరుగుచున్నవి. గతములో జరిగిన అనేక మానవ తప్పిదముల వలననే ఈనాడు ఈ విషయముల

గురించి ఆలోచించవలసిన అవసరము ఏర్పడినది. అడవులు తరిగి పోవుచున్నవి. కొన్ని జంతువులు అంతరించిపోతున్నవి. వాతావరణ సమతుల్యము దెబ్బతింటున్నది. ఈ నష్టములన్నీ మానవ తప్పిదముల వలన జరిగినవే. ఇవేకాక ఇతర కారణములు కూడా ఏమైనా ఉన్నాయా? జంతువులు, అడవులు, నదులు, వాతావరణ పరిస్థితులు మొదలైన విషయములన్నిటినీ మానవుడు తన స్వార్థస్వప్రయోజనాలకు ఉపయోగించు చున్నాడను విషయము నేడు అందరి దృష్టికి వచ్చినది. ఈ నేపథ్యములో వీటిని కాపాడుటకు తక్షణ చర్యలు చేపట్టవలసిన అవసరము అనివార్య మగుచున్నది.

వాతావరణ సమస్యలు ప్రస్తుత తరమునకే కాక, భావితరాలవారిని దృష్టిలో పెట్టుకుని సమస్యల పరిష్కరణకు పూనుకోవాలి. మన భవిష్యత్తుకు ఏమి వాగ్దానము చేయగలము? స్వార్థం వల్ల, అహంకారము వల్ల భావితరాల వారి దృష్టిని ఆకర్షించే రీతిలో ఎట్టి చర్యలు చేపడుతున్నట్లుగా కనిపించుటలేదు.

ఉన్న విషయము చెప్పుకోవాలంటే, భావితరాలవారి గురించి ఆలోచించే తీరిక ఎవరికీ లేదు. ఈనాటి మానవుడు తన సమస్యలతోనే సతమతమవుతున్నాడు. అయితే ఈనాడు రేడియోధార్మిక వ్యర్థ పదార్థముల దృష్టి అన్ని సమాజములపై బడినవి. వాటిని నిర్లక్ష్యము చేయుట కుదరదు. భావితరాలవారిని దృష్టిలో పెట్టుకుని తక్షణ చర్యలు చేపట్టవలసి ఉంటుంది.

ఈనాడు మరో ముఖ్యమైన అంశము జనాభా సమస్య. ప్రపంచ జనాభా బాగా పెరుగుతున్నది. దీనివల్ల కుటుంబ వ్యవస్థలలో అనేక మార్పులు వస్తున్నాయి. ఉమ్మడి కుటుంబ వ్యవస్థ తగ్గుతున్నది. చిన్న చిన్న కుటుంబాల వ్యవస్థ అధికమైనాయి. ప్రపంచ జనాభా ఇప్పటికే

బాగా రద్దీగా ఉన్నదని అందరి అభిప్రాయం. అయితే ఇక్కడ ఒక ప్రశ్న. ప్రపంచ జనాభా ఎంత ఉండాలి? అభివృద్ధి స్థాయిని జనాభా స్థాయిని బట్టి నిర్ణయిస్తారా? ఇటువంటి ప్రశ్నలకు సరియైన సమాధానములు దొరకవు.

ఇంతవరకు చర్చించిన ప్రతి అంశము, నైతిక మార్గమున పరిష్కారములు కనుగొనవలెను.

యుద్ధములు మరియు దౌర్జన్యములు అనేవి నైతికసమస్యలు. వీటివల్ల శాంతి కోల్పోవుట జరుగును. యుద్ధ పరిస్థితిని ఒకసారి సమీక్షించండి. ప్రభుత్వములు న్యాయము కోసము పోరాడటానికి యుద్ధములు చేపడతాయి. అయితే ఈ యుద్ధముల వలన సామాన్య జనజీవనానికి అనేక ఇక్కట్లు కలుగుతాయి. వీరిలో వృద్ధులు, స్త్రీలు, పిల్లలు ఉంటున్నారు. అటువంటి పరిస్థితు లలో యుద్ధమునకు సిద్ధపడుట న్యాయమైన మార్గముగా తోచదు. యుద్ధము కారణమతో ఒక దేశ ప్రభుత్వము మరియొక దేశ ప్రజలకు అనేక కష్ట, నష్టములను కలుగజేయుట ఎంతవరకు సబబు?

2001 లో తాలిబన్లపై అమెరికా ప్రభుత్వము దాడి చేసెను. దీనికి కారణము తాలిబన్ల దుశ్చర్యలే. వారిని శిక్షించడానికి అమెరికా ప్రభుత్వమునకు నైతిక హక్కు ఏర్పడింది. ఆఫ్ఘనిస్తాన్‌లోని తాలిబన్లపై, సామాన్య ప్రజలు ఇబ్బంది పడకుండా, అమెరికా యుద్ధము ప్రకటించింది. మాటలలో అనుకున్నంత తేలికగా ఆచరణ ఉండదు కదా! 1993లో అమెరికా మరియు బ్రిటిష్ ప్రభుత్వములు ఇరాక్‌పై సంయుక్తముగా దాడిచేసెను. ఈ యుద్ధము వలన ప్రజలకు నష్టము అధికముగా కలిగినదని చెప్పవచ్చును. ఈ యుద్ధముల వలన జరిగిన నష్టములకు నైతిక న్యాయము రీత్యా దాడిచేసిన ఆయా ప్రభుత్వములు యోచనలో పడినవి.

శ్రీ అరవిందులవారు యుద్ధములు లేకుండా ఒక ప్రతిపాదన చేశారు. మానవుడు అన్నిరంగములలో, అభివృద్ధి చెందినంత మాత్రమున సరిపోదు. మానవులంతా ఒక్కటే అన్న సమతాభావముతో, ఐకమత్యమును పెంచుకోవాలి. మానవులు తమలోని అహంకారములను నాశనం చేసుకొని పరస్పర వైవిధ్యములను రూపుమాపుకోవాలి. అన్నదమ్ములవలె జీవిస్తూ సర్వమానవ సౌభ్రాతృత్వమును పెంచుకోవాలి. అప్పుడు ఏ రకమైన ఆయుధములతో పని ఉండదు. యుద్ధములు నివారణ అప్పుడే సాధ్యము.

అణుయుద్ధముల గురించి విన్నాము. ఈనాడు శత్రువును నాశనము చేయు ఉద్దేశ్యముతో అణ్వాయుధములను సిద్ధము చేసుకుంటున్నారు. ఈ అణ్వాయుధ ములను ఎవరిపై ప్రయోగింతురు? శత్రుదేశములపై, ఈ అణ్వాయుధముల వలన ఆస్తినష్టము మరియు ప్రాణనష్టము కూడా అధికముగానే జరుగును. రెండవ ప్రపంచ యుద్ధములో వేసిన అణుబాంబు విధ్వంసక పరిస్థితుల నుండి జపాన్ 50 ఏళ్ళయినా ఇంకా పూర్తిగా కోలుకోలేదనే చెప్పాలి. ఈ అణ్వాయుధముల ప్రభావము వలన బ్రతికి ఉన్న వారిలో అనేకమైన ఆరోగ్యసమస్యలు తలెత్తినాయి.

మానవ జీవితమునకు సంబంధించిన మరో అంశము, గర్భ స్రావము. గర్భస్రావమునకు నైతికముగా అనుమతి లభించునా? ఒక మనిషిని చంపుట నేరము కాదా అని నైతికవాదులు తమ అభిప్రాయమును తెలుపుతున్నారు. అయితే ఈ గర్భస్రావం విషయంలో ప్రతికూల వాదనలు కూడా వినిపిస్తున్నాయి. గర్భస్థ శిశువు యొక్క రక్షణకు ఏ హక్కులు లేవు. ఈ కారణముచే ఇంకా శిశువుగా రూపము దాల్చని, పుట్టని శిశువుకు బ్రతికున్న మనుషులతో పోల్చవలసిన పనిలేదని మరి

కొందరి వాదన. మరియు తల్లి ఆరోగ్యాన్ని గుర్తుపెట్టుకొని గర్భస్రావం చేస్తున్నారు.

జనాభా సమస్యను దృష్టిలో పెట్టుకుని గర్భస్రావమును ప్రోత్సహించు పరిస్థితులు మనకు సర్వసాధారణమయ్యాయి. అయితే మానవజన్మ ఎంతో పవిత్రమైనది, విలువైనది కాబట్టి గర్భస్థ శిశువుగా ఉన్నప్పటికీ దానికి రక్షణ ఏర్పాటు చేయాలనే నైతిక వాదము. అంతేకాదు, అందరూ భగవంతుని స్వరూపాలే. ఆ భగవంతుని అంశముతోనే మానవులుగా రూపుదాల్చుతారు. కాబట్టి గర్భస్రావము పాపముగా నైతిక వాదము తెలియజేసెను. అయితే ప్రజలు ఈ సమస్యపై వివిధ అభిప్రాయములను వ్యక్తము చేయుచున్నారు. అయితే ఈ గర్భస్రావమును అరికట్టేంత బలముగా ఈ నైతికత ఇంకా అభివృద్ధి చెందలేదు.

అనాయాస మరణము విషయములో కూడా గర్భస్రావం అంశము వలెనే చర్చ జరిగినది. ఈ అనాయాస మరణము స్వచ్ఛందమా కాదా అనేదే చర్చనీయాంశ మౌతున్నది. పుట్టిన శిశువులు అనేక శారీరక అంగవైకల్యములతో జన్మించెదరు. వారికి ఊహ తెలియదు. ఈ కారణముచే వారి అంగీకారము ఉండదు. అనగా ఇట్టి పిల్లలు స్వచ్ఛందముగా అనాయాస మరణమును పొందలేరు. అయితే పరిస్థితులను బట్టి స్వచ్ఛందమరణములకు ప్రభుత్వములు అడ్డు చెప్పుటలేదు. ఈ అనాయాస మరణముల వలన ఎవరికీ హాని జరగనంతవరకు ప్రభుత్వము అనుమతి లభిస్తుంది. జీవించి ఉపయోగములేదు అనుకునే వారి విషయములో ప్రభుత్వము స్వచ్ఛందముగా కాకపోయినప్పటికీ, వారి మంచి చెడులను చూసేవారి కోరికమీదట అనుమతించుచున్నది.

కొందరు నైతిక సిద్ధాంతములు చావునకు అనుమతి పొందుట మరియు చంపుటకు గల వ్యత్యాసములపై దృష్టిపెట్టెను. చనిపోవుటకు అనుమతి అనునది ఎప్పుడు వర్తించును?

ఒకరోగిని వైద్యుడు పరీక్షచేసి అతను కోలుకోవడానికి ఎట్టి అవకాశము లేదని నిర్ణయిస్తాడు. అయితే అతనికి వెంటనే చావురాదు. రోగి తన అనారోగ్యము వల్ల బాధను అనుభవించాలి. రోగి ఆ బాధలను అనుభవించలేక తన జీవితమును ముగించాలనుకుంటాడు. సమాజంలో నెలకొని ఉన్న పరిస్థితుల దృష్ట్యా తప్పొప్పుల నిర్ణయము ఇక్కడ చెప్పుట కష్టము. నైతికవాదులు మానవ జీవితమును ఎట్టి పరిస్థితులలోనూ అంతమొందించరాదని తెలియజేస్తారు. అయితే పరిణామ క్రియావాదము ననుసరించి వీరికి మద్దతు లభించుచున్నది.

గర్భస్రావము మరియు అనాయాస మరణముల అంశములు ఈనాడు వైద్యశాస్త్రము మరియు జీవశాస్త్రముల ననుసరించి నైతిక దృష్టితో పరిశీలించ బడుచున్నది. 'జీవ-నైతికత' అను అంశముతో వైద్యులు, న్యాయవాదులు, శాస్త్రవేత్తలు మరియు తత్వవేత్తలు ఈ విషయముపై చర్చలు జరుపుతున్నారు.

ఈ జీవ-నైతికతకు సంబంధించిన ఎన్నో విషయములు ఇప్పుడు మనకు తెలియుచున్నవి. మనిషియొక్క అనారోగ్య కారణముల వలన గర్భస్రావమును, మరియు అనాయాస మరణములను నేడు నైతికముగా అనుమతులు లభించుటకు అవకాశములు పెరుగుచున్నవి.

వైద్యరంగములో సంభవిస్తున్న అభివృద్ధి నేపథ్యములో పలుప్రశ్నలు చోటు చేసుకుంటున్నవి. ప్రాణము నిలుపటయే వైద్యుని యొక్క లక్ష్యము. ప్రాణము తీయుట కాదు. ఈ నేపథ్యములో ప్రాణము తీయుటకు బదులు ప్రాణమును నిలబెట్టవచ్చుకదా అని వారి అభిప్రాయము. దీనికి తోడుగా అన్నట్టుగా ఈ విషయముల పట్ల నైతిక సమర్థత కూడా లభించుట లేదు. రోగికోరినా, కోరకపోయినా, లేదా రోగి తన అభీష్టము చెప్పలేని పరిస్థితిలో ఉన్నప్పుడు వైద్యులే రోగియొక్క ఆరోగ్యమును విశ్లేషించి,

ఆ రోగియొక్క అనారోగ్యమును ఆధారము చేసుకుని వైద్యులే నిర్ణయించుట సముచితముగా ఉండునని అభిప్రాయములు వ్యక్తమగుచున్నవి.

మరో అంశము రోగియొక్క స్వతంత్రత, అనాయాస మరణం విషయములోనే కాక మానవ దేహమును పరీక్షలు జరిగిన నేపథ్యము లోనూ ఈ స్వతంత్రత చాలా ముఖ్యమైన అంశంగా మారినది. ఈ నేపథ్యములో తప్పిదములు జరుగుతున్న దృష్ట్యా, ఈ విషయమును చాలా నిశితంగా విశ్లేషించుచున్నారు. తమ శరీర భాగములపై ప్రయోగమునకు రోగులు ముందుగా తమ సమ్మతి తెలియజేయాలి. అయితే ఏఏ విషయములు రోగికి తెలుపాలి అన్నది ఇంకా తేలని విషయముగా ఉంటున్నది. ముందుగా నిర్ణయించిన రీతిలో అన్నట్టుగా కాక అప్పటికప్పుడు ఏ రోగిని నిర్ణయించాలో అన్న పద్ధతిని అనుసరించుట వలన, ఇందు ఎక్కువ లోపములకు అవకాశము ఉ ంటున్నది. కొత్త పద్ధతిలో చికిత్సా విధానమునకు రోగి రెండు లేదా మూడు పరీక్షలకు ఒప్పుకని, అతని అభీష్టము మేర చికిత్స పొందడం జరుగుతుంది.

వనరులు తక్కువగా ఉన్న నేపథ్యంలో ఆఖరిదైన మరియు పరిమిత వనరులను ఎవరికి ఉపయోగించాలి, అనేది ప్రశ్న. గుండెకు సంబంధించిన మరియు మూత్రపిండాలకు సంబంధించిన శస్త్రచికిత్సలలో ఈ పరిమిత వనరులను ఉపయోగించడం జరుగుతుంది.

శ్రీసత్యసాయి సూపర్‌స్పెషాలిటీ ఆసుపత్రిలో అన్ని వైద్యాలు ఉచితముగా అందించబడును. అయితే ఈ పరిమిత వనరులను ప్రథమంగా చిన్నపిల్లలకు, యువకులకు వినియోగించుట ఈ ఆసుపత్రి నందు ఆచరించు పద్ధతిగాఉంటున్నది.

మానవ ఉత్పత్తికి సంబంధించిన విషయము. శిశు జననం తల్లి గర్భమున కాక బయట జరుగుచున్నది. ఇది ఒక చర్చనీయాంశమైనది. బిడ్డ జన్మించేలోపు తల్లిదండ్రులు చనిపోతే పరిస్థితి ఏమిటి? ఇక్కడ మరో అంశము. కొందరు స్త్రీలకు బిడ్డలు పుట్టని పరిస్థితి. అటువంటి సందర్భములలో భర్తయొక్క వీర్యమును మరియొక స్త్రీలో ప్రవేశపెట్టి ఆ స్త్రీలో గర్భస్థ శిశువు పెరుగుదల సాగుతుంది. ఈ స్త్రీకి ఈ కార్యమున సహాయపడినందుకు ఆర్థిక సాయము అందించబడుతుంది. బిడ్డ పుట్టాక, అసలు తల్లిదండ్రులు ఆ బిడ్డను స్వాధీనము చేసుకుంటారు.

ఇక్కడ కొన్ని ప్రశ్నలు ఎదురవుతాయి. నైతికముగా ఒక స్త్రీ తన గర్భాశయమును అనగా ఉత్పత్తిస్థానమును ధనాశతో అద్దెకు ఇవ్వవచ్చునా? ఇక్కడ మరో సమస్యకు అవకాశం ఉంటున్నది అది ఏమిటంటే, ముందుగా అద్దెకు తన గర్భాశయమును ఇచ్చి, బిడ్డ జన్మించాక, ఆ బిడ్డను తనే పెంచుకోవాలని నిర్ణయించుకుని, తనవద్దనే బిడ్డను పెంచుకోవడం. ఆ విధమైన హక్కు ఆ స్త్రీకి కలదు. ఒకవేళ పురుషునివల్ల బిడ్డలు కలిగే అవకాశం లేకపోవచ్చు. అప్పుడు అతని భార్యకు తల్లి కావాలన్న కోరికతో, పరపురుషుని వీర్యము ఆ స్త్రీలో ప్రవేశపెట్టుట జరుగును. ఆ పరపురుషుడు ఎవరో ఆ స్త్రీకి తెలియదు. ఆ పరపురుషుడు తన వీర్యము నిచ్చినందుకు అతనికి కొంత పైకము ముట్ట చెప్పడ మవుతుంది. ఈ విధమైన ప్రయత్నము ఆ స్త్రీ ముందుగా తన భర్త అనుమతి తీసుకునే సిద్ధపడాలి.

శాస్త్రసాంకేతికముగా అనేకమైన మార్పులు చోటుచేసుకుంటున్నవి. ఈ శాస్త్ర సాంకేతిక అభివృద్ధి ఆరోగ్య రంగములో చాలా అధికముగా ఉంటున్నది. నైతికముగా అనుమతులు లభించని వాటికి కూడా నేడు నైతిక అనుమతులు లభించుచున్నవి. ముందుముందు మరెన్ని మార్పులు చోటు చేసుకుంటాయో కాలమే నిర్ణయించాలి.

## 36. భవిష్యత్తులో నైతికత

సాంఘిక పరముగా రాబోవు రోజులలో నైతికముగా భారీ మార్పులు జరుగుతాయని నైతిక శాస్త్రజ్ఞులు అభిప్రాయపడుతున్నారు. రాజనీతితో కూడిన అంశములలో మానవాళి యావత్తు ఐకమత్యముతో ఏకాభిప్రాయ నిర్ణయములను తీసుకొనును. దీనివలన శత్రుత్వము తగ్గుతుంది. స్వేచ్ఛాస్వాతంత్ర్యముల విషయములో కనీస హద్దులను నిర్ణయించడం, విద్యా అవకాశములను పెంచడం మరియు రోగనివారణకు తగిన చర్యలు చేపట్టి ఆరోగ్యము నందించడం, ప్రజల యొక్క సుఖజీవనము కొరకు చర్యలు చేపట్టడం లాంటి అనేక విషయములలో మార్పులు రావచ్చును. యావత్ మానవాళి యొక్క మానసిక దృష్టిని గ్రహించి, వారందరికీ సరియైన నైతిక శిక్షణను అందించి, తమ తప్పులకు తామే శిక్షను అంతరంగమందు అనుభవించడం చూడటం జరుగుతుంది. భౌతికమైన శిక్షలపై కాక అంతరంగ శిక్షలకే ప్రాధాన్యత పెరుగుతుంది.

ఈ నైతిక మార్పులను చేపట్టవలసిన చర్యలు చాలా అవసరము. చాలా కష్టముతో కూడిన ప్రయత్నము. అయినప్పటికీ అసాధ్యము మాత్రము కాదు. మొదటి మెట్టు ప్రపంచములోని రాజ్యాధినేతలందరూ ఒక్క సామాన్య కేంద్ర స్థానమున హాజరుకావాలి. ఈ విధముగా దేశనాయకులందరు ఒకచోట చేరిననాడు వారిలో ఐకమత్యమునకు అవకాశములు పెరుగును. వ్యతిరేక ధోరణులకు ముగింపు పలుకును. 'ఒకే ప్రపంచము' అనే నానుడిని అనుసరించి యావత్ మానవాళిని ఏకత్రాటిపైకి తీసుకురావలసిన అవసరము ఎంతైనా ఉంది. వీటివల్ల విభజన యంత్రాంగములు తగ్గుముఖం పడుతాయి. ఉదాహరణకు: బానిసత్వమును అన్ని దేశములు నైతికముగా ఖండించాయి. ఈ కారణముచే బానిసత్వమును అన్ని దేశాలు నిషేదించాయి.

ముందుగా ప్రజలు మార్పును కోరుకోవాలి. ఆ మార్పులకు నైతిక మద్దతు లభించాలి. అలా నైతిక మద్దతు లభించిన నేపథ్యములో ప్రపంచ దేశాధినేతలు వాటిని ప్రజల క్షేమం కోసం, మరియు ప్రజల మధ్య అంతర్యములను తొలగించడం కోసం శ్రద్ధచూపుతారు. మానవత్వము యుద్ధమునకు ప్రత్యమ్నాయముగా మరో నైతిక మార్గమును కనుగొనవలసి ఉన్నది.

అనగా, మన అంతర్గత కలహాల కారణముగా మన శత్రుస్థానములో ఉన్న ఒక దేశముగానీ, సంస్థగానీ మన ద్వేషమునకు దౌర్జన్యములకు నాశనము కారాదు. మనలో ద్వేషములు ఉన్నంత వరకు మన అంతఃకలహాలు ఎన్నటికీ సద్దుమణగవని మనమంతా గుర్తించాలి. ద్వేషమునకు ప్రత్యామ్నాయము ప్రేమ. మనలోని ద్వేషమును, దౌర్జన్యమును రూపుమాపడానికి ప్రేమమార్గమే సరియైనది. మనమధ్యన ఉన్న 'మనశత్రువు'ను ముందుగా మనము గుర్తించాలి. ఆ శత్రువులే అనారోగ్యం, పేదరికం, ఆకలి, అజ్ఞానం మరియు సంఘములో మనము ఆచరించే చెడు అలవాట్లు. ఏనాడైతే సంఘములో మనకు కనీస అవసరములు చేకూరునో, ఆనాడు మనము మన శారీరక, మానసిక శ్రేయస్సుకై చర్యలు చేపట్టి సాధించడం జరుగుతుంది.

ఈ మార్పులకు వివేకవిచక్షణల ఆవశ్యకత ఎంతైనా అవసరముంది. ప్రజలలో మంచి, చెడుల అప్రమత్తత అవసరం. ప్రజలకు నైతిక విషయములపట్ల సరియైన అవగాహన కల్పించాలి. తప్పుచేసిన వారిని శిక్షించే పద్ధతికి స్వస్తి చెప్పాలి. జ్ఞానముతో వారి అజ్ఞానమును తొలగించి వారి నైతిక సమస్యలను పరిష్కరించాలి. ప్రేమతో, సదవగాహన అందించిన రోజున ఇటువంటి సమస్యలు తప్పక మాయమవుతాయి.

వివేకముతో కూడిన అవగాహనతో ఏదైనా సాధించవచ్చు. యావత్ మానవాళి కూడా జ్ఞానమును పెంచే ప్రయత్నము చేస్తున్నది. ఈ జ్ఞానమును పెంచడం వల్ల నైతికముగా మంచి చెడుల నిర్ణయము జరుగుతుంది. ఈ నేపథ్యములో జ్ఞానము, సదవగాహన అనుచితమైన కార్యరంగమందు ప్రవేశ పెట్టవలెను.

ఈనాడు భౌతికముగా ప్రపంచము ఎంతో అభివృద్ధి చెందుచున్నది. ఇది నాణెమునకు ఒకవైపు మాత్రమే అన్న సత్యమును అందరూ బలవంతంగానైనా ఒప్పుకొని తీరవలసినదే. నాణెమునకు రెండవ వైపే సాంఘిక నైతికత. బయట ప్రకృతి వనరులను అరికట్టడం కంటె మానవుడు తన స్వభావమును నియంత్రించు కోవడం మరింత ముఖ్యమైన అంశము.

మానవుడు తమ స్వభావమును నియంత్రించ వలెనన్న అంతర్ముఖులు కావాలి. అప్పుడు మానవుడు తమలో రగులుచున్న నైతిక సమస్యల పరిష్కారమును సాధించగలరు. ఇది ఎప్పుడు సాధ్యము? మానవుడు ఏ విధముగా అయితే తన శారీరక మానసిక అవసరముల విషయములో శ్రద్ధ చూపిస్తాడో అదే విధంగా నైతిక మరియు ఆధ్యాత్మిక విషయముల పట్ల కూడా శ్రద్ధ చూపవలెను. అప్పుడు మానవుడు చెడు అలవాట్లకు దూరముగా ఉండుటయే కాక తన నైతిక అభివృద్ధికి తృప్తిని కూడా అనుభవిస్తాడు. తాత్విక సిద్ధాంతము యొక్క పరమావధి ఈ సంతృప్తే. నైతికత అన్నది అందరికీ ఆవశ్యకమే అని అందరూ గుర్తించాలి. నైతిక మరియు ఆధ్యాత్మిక జ్ఞానముతో సర్వమానవ సౌభ్రాతృత్వమును సాధించాలి.

వ్యక్తిగతమైన నైతికతకు మరియు సాంఘికనైతికతకు మధ్యనున్న సంబంధము కాలమార్పులను బట్టి మనకు అవగతమగుచున్నది.

జ్ఞానము పెరుగుదల, పటిష్టమైన నియంత్రణ, స్వేచ్ఛాస్వాతంత్ర్యముల పెరుగదల, మానసిక పరిపక్వత, సుఖమయమైన జీవితవిధానము, వ్యక్తిగత స్వేచ్ఛ మొదలైనవన్నీ మానవుని అభివృద్ధిని సూచించును. కాబట్టి ఈ అంశములన్నీ మానవుని నైతిక లక్ష్యములుగా గుర్తించుకోవాలి. ఈ అంశములలో పక్షపాతవైఖరి వల్ల శత్రుత్వములు ఏర్పడటమన్నది చెడు పరిణామములకు దారితీయును. ఈ విధమైన రంగములకు మార్పులు సూచించడమైనది. సాంఘిక పరిధిలో కూడా ఈ మార్పులకు మార్గము ఏర్పడుచున్నది. అంతరంగమందు కూడా ఈ మార్పులకు సదవగాహన అవసరము.

మానవుల వల్లనే విలువలకు గుర్తింపు వచ్చుచున్నది. కాబట్టి ఆదర్శ వంతమైన జీవన విధానమునకు అందరూ అలవాటుపడాలి. ఈ అనుభవములను మననం చేసుకోవడానికి మానవుడు నైతికముగాను, మానసికముగానూ మరింత బలమును చేకూర్చుకుని, తన అంతరంగ మందు తల ఎత్తు సమస్యలను తనకుతానే పరిష్కరించుకొనవలెను. అప్పుడు మానవుడు తనకు తానుగా నైతికమార్గమునకు అలవాటు పడతాడు.

మానవుడు సర్వతోముఖాభివృద్ధి సాధించవలెనన్న, ముందుగా తనలో సాగుతున్న అంతఃకలహములను జ్ఞానముతో, ప్రేమతో, ఆచరణతో, మానసిక పరిపక్వముతో మరియు విలువలతో జయించ వలెను. ఇది తప్ప మరోదారి లేదు. ప్రేమతోను, జ్ఞానముతోనూ మరియు అవగాహన తోనూ మానవుడు ముందడుగు వేయవలెను. జులియన్ హక్స్‌లే మహాశయుడు ఇట్లు సూచించెను. 'మానవుడు తన అంతర్ మరియు భౌతిక వనరులను ఏకం చేసుకోవాలి. మానవుడు తనలోని అహంకారమును రూపుమాపి తనలో రగులుచున్న ఉద్రేకములను

అదుపులో బెట్టుకొనవలెను. మానవుడు తన అనుభవమును, తాను చేపట్టిన కర్మలయందు సమన్వయమును సాధించి సామరస్య పూర్వకముగాకృషి సలుపవలెను.

మానవుని మనస్సు పరిమితమైనది, హృదయము ఎంతో విశాలమైనది. అనగా మానవుని మనస్సు పరిమితమైనది కాబట్టి సూక్ష్మమైన విషయములను పరిశీలించగలదు, మానవుని హృదయము విశాలమైనది కనుక యావత్ విశ్వమును అది ఇముడ్చుకోగలదు. అనగా మానవుడు మొట్టమొదట తన గురించి తాను తెలుసుకోవాలి. ఆ తరువాత సంఘము ఆ తరువాత ప్రకృతి. మానవుడు భూత భవిష్య వర్తమానముల జ్ఞానముతో ప్రస్తుతములో జీవించడము నేర్చుకోవాలి. ఈ ఉనికి శాశ్వతమైనది, అనంతమైనది, సత్యమైనది, అచేతనమైనది. ఇట్టి జ్ఞానముతో మానవుడు సూక్ష్మస్థితి నుండి స్థూలజ్ఞానమును గ్రహించగలడు. మానవుడు తానుకూడా ఈ స్థూల ప్రపంచములో తన ఉనికిని సూక్ష్మముగా అనుభవించగలడు.

హక్స్‌లే మాటలలో, సూక్ష్మజ్ఞానము వాస్తవమును మరియు సామర్థ్యమును తెలియజేయును. వాస్తవమును మనోభావములను తెలియజేయును. గతమును మరియు భవిష్యత్తును చిత్రించును. భౌతిక సిద్ధాంతములు మరియు అంతర్గత ప్రభావములు మొదలైన అంశములన్నీ మానవుని మానసిక స్థితిపై మంచిచెడుల రూపములో ప్రకటింపజేసి, వాటి పనితీరును మెరుగుపరుచును.

అనుభవజ్ఞానులు మరియు వివేకవంతులు వ్యక్తికి, సమాజమునకు మధ్య విరోధములను గుర్తించరు. వ్యక్తి సంఘజీవి వ్యక్తి సంఘములో ఏకాకిగా జీవించడమనునది అర్థములేని మాట. సంఘములో భాగ

మైనప్పుడే మానవుడు నైతికముగా అభివృద్ధి చెందగలడు. దానికి కారణము సంఘము మానవునికి పూర్తి స్వేచ్ఛతోబాటు ఆదర్శముల విషయములో వెసలుబాటు కల్పించినది.

వ్యక్తి పరముగా కాలానుగుణముగా అనేక మార్పులు జరుగుతున్నవి. ఈ మార్పులన్నీ సంఘముతో కలిసే జరుగుచున్నవి. గతంతో పోల్చితే, ఈ మార్పులు కాలముతో మరింత వేగమును సంతరించుకుంటున్నాయి. ఈ మార్పులు మనపై నియంత్రణ పెంచుతున్నాయి.

ఇదే వేగముతో మార్పులు భవిష్యత్తులోనూ జరిగితే, మానవుడు ఊహించని పరిణామములను భవిష్యమానవులు చవిచూస్తారు. నైతిక పరిణామ రీత్యా అది శుభపరిణామము. అది అలా జరిగి తీరవలసిందే. ఆ మార్పులకు సహకరించుటే మన నైతిక బాధ్యత. ఈ మార్పులకు ఎన్నడూ, ఎవరూ అడ్డు కట్టవేయరాదు. మనము మన సంఘపురోభి వృద్ధికే కృషి చేయవలెను తప్ప, సంఘపతనమునకు ఎన్నడూ కారణము కారాదు.

కాలముతో బాటు సంభవించే మార్పులకు జ్ఞానము మరియు విలువలతో కూడిన విజ్ఞానము అసవరము. అయితే మానవులు మాత్రమే ఈ విలువలతో కూడిన విషయములను గ్రహించగలరు. కానీ సంఘము కాదు. అనగా మానవులంతా సంఘంలో భాగమైనప్పటికీ, సంఘము లోని మానవులందరికీ ఈ జ్ఞానము, ఈ వివేక విచక్షణలు మరియు ఆచరణజ్ఞానము ఉండుటలేదు. ఇవి సంఘములో ఏకొద్దిమందికి మాత్రమో అనుభూతి కలిగి ఉంటున్నది. మరి ఇట్టి తరుణములో మార్గము ఏమిటి? ఆ కొద్దిపాటి జ్ఞానము కలిగిన వ్యక్తులు సంఘములోని మిగతా వ్యక్తులకు కూడా ఈ జ్ఞానమును అందించుటకు కృషి సలుపవలెను.

సంఘమునకు వ్యక్తికి మధ్యనున్న సంబంధము, రెండు అంచులకు మధ్య నున్న సంబంధం వంటిది. సంపూర్ణమైన వ్యక్తి వికాసము అనునది పరిపూర్ణమైన మార్పు. అదే యుగమార్పునకు అంతిమ లక్ష్యము. కేవలం మానవుడు మాత్రమే ప్రేమ, జ్ఞానము, ఆధ్యాత్మిక పరివర్తనలతో అట్టి అత్యుత్తమ స్థితిని సాధించగలడు. అయితే దురదృష్టము కొద్దీ, సంఘము యొక్క పద్ధతులు ఇందుకు వ్యతిరేకముగా ఉన్నచో అక్కడ ఈ ప్రేమకు, జ్ఞానమునకు ఆధ్యాత్మిక పరివర్తనకు తావుండదు. దీనివల్ల వ్యక్తిగత అభివృద్ధి పూర్తిగా కుంటుబడుతుంది. అలాకాక సంఘములో సరియైన పద్ధతులు ఆచరణలో ఉన్న, మానవుని అభివృద్ధికి అన్ని విధాలా దోహదపడును.

ఈ నేపథ్యములో, మానవుని తరువాత చర్య మానవత్వం యొక్క సమైక్యత. ఇప్పటికీ ఈ దిశగా ఎన్నో మార్పులు చోటుచేసుకున్నవి. ఇప్పటికీ శాస్త్రసాంకేతిక రంగములలో అనేక మార్పులు చోటు చేసుకొనెను. సమాచార రంగము ఎంతో అభివృద్ధి సాధించెను. ఇంటర్నెట్ అభివృద్ధితో ప్రపంచమే కుదింపబడినదా అన్నట్లుగా అన్ని అభివృద్ధి కార్యకలాపములకు దోహదపడుచున్నది.

మానవ హక్కుల పరిరక్షణకు, అమలుకు యావత్ మానవాళి యందు ఎన్నో చర్యలు చేపట్టబడుచున్నవి. మానవ హక్కుల భంగము కలిగించేవారిపై చర్యలు చేపడుతున్నారు. మానవుని స్వేచ్ఛా స్వాతంత్ర్యములపై అధిక ప్రాధాన్యత ఇవ్వబడుతున్నది. రాచరికపు వ్యవస్థ పూర్తిగా నశించిపోయెను. ఎక్కడ చూసినా ప్రజాప్రభుత్వములే ప్రజల క్షేమానికి వివిధ స్థాయిలలో పనిచేయుచున్నవి. ఈ నేపథ్యములో ఒక కేంద్రీకృతమైన ప్రపంచ సంస్థ ఏర్పడి, ఆ సంస్థద్వారా మానవుని రాజనీతి అవసరములను తీర్చవలెను.

మానవ పరిణామక్రమములో గ్రహించవలసిన ముఖ్యమైన విషయము ఏమనగా అనేకత్వములో ఏకత్వమును దర్శించుట జరుగుచున్నది. ఈ ఏకత్వ దర్శనము వలన ఐక్యత సాధ్యమగుచున్నది. ఈ విధముగా ఏకత్వముతో, ఐక్యమత్యముతో పురోగమించడం వలన మానవుడు ఏదైనా సాధించడానికి రంగమును సిద్ధము చేసుకుంటున్నాడు.

శ్రీ అరవిందులు, మహాయోగి దూరదృష్టి గలిగిన స్ఫురద్రూపి. మానవుని యొక్క పరిణామ క్రమమును ఈ విధముగా వివరించెను. పూవు ఏ విధముగా వికసించుచున్నదో, అదే రీతిలో సృష్టిలోని జీవరాసులన్నీ పదార్థరూపములో వ్యక్తమై, భౌతిక స్థాయి నుండి అగోచర మైన ఆత్మస్థాయికి చాలా కష్టముగా మార్పు చెందుచున్నది. గోచరమైన భౌతిక స్థాయి నుండి, అగోచరమైన ఆత్మస్థాయికి ప్రయాణించడమే అసలైన సృష్టిరహస్యముగా తెలియుచున్నదనెను.

సృష్టిలో మానవుడు మాత్రమే రెండుకాళ్ళతో నిటారుగా నడిచే ప్రాణి. ఆ విధముగా మానవుడు అధిక తెలివితేటు కలవాడు. తన తెలివితేటలతో తాను ఎవరు, ఎక్కడినుండి వచ్చాడు, ఎక్కడికి ప్రయాణం చెయ్యాలి మొదలైన విషయములన్నిటిని విచారణతో సేకరించుచున్నాడు. విషయమును గ్రహించాక ఆ లక్ష్యమే అతని జీవిత పరమార్థమవుతున్నది. అప్పటిదాకా అగోచరముగా ఉన్న జీవిత పరమార్థము, ఒక్కసారిగా అవగాహన కలిగనంతనే అంతా తానై అన్నట్టుగా ఉంటున్నది. మానవుడు తన సర్వశక్తులను తన జీవిత పరమార్థమును సాధించడానికి కృషిచేయును.

మనసే సర్వస్వము కాదు. మనస్సు కంటె చైతన్యము గొప్పది. సూపర్‌మైండ్ ఉంటున్నది, ఆత్మ ఉంటున్నది. పశువు ఉంటున్నది. పశువులో మనస్సు అంతంతమాత్రంగా ఉంటున్నది. పశువు నుండి

క్రమముగా మానవజన్మ సంక్రమించుచున్నది. మానవుడు మనస్సు మరియు బుద్ధితో ప్రకాశించుచున్నాడు. మానవుడు కూడా శ్రమ పడుతూనే ఉంటున్నాడు. ఎప్పటివరకు? తనలోని దివ్యత్వమును తెలుసుకునే ప్రయత్నముతో మానవుడు మార్పులతో ఉన్నతస్థితికి చేరుకుంటూ ఈ సృష్టికి కారణము, విశ్వచైతన్యములను గుర్తించి అనుభవించి అందు లీనమవుటకు ప్రయత్నిస్తున్నాడు.

పరిణామక్రమంలో మట్టి లేదా ఖనిజములు మొక్కగా మారెను. మొక్క పరిణామ క్రమములో జంతువుగా మారెను. జంతువు పరిణామ క్రమంలో మనిషిగా మారెను. మనిషిగా మానవుడు సాధించవలసింది ఎంతో ఉంది. మనిషి పదార్థము నుండి ప్రాణమునకు, ప్రాణము నుండి మనస్సునకు, మనస్సునుండి సూపర్ మైండ్ లేదా అధికమైన మనస్సును సాధించవలెను. ఈ మార్పులతో మానవుని స్థాయినుండి అసాధారణమైన మానవస్థాయికి ఎదుగవలెను. ఇట్టి మార్పే మానవుని యొక్క గొప్ప మహిమ.

శ్రీ అరవిందులువారు సాధారణ వ్యక్తిని ఈ విధముగా వివరించెను. "మానవుడు ఎవరు? మానవుడు మానసికమైన జీవి; జీవితమునకు పదార్థమునకు బంధింపబడి యున్నాడు. మానవుడు తన మనస్సుకు బానిసగా ఉంటున్నాడు. మనస్సు పరిమితమైనది. అనగా మానవుడు పరిమితమైన జగత్తునకు లోబడి ఉంటున్నాడు. జగత్ (జ+గత్) అనగా వచ్చిపోయేది. శాశ్వతముకాదు. ఈ జగత్తు అసత్యమైనది. ఈ జగత్తు అగోచరమైనది, నశించేది.

మానవుడు ఆత్మస్వరూపుడు, దైవము అసాధారణమైన వ్యక్తి మరియు అసలైన పురుషుడు. మనస్సు ఎలా ఉండాలి? మనస్సు

అసాధారణమైన మనస్సుగా పరిణమించాలి. అప్పుడు అది శరీరమును అదుపులో పెట్టుకొనును. అప్పుడు అది ప్రకృతిని శాసించగలుగును. అప్పుడు అది దేనికీ బానిసగా ఉండక స్వేచ్ఛగా వ్యవహరించును. అది సంపూర్ణముగా ఉండును. అది విభజనకు లోనుకాదు. దానికి చావంటే భయములేదు. అది చీకటికాదు. అది వెలుగుతో నిండివుంటుంది. అది ఆనందమయస్థితి, అనగా ద్వంద్వాతీత స్థితి. అది ఎంతో శక్తివంతమైన స్థితి. పరిమితముగా వ్యక్తమైనప్పటికీ అది ఎప్పుడు అనంతమైన తత్వముతోనే కలసి ఉండును. తాను భగవంతుని రూపమే యని గ్రహించి భగవంతునిలో జీవించును.

ఈ మానవుడు ఇవి అన్నీ తానే అయి వున్నాడు. కానిచో తానట్లు వాటిగా మారగలడు. తనలో ఏదైతే ఉందో, దానినే తాను వ్యక్తము చేయగలడు. భౌతిక దృష్టి కలిగినంత వరకూ మానవుడు బానిసగా జీవించుచున్నాడు.

మానవుడు బానిస బ్రతుకు నుంచి బయటపడాలంటే ఏమి చేయాలి? మానవుడు తనగురించి తాను తెలుసుకుని మార్పుచెందాలి. మానవుడు మనిషిగా పుట్టాడు. మనిషిగానే జీవించాలి. కానీ మానవుడు పశులక్షణములతో వర్తిస్తున్నాడు. మానవుడు ఆలోచిస్తాడు, మానవుడిలో ఒక కళాకారుడు ఉన్నాడు. మానవుడు ఆనందపిపాసి. మానవుడు జ్ఞానపిపాసి. మానవుడు కూడా వస్తువులను సృష్టించగలడు. మానవుడు అందంతో పాటు ఆనందమును కూడా అనుభవిస్తాడు.

మానవునిలో ఇన్ని లక్షణములు ఉన్నవంటే అసాధారణ మానవునిగా ఎదగడానికే. మానవుడు తన మనస్సును సామాన్యమైన మనస్సు స్థాయినుండి అసాధారణమైన మనస్సు స్థాయికి చేర్చవలెను.

అదే భగవంతుని కోరిక, భగవంతుని శక్తిగా భావించవలెను. అసాధారణ మైన మనస్సు కలిగి ఉండడం, అన్నది మనస్సునకు అతీతముగా తయారవ్వడం. అసాధారణమైన వ్యక్తిత్వముతో ఆధ్యాత్మిక జీవనమునకు అలవాటుపడి భగవంతునిలో జీవించాలి. మానవుడు తనను తాను భగవంతునిగా ఎరిగి, అన్నిటిలోనూ తననుతాను ప్రకటించుకోగలగాలి.

అప్పుడే నైతికత యొక్క లక్ష్యము నెరవేరుతుంది. మానవుడు నైతికముగా మార్పుచెంది ఆధ్యాత్మిక జీవనమునకు అలవాటుపడాలి. అణు ఆయుధముల తయారు గురించి, అంతర్జాతీయ సంస్థలైన యుఎన్ఓ పనితీరు, ప్రపంచదేశాల కేంద్రపాలిత ప్రభుత్వము, అనారోగ్యం రూపుమాపుట. ఆకలి పేదరిక నిర్మూలన, ఉచితవిద్య అన్ని రంగములలోను శాస్త్రసాంకేతిక రంగములలో అభివృద్ధి సాధన, విఘ్నములు లేకుండా మానవ హక్కుల అమలు మొదలైన అంశములన్నీ నేటి మన మార్పులకు దోహదపడే నైతిక అంశములు. భావితరముల వారు నేటి తరముల వారిని, వారి నాయకులను విశ్లేషించెదరు. ఆ విశ్లేషణ నైతికమా కాదా అన్నది ఇప్పటి తరముల యొక్క సహకారము, ఐకమత్యములపై ఆధారపడును.

ప్రతి మనిషిలోనూ ఉన్న దైవమును గుర్తించే దిశగా మానవులు, మరియు దేశములు ఎదగవలెను. ఈ ఆధ్యాత్మిక జీవనానికి మానవునికి స్వేచ్ఛాజీవనము అత్యవసరమై ఉన్నది. ఆధ్యాత్మిక జీవనము మానవుని యొక్క భౌతిక అవసరములకు తెరదించును. అనగా బయటి ప్రపంచముతో మానవులను వేరుచేయుటగా భావించరాదు.

అనేకత్వములో ఏకత్వమును అనుభవింపజేసేది ఆధ్యాత్మిక జీవనము. ప్రతి మనిషి ఉన్న స్థితినుండి ఉన్నత స్థితికి ఎదిగి తనలో ఉన్న

దివ్యత్వమును గ్రహిస్తాడు. తనలో వ్యక్తమయ్యే ఈ దివ్యత్వమును తాను అందరిలోనూ దర్శించగలుగుతాడు. అందరిలో ఏనాడైతే భగవంతుని చూడగలుగుతాడో, ఆనాడు తాను అందరిలోనూ ఉన్న భగవంతునికి సేవచేయగలడు. అతను తన స్వేచ్ఛను అనుభవించడమే కాకుండా, పరులు కూడా అదే స్వేచ్ఛను అనుభవించాలని కోరుకుంటాడు. తాను ఉన్నతిని సాధించడమే కాకుండా, అందరి ఉన్నతిని కాంక్షిస్తాడు. తాను తన కోసంగానీ తన సంఘం కోసంగానీ జీవించడు. తాను జీవించేది తనలో ఉన్న భగవంతుని మరియు జగత్తులో ఉన్న భగవంతుని కోసం.

మానవుడు ఆధ్యాత్మిక జీవనమునకు అలవాటుపడవలెనన్న మొదటగా పదార్థ జ్ఞానమును తగ్గించుకుని, మానసిక జ్ఞానమును పెంచుకోవాలి. ఒక ఆధ్యాత్మిక జీవన వ్యవస్థ మూడు ముఖ్యమైన అంశములు గుర్తించినది. అవి దైవము, స్వేచ్ఛ మరియు ఐకమత్యము. ఈ మూడు సమిష్టి స్వరూపములే, వ్యష్టి స్వరూపములు కాదు. భగవంతుని గ్రహించకుండా మానవుడు స్వేచ్ఛను, ఐకమత్యములను అనుభవించలేడు. భగవంతుడు మానవునికి అందుబాటులోనే ఉన్నప్పటికీ, మానవుడు ఎంతవరకూ భగవంతుని తెలుసుకునే ప్రయత్నమే చేయుచున్నాడు. అనగా భౌతికముగా విగ్రహములలో భగవంతుని చూచుటకు ప్రయత్నిస్తున్నాడు. పైగా ఆ ప్రయత్నము కూడా అహంకార మమకారములతో కొనసాగుతున్నది. మానవుడు ఏనాడైతే తన అహంకారమును నాశనము చేసుకుంటాడో, ఆ క్షణము నుండే దైవమును తనలోను బయటా గ్రహించడము మొదలుపెడతాడు. ప్రతి ఆధ్యాత్మికపరుడు ఆశించేది ఇదే.

ఆధ్యాత్మిక జీవనము సమిష్టిని కోరుకుంటుంది. మానవులంతా ఆత్మస్వరూపులే. మానవుడు వ్యష్టిస్వరూపుడే. ఏనాడైతే మానవుడు తన

అహంకారమును నాశనము చేసుకుంటాడో ఆనాడు తనలోని ఆత్మ తత్వమును, అనగా సమిష్టి తత్వమును గుర్తించి, సమిష్టి జీవనము సాగిస్తాడు. ఆధ్యాత్మిక జీవనముతో కూడిన సంఘము విద్య యొక్క, శాస్త్ర సాంకేతిక జ్ఞానము యొక్క, నైతికత యొక్క, కళలయొక్క, ఆర్థిక మరియు రాజనీతి యొక్క సమగ్ర స్వరూప ఆవశ్యకతను గుర్తించి, మానవునిలో దైవమును గ్రహించేందుకు ప్రోత్సహించును.

అటువంటి ఆధ్యాత్మిక సంఘము ప్రజలను ప్రేమతో చూచును. అసలు ద్వేషము ప్రకటించదు. కష్టములలో ఉన్నవారిని ఊరడించును. అజ్ఞానములో ఉన్న వారికి జ్ఞానమునందించును. బంధనలలో చిక్కుకున్న వారిని బంధవిముక్తి చేయును, నిర్భాగ్యులకు ఆధారము ఏర్పాటు చేయబడును. భగవంతునికి వ్యష్టి సేవల కంటే సమిష్టి సేవలు అంటే ఇష్టము. కారణము భగవంతుడు సమిష్టి స్వరూపుడు కాబట్టి. ఈ నేపథ్యంలో మానవునిలో ప్రేమ, కరుణ, దయ, వినయములు పెరగడానికి సమిష్టి సేవలలో పాల్గొనవలెను.

ఏనాడైతే మానవుడు ఈ సత్యములను స్వీకరిస్తాడో ఆనాటి నుండే ఆధ్యాత్మిక సంఘజీవనము అతనికి మొదలవుతుంది. ఇదే విషయమును అనాదిగా ప్రతి మతము మానవుని గుర్తు చేయుచున్నది. వారు యావత్ మానవాళిని భగవంతుని కుటుంబముగా గుర్తించి వర్తించుచున్నారు.

ఆధ్యాత్మికమతము అనగా మానవత్వం. దీని అర్థము భవిష్యత్తులో మానవ పరిధిలో భగవంతుని జ్ఞానము అన్ని రంగములలోనూ పెరుగుతూ ఉండుట. మానవులంతా ఒక్కటే అన్న భావన, భగవంతుని సృష్టిలో మానవుడే అత్యున్నత జీవియని గ్రహించుట, కేవలం మానవ జన్మవల్లనే మానవుడు తనను తాను తెలుసుకొనగలుగుచున్నాడని అర్థమగుచున్నది.

ఈ అనుభవమును అతను సాకారముగా ఈ జగమునందు సాకారము చేసుకుంటాడు. మానవజన్మము పరిపక్వత సాధించవలెనన్న మానవుడు తనను తాను సాటివారిలో చూసుకొన గలగాలి. మానవుడు జీవించి ఉండగానే తన లక్ష్యములను సాధించాలి. మానవుడు శరీరముతో ఉన్నంత వరకే ఏదైనా సాధించి ఆనందించగలడు.

పరిణామ క్రమములోని మార్పులు సత్యదూరముకావు. అవి తప్పక సాధింపబడును. ఆ రంగములు నాలుగు. భౌతికరంగము, మానసిక రంగము, ఆధ్యాత్మికరంగము మరియు నైతిక రంగము. మానవుని నైతికత అనునది మానవుడు ప్రకృతి నుండి సంతరించుకున్నాడు. కాబట్టి ప్రకృతికి సంబంధము లేకుండా మానవుని నైతికతకు సమర్థత ఉండదు. మనము ఈ సంబంధమును గుర్తించినపుడు, అసలు నైతికతను మానవుడు విడిచిపెట్టుట అన్నది జరుగునా? ఈ నైతికతకు విలువలు ఎన్నడూ ఆపాదింపబడలేదు. అయినప్పటికీ పోలికతో, ఈ నైతిక విలువలను గ్రహించుటకు వీలు కలుగును. ఈ నైతిక మార్పులను కూడా ఈ పోలికలతోనే విశ్లేషించవలెను.

జంతు శాస్త్రజ్ఞులు, కాలముతో పెరుగుతున్న జ్ఞానమును, అభివృద్ధికి చిహ్నముగా వర్ణించెను. మన వద్దనున్న జ్ఞానమును మనము అభివృద్ధి క్రమములో ఏ విధముగా సద్వినియోగము చేసుకోవాలా అన్న విషయము శ్రీ అరవిందులు మరియు అటువంటి యోగపుంగవులు మనకు సూచించారు.

భౌతికమైన జగత్తునందు, మానవుడు జన్మ ఎత్తుతున్నాడు. ఈ భౌతికమైన జీవితము ఎన్నో రకముల కార్యక్రమముల సమూహము. అయితే మానవుడు తన సహజ స్వరూపమును గుర్తించి, అందుకు

అనువుగా ఉన్నత స్థితికి అనేక మార్పులను తనలో చోటు కల్పించు కుంటూ, భౌతికముగానూ లబ్ధిపొందుతున్నాడు. మానవుని నైతికత, సత్ప్రవర్తన మరియు ఆధ్యాత్మిక పిపాస. అతని ఆధ్యాత్మిక సమగ్రతను నిరూపించును.